శ్రీరస్తు

శ్రీపుణ్యానందమునీంద్రవిరచితంబగు

# కామకలావిలాసము

బ్రహ్మవిద్యామార్గాభిషిక్తులగు సాధకజనోపయోగార్థమై

బ్రహ్మశ్రీ, సింహాంభట్ల రామమూర్తిశాస్త్రిగారిచే రచింపఁబడిన

రహస్యార్థబోధిని యనే ఆంధ్రభాషావ్యాఖ్యానసహితము

## అద్వైతసిద్ధాంతము



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచే ప్రకటితము

1959

# ఉపోద్ఘాతము

౧. సుఖేచ్ఛ:—సుఖమును గోరుట. ఇదియే సుఖేచ్ఛ యనఁ బడును. చరాచరాత్మకమయిన సకలజీవులును సర్వదా సుఖమును కోరుచున్నారు కాని సుఖేతరమయిన దుఃఖము నెవ్వరును కోరుటలేదు. అయినను సంసారమునందు సుఖము స్వల్పముగను దుఃఖము అధికముగను లభించుచున్నది. ఇందువలన చూడఁగా నీసుఖదుఃఖములను సంపాదించుటకును త్యజించుటకును, జనులకు స్వతంత్రము లేనట్టును, జనులందఱు అవిద్యా పశువులయి యున్నట్లును స్పష్ట మగుచున్నది. కాన నా యవిద్యాస్వరూపమును, తననిజస్వరూపమును విచారించుట అత్యావశ్యకముగా నున్నది. ఈవిచారణవలన స్వస్వరూపము తెలిసినందున అవిద్య స్వయముగనే తొలఁగును.

సుఖ మనునది సర్వానుభవగోచరమయి యున్నది. తాను గోరు సుఖమునకు ప్రతిబంధకము కలుగుటయు, తాననుభవించుచున్న సుఖము అంతమగుటయు దుఃఖమనిపించుకొనును. ఈసుఖమనునది రెండువిధములుగా నున్నది. ఒకటి విషయసుఖము. రెండవది బ్రహ్మానందము. ఇందు విషయ సుఖమనునది సర్వప్రాణుల యనుభవములో నున్నది. బాహ్యపరికరమువలన లభించునది. ఇంద్రియములచే గ్రహింపఁబడునది. స్వల్పకాలమును, అంతమును గలదిగానున్నది.

తనకు నిష్టమయిన వార్తలను, కథలను, గానమును వినుటవలన శీతోష్ణ, ఇష్టవస్తుస్పర్శవలనను, మనోహరమయిన వస్తువులను చూచుట వలన, నిష్టమయిన రుచిగలపదార్థ భక్షణవలన, పరిమళ ద్రవ్యాదుల వలన, స్రక్చందనవనితాదులవలనఁ గలిగెడు సుఖము విషయసుఖ మనఁ బడుచున్నది. ఈసుఖము అంతమందు అనుభవోత్తరక్షణమందే దుఃఖప్రదముగా నున్నది. ఈసుఖసంపాదనకు ధనవ్యయము, దేహాయాసము, కాలవిలంబము నివి ఆవశ్యకములుగా నున్నవి.

ఇక రెండవసుఖము:—బ్రహ్మానందస్వరూపము స్వరూప జ్ఞానము వలన కలుగుచున్నది. ఆస్వరూపజ్ఞానము విచారణవలన లభించుచున్నది. ఆసుఖమునకు బాహ్యపరికర మక్కరలేదు. ఆసుఖము లభించిన పిమ్మట అంతము లేనిది. ధనవ్యయము, దేహాయాసము మున్నగు నేప్రమాదములును లేనిది. ఇది నిత్యసుఖ మని యనఁబడును. స్వరూపవేత్తలగు పుణ్యపురుషుల అనుభవములో నున్నది.

వెనుక చెప్పిన విషయసుఖములు నీబ్రహ్మానంద సుఖముయొక్క వాసనలుగాను ప్రతిబింబములును అయియున్నవి. ఇట్టి నిజసుఖమును గోరువారు సుఖేచ్ఛ జనించిన పైని స్వస్వరూపవిచారణ చేయవలెను. ఆస్వరూపజ్ఞానము కలుగుటకును, నావిచారణకు నీ కామకలావిలాసమనే గ్రంథము సులభసాధనముగా నున్నది.

౨. సద్గ్రంథలక్షణము:—స్వరూపవిచారణకు సాధనములయిన గ్రంథములు సద్గ్రంథము లనఁబడుచున్నవి. 'సత్' అనఁగా నిత్యవస్తువు, ఇదే బ్రహ్మవస్తువు. ఈవిచారణ పర్యవసానమందు నిదియే స్వస్వరూపముగా తెలియుచున్నది.

ఉపనిషత్తులు, తదర్థానుసారము లగు గ్రంథములును నీఆత్మ విచారణకు సాధనములుగా నున్నవి. అట్టి గ్రంథములందు అధికారి, విషయము, సాధనము, ప్రయోజనము నీనాలుగంశములును ముఖ్యములుగా నున్నవి. ఈగ్రంథమందు బ్రాహ్మణులు విచారణాధికారులుగా నున్నారు. ఎందువలననఁగా.

శ్రుతి:—

"పరోక్షంచా పరోక్షేతి విద్యా ద్వేధా విచారజా,
తత్రాపరోక్షవిద్యాప్తౌ విచారోఽయం సమాప్యత." ఇతి.

తా. విచారణవలన పరోక్షజ్ఞానము, అపరోక్షజ్ఞానము కలుగుననియు, అం దపరోక్షజ్ఞానము సిద్ధించుటయే నీవిచారణకు సమాప్తియని నీశ్రుతి తాత్పర్యము. ఆజ్ఞానద్వయము మహావాక్యాధీనముగా నున్నది. ఆమహావాక్యప్రాప్తి అనేకజన్మపుణ్యపుంజపరిపాకముచే ఈశ్వరానుగ్రహమువలన బ్రాహ్మణు లగు పుణ్యపురుషులకు చిద్విద్యాపూర్ణదీక్ష లభించుచున్నది. అం దంతర్భూతమయిన మహావాక్యప్రాప్తి కలుగు

చున్నది. వీరలకు ఉపనయనసంస్కారముచేతను, ద్విజత్వ సాధనభూత మైన గాయత్రీప్రాప్తివలనను ద్విజత్వసిద్ధి కలిగినది. ఈచిద్విద్యాదీక్షాంత మందు తృతీయ జన్మయనియు, ఇదియే వీరికి చరమజన్మ యనియు తెలియు చున్నది గాన, వీరలు నీవిచారణాధికారులుగా నున్నారు.

ఈమహావాక్యప్రాప్తి రెండువిధములుగా నున్నది. ఒకటి ఈచిద్విద్యాపూర్ణదీక్షయందును, రెండవది తురీయాశ్రమమందును లభించుచున్నది. ఈవిచారణకు శిఖీ, ముండీ, జటీ వీరలు సమానులని ఉపనిషత్ప్రమాణము. శిఖీ=బ్రహ్మచారి గృహస్థులు; ముండీ=సన్న్యాసులు; జటీ = వానప్రస్థులు. ఈనాలుగాశ్రమములవారును బ్రాహ్మణులుగా నున్నారు గాన నీవిచారణకు వీర లధికారులుగా నున్నారని తెలియు చున్నది.

ఇకవిషయము:—స్వవిచారణకు సాధనములు, చిద్విద్యావిషలు, ప్రయోజనము, అపరోక్షజ్ఞానసిద్ధి, స్వరూపావాప్తి, నిజసుఖావాప్తి, జీవన్ముక్తి ఇవిఫలములు. దుఃఖాభావము, అభయము, సర్వకామావాప్తి, నిరంకుశతృప్తి ఇవి అవాంతరఫలములుగా నున్నవి.

3. గ్రంథోత్పత్తి. సకలనిగమాగమావధారితాత్మ యాథార్థ్య వేత్తలును, కులసమయ సర్వసంకేతాభిజ్ఞులును, సమయాచారపరులును, శ్రీ పరాభట్టారికాసాక్షాత్కారులగు పుణ్యానందమునీంద్రులు సాధక జనమునం దనుగ్రహబుద్ధితో నీగ్రంథమును రచియించినట్లు నీగ్రంథ మందుఁ గల ౫౮-వ సూత్రమువలన తెలియుచున్నది. ఈగ్రంథాంత మందు ఇది శ్రీపరాభట్టారికాముఖపంకజాయత్ననిస్సారితమని యున్నది. ఇందుకు కారణము:—

ఈమునీంద్రులవా రొకసమయమున స్వరూపనిష్ఠులయి యుం డఁగా, ఆకాశమధ్యమందు నొకహంసద్వంద్వము జ్ఞానగోచర మాయెను. ఆద్వంద్వము అన్యోన్య ప్రేమాతిశయముచే సామరస్యముకలిగియున్నది. అందాడుపక్షి పురుషపక్షిని ఇటుల ప్రార్థించుచున్నది:—"హే స్వామిన్! యద్విజ్ఞానేన సర్వం విజ్ఞాతం భవతి తదాచక్ష్వేతి"-"ఓస్వామీ! ఏవస్తువ తెలియుటచేత సకలమును తెలియుచున్నదో దానిని నాకొఱ కుప దేశించుము" అని ప్రార్థించెను.

పిదప సర్వజ్ఞత్వాదిధర్మములుగల ఆభర్త ఇట్లుపదేశించెను:—
ఏకమృత్పిండజ్ఞానేన సర్వం మృణ్మయం విజ్ఞాయతేతి.

తా. కులాలుఁడు అనేకవిధములయిన నామరూపభేదములు గల ఘటములను నిర్మించుటకొఱకు ప్రథమమందు మృత్తికను జలముతో మేళనచేసి శోధించి ఒకగోళము నేర్పరచును. ఆగోళమువలన ననేక విధములగు ఘటముల నిర్మించును. ఆదియందున్న మృద్గోళమే ఈసకల ఘటములకు నాస్పదముగా నున్నందున అట్టి కారణవస్తువయిన మృద్గోళ జ్ఞానము కలిగినచో సకల ఘటములును మృణ్మయములని తెలియునుగాన సర్వకారణవస్తువును తెలుసుకొమ్మని యుపదేశించెను. పిమ్మట నాయాఁడు పక్షి తనభర్త ఉపదేశించిన సంకేతార్థములను గ్రహించి సంశయవిపర్యయరహితమయిన స్వరూపజ్ఞానముకలదై బ్రహ్మానందసుఖము ననుభవించుచుండెను.

ఈస్థితిని ఈమునీంద్రులు గ్రహించి గురుముఖైకవేద్యము లగు సకలసంకేతార్థవేత్తలు గావున నాహంసద్వంద్వము కామేశ్వరి కామేశ్వరులుగాను, వారి ప్రశ్నోత్తరములు కామకలా తద్విలాసములుగాను తెలుసుకొని నాపరమేశ్వరుఁడు పరాశక్తి కుపదేశించిన ఆత్మవిద్యావికాసములను నీగ్రంథముగా రచియించెను. అందువలన నాపరాభట్టారికవలన క్రమముగా జగత్తునందు విస్తరించినందున పరాభట్టారికాముఖపంకజాయత్ననిస్సారిత మని తెలియుచున్నది.

ఇందువలన తెలిసే ఫలితాంశము ఆదిని ఈశ్వరుఁడు స్వశక్తికి ఉపదేశించిన ఆత్మయాథార్థ్యమును ఆత్మవలన ఉత్పన్నమయిన బ్రహ్మాండాది కార్యసర్గమును, నీగ్రంథమందు వివరించినట్లు తెలియుచున్నది. సకల మునిగణముచే ప్రార్థింపఁబడుచున్నదిగాన కామకలయనియు, కారణవస్తువయిన ఆకామకలవలన ఉత్పన్నమయిన బ్రహ్మాండ పిండాండ మాతృకా చిద్విద్యా శ్రీచక్రములు కార్యములుగా నున్నందున తద్విలాసములనియు, నీకార్యకారణములు గలదిగాన 'కామకలావిలాస మని నీగ్రంథనామము సార్థకముగా నున్నది.

ఆత్మవస్తువునకు 'కామకల' యని నిరూపించినందున కలాశబ్దము 'కలాతుషోడశోభాగః' అనే అర్థమువలన షోడశకలాయుక్త చంద్ర

మండలము గ్రహింపఁబడుచున్నది. అందు పదియాఱుకలలున్నందున నవి నాలుగుభాగములుగా విభజించి, నాలుగుపాదములుగా నేర్పరిచి నొక్కొకపాదమందు, నాలుగుకలలు భావించి ౧. అవిద్యాపాద మనియు, ౨. విద్యాపాదమనియు, ౩. ఆనందపాదమనియు, ౪. తురీయ పాదమనియు వివరించి నాలుగు పాదములుగల నీగ్రంథమును రచించినారు.

ఇందువలన తురీయ. తురీయమయిన షోడశీకల వృద్ధిక్షయరహిత మయినది. ఇది ధ్రువకలగాను, అదియే ఆత్మస్వరూపముగాను ఉన్నది. తక్కిన పంచదశకలలూ నీ కలవలన ఉత్పన్నములయి తిరిగి దీనియందే లయమగుచున్నవి గాన నీధ్రువకలగలగి తురీయపాదమనియు, తక్కిన పాదత్రయము బ్రహ్మాండాదికార్యవర్గ రూపముగాను ఉన్నట్లు తెలియు చున్నది.

ఈ ఆత్మస్వరూపమును చంద్రకలలద్వారా బోధచేసినందున నీ చిద్విద్యకు చంద్రకలావిద్యయనియు, ఆత్మవిద్యయనియు, బ్రహ్మవిద్య యనియు సంకేతములు కలిగినవి. ఈయంశము లీగ్రంథమందు వివరింపఁ బడినవి.

### ౪. వ్యాఖ్యానకారణము.

ఈగ్రంథము సకలోపనిషత్సారభూతమయిన ఆత్మవస్తువును తెలియఁజేయుచున్నది. వేదమందు, మంత్రములందు, శబ్దములందు, అర్థము గుప్తముగా ఇమిడియున్నది. ఒకశబ్దమునకు నిగమార్థము, ఆగ మార్థము, రహస్యార్థము, సంకేతార్థము, రూఢి, యౌగికము, తత్త్వా ర్థము, ఇట్లనేకవిధములుగా అర్థభేదములున్నందున నీచిద్విద్యాప్రకరణ మందు మంత్రము మంత్రార్థము, అర్థానుసంధానము, స్వానుభవము ఇవి ఆవశ్యకములుగా నున్నవి. అట్టి అనుసంధానరహస్యములు, మంత్ర వీర్యముల నుపదేశించుట గురువులధర్మము. అట్టిగురువులు లభించుట ఈకాలమందు దుర్లభము. ఈమంత్ర వీర్యాదులు విద్వాంసులకును అగోచరములు. స్వస్వరూపజ్ఞానాపేక్షయు సుఖాపేక్షయు సర్వజన సామాన్యధర్మముగా నున్నందున బ్రహ్మవిద్యా మూర్ధాభిషిక్తులగు సాధకజనసుఖబోధార్థమై మంత్రవీర్యాది అనుసంధానరహస్యములను

వెల్లడిగా నాంధ్రభాషతో వ్రాయడమయినది. ఈవ్యాఖ్యానము నిగమాగమ సామరస్యమును తెలుపుచు శ్రుతిస్మృతిపురాణేతిహాసాది ప్రమాణయుక్తముగను అనుమానశాస్త్ర ప్రత్యక్షప్రమాణత్రయ సిద్ధముగను, శ్రుతి యుక్తి స్వానుభవములను తెలుపుచున్నది. ఇందుగల ఆదినున్న తురీయపాదమందు నాలుగుచిద్బిందువులను, అవిద్యాపాదమందు అశ్వత్థవృక్షమును, విద్యాపాదమందు నిత్యాచక్రాదులును, ఆనందపాదమందు శ్రీచక్రమును, మూలాధారాది సహస్రారాంత కమలములును పరిలేఖనతో (పటములతో) చూపింపఁబడినవి.

ఈ గ్రంథముద్రణాధికారము శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, చెన్నపురి వారి కివ్వఁబడెను.

ఇట్లు,

సింహంభట్ల రామమూర్తిశాస్త్రి.

# విషయసూచిక

ఓం

# కామకలావిలాసము

## మూలసూత్రాణి.

శ్లో. సకలభువనోదయస్థితిలయమయలీలావినోదనోద్యుక్తః,
అంతర్లీనవిమర్శః పాతు మహేశః ప్రకాశమాత్రతనుః. ౧
సా జయతి శక్తిరాద్యా నిజసుఖమయనిత్యనిరుపమాకారా,
భావిచరాచరబీజం శివరూపవిమర్శనిర్మలాదర్శః. ౨
స్ఫుటశివశక్తిసమాగమబీజాంకురరూపిణీ పరాశక్తిః,
అణుతరరూపానుత్తరవిమర్శలిపిలక్ష్యవిగ్రహా భాతి. ౩
పరశివరవికరనికరే ప్రతిఫలతి విమర్శదర్పణే విశదే,
ప్రతిరుచిరుచిరే కుడ్యే చిత్తమయే నివిశతే మహాబిందుః. ౪
చిత్తమయోఽహంకార స్సువ్యక్తాహార్ణ సమరసాకారః,
శివశక్తిమిథునపిండః కబలీకృతభువనమండలో జయతి. ౫
సితశోణబిందుయుగళం వివిక్తశివశక్తిసంకుచత్ప్రసరం,
వాగర్థసృష్టిహేతుః పరస్పరానుప్రవిష్టవిస్పష్టః. ౬
బిందురహంకారాత్మా రవిరేతన్మిథునసమరసాకారః,
కామః కమనీయతయా కలా చ దహనేందువిగ్రహౌ బిందూ. ౭
ఇతి కామకలా విద్యా దేవీచక్రక్రమాత్మికా సేయం,
విదితా యేన సముక్తో భవతి మహాత్రిపురసుందరీరూపః. ౮
స్ఫుటితాదరుణాద్బిందోర్నాదబ్రహ్మాంకురో రవో వ్యక్తః,
తస్మాద్గగనసమీరణదహనోదకభూమివర్ణసంభూతిః. ౯
అథ విశదాదపి బిందోర్గగనానిలవహ్నివారిభూమిజనిః.
ఏతత్పంచకవికృతిర్జగదిద మణ్వాద్యజాండపర్యంతం. ౧౦
బిందుద్వితయం యద్వద్భేదవిహీనం పరస్పరం తద్వత్,
విద్యాదేవతయోరపి న భేదలేశోఽస్తి వేద్యవేదకయోః. ౧౧
వాగర్థౌ నిత్యయుతౌ పరస్పరం శక్తిశివమయావేతౌ,
సృష్టిస్థితిలయభేదౌ త్రిధా విభక్తౌ త్రిబీజరూపేణ. ౧౨
మాతామానం మేయం బిందుత్రయబీజభిన్నరూపాణి,
ధామత్రయపీఠత్రయశక్తిత్రయ భేదభావితాన్యపి చ. ౧౩
తేషు క్రమేణ లింగత్రితయం తద్వచ్చ మాతృకాత్రితయం,
ఇత్థం త్రితయపురీ యా తురీయపీఠా చ భేదినీ విద్యా. ౧౪

శబ్దస్పర్శౌ రూపం రసగంధౌ చేతి భూతసూక్ష్మాణి,
వ్యాపకమాద్యం వ్యాప్యం తూత్తరమేవం క్రమేణ పంచదశ,
పంచదశాక్షరరూపా నిత్యా చైషా హి భాతి కాభిమతా,
నిత్యాశ్శబ్దాదిగుణప్రభేదభిన్నాస్తథానయా వ్యాప్తాః. ౧౬
నిత్యాస్తిథ్యాకారాస్తిథయశ్శివశక్తిసమరసాకారాః,
దివసనిశామయ్యస్తాశ్శ్రీవర్ణాస్తేఽపి తద్ద్వయీరూపాః. ౧౭
అజ్వ్యంజనబిందుత్రయసమష్టిభేదైర్విభావితాకారా,
షట్త్రింశత్తత్వాత్మా తత్వాతీతా చ కేవలా విద్యా. ౧౮
విద్యాపి తాదృగాత్మా సూక్ష్మా సా త్రిపురసుందరీ దేవి,
విద్యావేద్యాత్మకయోరత్యంతాభేదమామనంత్యార్యాః. ౧౯
యాసాంతరోహరూపా పరా మహేశీ త్రిభావితా సైవ,
స్పష్టా పశ్యంత్యాదిత్రిమాతృకాత్మా చ చక్రతాం యాతా. ౨౦
చక్రస్యాపి మహేశ్యా న భేదలేశోఽపి భావ్యతే విబుధైః,
అనయోస్సూక్ష్మాకారా పరైవ సా స్థూలయోశ్చ కాపి భిదా.
మధ్యం చక్రస్య స్యాత్పరామయం బిందుతత్త్వమేవేదం,
ఉచ్ఛూనం తచ్చ యదా త్రికోణరూపేణ పరిణతం స్పష్టం. ౨౧
ఏతత్పశ్యంత్యాదిత్రితయనిదానం త్రిబీజరూపం చ,
వామా జ్యేష్ఠా రౌద్రీ చాంబికయానుత్తరాంశభూతాః స్యుః.
ఇచ్ఛాజ్ఞానక్రియాశాంతాశ్చైతాశ్చోత్తరావయవాః,
వ్యస్తావ్యస్తతదర్ణద్వయమిదమేకాదశాత్మ పశ్యన్తి. ౨౪
ఏవం కామకలాత్మా త్రిబిందుతత్త్వస్వరూపవర్ణమయీ,
సేయం త్రికోణరూపం యాతా త్రిగుణస్వరూపిణీ మాతా. ౨౫
ఏకా పరా తదన్యా వామాదివ్యష్టిమాతృసృష్ట్యాత్మా,
తేన నవాత్మా జాతా మాతా సా మధ్యమాభిధానాభ్యాం. ౨౬
ద్వివిధా హి మధ్యమా సా సూక్ష్మా స్థూలాకృతిస్తథా సూక్ష్మా,
నవనాదమయీ స్థూలా నవవర్గాత్మా చ భూతలిప్యాఖ్యా. ౨౭
ఆద్యా కారణమన్యా కార్యం త్వనయోర్యతస్తతో హేతోః,
నైవేయం న హి భేదస్తాదాత్మ్యం హేతుహేతుమతోరిష్టం. ౨౮
శషసపవర్గమయం తద్వసుకోణం మధ్యకోణవిస్తారః,
నవకోణం మధ్యం చేత్యస్మిన్ చిద్దీపదీపితే దశకే. ౨౯

తేజాఖ్యయాద్వితయమిదం దశారచక్రద్వయాత్మనా వితతం,
తటచకవర్గచతుష్టయవిలసనవిస్పష్టకోణవిస్తారమ్. ౩౦
ఏతచ్చక్రచతుష్క ప్రభాసమేతం దశారపరిణామః,
ఆదిస్వరగణగతచతుర్దశవర్ణమయం చతుర్దశారమిదం. ౩౧
పరయా పశ్యంత్యాపి చ మధ్యమయా స్థూలవర్ణరూపిణ్యా,
ఏతాభిరేకపంచాశదక్షరాత్మికా వైఖరీ జాతా. ౩౨
కాదిభిరష్టభిరుపచిత మష్టదళాబ్జం చ వైఖరీవర్గైః.
స్వరగణసముదిత మేతద్వ్యష్టదళాంభోరుహం చ సంచింత్యం. ౩౩
బిందుత్రయమయతేజస్త్రితయవికారస్థితాని వృత్తాని,
భూబింబత్రయ మేతత్పశ్యంత్యాదిత్రిమాతృవిక్రాంతిః. ౩౪
క్రమణం పదవిక్షేపః క్రమోదయస్తేన కథ్యతే ద్వేధా,
ఆవరణం గురుపఙ్క్తిర్ద్వయమిదమంబాపదాంబుజప్రసరం. ౩౫
సేయం పరా మహేశీ చక్రాకారేణ పరిణమేత యదా,
తద్దేహావయవాన్యా పరిణతిరావరణదేవతాస్సర్వాః. ౩౬
ఆసీనా బిందుమయే చక్రే సా త్రిపురసుందరీ దేవీ,
కామేశ్వరాంకనిలయా కలయా చంద్రస్య కల్పితోత్తంసా. ౩౭
పాశాంకుశేక్షుచాపప్రసూనశరపంకజాంచితస్వకరా,
బాలారుణారుణాంగీ శశిభానుకృశానులోచనత్రితయా. ౩౮
తన్మిథునం గుణభేదా దాస్తే బిందుత్రయాత్మకే త్ర్యశ్రే,
కామేశీ మిత్రేశప్రముఖద్వంద్వత్రయాత్మనా వితతం. ౩౯
వసుకోణనివాసిన్యో యాస్తాస్సంధ్యారుణావశిన్యాద్యాః,
పుర్యష్టక మేవేదం చక్రతనోస్సంవిదాత్మనో దేవ్యాః. ౪౦
తద్విషయవృత్తయస్తాస్సర్వజ్ఞాదిస్వరూపమాపన్నాః,
అంతర్దశారనిలయా లసంతి శరదిందుసుందరాకారాః. ౪౧
తద్బాహ్యపఙ్క్తికోణే యోగిన్యస్సర్వసిద్ధిదాః పూర్వాః,
దేవీధీకర్మేంద్రియవిషయమయా విశదవేషభూషాఢ్యాః. ౪౨
భువనారచక్రభవనా దేవీమనుకరణవివరణస్ఫురణాః.
సంధ్యాసవర్ణవసనాస్సంచింత్యాస్సంప్రదాయయోగిన్యః. ౪౩
అవ్యక్తమహదహంకృతి తన్మాత్రాస్వీకృతాంగనాకారాః,

ద్విరదచ్ఛదనసరోజే జయంతి గుప్తతరయోగిన్యః. ౪౪
భూతానీంద్రియదశకం మనశ్చ దేవ్యా వికారషోడశకం,
కామాకర్షిణ్యాదిస్వరూపతష్షోడశారమధ్యాస్తే. ౪౫
ముద్రాస్త్రిఖండయా సహ సంవిన్మయ్యస్సముచ్ఛ్రితాస్సర్వాః,
ఆదిమహీగృహవాసా భాసా బాలార్కకాంతిభిస్సదృశాః. ౪౬
ఆధారనవకమస్యా నవచక్రత్వేన పరిణతం యేన,
నవనాథశక్తయోఽపి చ ముద్రాకారేణ పరిణతం తేన. ౪౭
అస్యాస్త్వగాదిసప్తక మాకారశ్చైవమష్టకం స్పష్టం,
బ్రాహ్మ్యాదిమాతృరూపం మధ్యమభూబింబమేతదధ్యాస్తే. ౪౮
అణిమాదిసిద్ధయోఽస్యాస్స్వకృతకమనీయకామినీరూపాః,
విద్యాంతరఫలభూతా గుణభావేనాంత్యభూనికేతనగాః. ౪౯
పరమానందానుభవః పరమగురుర్నిర్విశేషబింద్వాత్మా,
స పునః క్రమేణ భిన్నః కామేశత్వం యయా విమర్శాంశాత్.
ఆసీనశ్శ్రీపీఠే కృతయుగకాలే గురుశ్శివో విద్యాం,
తస్యై దదౌ స్వశక్త్యై కామేశ్వర్యై విమర్శరూపిణ్యై. ౫౧
సేయాయమిత్రసంజ్ఞాం స్థానేశాన్ జ్యేష్ఠమధ్యబాలాఖ్యాన్,
చిత్ప్రాణవిషయభూతాన్ త్రేతాయుగాదికారణత్రిగురూన్.
బీజత్రితయాధిపతీన్పరీక్ష్య విద్యాం ప్రకాశయామాస,
ఏతైరోఘత్రితయం సమనుగృహీతం గురుక్రమో విదితః. ౫౩
ఉదితః పుణ్యానందాదితి కామకలాంగనావిలాసోఽయం,
పరశివభుజంగభావాకర్షణహార్షాయ కల్పితాం నిత్యం. ౫౪
చింతాతరంగతరళస్తృష్ణాసలిలః ప్రపంచవారాశిః,
యదనుగ్రహేణ తీర్ణస్తస్మై శ్రీనాథనావికాయ నమః. ౫౫

ఇది శ్రీమత్పరాభట్టారికాముఖపంకజాయత్ననిస్సారి
తంబును, పుణ్యానందమునీంద్రవిరచితంబునగు
కామకలాసూత్రపంచపంచాశతి.

సంపూర్ణము.

శ్రీమహాత్రిపురసుందరీపరదేవతార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.

శ్రీ గణేశాయ నమః.

శ్రీసచ్చిదానందగురవే నమః.

# కామకలావిలాసము

---

౧. మూలసూత్రము.

మూ. సకలభువనోదయస్థితిలయమయలీలావినోదనోద్యుక్తః,
అంతర్లీనవిమర్శః పాతు మహేశః ప్రకాశమాత్రతనుః.

వ్యాఖ్యానపీఠిక.

శ్లో. శ్రీవిద్యాంచితమస్తకశ్శ్రితజనానందైకకృన్మాధురీ,
వాక్పూరస్సకలాగమాంతరరసజ్ఞాతా సదాఽంతర్ముఖః,
సింహాంభట్లసువంశజః ప్రకురుతే శ్రీరామమూర్తిస్స్వయం
శ్రీమత్కామకలావిలాసవిలసత్సూత్రార్థమానందదమ్.
గజాననం గణాధీశం గంభీరహృదయాంబుజమ్,
వందే కామేశ్వరీపుత్రం కామితార్థఫలప్రదమ్.
విశుద్ధచక్రనిలయాం శుక్లమాల్యాంబరాన్వితామ్,
వందే కుందేందుశంఖాభాం శారదాం శ్రీకలాత్మికామ్.
వందే కామకలాం దివ్యాం కరుణామయవిగ్రహామ్.
మహాకామేశమహిషీం మహాత్రిపురసుందరీమ్.
శ్రీమత్సత్యానందనాథమంత్రదీక్షాభిధాధరమ్,
అస్మద్గురువరం సర్వపురుషార్థద మాశ్రయే.
సాధకానాం సుబోధాయ కామరాజకలాస్తుతేః,
శ్రీజ్ఞానానందనాథేన భాషాటీకా విరచ్యతే.

సూత్రలక్షణమ్:—

అల్పాక్షరమసందిగ్ధం సారవద్విశ్వతోముఖమ్,
అస్తోభమనవద్యం చ సూత్రం సూత్రవిదో విదుః.

**వ్యాఖ్యానలక్షణమ్:—**

పదచ్ఛేదః పదార్థశ్చ విగ్రహో వాక్యయోజనా,
ఆక్షేపస్య సమాధానం వ్యాఖ్యానం పంచలక్షణమ్.
శబ్దశాస్త్రమశేషం తు ధత్తే శర్వస్య వల్లభా,
అర్థస్వరూపమఖిలం ధత్తే ముగ్ధేందుశేఖరః.

**మూలసూత్రమునకు ప్రతిపదార్థము.**

టీక. సకలభువనోదయస్థితిలయమయలీలావినోదనోద్యుక్తః-సకల = సమస్తమయిన, భువన = లోకములయొక్క, ఉదయస్థితిలయమయ = సృష్టి - స్థితి - సంహారములనెడి, లీలా = పంచకృత్యరూపమయిన, వినోదన=క్రీడయందు, ఉద్యుక్తః = జాగరూకుఁడైనట్టియు, అంతర్లీనవిమర్శః= అంతర్గతమైనవిమర్శశక్తిగలిగి, ప్రకాశమాత్రతనుః = ప్రకాశశక్తి మాత్రమే శరీరముగాగల, మహేశః = సర్వజ్ఞత్వాది శక్తులుగల కామేశ్వరరూపపరమాత్మ, పుణ్యపురుషాన్ = పుణ్యపురుషులను, పాతు= రక్షించుఁగాక.




**రహస్యార్థము.**

సకల నిగమాగమావధారిత ఆత్మయాథార్థ్యవేత్తలును, స్వరూపనిష్ఠులును, పరమదయాళువులు నగు పుణ్యానందమునీంద్రులు స్వరూపజ్ఞానసాధనములయిన చిద్విద్యాశ్రీచక్రాదులను వివరించ దలంచి, వానికి అధిష్ఠానదేవతయు సర్వకారణవస్తువునగు కామకలాస్వరూపము నీసూత్రమునుంచి ఎనిమిది సూత్రములచే నిరూపించుచున్నారు. ఈ

తొమ్మిది సూత్రములు తురీయకూటము. ఇదియే తురీయపాద మనఁ బడును. సర్వకారణవస్తుజ్ఞానము తెలియనిది కార్యవస్తువులు తెలియ నేరవుగావున తురీయ - తురీయాతీతమయిన - ధ్రువకలారూపపరమాత్మను ఈ ప్రకాశబిందువుగా నిర్దేశించినారుగాన సృష్ట్యాదిగా గ్రంథారంభ మని తెలియుచున్నందున ఇచట నామరూపములు లేనందున నీపాద మందు నాలుగుచిద్బిందువులు నిరూపింపఁబడుచున్నవి. అందీప్రకాశ బిందువు ప్రథమబిందువుగా నున్నది.

ఉపోద్ఘాతమందు చూపించిన నిజసుఖము గోరువారు నిజ సుఖమనగా జగత్తునందు సర్వజనానుభవములోనున్న విషయసుఖ ములు బ్రహ్మానందసుఖముయొక్క వాసనలును ప్రతిబింబములును నయి యున్నవి. కాన నాబింబభూతానందము నిజసుఖమని తెలియుచున్నది. అట్టిసుఖమును గోరువారు స్వరూపవిచారణను చేయవలెను. తన నిజ మయిన రూపమును తెలిసికొనుటకు రెండువిధములగు సాధనములు గలవు. ఒకటి బాహ్యము-బ్రహ్మాండస్వరూపము. రెండవది ఆంతర్యము. తనశరీరమందుగల పదార్థశోధన. ఇది సూక్ష్మమనియు ప్రపంచవిచారణ స్థూలమనియు చెప్పఁబడును. స్థూలసూక్ష్మములకు భేదము లేదుగాన స్వరూపజ్ఞానమువలన నిత్యసుఖప్రాప్తి కలుగును. ఆస్వరూపజ్ఞానము అంతర్ముఖునకు లభించును. ఆ యంతర్ముఖత్వ మీగ్రంథాభ్యాసమువలన సహజముగా సిద్ధించును. జనులు అవిద్యావశు లయినందున సర్వానర్థ ములు గలుగుచున్నవి. విద్యాభ్యాసమువలన అవిద్య స్వయముగనే తొలఁగి నిజసుఖము లభించును.

"మహేశః పాతు=పరమాత్మ రక్షించుఁగాక"—యని గ్రంథకర్త గ్రంథారంభలక్షణముగా ఆశీర్వాదనిరూపణ చేసినారు. మహేశః - ఈపదమందు మహాన్=అపరిచ్ఛేద్యుఁడు. ఈశః=సర్వనియంతృత్వాదిధర్మ ములు గలవాఁడు. మహేశః-అనిపించుకొనును.

శ్రు. యో వేదాదౌ స్వరః ప్రోక్తో వేదాంతే చ ప్రతిష్ఠితః,
తస్య ప్రకృతిలీనస్య యః పర స్స మహేశ్వరః.

తా. వేదారంభమందు సమాప్తియందు "ఓమ్" అనే ప్రణవో చ్చారణ విహితముగా నున్నది. ఆప్రణవము వైఖరీరూపముగాన

ప్రకృతిరూపమయిన పరానాదమందు లీనమగుచున్నది. ఆప్రకృతికంటె పైనున్నతత్త్వము పురుషుఁడు. అతఁడు మహేశుఁడు అనిపించుకొనును. ఇదే పరమాత్మవస్తువని తాత్పర్యము. ఈయంశము ముందు వివరముగా తెలియును.

కించ.—

శ్లో. సర్వజ్ఞతాశక్తిరనాదిబోధస్స్వతంత్రతా నిత్యమలుప్తశక్తిః,
అనంతతా చేతి విభోర్విధిజ్ఞాష్షడాహురంగాని మహేశ్వరస్య. ఇతి.

తా. సర్వజ్ఞత్వశక్తి, అనాదిబోధ, స్వతంత్రము, నిత్యత్వము, సంపూర్ణశక్తి, అనంతత్వము, ఈ ఆరును మహేశ్వరునికి అవయవములుగా నున్నవని, యిందువలనను పరమాత్మయని సూచనయగుచున్నది.

ఉపోద్ఘాతమందు నిత్యసుఖప్రాప్తికొఱకు స్వరూపవిచారణచేయవలెనని యున్నది. అందు ఆత్మవస్తునిర్దేశముగా ఈశ్వరుని నిర్దేశించినట్టు లిచట చెప్పిరి. ఆత్మవస్తువు నామరూపరహిత మయినదని శ్రుతులు చెప్పుచున్నవిగాన, ఆత్మబోధకొఱకు 'మహేశః' అని ఈశ్వరనిర్దేశమునకు ఏమిసంబంధమనిన,

శ్రు. అవాఙ్మనసగమ్యం తం శ్రుతిర్బోధయితుం సదా,
జీవమీశం జగద్వాపి సమాశ్రిత్య ప్రబోధయేత్.

తా. ఈ శ్రుతిప్రమాణమువలన సర్వోపనిషత్ప్రసిద్ధమయిన బ్రహ్మవస్తువు వాక్కుచే నిట్టిదని చెప్పుటకును మనస్సుచే గ్రహించుటకును శక్యముకానిది గాన, నట్టివస్తువును బోధించుటకు జీవునిగాని ఈశ్వరునిగాని జగత్తునుగాని పురస్కరించుకొని శ్రుతి బోధించుచున్నది. కాన నీయీశ్వరనిర్దేశము స్వరూపజ్ఞానసాధనముగా నున్నది.

స్వరూపజ్ఞానబోధకు ముందుగా అవాఙ్మానసగోచరమయిన బ్రహ్మవస్తువును నిర్దేశించుటకు కారణమేమనిన,

శ్రు. అనంతశాస్త్రం బహు వేదితవ్య
మల్పశ్చ కాలో బహవశ్చ విఘ్నాః,

హంసో యథా క్షీరమివాంబుమధ్యా
ద్యత్సారభూతం తదుపాసితవ్యమ్.

ఈవచనము ననుసరించి చతుర్దశభువనాత్మకమయిన బ్రహ్మాండమం దేవస్తువు సారభూతముగా నున్నదో అది ఉపాసించతగినదని తెలియుచున్నది.

ఈ ప్రపంచమందుగల సకలవస్తువులును, జీవసముదాయమును సత్యము, అసత్యము అనే రెండుపదార్థముల మేళనము కలిగియున్నవి. అందు అసత్యమనునది నామరూపములు గలది. రెండవదగు సత్యమనునది ఆ నామరూపములకు చైతన్యమును, వృద్ధిక్షయములను కలుగఁజేయునది. అదియే జీవుఁడను అగోచరపరమార్థము. అది సత్తామాత్రముచే తెలియునది. ఈరెండును ప్రతివస్తువందును గలవు. ఈ రెంటిలో నామరూపములు గలది అసత్యభాగము. ఈ రెండును కలసి జగత్తుగా నున్నది. ఆ రెంటిలో సత్యభాగము సారమనిపించుకొనును. తిలలందు తైలము సత్యము. అదియే సారము. రెండవది పిష్టము. అది అసత్యభాగము. మనుష్యునందు జీవుఁడు సత్యము. దేహము అసత్యభాగము. ఈ రెండును కలసి యున్నపుడు ప్రవృత్తి కలుగుచున్నదిగాన ప్రపంచమందు సత్యవస్తువు సారభూతముగా నున్నది. సారమనఁగా రసము.

శ్రు. రసోవై సః, రసగ్గ్ం హ్యేవాయం లబ్ధ్వాఽఽనందీ భవతి.

తా. జగత్తునం దేవస్తువు సారభూతముగా నున్నదో అది రసమనిపించుకొనును. అదియే బ్రహ్మవస్తువుగాన నారసరూపమున ఆత్మను పొందినవారు, తెలుసుకొన్నవారు బ్రహ్మానందమును పొందుచున్నారని యీశ్రుత్యర్థము. ఆనందము సుఖస్వరూపముగాన గ్రంథాదిని ఆత్మవస్తునిర్దేశముగా "మహేశః" అని నిరూపించిరి. దీనినే మాయయందురు. చైతన్యము సత్యభాగము.

ఇతఁ డెట్టివాఁ డనిన—"సకలభువనోదయస్థితిలయమయలీలావినోదనోద్యుక్తః." చతుర్దశభువనాత్మకమయిన బ్రహ్మాండముయొక్క సృష్టిస్థితిసంహారములను అనాయాసముగా కల్పించుటయనే క్రీడయం దాసక్తి గలవాఁడు. ఇందువలన త్రిమూర్తులగు బ్రహ్మ-విష్ణు-రుద్రులు సృష్టి-స్థితి-

సంహారకర్తలుగాను, వారికిని, వారికృత్యములకును నితఁడే నియామకుఁడనియు, నీకృత్యమువలన నాపరమాత్మకు ఫలమేమియు లేదనియు, సృష్ట్యాది నున్నవస్తువనియు తెలియుచున్నది.

ఈసృష్టిని గురించి అనేకు లనేకవిధములుగా నూహించిరి. మాండూక్యమందు గౌడపాదకారిక:—

శ్లో. విభూతిం ప్రసవం త్వన్యే మన్యంతే సృష్టిచింతకాః,
స్వప్నమాయాస్వరూపేతి సృష్టిరన్యైర్వికల్పితా,
ఇచ్ఛామాత్రం ప్రభోస్సృష్టిరితి సృష్టౌ వినిశ్చితాః,
కాలాత్ప్రసూతిర్భూతానాం మన్యంతే కాలచింతకాః,
భోగార్థం సృష్టిరిత్యన్యే క్రీడార్థమితి చాపరే,
దేవస్యైష స్వభావోఽయమాప్తకామస్య కా స్పృహా. ఇతి.

ఇట్లనేకవిధములుగా నూహించిరి. సృష్టిచింతకులకే సృష్టివికల్పములుగాని స్వప్నమాయాసదృశమును నిష్ప్రయోజనమయిన నీసృష్టియందు ముముక్షువులు అనాదరణగా నుందురు.

సృష్ట్యాదిని బ్రహ్మవస్తువు మాత్రమే ఉన్నట్టు ప్రమాణములు.

శ్రు. ఆత్మైవేదమగ్ర ఆసీత్ సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్,
నాసదాసీన్నో సదాసీత్ ఏకమేవాద్వితీయం బ్రహ్మ.

ఈ మొదలగు శ్రుతులవలన సృష్టికి పూర్వము బ్రహ్మవస్తువు మాత్రమున్నట్టు తెలియుచున్నది.

ఈసృష్టికి బ్రహ్మవస్తువే కారణమని ప్రమాణము.

శ్రు. మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరం,
అస్య అవయవభూతైస్తు వ్యాప్తం సర్వమిదం జగత్.
తస్మాన్మాయీ సృజతే విశ్వమేతత్. ఇతి శ్వేతాశ్వతరోపనిషత్.
స తపోఽతప్యత సతపస్తప్త్వా ఇదగ్ంసర్వమసృజత. ఇతి తైత్తిరీయే.
యథాసుదీప్తాత్పావకాద్విస్ఫులింగాస్సహస్రశః ప్రభవంతేసరూపాః,
తథాఽక్షరాద్వివిధాస్సోమ్యభావాః ప్రజాయంతే తత్రచైవాపి
యంతి. ఇతిముండకోపనిషత్.

ఇత్యాదిశ్రుతులు బ్రహ్మవస్తువే జగత్స్రష్టృత్వకారణమని తెలుపుచున్నవి.

"అంతర్లీనవిమర్శః—విమృశ్యత ఇతి విమర్శః. ప్రపంచః - అంతర్లీనః అంతర్గతోయస్య సః" తనయందిమిడియున్న సకలప్రపంచము గలవాఁడని స్వాంతర్గతవిమర్శనశక్తిగలవాఁడనియు, "ప్రకాశమాత్రతనుః—ప్రకృష్టేన కాశ్యతే ద్యోతత ఇతి ప్రకాశః తదేవ తనుః శరీరం యస్య సః." ప్రకాశమాత్రమే శరీరముగా గలవాఁడు. ఇట్టి కామేశ్వరుఁడు సాధకపుంగవులను రక్షించుఁగాక!

ఈ ప్రకాశవిమర్శశబ్దములు రెండును శివశక్తిపర్యాయములుగా నీప్రకరణమందు సంకేతములుగా నున్నవి. 'ప్రకాశమాత్రతనుః' అని చెప్పినందున సృష్ట్యాదిని వేఱొకవస్తువు లేనందున, నామరూపములుగా లేనందున నిదియే ప్రకాశబిందువని నిర్దేశించినారు. ఈ ప్రకాశత స్వతస్సిద్ధము. జ్ఞానము ప్రకాశరూపముగాన నిదియే సంవిద్బిందువుగా నున్నది. నామరూపములు రెండును ఏకవస్తుధర్మములు గావున నీరెంటికి నాశ్రయము ఒకటిగానున్నది. ఈ ప్రకాశబిందువునందు విమర్శశక్తి అంతర్భూతముగా నున్నదని తెలియుచున్నది.

ఈబిందువు ముందు కలుగఁబోయే వర్ణించఁబడే బ్రహ్మాండ పిండాండ శ్రీవిద్యా మాతృకా శ్రీచక్రాదులకు కారణబిందువుగా నున్నది. ముందు ఆవివరము స్పష్టమగును. సాధకుల బోధకొఱకు కామకలాస్వరూపమును నీతురీయపాదమందు నిరూపింపఁ దలంచి యీ బిందువును నిర్దేశించినారు.

ఈ ప్రకాశబిందువు అనుసంధానమందు సాధకులసహస్రారాంతర్గతపరాకాశమందున్న చంద్రమండలముగా నున్నది. స్వరూపజ్ఞానమనఁగా, తన నిజమయినరూపమును తాను తెలిసికొనుట. ఇందుకు తనయందుఁగల పదార్థములను తాను విమర్శించుట ముఖ్యాంశము. ఇందుకు సాధకునిశరీరము నాలుగుభాగములుగా నున్నది. అందు కటిప్రదేశమునుంచి భ్రూమధ్యపర్యంతము మూఁడుభాగములు. ఆభ్రూమధ్యమునుంచి బ్రహ్మరంధ్రపర్యంతము ఒకభాగము. ఇది అవరోహణక్రమములో ప్రథమభాగము. ఆరోహణమందు తురీయభాగము గాన తురీయకూటమని సంకేతముగలది. ఇచటనున్న ప్రధానవస్తువునకు 'ఆత్మ' యనిన అదే బ్రహ్మకల - ధ్రువకల యని సకలాగమసిద్ధము.

ని. ఆత్మా బ్రహ్మమనోజీవశరీరధృతిబుద్ధిషు. ఇతి విశ్వః.

ఇందువలన ఆత్మశబ్ద మీవస్తువులందు వర్తించుచున్నది.

శ్రు. ఖం బ్రహ్మేతి వ్యజానాత్.

ఈ శ్రుతివలనను ఆకాశము బ్రహ్మస్వరూపమని తెలియుచున్నది. ఆకాశము శూన్యమును, పూర్ణమును సూచించుచున్నది. వృత్తము ఆకాశమును తెలియఁజేయుచున్నదిగాన నీబిందువు పరాకాశముగాను, సర్వకలాపూర్ణమైన చంద్రమండలాకార బ్రహ్మవస్తువుగానున్నది.

ఇందువల్ల, స్వవిచారణకేమి సార్థకమనిన, స్వరూపజ్ఞానసాధనముగా గ్రంథకర్త కామకలానిర్దేశము చేయఁగోరి నీప్రకాశబిందువును ముందు నిరూపించినాఁడు. ఈకామకలాస్వరూపమును, తన నిజరూపమును పర్యవసానమునకు ఒకటిగానున్నదిగాననే, యిది విచారించిన రెండవది స్థిరపడుచున్నది. ఈవిచారణకు ప్రపంచానుభవమువలన నామరూపములు రెండును రెండుశాఖలుగా నున్నవి. రూపము వస్తువు. ఆకారము నామము. ఆకృతికిఁగల సంజ్ఞ. కామకలకున్ను స్వస్వరూపమునకును గూడ నీరెండుశాఖలును గలవుగాన నీరెంటిని అనుసరించి విచారించవలెను. అందు రూపమును స్థిరపరుచుటకే ప్రకాశబిందువు నిర్దేశింపఁబడినది. ఇక నామమును గురించి ఆత్మ పదము. కామకల స్వరూపపక్షమందు నేను, నాది, అనునది యిందుకు సంస్కృత భాషలో "అహమహమ్" అని ప్రతిశరీరమందు అభిమానము గలశబ్దము. ఈ అహమనే సంజ్ఞ, ఈశబ్దము ఎట్లు కలిగినదని, దీని నిజమేమి అని విచారించెదము:—ఇందుకు, ని. "అకారం బ్రహ్మదైవత్యం సర్వదైవతమాత్మకం, బీజం స్వాయంభువం మృత్యోః క్షోభణంభవశంకరమ్." ఇతి బీజ నైఘంటిక వచనము. ఈప్రకాశబిందువు బ్రహ్మవస్తువుగా నున్నందున పంచాశద్వర్ణములకును ఆదియయిన నీప్రకాశబిందువువలన అకారము గ్రహింపఁబడుచున్నది. వినియోగము ముందు విశదమగును. ఈబిందుస్థానము పరాకాశమని ప్రమాణము.

చిద్గగనచంద్రికాయాం:—

శ్లో. ద్వాదశాంతం లలాటోర్ధ్వం కపాలోర్ధ్వావసానకమ్,
ద్వ్యంగులోర్ధ్వం శిరోదేశాత్పరం వ్యోమ ప్రకీర్తితమ్.
హృత్క్రియాత్మశశిభానువిగ్రహః ఖేచరత్వనలదృష్టిధామయః,
యత్తదూర్ధ్వశిఖరం పరం నభస్తత్ర దర్శయ శివం తమంబికే. ఇతి.

ఈ వచనముల తాత్పర్యము ముందు వెల్లడింపఁబడును. ఇందువలన బ్రహ్మరంధ్రాధోభాగము ద్వాదశాంతమని, పరాకాశమని, యచట నున్న చంద్రమండలము ప్రకాశబిందువుగా నేర్పడినది.

ఈవిచారణకేమి యవసరమనిన; లోకమందు నొకవస్తువు మరికొన్నివస్తువులతో కలిసియున్నప్పుడు తనవస్తువును నిరూపించుటకు నాయుభయవస్తుధర్మములను విచారించనిది తనవస్తువును నిశ్చయించుటకు అవకాశము లేదు. ఇచట ప్రపంచము అవిద్యచే ఆవరింపఁబడి యున్నది. ఇందువలన ప్రపంచముమాత్రమే నిజమని కొందఱును, ఇంతకన్న నిజమైన ఆత్మ వేఱే యున్నదని కొందఱును ఉద్దేశములు కలవారై యున్నందున నిందు సత్యము సంశయగ్రస్తమైనది. మఱియు నిజమైన ఆత్మ లేనే లేదనియు, ప్రపంచమే నిజమనియు, విపరీతబుద్ధి కూడ కలిగినది. ఇది రజ్జువందు సర్పభ్రమవలె నున్నదిగాన నీనిజమును తెలిసికొనుటకు విచారణావసరము కలిగినది.

ఇందువలన సర్వానర్థమూలమైన అవిద్యానివృత్తి ఫలముగా నున్నది.

౨ సూత్రము.

**మూ. సా జయతి శక్తిరాద్యా నిజసుఖమయనిత్యనిరుపమాకారా,**
**భావిచరాచరబీజం శివరూపవిమర్శనిర్మలాదర్శః.**



అర్థము. భావిచరాచః బీజం-భావి=ముందు పుట్టవలసిన, చరాచరబీజం = పిండాండబ్రహ్మాండములకును, సకలతత్త్వసముదాయమునకును, సకలవర్ణకదంబమునకును బీజమువంటిది కార్యకారణరూపమైనట్టియు, శివరూపవిమర్శనిర్మలాదర్శః - శివరూప = శివస్వరూపాహమాత్మికమైన, విమర్శ=పరామర్శకు, జ్ఞానమునకు, నిర్మలాదర్శః=నిర్మలమైన అద్దమువంటిదైన, నిజసుఖమయనిత్యనిరుపమాకారా - నిజ = స్వాభావికమైన, సుఖమయ=ఆనందస్వరూపమైన, నిత్య = సార్వకాలికమైన, నిరుపమాకారా = ఉపమానరహితమయిన స్వరూపముగల, సా=పూర్వోక్తవిమర్శరూపపరాభట్టారిక, జయతి = సర్వోపనిషత్ప్రతిపాదికయగుచు సర్వోత్కర్షగానున్నది.

రహస్యార్థము 'సా జయతి' అని చెప్పుటవలన ప్రథమసూత్రమందు 'అంతర్లీన విమర్శః' అని స్వాంతర్గతముగానున్న విమర్శశక్తిగల ప్రకాశబిందువును కామేశ్వరస్వరూపముగా వర్ణించినారుగాననా ప్రకాశబిందువునందు లీనమైయున్న విమర్శశక్తిని నీసూత్రమందు పైనచూపించిన విమర్శబిందువులుగా విభజించి నిరూపించిరి.

ఇది యెట్టిదనిన; భావిచరాచరబీజం - వెనుకటి సూత్రమందు ప్రకాశబిందువు సృష్ట్యాదివస్తువుగాను సర్వకారణముగాను చెప్పఁబడినది. ఈవిమర్శబిందువు అటులనే భావిసృష్టికి కారణముగా నున్నదనియు, నిదే కార్యకారణరూపముగా నున్నదనియు చెప్పుచున్నారు. ఈ ప్రకాశవిమర్శ బిందువులు శివశక్తిస్వరూపములుగాన నీబిందుద్వయము కామేశ్వరకామేశ్వరీస్వరూపములని వెనుక చెప్పఁబడినది.

ఈ ప్రకాశబిందువు సర్వకారణబిందువని చెప్పినయెడల పరాశక్తిసంబంధము లేనిది కేవల పరశివునకు జగత్కర్తృత్వమును చెప్పుట అయుక్తమని ఆక్షేపణ కలుగుచున్నది. ఇచట పరాశక్తికిని కార్యకారణరూపముగా నున్నదని చెప్పిరి. ఇందువలనను సంశయము కలుగుచున్నది. ఎట్లనిన; పరశివసంబంధము లేనిది కేవలపరాశక్తికిని జగత్సర్జనసామర్థ్యము కలుగనేరదు.

ఈ శివశక్తులిద్దఱికిని జగత్కారణత్వము చెప్పినయెడల నొక కార్యమునకు రెండు కారణములుండుట అప్రసిద్ధము. ఒకవృక్షమునకు రెండు

బీజము లుండవు. ఇదిగాక అద్వైత ప్రతిపాదకశ్రుతులకు విరోధము కలుగును గాన, నీశివశక్తుల యన్యోన్యసామరస్యము - మేళనతత్త్వ మొకటిగానున్నందున నాతత్త్వమునకు జగత్కారణత్వము సిద్ధించు చున్నదని అభిప్రాయము.

కొందఱిమతము పరశివుఁడు ఉపాదానకారణముగాను, పరాశక్తినిమిత్తకారణముగాను నున్నారని గలదుగాని యది సమంజసము గాలేదు. ఉభయమేళనతత్త్వమే నివర్తోపాదానకారణముగా నున్నది. ఈ అంశము ముందు వివరింపఁబడును. 'భావిచరాచరబీజం' అని చెప్పి నందున బీజమందు వృక్షము సూక్ష్మరూపముగా ఇమిడి యున్నది. అట్లే యీవిమర్శశక్తియందు భావిజగత్తు సైతము ఇమిడి యున్నది. బీజము కారణము, వృక్షము కార్యముగా నున్నందున నీపరాశక్తి కార్యకారణరూపముగా నున్నదని చెప్పిరి.

శ్లో. న శివేన వినా దేవీ దేవ్యా చ న వినాశివః,
నైతయోరంతరం నాస్తి చంద్రచంద్రికయోరివ.

ఇతి ఆగమసిద్ధాంతవచనమువలన శివశక్తులకు అన్యోన్యభేదము లేదని తెలియుచున్నది.

'శివరూప విమర్శ నిర్మలాదర్శః' అని చెప్పుటవలన నెట్లు పరాశక్తిసంబంధము వినాగా పరశివునకు జగత్సృష్టిసామర్థ్యము లేదో, అటులనే పరాశక్తికిని పరశివసంబంధము వినాగా అట్టి సామర్థ్యము లేదని చెప్పుచున్నారు. ఈవిమర్శశక్తి అహమాత్మికమైన శివస్వరూపజ్ఞానమునకు ఆదర్శము. స్వచ్ఛమయిన అద్దమువంటిది. వెనుక చెప్పిన ప్రకాశబిందువు బ్రహ్మస్వరూపమని, అందువలన మాతృకయొక్క ప్రథమమందున్న అకారస్వరూపమని, చంద్రమండలమని వివరింపఁబడినది. ఈవిమర్శబిందువు బ్రహ్మాత్మికమైన శక్తిస్వరూపము. అగ్నిమండలము మాతృకయొక్క అంత్యవర్ణమైన హకారము ప్రకారాంతరముగా నగ్నిబీజముగా నున్నది. ఈశివశక్తి రూపములయిన ప్రకాశ విమర్శాంశలగు 'అ, హం' అనే నీరెండువర్ణములు ఏకమైనపుడు అహమనే శబ్ద ముత్పన్నమగును. ఇదియె శివస్వరూపము. అయమహమనే జ్ఞానమునకు నీపరాశక్తి నిర్మలమయిన అద్దమువంటిది. అనఁగా :

లోకమునందు అతిసుందరమైన ఒక మహారాజు అలంకరించుకొని సింహాసనాసీనుఁడై తనయెదుట నొకస్వచ్ఛమైన అద్దము నుంచుకొని, అందు తన ప్రతిబింబమును చూచి 'అయమహం' ఈ ప్రతిబింబము నేను అని తెలుసుకొనుచున్నాఁడు. అటులనే పరమేశ్వరుఁడును తనఅంశభూతమైన ఆత్మశక్తిని చూచి నేను సర్వపరిపూర్ణుఁడనని తెలిసికొనుచున్నాఁడు. మరియు అద్దమునకును తనసాన్నిధ్యమం దేవస్తువున్నా లేనపుడు స్వాంతస్థతప్రతిబింబప్రకాశతకు సామర్థ్యము లేదు. అటులనే పరాశక్తికిని పరశివసాన్నిధ్యము లేనపుడు తనయం దిమిడియున్న ప్రపంచోల్లసనసామర్థ్యము సంభవింపనేరదు. అట్లే పరశివునకును పరాశక్తిసంయోగములేనిది స్వరూపజ్ఞానము కలుగనేరదుగాన కామేశ్వరీకామేశ్వరద్వంద్వమువలన సకల జగజ్జాలము ఉత్పన్నమగుచున్నదని తాత్పర్యము.

'నిజసుఖమయనిత్యనిరుపమాకారా' ఇట్లు చెప్పినందున నిజసుఖము బ్రహ్మానందస్వరూపము. ప్రపంచమందు సర్వానుభవములో నున్న సుఖములు విషయసుఖములు. ఇవి మరియొక వస్తుసంబంధమువలన కలుగునవియును అనిత్యములు. ఇవి బ్రహ్మానందముయొక్క ప్రతిబింబములుగా నున్నందున బింబభూతమైన సుఖము నిజసుఖమనియు, ప్రతిబింబములు మిథ్యలనియు, ప్రతిబింబకారణములు నిజమైన వస్తువులనియు సర్వానుభవముగా నున్నది. అట్టి బ్రహ్మానందమే స్వరూపముగాగలది, సృష్ట్యాదిని అంతమందును గలదిగాన 'నిత్య' అనఁబడుచున్నది. తనకు సమానముగాని అధికముగాని మరియొక వస్తువు లేనిది యిందువలన ఏకాకి అని తెలియుచున్నది.

'ఆద్యా' అనినందున సృష్ట్యాదియందున్న వస్తువనియు, ప్రకాశబిందువునుంచి విభాగమును పొందినదిగాన సృష్టికి నిదే ప్రారంభమనియు తెలియుచున్నది. అందువలన మూలశక్తియని గ్రహింపఁబడుచున్నది.

శ్రు. ఆదిత్యవర్ణం సువర్ణజ్యోతిః.

ఈ శ్రుతులవలన నీపరాశక్తిస్వరూపము తేజోమయముగాని అంధకారరూపము కాదని తెలియుచున్నది.

పైనచెప్పిన అంశములకు ప్రమాణములు:—

శ్రు. సోఽకామయత, బహు స్యాం ప్రజాయేయేతి. తైత్తిరీయే.
తదైక్షత బహు స్యాం ప్రజాయేయేతి. ఛాందోగ్యే.
సం ఈక్షతలోకాన్ను సృజత ఇత్యైతరేయే.
స తస్మిన్నాకాశే స్త్రియమాజగామేతి. బృహదారణ్యకే. తత్రైవ.
శ్రు. సోఽభిభేత తస్మా దేకాకి బిభేతి, సహాయ మీక్షాంచక్రే యన్మదన్యం నాస్తి కస్మాన్ను బిభేమీతి, తత ఏవాస్య భయం వీయాయ. కస్మాద్ధ్యభేష్యత్తు ద్వితీయాద్వై భయంభవతి.

తా. సర్వశక్తి పరంబ్రహ్మ యని శ్రుతివలన విమర్శాత్మకమైన బ్రహ్మవస్తువునందు సకలశక్తులు నిమిడియున్నవి. బ్రహ్మాండావిర్భావ కాలము సమీపించినపుడు నిస్తరంగసముద్రమందు తరంగముల వలెను, రజ్జువందు సర్పభ్రమవలెను, శుక్తియందు రజతభ్రాంతివలెను, స్థాణువందు పురుషారోపణవలెను ఆత్మయందు స్పందశక్తి ఉద్రేకించినది. అదియే ఈక్షణకాలములని వ్యవహరింపఁబడుచున్నది. ఆస్పందమే ఇచ్ఛాశక్తి యనఁబడును. అట్టిసంకల్పము కలిగినవెంటనే ప్రతిబింబ కారణమగు జ్ఞానశక్తి పురోభాగమందు ఆవిర్భవించినది. అదియే విమర్శ బిందువుగా నున్నది. మొదట చూపించిన ప్రకాశబిందువునందు లీనముగా నున్న విమర్శశక్తి భావిబ్రహ్మాండాదిని కార్యనిర్మాణము కొఱకు నాప్రకాశబిందుప్రభయే. ప్రతిబింబముగా నీవిమర్శబిందువు స్పష్టమైన భేదము - అభేదమును కలదై ఆవిర్భవించినది. ఈప్రతిబింబ మునకు ప్రకాశబిందువే కారణము. నిజమైనవస్తువుకాన ప్రథమ బిందువునకు కారణములేదు. ఈవిమర్శబిందువు తనయం దుదయించే ప్రతిబింబమునకు ఆదర్శమువలె కారణమును, కార్యరూపమైన ప్రతిబింబమును తానే యగుచున్నందున భావిబ్రహ్మాండమునకు కార్య కారణరూపముగా నున్నదని తెలియుచున్నది.

మూలమందున్న 'ఆద్యా, నిత్యా' పదములవలన ఆత్మరూపమైన కామకలను గ్రహించుటకు నామరూపము లనే రెండుశాఖలలో రూపము ననుసరించి తురీయ తురీయమైన షోడశీకలగా నున్నది. ఆకల నాశరహితము గాన నిత్యానామము. తక్కిన పంచదశకలలు నీకల

వలన జనించి, యందు లయమగుచున్నందున 'ఆద్యా' అని చెప్పఁబడినది. లోకమునందు ద్వితీయకల ప్రజలకు దృగ్గోచరమగును. ప్రతిపత్కల యోగులకు దృగ్గోచరమగును. ఈనిత్యకల బ్రహ్మవేత్తలకు శిరోమధ్యమందు సంవిన్మయముగా జ్ఞానదృష్టికి గోచరముగానున్నది. ఇట్లు రూపాత్మకము. సాధకులకు పరాకాశమందున్నట్లు నిరూపింపఁబడినది.

ఇక నామాత్మకశాఖ ననుసరించి అకారము బ్రహ్మద్యోతనము గాన, చంద్రమండలాత్మకముగా ప్రకాశబిందువుచే అకారమును నిర్దేశించినారు. ఇందు విమర్శబిందువు అగ్నిబీజమైన హకారమును తెలుపుచున్నది. పర్యవసానము ఈరెండు బిందువులవలన షోడశీకల 'అహం' అనే వర్ణద్వయము, శివశక్తులు, బింబప్రతిబింబములు ఏర్పడినవి.

బృహదారణ్యకశ్రుతిః. స వై నైవ రేమే తస్మా దేకాకీ న రమతే స ద్వితీయ మైచ్ఛత్, సహైతావానాస యథాస్త్రీ పుమాగ్ంసౌ సంపరిష్వక్తౌ స ఇద మేవాత్మానం ద్వేధా పాతయత, పతిశ్చ పత్నీ చాభవతా మితి.

ఈశ్రుతివలన ప్రాణ్యదృష్టకాలము సంభవించినపుడు పరమాత్మ తనను రెండు భాగములుగా విభజించి స్త్రీ, పుం రూపములను ధరించి భార్యాభర్తలుగా నున్నారని తెలియుచున్నది.

శ్రు. ఏకో రుద్రస్సర్వభూతేషు గూఢో
మాయారుద్రోసకలో నిష్కలశ్చ,
స ఏవ దేవీ న చ తద్విభిన్నా
హ్యేతి జ్ఞాత్వాహ్యమృతత్వం వ్రజంతి. ఇతి శ్వేతాశ్వతరీయం.

ఇందువలన కార్యకారణములకును, శివశక్తులకును భేదము లేదని తెలియుచున్నది.

### 3. సూత్రము.

**సూ. స్ఫుటశివశక్తిసమాగమబీజాంకురరూపిణీ పరాశక్తిః,**
**అణుతరరూపానుత్తరవిమర్శలిపిలక్ష్యవిగ్రహా భాతి.**




అర్థము. స్ఫుటశివశక్తిసమాగమబీజాంకురరూపిణీ - స్ఫుట = వ్యక్తమయిన, శివశక్తి = ఇచ్ఛాజ్ఞానశక్తులయొక్క, సమాగమ = సమ్మేళనముచేత, బీజాంకురరూపిణీ = బీజాంకురరూపమయినట్టియు, అణుతరరూపానుత్తర...లిపిలక్ష్యవిగ్రహా - అణుతర = అత్యంతసూక్ష్మమయిన, రూప = స్వరూపముగల, అనుత్తర=సర్వవర్ణాగ్ర్యమయిన అకారమును, విమర్శ = పంచాశద్వర్ణముల అంత్యమయిన హకారములనెడి లిపివర్ణములచేత, లక్ష్య=చూడదగిన, విగ్రహా=శరీరముగల, పరాశక్తిః=పరాభట్టారిక, భాతి=ప్రకాశించుచున్నది.

రహస్యార్థము. వెనుక చూపించిన ప్రకాశవిమర్శ బిందువులు కామకలాస్వరూప సాధనములుగా నున్నట్లిచ్చట స్ఫుటపరచుచున్నారు. భావిప్రపంచమునకు బీజాంకురరూపమయిన ప్రకాశవిమర్శాత్మక శివశక్తిస్వరూపతేజోమయమయిన అహమనే బీజద్వయము శరీరముగా గలిగి పరాశక్తి ప్రకాశించుచున్నదని చెప్పిరి.

'స్ఫుటశివశక్తిసమాగమబీజాంకురరూపిణీ' ఈవిశేషణమువలన వెనుకచెప్పిన ప్రకాశాంశవిమర్శాంశలును, ఇచ్ఛాజ్ఞానశక్తిరూపములును గలది. ఈశివశక్తులయొక్క మేళనము వినాగా భావి శివాది క్షిత్యంతపదార్థము లుత్పన్నము కానేరవు గాన, నీమిశ్రబిందువు భావిజగత్తునకు బీజాంకురరూపముగా నున్నదని చెప్పిరి. బీజమందంకుర మిమిడియుండును. బీజము వికసనమును పొంది యాబీజమే అంకురరూపముగా పరిణమించును. కాన నీబీజాంకురములు పరస్పరాపేక్షయు, అన్యోన్యమేళనమును గలవి.

'అణుతరరూపానుత్తరలిపిలక్ష్యవిగ్రహా' అను నీవిశేషణముచే అనుత్తరలిపి పంచాశద్వర్ణములలో నింతకుముందు ఏవర్ణము లేనందున అకారముగా తెలియుచున్నది. విమర్శలిపి విమర్శశబ్దముచే కలారూపశక్తి ద్యోతన మగుచున్నది. అది అగ్నికలాత్మకము. ఇందువలన సర్వవర్ణాంత్యమయిన హకారముగానున్నది. ఈవర్ణద్వయసంయోగము అహం. ఇందు నీరెండు బీజములమధ్యను పంచాశద్వర్ణములు గర్భీకృతములుగా నున్నవనియు, వర్ణపదమంత్రరూపమయిన సకల శబ్దజాలమును, కలాతత్త్వ భువనాత్మకమైన సకలతత్వములును, వస్తువులు నీ అహామనెడి పదమం దిమిడియున్నవి. అందువలన నామరూపాత్మకమైన జగత్తునకు నిదియె కార్యకారణ రూపముగా నున్నది. ఇదె ఆత్మస్వరూపమైనందున ఆత్మమాత్రమని సకలోపనిషత్తులందును, అహామహామని సర్వజనులందును నున్నందున ఇదే బ్రహ్మావస్తువని సకలాగమసిద్ధము. ఇందుకు యోగవాసిష్ఠమందు:—

శ్లో. అకారస్సర్వవర్ణాగ్ర్యః ప్రకాశః పరమశ్శివః,
హకారోఽంత్యః కలారూపో విమర్శాఖ్యః ప్రకీర్తితః,
అనయోస్సామరస్యం యత్తస్మిన్నహమితీర్యతే.
అశిరస్కం హకారాంతమశేషాకారసంస్థితమ్,
అజస్రముచ్చరంతం స్వం తమాత్మానముపాస్మహే.

**బ్రహ్మోపనిషత్ :—**

శ్రుతి. ఏష సర్వేషు భూతేషు గూఢాత్మా న ప్రకాశతే,
దృశ్యతే త్వగ్ర్యయా బుధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః.

తా. ఈ పరమాత్మ సకలభూతములందును అహామని వ్యవహరించుచున్నను అతిగోప్యముగా నున్నది. అతిసూక్ష్మమైనందున జ్ఞానదృష్టిగల మహనీయులు సూక్ష్మదృష్టిచే దీనిని తెలుసుకొనుచున్నారు; చూచుచున్నారని శ్రుతి తాత్పర్యము.

**౪. సూత్రము, మహాబింద్వావిర్భావము.**

**మూ. పరశివరవికరనికరే ప్రతిఫలతి విమర్శదర్పణే విశదే,**
**ప్రతిరుచిరుచిరే కుడ్యే చిత్తమయే నివిశతే మహాబిందుః.**

అర్థము. పరశివరవికరనికరే.పరశివ=ప్రకాశైకస్వరూపుఁడగు కోఁ శివుఁడనెడి, రవి = సూర్యునియొక్క, కరనికరే = కిరణసముదాయము, విశదే=నిర్మలమయిన, విమర్శదర్పణే = స్ఫురణశక్తి యనెడి అద్దమందు, ప్రతిఫలతి సతి = ప్రతిఫలించుచుండఁగా, చిత్తమయే = జ్ఞానైకస్వరూప మయిన, ప్రతిరుచిరుచిరే = ప్రతిప్రకాశరమ్యమయిన, కుడ్యే = భిత్తి యందు (గోడయందు) ప్రకాశవిమర్శాత్మమైన అహామనే మహాబిందువు, నివిశతే = ప్రవేశించుచున్నది.

రహస్యార్థము. ఈప్రకరణము ననుసరించి గ్రంథకర్త కామకలా స్వరూపమును నిరూపింపఁదలఁచి అందుకు సాధనముగానున్న కామకలా క్షరద్వయమును స్పష్టపరచుచున్నారు. వెనుక చెప్పిన ప్రకాశబిందువు శివ స్వరూపము చంద్రమండలము అకారముగా గ్రహింపఁదగినది. రెండవ సూత్రమందు వర్ణించిన విమర్శబిందువు శక్తిస్వరూపము. అగ్నిమండ లము హాకారముగా నున్నదని యిదివరకే చూపింపఁబడినది. పరబ్రహ్మ వస్తువు స్వాత్మశక్తీక్షణాభిముఖమయినపుడు జగత్కారణత్వము ఆ బ్రహ్మవస్తువునకు గలుగుచున్నదని సకలనిగమాగమసిద్ధముగా నున్నది. ఆయర్థమునే ఇచట సంక్షేపముగా చెప్పుచున్నారు.

ప్రకాశవిమర్శశక్తులు రెండును ఆదిని ఏకవస్తువుగానుండి కార్యా ర్థమయి విభాగమును పొందినవి. విభాగకాలమందు చంద్రాగ్ని రూప ములు కలిగియున్నవి. ఈరెంటియొక్క సంయోగమువలన మూఁడవ దగు సూర్యబిందువు జనించుచున్నది. ఇందుకు దృష్టాంతముచే బోధించు చున్నారు. అకారస్వరూపుఁడగు పరశివుఁడు హాకారస్వరూపపరాశక్తి నీక్షించినపుడు వెనుక పరాశక్తి అద్దమువంటిదని చెప్పినందున నీఈశ్వర తేజస్సువలన ఆశక్తియందు ఈశ్వరప్రతిబింబము ప్రకాశించుచున్నది. అపుడు శివశక్తులు రెండు, ఈరెంటి సంయోగమువలన జనించిన ప్రతిబింబము ఒకటి, ఇటుల మూఁడు బింబములు పదార్థము లేర్పడినవి. అనఁగా అ, హం, అహం. ఇట్లు ఈశ్వరునికి తన జ్ఞానశక్తి రూపాదర్శన వీక్షణమువలన అందు ప్రతిఫలించిన ప్రతిబింబమును చూచి అయ మహామని (ఈ ప్రతిబింబము నేను సర్వాఁరిపూర్ణుఁడనని) తన చిత్తమందు తలంచెను. అహామనేది ఈశ్వరచిత్తమందు కలిగినది ఈమూఁడవ బిందు వగు అహామనునది ఉత్పత్తికి లోకదృష్టాంతము.

పగలు యామాదూర్ధ్వమందు సూర్యాభిముఖముగా అద్దము నుంచినపుడు ఆ సూర్యకిరణములు అద్దముచే ప్రతిహన్యమానములై సమీపమందున్న గోడయందు ప్రతిఫలించి ఆ ప్రతిబింబకాంతి మండలాకారముగా తేజోబిందువు ప్రకాశించును. ప్రధాన సూర్యమండలము ఒకటి. అద్దమందు ప్రతిబింబము రెండవది. గోడయందున్న తేజోబిందువు మూడవది. ఈమూడవబిందువుయొక్క ఉత్పత్తికి సూర్యబింబమును అద్దమును సమానకారణములుగా నున్నవి. ఏది లోపించినను ఈమూడవ బిందువు కలుగనేరదు. అటులనే జగదుత్పత్తికి నీశివశక్తు లిద్దఱును సమానకారణములుగా నున్నారని చెప్పిరి.

'చిత్తమయే నివిశతే మహాబిందుః' అనినందున తెలియుచున్న అంశము. ఈ గ్రంథమంతయు స్వరూపజ్ఞానసాధనముగా నున్నది. ఇందారంభమందు తురీయకూటమును వర్ణించినందున సృష్టితో సంబంధించిన దృష్టాంతములు చూపించుటకు వీలులేదు. ముందు రాఁబోవు అవిద్యాపాదమందు శ్రీచక్రాదివర్ణనయందును శరీరకవిచారణ స్పష్టమగును. ఇచట చెప్పినను దురవగాహము. అయినను సూక్ష్మముగా వివరింపఁబడును. ఏకాగ్రచిత్తులయి గ్రహింపఁదగినది.

సకలజనశరీరములందును చిత్కళ, జీవము, సాక్షి, కూటస్థుఁడు, సూత్రాత్మ, చిత్తము, చైతన్యము, మనస్సు, బుద్ధి మొదలగు వస్తువులున్నట్లును, లోకాంతర గమనాగమనములు, బంధమోక్షములు కలవనియు పండితపామరులకు గూడ తెలిసిన యంశము గాని; పైన చెప్పఁబడిన వస్తువులు ఎచ్చటెచ్చట నున్నవి? ఎట్టివి? వీనియుత్పత్తిక్రమమెట్టిది? ఎంతవరకు నిజము? అని మాత్రము విచారించలేదు. విచారించినను అగోచరముగా నున్నది. అది కొంత ఇచట వివరింపఁబడును.

ఈ గ్రంథకర్తయును అహమనే శబ్దమును వివరించుటకే ఆరంభించినాఁడు. ప్రథమసూత్రమందున్న ప్రకాశబిందువు సర్వకారణ వస్తువనియు, అదియే పరమాత్మయనియు, అది సాధకజనశిరోమధ్యనున్న చంద్రమండలాకారముగా నున్నపుడు ప్రత్యగాత్మయనియు, బ్రహ్మాండ పిండాండములకభేదమనియు ఇదివరకే చెప్పఁబడినది. ఆ ప్రకాశబిందువే సాక్షిస్వరూపము. ప్రకాశమనఁగా చిత్కళ. ఆసాక్షినే కూటస్థుఁ

డని యీ ప్రకరణమందు వాడుచున్నారు. ఇందువలన చిత్కల, సాక్షి, కూటస్థుఁ డనునీపదములు ఏకవస్తుపర్యాయములు. ఈసాక్షియనే కల జ్ఞానస్వరూపమయిన విమర్శశక్తియందు సర్వవ్యాపక బ్రహ్మవస్తు ప్రతి బింబముగా నున్నది. ఈశక్తి బ్రహ్మప్రతిబింబమునకు అద్దము వంటిది. ఇందువల్ల ఆత్మ బింబముగాను, శక్తి ఉపాధిగాను, అందుగల ప్రతి బింబము సాక్షిగాను తెలియుచున్నవి. ఆసాక్షియే కూటస్థుఁడని, చిత్కలయని, అంతర్యామియని వ్యవహరింపఁబడుచున్నది.

అద్దమందున్న సూర్యప్రతిబింబమునకును తేజస్సు ఉన్నట్లు నీసాక్షికిని ప్రకాశత కలదుగాన, నిందువలన అవిద్యయనే కుడ్యసదృశ చిత్తమందు మరియొక ప్రతిబింబము ప్రతిఫలించుచున్నది. ఇందువలన సూర్యుఁడు, అద్దమందుగల ప్రతిబింబము, దానివల్ల కలిగిన కుడ్యమందున్న తేజోబిందువు-ఇట్లు ఒక సూర్యుఁడే ఉపాధులభేదముచే మూడు విధములుగా నగుపడుచున్నాఁడు. అటులనే సర్వవ్యాపకమయిన పరమాత్మ, అతని ప్రతిబింబము సాక్షి, దాని ప్రతిబింబము జీవుఁడు. ఇటుల మూడు వస్తువులు ఇచటను కలిగినవి. రెండవ ప్రతిబింబమయిన జీవుఁడు అహామహామని ప్రతిశరీరమందును వ్యవహరించుచున్నాఁడు. ఈ అహామనేవాడుక జీవునియందు కూడదనియు, సాక్షియందు వర్తించు ననియు తెలుపుటకయియే యీగ్రంథోత్పత్తి అయినది.

పర్యవసానము. శుద్ధసత్వమనే మాయోపాధియందుఁగల బ్రహ్మ ప్రతిబింబము, సాక్షి కూటస్థుఁడు, ఈశ్వరుఁడు అని చెప్పఁబడును. కలుష సత్వమనే అవిద్యోపాధియందుగల సాక్షిప్రతిబింబము జీవసంజ్ఞ కలది. ఆత్మరూప ప్రకాశవస్తువు సాక్షికి కారణముగాను, ఆసాక్షి జీవుఁడనే ప్రతిబింబమునకు కారణముగాను ఇట్లు కార్యకారణ[illegible]వము కలిగియున్నది.

ఈయంశమును గురించి విద్యారణ్యులవారు పంచదశిలో కూటస్థ విచారణలో నిటుల వివరించిరి:

శ్లో. ద్విగుణీకృతచైతన్యే జన్మనాశానుభూతితః,
అకూటస్థం త దన్యత్తు కూటస్థ మవికారతః,

తా. చిదాభాసుఁడగు జీవరూపప్రతిబింబమును, సాక్షిరూప మయిన శుద్ధసత్త్వోపాధియందుగల ప్రతిబింబమును చిత్కళలవలననే కల్గినవికదా! ఇందులో ఒకటి కూటస్థుఁడనియు, రెండవది కాదనియు చెప్పుటకు కారణమేమనిన, చిదాభాసుఁడగు జీవుఁడు అనే రెండవప్రతి బింబము జననమరణధర్మములు కలుగుటచే కూటస్థుఁడు కాఁడనియు, పరమాత్మయొక్క ప్రథమ ప్రతిబింబమయిన సాక్షియందు చిదాభాసుని కన్న ప్రకాశత ద్విగుణముగా నున్నందున, వికారములు లేక ఏకరీతిగా నున్నందున చిత్సంబంధము సమానముగా నున్నను సాక్షికే కూటస్థ సంజ్ఞకలదని చెప్పిరి.

**మరియు.—**

శ్లో. అంతఃకరణ తద్వృత్తిసాక్షిత్యాదావనేకథా,
కూటస్థ ఏవ సర్వత్ర పూర్వాచార్యై ర్వినిశ్చితః.

తా. మనోబుద్ధి చిత్తాహంకారములు అంతఃకరణయని, ఆచిత్త మందుగల ప్రతిబింబము చిదాభాసుఁడని, వికారములుగల జీవుఁడని అంతఃకరణ వృత్తులను తెలుసుకునేవాఁడు సాక్షి, కూటస్థుఁడనియు నితఁడు అవికారిగా పూర్వాచార్యులు అనేక స్థలములలో చెప్పిరి. స్వకల్పితముకాదని ఇందుకు ప్రమాణములు.

శ్లో. అంతఃకరణ తద్వృత్తిసాక్షిచ్చైతన్యవిగ్రహః,
ఆనందరూప స్సత్య స్సన్కిమాత్మానం ప్రపద్య సః.
ఆత్మాభాసాశ్రయాశ్చైవం ముఖాభాసాశ్రయా యథా,
గమ్యతే శాస్త్రయుక్తిభ్యా మిత్యాభాసశ్చ వర్ణితః.

తా. వెనుక అంతఃకరణ వృత్తులకు సాక్షిగానున్న చైతన్యమును ఆనందస్వరూపుఁడగు కూటస్థునిగా నిశ్చయించి ఇచట చిదాభాస స్వరూపమును వివరించుచున్నారు.

ఆత్మ, ఆభాస, ఆశ్రయము అని మూడువస్తువులు. ఆత్మయే సాక్షి. అదియే చిత్కళ. ఆభాసప్రతిబింబము అదియే జీవసంజ్ఞ కలది. ఆశ్రయము ప్రతిబింబకారణమగు చిత్తము. అదియే అంతఃకరణచతు ష్టయ సముదాయము. ఇందుకు దృష్టాంతము. స్వముఖము, ముఖప్రతి బింబము, ఇందులకాశ్రయమగు అద్దము, ఇటులనే సాక్షి, చిదాభాస,

చిత్తము. ఈమూడు వస్తువులు దృష్టాంతదార్ష్టాంతికములయందు సమానముగా నున్నవని చెప్పిరి గాన, మూలమందుచెప్పిన పరశివుఁడు ఆత్మస్వరూపుఁడు, మాయ యందుగల తన ప్రతిబింబము సాక్షి; కుడ్యసదృశ చిత్తమందుఁగల సాక్షిప్రతిబింబము చిదాభాసుఁడనే జీవుఁడు. ఇదియే అహమహమనే మహాబిందువు చిత్తమందు ప్రవేశించినదని చెప్పిరి. ఈయంశము పదియవసూత్రవ్యాఖ్యయందు విస్తరింపఁబడును.

౫. సూత్రము, కామకలానిరూపణము.

**మూ. చిత్తమయోఽహంకార స్సువ్యక్తాహార్ణ సమరసాకారః,**
**శివశక్తిమిథునపిండః కబలీకృతభువనమండలో జయతి.**

అ. చిత్తమయః = జ్ఞానైకస్వరూపముఁగల, అహంకారః = స్వప్రకాశస్వాత్మవిశ్రాంతిరూపమయిన అహంకారము, సువ్యక్తాహార్ణసమరసాకారః—సువ్యక్త=అత్యంతము స్పష్టమైన, అహార్ణ=అకారహకారముల యొక్క, సమరస = లోలీభావమనెడి, ఆకారః = స్వరూపముఁగల, శివశక్తి మిథునపిండః = ప్రకాశవిమర్శాత్మకదివ్యదంపతీసంపుటము, కబలీకృతభువనమండలః = అంతస్థాపితమైన షట్త్రింశత్తత్త్వకదంబమును, సకలశబ్దజాలమును కలదై, జయతి=సర్వోత్కృష్టగా ప్రకాశించుచున్నది.

తా. పూర్వసూత్రమందు పరబ్రహ్మ ఇచ్ఛాశక్తిని స్వసాన్నిధ్యమందు చూచుటవలన విమర్శశక్తియుక్తుఁడైనపుడు నందు ప్రతిఫలించిన రూపము అహమని (తానే యని) గ్రహించి తాను సర్వపరిపూర్ణుఁడనని తన ఆత్మయందు తాను విశ్రాంతిని పొందుటయె అహమనే జ్ఞానోదయమైనదని చెప్పినారు. ఆ అహమనే వస్తువునే దృఢపరచుచున్నారు. అహమనుపదము చిత్తస్వరూపము. చిత్తమనఁగా జ్ఞానరూపము. ఆ జ్ఞానము విమర్శయుక్తమైనపుడు (విమర్శ అనగా వస్తువివేచనయు ఆద్యంతపరిశీలనయు) అహమేవ పూర్ణః మదన్యో నాస్తీతి (నేను పూర్ణుఁడను నాకన్న అన్యము లేదనియే) తనయందు తాను విశ్రాంతిని పొందును. ఈవిచారణవలన అహమనేపదము ఆత్మస్వరూపముగాను, శివశక్త్యాత్మకముగాను యుక్తిచేతను శాస్త్రముచేతనుకూడ నగుపడుచున్నది. ఈ అహమనునదియు చిత్తమని తెలియుచున్నది.

"కబలీకృతభువనమండలః" అంతస్థాపితమైన చతుర్దశభువనాత్మక బ్రహ్మాండము కలదని యెట్లనిన, సకలభువనములును నామము రూపము అను నీరెండువస్తువులు కలవి. ఇంతకు వేరులేదు. ఈనామము శబ్ద మయము. ఆశబ్దము పంచాశద్వర్ణాత్మకము. ఆపంచాశద్వర్ణములకు ఆదివర్ణము అకారము. అంత్యవర్ణము హకారము ఈరెండువర్ణముల మధ్యను సకలవర్ణకదంబమున్నూ ఇమిడియున్నదని గ్రహింపఁబడు చున్నందున సకలభువనములందుగల నామాంశము నీవర్ణద్వయమం దిమిడియున్నది. ఇక రూపము. రూపమునకు బ్రహ్మాండమందు, చంద్ర సూర్య అగ్నులు కారణవస్తువులు, ఇచట అకారము చంద్రమండలమని యిదివరకే చెప్పఁబడినది. ఈఅకారగ్రహణముచే పదియారు స్వరములు చంద్రకలలుగా గ్రహింపఁబడుచున్నవి. హకారము అగ్నిమండలము. ఇందు వరస యకారాది అగ్నికలలుపదియు గ్రహింపఁబడినవి. ఈచంద్రా గ్నుల మేళనసామరస్యము అహమని యిందువలన మధ్యనున్న ౨౪ యిరు వదినాలుగుకలలు కకారము మొదలు భాంతముకలవి. సౌరమండలము సౌరకలలుగా గ్రహింపఁబడినవి. ఇందు నాసౌరకలలలో (౧౨) కలలు చంద్రసంబంధములు. ౧౨ కలలు అగ్నిసంబంధములు. కలసి ౨౪ సూర్య మండలముగా నున్నందున నిది మిశ్రమండలము. అహమనిపించుకొనును. ఆ మండలత్రయమందు (౩౬) షట్త్రింశత్తత్త్వములు ఇమిడియున్నందున, నీమండలత్రయము అహమనే వర్ణద్వయమునం దిమిడియున్నందున, చతుర్దశభువనములందుగల సకలవేదశాస్త్ర మంత్రభాషారూపమైన శబ్ద బ్రహ్మము ఇమిడియున్నందున కబలీకృతభువనమండలమని చెప్పిరి. ఈ అహంకారస్వరూపశివశక్తిసంపుటమువలననే నామరూపాత్మక సకలజగ దావిర్భావము కాఁగలదని అభిప్రాయము.

## ౬. సూత్రము, బిందుత్రయము.

**మూ. సితశోణబిందు యుగళం వివిక్తశివశక్తిసంకుచత్ప్రసరమ్,**
**వాగర్థసృష్టిహేతుః పరస్పరానుప్రవిష్టవిస్పష్టః.**




అ. వివిక్తశివశక్తిసంకుచప్రసరం—వివిక్త = అన్యోన్యవిహార స్వభావముగల, శివశక్తి = కామేశ్వరీకామేశ్వరస్వరూపముగు, సంకుచ ప్రసరం=ముకుళీభూతమైన అంకురముగలదియు, వాగర్థసృష్టి హేతుః= నామరూపములసృష్టి హేతువైనదియు, పరస్పరాను ప్రవిష్టవిస్పష్టః— పరస్పర=అన్యోన్యమును, అనుప్రవిష్ట = సమ్మేళనముచే, విస్పష్టః = పృథగ్భూతమయిన, సితశోణబిందుయుగళం = రక్తశుక్లసమ్మేళనసంపుటము, జయతి = సర్వోత్కృష్టగా వర్తించుచున్నది.

తా. ఇటుపైని రెండుసూత్రములచే బిందుమయకామకలా స్వరూపమును నిరూపించుచున్నారు. వెనుక ప్రకాశవిమర్శ మిశ్రబిందువులు అహామనే వర్ణద్వయ సమష్టి వ్యష్టిరూపముగా నున్నట్లు చెప్పిరి. ఆ అర్థమునే ప్రకారాంతరముగా నిచట వర్ణించుచున్నారు.

శ్రు. యః పరస్స మహేశ్వర ఇతి.

ఈశ్రుతిచే నిరూపింపఁబడిన పరమేశ్వరుఁడు వేదాదిశబ్దజాలమున కాస్పదమయిన సర్వవర్ణాగ్ర్యమైన అకారస్వరూపుఁడై తనవలన ఉత్పన్నమైన సకలప్రపంచమునకు స్థానముగా నున్న ఆత్మశక్తియందుఁ బ్రవేశించి శుక్లబిందురూపమును పొందినాఁడు. అటులనే విమర్శశక్తియు స్వాంతర్గతశుక్లబిందువునందుఁ బ్రవేశించి రక్తబిందుభావమును పొందుచున్నది. పిమ్మట నామిశ్రబిందువు వికసనమును పొందినపుడు ఆ బిందువువలన నాద ముత్పన్నమగుచున్నది. ఆ నాదమందు కలలు ఉత్పన్నమగుచున్నవి. ఆ కలలు కలాతత్త్వభువనాత్మకములు. వర్ణపద

మంత్రాత్మకములుగా నున్నవి. ఇట్లు రహస్యార్థ మున్నందున ముకుళీభూతమైన అంకురమూగలదని చెప్పిరి. ఇటుల నాబిందువువలన నుత్పన్నమైన సకలతత్త్వాత్మకపరానాద ముత్పన్నమై తేజోమయమై నీవారాగ్రమువంటి సూక్ష్మరూపముతో శృంగాటమును పొందుచున్నది. ఈబిందునాదములు అహమనే వర్ణద్వయసంపుటము శరీరముగా నున్నవని రహస్యార్థము.

౭ సూత్రము.

మూ. బిందురహంకారాత్మా రవిరేతన్మిథునసమరసాకారః,
కామః కమనీయతయా కలా చ దహనేందువిగ్రహౌ భాతి.

శుక్లబిందువు రక్తబిందువు




మిశ్రబిందువు.

కామకలాంగనాస్వరూపము.

అ. బిందుః = పూర్వోక్తమిశ్రబిందువు, అహంకారాత్మా='అహ మనే వర్ణద్వయమాత్మయందుగలది, ఏతన్మిథునసమరసాకారః = అకార హకారములనే ప్రకాశవిమర్శాంశలగు శివశక్తిరూప రక్తశుక్లబిందు ద్వయముయొక్క, సమరసాకారః = అన్యోన్య మేళనస్వరూపము (చంద్రాగ్ని మేళనవస్తువు), రవిః = సూర్యబింబము, కమనీయతయా= మనోహరమైనందున, కామః=మహాయోగులచే కోరదగినది, దహనేందు'

విగ్రహా = చంద్రాగ్ను లేశరీరముగానున్న, కలాచ = ప్రకాశాత్మక విమర్శశక్తి స్వరూపమున్ను అగుచున్నది.

తా. వెనుక ఆఱుసూత్రములచే ప్రతిపాదించిన ప్రకాశబిందు, విమర్శబిందు, మిశ్రబిందువులను ఇచట కామకలారూప మహాత్రిపుర సుందరీ స్వరూపముగా నిరూపించుచున్నారు. ప్రకాశవిమర్శాంశలగు కామేశ్వరీకామేశ్వరస్వరూప దివ్యదంపతీద్వంద్వము. అహామనే వర్ణ ద్వయ సంయోగరూపమయిన మిశ్రబిందువు రవిమండలముగానున్నది. రక్తశుక్లబిందువులు చంద్రాగ్నులుగా నున్నారు. లోకమందును తేజో ప్రవేశనిర్గమముల ననుసరించి సూర్యబింబము మిశ్రబింబముగానున్నది. పరిలేఖనలో యోనిచక్రమధ్యబిందు వగు సంవిద్బిందువు సర్వకారణ బిందువు. ఈమధ్యబిందుప్రభయే సూర్యచంద్రపరివేషములభంగి నీయోనిచక్రాకారముగా పరిణమించినది. ఈబిందుచతుష్టయము పరా శక్తియొక్క అవయవములుగా నేర్పడినది.

ఈచక్రసమిష్టి కామకలాస్వరూపమును తెలియఁజేయుచున్నది.

శ్లో. మిహిరబిందుముఖిం తదధోలసచ్ఛశిహుతాశనబిందుయుగస్తనీం,
సహపరార్థకలారశనాస్పదాం భజత సత్య మిమాం పరదేవతాం.
ఇతి మాతృకావివేకే.

తా. మిశ్రబిందువనే రవిబింబము ముఖముగాను, చంద్రాగ్ను లనే రక్తశుక్లబిందువులు స్తనద్వయముగాను,నాదబిందువు కటిప్రదేశము గాను నున్న సత్యస్వరూపమయిన కామకలయనే పరదేవతను పుణ్య పురుషులు భజింతురుకాక.

కల్పసూత్రే:—

అగ్రబిందుపరికల్పితాననా మన్యబిందురచితస్తనద్వయీాం,
నాదబిందురశనాగుణాస్పదాం నౌమి తే పరశివాం పరాం కళాం.

వెనుకటి యర్థమే యీశ్లోకమునకును వర్తించుచున్నది. ఈబిందు చతు ష్టయవివరము రహస్యామ్నాయమందు చెప్పఁబడినది.

నిత్యసుఖప్రాప్తికి స్వరూపవిచారణ చేయవలెనని చెప్పి యిచట బిందుమయకామకలానిర్దేశమువలన నేమి సార్థకమనిన నిదంతయు స్వరూపవిచారణగానే యున్నది. ఎట్లనిన; తనయొక్క నిజమైనరూప

మును తాను తెలిసికొనుటకు సాధనము స్వరూపవిచారణ యనఁబడును. ఈస్వరూపమును స్థిరపరచుటకు "శ్రుతిశ్చ భిన్నాస్మృతయశ్చ భిన్నాః మహాఋషీణాం మతయశ్చ భిన్నాః" అను వచనరీత్యా స్వరూపనిశ్చయమునకు ప్రమాణములు. శ్రుతిస్మృతులును బ్రహ్మవేత్తల సమ్మతియు భిన్నాభిప్రాయములుగా నున్నవి. ఇందువలన స్వరూపము ప్రతిజను నందును అహామహామని (నేను, నాది అని) వ్యవహరించఁబడువస్తువు ప్రపంచవ్యవహారదశలో స్థూలశరీరమందు వర్తించుచున్నది. ఇది సర్వానుభవసిద్ధముగా నున్నది. ఇందునకును ప్రమాణములుగా శ్రుతులున్నవి.

కర్మకాండ పరోక్షజ్ఞానమును, స్వర్గాదులను, ఇంద్రాదులను, లోకాంతరగమనమును తెలుపుచున్నది. అందువలన సూక్ష్మశరీరాభిమానియగు జీవునియందు నీ అహామనేది వర్తించుచున్నట్టును శ్రుతిసిద్ధముగా నున్నది. ఇక బ్రహ్మకాండమగు ఉపనిషత్తులందు పరమాత్మ బ్రహ్మవస్తువుగా నున్నట్టును, సాక్షి చిత్కళారూపముగా నున్నట్టు నది సత్యవస్తువై నందున అహామనేది యాసాక్షియందు వర్తించునని సర్వోపనిషత్సిద్ధముగా నున్నది.

ఇందులో నీమూడు తరగతులలో ఏది నిజమని యీవిచారణావసరము కలిగినది.

లోకమం దొక వస్తువునుగూర్చి సిద్ధ నిజములు సందిగ్ధములుగా నున్నపుడు నిజమును స్థిరపఱుచుటకు విచారణ ఆవశ్యకమగుచున్నది. అందు లిఖితము, భుక్తము, సాక్ష్యము, సాధనములుగా నున్నవని ప్రకృతమందు లిఖితములు వేదశిరస్సులనే శ్రుతివాక్యములు, బ్రహ్మవేత్తలు సాక్షులు. అనుభవమునుగురించి సృష్టియొక్క ఆద్యంతములు. స్థూలశరీరాద్యంతములవలన దేనికి చిరకాలానుభవము కలదో దానివలన తెలియుచున్నది. శాస్త్రమందును అనుమానము, శాబ్దము, ప్రత్యక్షము, ఈమూడు ప్రమాణములు మాత్రము సర్వసమ్మతములుగా గ్రహింపఁబడుచున్నవి.

శ్లో. శ్రుతితాత్పర్యమఖిల మబుధ్వా భ్రామ్యతే జడః,
వివేకీ త్వఖిలం బుధ్వా తిష్ఠత్యానందవారిధౌ.

శ్రుతులు అనేక భేదములుగా నుండుట. అధికారు లనేకవిధ ములుగా నున్నందున నాయాఫలాభిలాషగలవారి కొఱకు నాయా శ్రుతులు ఉత్పన్న మయినవి. ఉపనిషదర్థమందు సర్వశ్రుతులును లయ మగుచున్నవి గాన, ఉపనిషత్తులకన్న వేరు ప్రమాణము లేదు గాన, నీవిచారణ సర్వోపనిషత్సమ్మతముగా నున్నది.

శ్రు. ప్రమాణోత్పాదితా విద్యా ప్రమాణం ప్రబలం వినా,
నవశ్యతి నవేదాంతా త్ప్రబలం మాన మిష్యత.

ఇత్యభియుక్తవచనం.

ఈతురీయపాదమందు సృష్ట్యాది నున్నస్థితిని తెలుపుచున్నం దున, నాకాలమందు నామరూపములు లేనందున, నిర్గుణపరమాత్మను బోధించుటకై పైన చూపించిన ప్రకాశాది నాలుగు చిద్బిందువులుగా నిర్దేశించినారు. ఆకాలస్థితికి ప్రమాణములు. శ్రు. "ఏకమేవాద్వితీయం బ్రహ్మ-సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్, నాసదాసీన్నో సదాసీత్." ఇత్యాది ప్రమాణములచే, సృష్ట్యాదిని పరమాత్మరూపమయిన ప్రకాశబిందువు మాత్ర మున్నట్లు తెలియుచున్నది.

శ్రు. "సోఽకామయత = స ఈక్షత" ఇత్యాదిశ్రుతులవలనను, నాపరమాత్మకు ఇచ్ఛాశక్తి నిస్తరంగసముద్రమం దలలవలె స్ఫురణ శక్తి కలిగినందున, స్వాంతర్గతవిమర్శశక్తి అద్దమువలె పురోభాగమం దావిర్భవించినది. అం దీశ్వరప్రతిబింబము ప్రతిఫలించినది. అప్పు "డాత్మ, శక్తి, ప్రతిబింబము" అను నీమూడువస్తువులు సిద్ధ మయినవి. అం దాత్మవస్తువు సత్యముగా నున్నది. ప్రతిబింబమును దీని కాధారమయిన దర్పణసదృశశక్తియు, నీరెండును మిథ్యలుగా నున్నవి. అందువలన నీమూడుబిందువులసమష్టి సత్యాసత్యమేళన వస్తువు. ఇదియే సృష్టి కారంభవస్తువు.

శ్రు. "సత్యచ్చుచ్చాభవత్." తైత్తిరీయము.

తా. బ్రహ్మవస్తువు సృష్టియందు సత్యాసత్యమేళనగా నున్నదని యాశ్రుతి తెలుపుచున్నది.

ఈ అహమనే వర్ణద్వయము శివశక్తిస్వరూపముగాన నీ ఆది దంపతులసామరస్యము (మేళనము) అహమను శబ్దమయినట్లును, వెనుక

చెప్పిన బింబ ప్రతిబింబాశ్రయములలో, ప్రతిబింబము సాక్షి యనియు, నదియే కూటస్థుఁడని శ్రుతులచే చెప్పఁబడుచున్నది.

ఆ ప్రతిబింబ మిశ్రబిందువు, ఆమిశ్రబిందువు 'అహ'మను వర్ణద్వయమేళనవస్తువుగాన-ప్రతిమానవునందు "అహమహ" మని వ్యవహరించుచున్న శబ్దము శరీర-జీవపరము కాదనియు, సాక్షిపరముగానున్నట్లు స్పష్టమయినది. ఇందువలన 'నేను' 'నాది'యను తన నిజరూపము సాక్షియందుగాని స్థూలశరీరవాదులు కావని తెలియుచున్నది. ఈ సాక్షిస్థానము, బ్రహ్మరంధ్రాధోభాగమందున్న పరాకాశము. ఈయంశము ముందు బాగుగ తెలియును.

ఈ ప్రకాశబిందువు విమర్శబిందువునకుఁ గారణము. ఈ రెండు బిందువులును, ప్రతిబింబకారణములుగా నున్నందున కార్యకారణముల కభేదము. శివశక్తులకు నట్లే యభేదము. పరమాత్మ నంగనారూపముగా వర్ణించుటకుఁ గారణ మేమనిన, సకలతత్త్వసముదాయమును, సకలవర్ణకదంబమును గర్భమం దిమిడియున్నందున; ప్రసవధర్మాదులు స్త్రీవ్యక్తియందున్నందున; నటులు చెప్పిరిగాని పరమాత్మకు స్త్రీపుంభేదము లేదు.

శ్రు. నైవ స్త్రీ న పుమా నేష, నైవ చాయం నపుంసకః,
యద్య చ్ఛరీర మాదత్తే తేన తేన స యుజ్యత. ఇతి.

ఈ అహంకారస్వరూప మిట్లున్నందున నిదియే ఆత్మమంత్రమని ఆగమరహస్యము. ఈ ఆత్మమంత్రహంసమంత్రములు రెండును సమానార్థములు. (సమానధర్మమును కలవి) ఆహంసమంత్రమును శివశక్తిసామరస్యమునే తెలుపుచున్నది. అందువలన నాత్మవేత్తలు నీమంత్రద్వయమునకును సామరస్యము ననుసంధానమందు భావించుచున్నారు.

**ఉక్తం చ మాతృకావివేకే:—**

శ్లో. శాంతాంతం శక్తి రస్యోక్తా తదంతం బీజ ముచ్యతే,
విద్యాశక్తి ర్భవే ద్బీజం శివ ఏవ న చాన్యథా.

శ్లో. తేనాయం పరమో మంత్రశ్శివశక్త్యాత్మక స్స్మృతః.

టీ. 'శ, ష, స, హ' అను నీవర్ణక్రమమందు శవర్ణాంతమందు షకారమున్నది. షకారాంత మందున్న సకారము సారస్వతబీజము గాన శక్తిస్వరూపము. ఆ సకారాంతమందుగల హకారము అగ్నిబీజ మనియు, ఆబీజము శివస్వరూపముగా నున్నందున హంసమంత్రము శివ శక్తుల పరముగానున్నదనియు, నందువలన నీమంత్రముత్కృష్టమయిన దని యీ వచనతాత్పర్యము.

శ్లో. "త్రికోణరూపిణీ శక్తిర్బిందురూపశ్శివస్స్మృతః. ఇతి.

ఇందువలనను హకారము శివస్వరూపమనియు, సకారము శక్తి స్వరూపమనియు నీవర్ణద్వయసంయోగము 'హంసః' అను మంత్రము శివశక్తిమేళన సంపుటముగా నున్నది గాన హంసమంత్రాత్మమంత్రము లకు సామరస్యము కలదని తెలియుచున్నది.

ఈబిందుత్రయరూపమయిన 'అహ' మను నాత్మమంత్రమును, పైన చూపించిన కామకలాస్వరూపమందుగల బిందుత్రయమును, జని ష్యమాణములయిన చంద్రాగ్నిసూర్యులకు బీజభూతములుగా నున్నం దునను కామకలాంగనాయవయవములుగా నున్నవని యిదివరకే చెప్పఁ బడినది. "కలా చ దహనేందువిగ్రహా" అని యున్నందున నీకామకల శివశక్తిసంపుటముగాను, సకలతత్త్వసముదాయమునకును, సకలవర్ణ కదంబమునకును, శబ్దజాలమునకును జన్మస్థాన మయినందున సర్వకార ణముగా నున్నది.

ఇంకను కలాశబ్దగ్రహణముచేత నీకలాశబ్దము చంద్రకలలందును, అకారాది హకారాంతవర్ణసముదాయమందును వర్తించుచున్నందున, చంద్రకలలు తత్త్వమయములు; పంచాశద్వర్ణములు శబ్దమయములు గాన నీకామకలనామరూపములకు కారణముగా నున్నది. ఈకల చంద్రునియందుగల పదియారవకళగా నున్నది. ఆకల నిత్యముగాన ధ్రువకల యని సంకేతనము. ఈకల తురీయముగాన నీతురీయపాదమందు గల నాలుగుకలలు నాలుగు చిద్బిందువులుగా నున్నవని తెలియుచున్నవి.

ఈతురీయకూటము దిన, రాత్రిభేదము లేక జ్యోత్స్నాలోక ముగా నున్నందున నిచట వస్తుభేదకాలభేదములు లేవు. ఈకల షోడశ కలాపూర్ణముగా నున్నది. సాధకజనుఁ మూలాధారాది ఆజ్ఞాకమలాం

తము కటిప్రభృతి భ్రూమధ్యపర్యంతము పాదత్రయము, కూట త్రయము, లోకత్రయముగా నున్నందున, సూర్యచంద్రగతిభేద మింత వరకే కలిగినందున నహోరాత్రిభేద మింతవరకే గలదు. తదుపరి భ్రూమధ్యమునుంచి బ్రహ్మరంధ్రపర్యంతము తురీయకూటము, జ్యోత్స్నాలోక మని ఆగమరహస్యము. ఇదియే సాక్షిస్థానము.

**ఆత్మవివరము.**

శివశక్త్యాత్మక మగు నీకల ఆత్మస్వరూపమైనందున, ఆత్మకాము లగు స్వరూపవేత్తలు సర్వదా యీకల ననుసంధానమందు కోరు చున్నారు గాన కామకల యనఁబడును. మరియు ఐతరేయమందు కోరు దేవాదిఋషు లాత్మజిజ్ఞాసఁజేయుచు నన్యోన్య మిట్లు ప్రశ్నించుకొనిరి:-

శ్రు. "కోఽయమాత్మేతి వయ ముపాస్మహే కతర స్స ఆత్మా?" ఇతి.

తా. "ఈ యాత్మయనునది యేది? యెచట నున్నది? యెట్టిది? మే మెట్లుపాసించుట?" యని యన్యోన్యము ప్రశ్నించుకొనినపిమ్మట సర్వసమష్టిని నిట్లు నిశ్చయించిరి.

"ప్రజ్ఞానం బ్రహ్మ" ప్రజ్ఞానమే బ్రహ్మస్వరూపమని, ఆత్మను ప్రజ్ఞానరూపముగా నుపాసించవలెనని నపిదప నాప్రజ్ఞాన మెట్టిదనిన:

శ్రు. "యేన వా రూపం పశ్యతి; యేన వా శబ్దం శృణోతి" ఇత్యాదినా ప్రజ్ఞానలక్షణముక్తం.

తా. నేత్రశ్రోత్రాదీంద్రియములచేత, శబ్దరూపరసాదు లేది గ్రహించుచున్నదో అది ప్రజ్ఞానమని నిర్ణయించిరి.

శ్రు. "యదేతద్ధృదయం మనశ్చైతత్ సంజ్ఞానమాజ్ఞానం విజ్ఞానం ప్రజ్ఞానం మేథాదృష్టిర్ధృతిర్మనీషా జూతిస్మృతిస్సంకల్పః క్రతురసుః కామోవశ ఇతి సర్వాణి నైతాని ప్రజ్ఞానస్య నామధేయానిభవంతి."ఇతి.

ఈశ్రుతియందున్న "కామః" అను ప్రజ్ఞానపర్యాయమువలన, కామకల యనఁగా నాత్మస్వరూపమైన ప్రజ్ఞానకల యని తెలియుచున్నది గాన, సంవిద్రూపమగు నాత్మయని నిష్కర్షార్థము.

ని. "ఆత్మా బ్రహ్మమనోజీవ దేహబుద్ధీంద్రియాదిషు" ఇతి విశ్వః.

ఆత్మశబ్దము బ్రహ్మబుద్ధ్యాదులందు వర్తించుచున్నందున నీ కామ కల యాత్మగాను, బ్రహ్మవస్తువుగాను నున్నది.

**ఆత్మాష్టవిధభేదము.**

శ్లో. "గుణభేదా దాత్మమూర్తి రష్టధా పరికీర్తితః,
జీవాత్మా చాంతరాత్మా చ పరమాత్మా చ నిర్మలః.
శుద్ధాత్మా జ్ఞానరూపాత్మా మహాత్మా సప్తమస్స్మృతః,
అష్టమ స్తేషు భూతాత్మేత్యష్టాత్మానః ప్రకీర్తితః."

ఈ తురీయకూటమందు నామరూపములు లేవు గదా! నిర్గుణ బ్రహ్మవస్తువున కాత్మయని, బ్రహ్మయని పర్యాయము లెట్లు గలిగినవనిన,

శ్రు. ఋతమాత్మా పరంబ్రహ్మ సత్యమిత్యాదికా బుధైః,
కల్పితా వ్యవహారార్థం యస్య సంజ్ఞా మహాత్మనః.

తా. వెనుకఁ జెప్పిన యెనిమిదివిధములగు నాత్మస్వరూపములలో నుత్తమమయిన మహాత్మకు ఋతమనియు, నాత్మయనియు, బ్రహ్మయనియు, సత్యమనియు, పర్యాయములు సాధకజనబోధకొఱకు వ్యవహారార్థమై బ్రహ్మవేత్త లీసంజ్ఞలను కల్పించిరి.

పరమాత్మకు "ఋతము, సత్యము, బ్రహ్మ, ఈశ్వరుఁడు, సాక్షి, కూటస్థుఁడు, చిత్, చైతన్యము, చిదాభాసుఁడు, జీవుఁడు, మాయ" అను నీ నామము లెట్లు కలిగినవి? ఇందువలన నేమి సార్థకమనిన;

**బ్రహ్మాదిశబ్దముల కర్థవివరము.**

సర్వసారనిరాలంబోపనిషదుక్తము: ఋతమనఁగా:—జలము నందు, నిత్యవస్తువునందు, సత్యమందు, యజ్ఞమందు, నుంఛవృత్తి యందు, సూర్యునియందు వర్తించుచున్నది. బ్రహ్మ:—బృహత్వా ద్బృంహణత్వా ద్బ్రహ్మ=గొప్ప దగుటను, వికసనస్వభావము గలదగు టను బ్రహ్మయనియు "బ్రహ్మైవాత్మా, ఆసమంతా త్తిష్ఠతీత్యాత్మేతివా" సర్వవ్యాపకమయినది గాన నాత్మయనియు, సాక్షి:—జ్ఞాతృజ్ఞానజ్ఞేయ ములకన్న పూర్వవస్తువయినందున వానిని తెలుసుకొనుచు, ఆవిర్భావ తిరోభావములను తెలుసుకొనుచు తాను వికారశూన్యుఁడయి, స్వప్ర కాశమయిన తేజోమయచిత్ప్రతిబింబచైతన్యము - చిత్కళా ప్రథమ ప్రతిబింబము సాక్షి యనఁబడును. కూటస్థుఁడు:—శరీరమందుఁగలప్రాణ బుద్ధ్యాదిసకలసంకేతములకు నెయ్యది యధిష్ఠానముగా నున్నదో అది

కూటస్థుఁ డనఁబడును. సాక్షియే కూటస్థుఁడని. అంతర్యామి:—సర్వ ప్రాణులయందును బుద్ధిరూపముగా నుండి యేది ప్రేరణచేయుచున్నదో అది అంతర్యామి. ప్రత్యగాత్మ:—సర్వోపాధిరహితము, కటకమకుటాది రహితసువర్ణఘనమువలె నున్న శుద్ధచైతన్యము, సాక్షియే ప్రత్యగాత్మ యనఁబడును. బింబభూతము పరమాత్మ. ఆపరమాత్మయొక్క ప్రథమ ప్రతిబింబము ప్రత్యగాత్మ, సాక్షియు, దీని ప్రతిబింబమగు చిదాభాస జీవుఁ డనఁబడును. సత్యమనఁగా నామరూపాత్మక ప్రపంచముకన్న వేరైన నాశరహితమగు నొకానొకవస్తువున్నదని ఏది శ్రుతులచేఁ జెప్పఁబడు చున్నదో అది సత్యము. సృష్ట్యాదియందును, నంతమందు, వర్తమాన మందు గలది. జ్ఞానమనఁగా:—

శ్రు. స్వప్రకాశం జ్ఞానం సర్వప్రకాశకం జ్ఞానం, నిరావరణచిన్మాత్రం జ్ఞానం, అనాద్యంతం నిరంతరవృత్తి వృత్తిసాక్షిచైతన్యమేవ జ్ఞానం. కిమనంతమితి? అవ్యక్తాది సృష్టిప్రపంచేషు వ్యాప్య పూర్ణమవినాశి చైతన్య మనంతం. ఉత్పత్తి వినాశరహిత మనంతం. ఆనందం నామ-అంభసా మర్ణవ ఇవ - సుఖచేతనానా మధిష్ఠాననిత్యశుద్ధాఖండాద్వైతచిదానందైకరస మానందం. కిం బ్రహ్మజ్ఞానం? సమూలానాత్మనివర్తకం సతు - బ్రహ్మణి విలీయతే. కిమనాత్మత్వం? స్థూలశరీరజీవాద్యభిమానిత్వం, ఆకాశాదిప్రపంచే సత్యత్వజ్ఞాన మనాత్మత్వం. అనాత్మమూలం మాయా. సాచ బ్రహ్మణ్యాకాశే మేఘాదిరివ దృశ్యతే. మాయా నామ - అనాదిరంతవతీ యా న విద్యతే సా మాయా మాయాస్వరూప మజ్ఞానం తదేవ మూలప్రకృతిః. గుణసామ్య మవిద్యేత్యాద్యనేకాకారా-జగదాకారేణ పరిణతా, తదేత జ్జ్ఞానాత్యనుభవతి చ. క ఈశ్వరః? బ్రహ్మైవ స్వశక్తి ప్రకృత్యభిధేయ మాశ్రిత్య లోకాన్ సృష్ట్వా అంతర్యామిత్వేన బ్రహ్మాదీనాం బుద్ధీంద్రియనియంతృత్వా దీశ్వరః. కో జీవః? అంతఃకరణోపాధ్యాయత్సాక్షిచైతన్య ప్రతిబింబం స్థూలో ఒహ మిత్యధ్యాస ఏవ జీవః.

ఇటుల నున్న బ్రహ్మాదిశబ్దముల కర్థవివరణమును తెలుసుకొని పూర్వోక్తకామకలాస్వరూపహంసద్వంద్వమును తన సహస్రారాంతర్గత పరాకాశమందున్న సాక్షిగా భావించి, యది తన నిజరూపమని నిశ్చయముగలవారు జీవన్ముక్తులనియు, కృతార్థులు స్వరూపవేత్తలనియు చెప్పఁబడుదురు.

౮ సూత్రము, కామకలాజ్ఞానఫలము.

**మూ. ఇతి కామకలా విద్యాదేవీచక్రక్రమాత్మికా సేయం,**
**విదితా యేన స ముక్తో భవతి మహాత్రిపురసుందరీరూపః.**

అ. విద్యాదేవీచక్రక్రమాత్మికా—విద్యా= గాయత్రి, పంచదశి, షోడశి, కామకలా, ఏకాక్షరీ మొదలగుమంత్రములు, దేవీ=ఆమంత్రాధి దేవతయగు త్రిపురసుందరీదేవి, చక్ర = శ్రీచక్రము, గురుమండలము ఆత్మయందుగల, సా ఇయం, కామకలా = పూర్వోక్తరూపముగ, కామేశ్వరావినాభూత నాదాఖ్యకలాస్వరూపకామేశ్వరీదేవి, యేన=ఏ భాగ్యవంతునిచే, ఇతి విదితా = పూర్వోక్తప్రకారముగా తెలియఁబడు చున్నదో, సః=అట్టిమనుజుఁడు, మహాత్రిపురసుందరీరూపః = కామేశ్వరీ సాయుజ్యమును పొందినవాఁడై, ముక్తో భవతి = జీవన్ముక్తుఁ డగు చున్నాఁడు.

రహస్యార్థము. ఆరంభమునుంచియు ప్రకాశ, విమర్శ, మిశ్ర బిందువులను నిరూపించి, వానినే బింబప్రతిబింబ ఆశ్రయములుగా సూచించి, వానినే అహమనే వర్ణద్వయవిభజనసమ్మేళనగానున్న సాక్షి స్వరూప ఆత్మను నిరూపించి, ఇదియే ముందు కలుగఁబోవుసృష్టియందు గల బ్రహ్మాండ, పిండాండ, చిద్విద్యా, శ్రీచక్రాదులకు కారణవస్తు వుగా నున్నదని చెప్పిరి. ఈకారణమే కార్యరూపముగా పరిణమించుట గాని, మిథ్యారూపమైనకార్యములకు అధిష్ఠానముగా నున్నందునగాని కార్యకారణముల కభేదమని తెలియుచున్నది.

ఇటుల తెలిసికొనిన పుణ్యపురుషులు కామేశ్వరిసాయుజ్యమును పొందుచున్నారని చెప్పిరి. త్రిపురసుందరి అనఁగా: త్రిభిః - ధ్యాతృ ధ్యాన ధ్యేయైః పురా త్రిపురా, త్రిభిః-బ్రహ్మ విష్ణు రుద్రైః పురావా, త్రిభిః-సత్వరజస్తమోగుణైర్వా పురా; ఇచ్ఛాజ్ఞానక్రియాభిః పురా - త్రిపురా; ధ్యాతృధ్యానధ్యేయములకంటెను పూర్వమున్నదనినందున బ్రహ్మస్వరూపమని స్పష్టమగుచున్నది. ఆబ్రహ్మవస్తువును తెలుసుకొనిన మనుజుఁడు తత్స్వరూపుఁడగుచున్నాఁడని స్థూలశరీరజీవాదులు తానసే

భ్రమను వదలి, సాక్షిస్వరూపము తన నిజస్వరూపమని నిశ్చయమును పొందుచున్నాఁడు. అందువలన వారే జీవన్ముక్తులని చెప్పఁబడుదురు. ఇందుకు ప్రమాణములు:—

శ్రు. బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి. బ్రహ్మవిదాప్నోతి పరం.
సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ, యో వేద నిహితం గుహాయాం
పరమే వ్యోమన్, సోఽశ్నుతే, సర్వాన్కామాన్సహ.
ఇతి తైత్తిరీయే.

ఇత్యాదిశ్రుతులవలన బ్రహ్మవేత్త బ్రహ్మస్వరూపుఁ డగుచున్నాఁ డని తెలియుచున్నది. సకలజీవులందును 'అహ మహ' మని వ్యవహరించుచున్న ఆత్మను శరీర జీవాదులందు భావించక నిత్యుఁడును, ప్రత్యగాత్మస్వరూపుఁడు నగు సాక్షియందు భావించినవారు జీవన్ముక్తులగుదురు. ఉపాధివిలయమైనపుడు ప్రతిబింబము బింబమందు లయమగు రీతిని బ్రహ్మవస్తువునందు లయమగుదురు. బ్రహ్మకు జననాదులు లేనందునను, జీవత్వారోపణ క్షయించినందునను అట్టివారు జననమరణ రహితులని తాత్పర్యము.

శ్రు. దేహాత్మజ్ఞానవద్జ్ఞానం దేహాత్మజ్ఞానబాధకం,
ఆత్మన్యేవ భవేద్యస్య స నేచ్ఛన్నపి ముచ్యతే.

తా. ప్రతిజనుఁడు తనశరీరమందు 'నేను, నాది' అను నభిమానము (తాదాత్మ్యము) కలవాఁడగుచున్నాఁడు. అటులనే దేహాదులు మిథ్యలుగానెంచి యేపురుషుఁడు సాక్షిస్వరూపము తన నిజస్వరూపమని, దేహాదులు తనవి కావని సాక్షియందు తాదాత్మ్యము కలవాఁడగునో, వాఁడు ముక్తిని కోరకపోయినను స్వయముగనే ముక్తుఁ డగుననియు, అవిద్యవలన విముక్తుఁ డగుచున్నాఁడని శ్రుతి చెప్పుచున్నది.

**త్యాగలక్షణము.**

శ్రు. న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వ మానశుః.

తా. మర్త్యుఁడు; జననమరణధర్మము గలవాఁడు. అమృతత్వమును బొందుటకు (జననమరణధర్మరహితుఁ డగుటకు) యాగాది కర్మలుగాని, పుత్త్రాది ప్రజాసంపత్తిగాని, ధనముగాని, సహాయములు

కానేరవనియు, కేవలత్యాగము మాత్రము సాధనముగా నున్నదనియు నీశ్రుతివలనఁ దెలియుచున్నది.

త్యాగమనఁగా:—మిథ్యారూపములు గల ద్వైతవస్తురూపములుగానున్న తన స్థూలశరీర బ్రహ్మాండాదులందు సత్యత్వబుద్ధిని విడుచుట త్యాగమనఁబడును. ఈత్యాగమువలన వీనియందు మిథ్యలనే బుద్ధికలిగినపుడు సత్యమైన సాక్షి తానని జ్ఞానము కలుగును. సాక్షికి జననాదులు లేనందున అట్టిజ్ఞానము కలవాఁడు మరణధర్మరహితమైన అమృతత్వమును పొందుచున్నాఁడు గాన, అవిద్యాత్యాగము ఇచట త్యాగమని తెలియుచున్నది. ఇది వాస్తవార్థము. కేవల కర్మత్యాగాదులనే తాత్పర్యము భ్రమగానున్నది. ఇందుకు ప్రమాణము.

శ్రు. పంచరూపపరిత్యాగా దస్వరూపప్రహాణతః,
అధిష్ఠానం పరం తత్వ మేకం స చ్ఛిష్యతే మహత్.

తా. పంచభూతములను వానివలన కలిగినశరీరాదులను మిథ్యారూపములని తెలిసికొని వానిని పరిత్యజించి వానియందుగల సచ్చిదానందస్వరూపమును గ్రహించుటయును, అస్వరూపప్రహాణతః=నిజమైన ఆత్మవస్తువుకాని దేహజీవాదులయందుగల తాననే భ్రమను కొట్టివేయుటవలన సకలబ్రహ్మాండమునకును, దేహజీవాదులకును, అధిష్ఠానమగు బ్రహ్మవస్తువుమాత్రము మిగులును గాన, అట్టి మనుజుఁడు బ్రహ్మస్వరూపుఁ డగును.

ఇది త్యాగలక్షణము.

శ్రు. ద్వైతావజ్ఞా సుస్థితా చే దద్వైతే ధీ స్థిరా భవేత్,
స్థైర్యే తస్యాః పుమా నేష జీవన్ముక్తో భవిష్యతి. ఇతి.

శ్రు. అవిచారకృతో బంధః విచారా న్మోక్షో భవతి.

నిజానిజములు విచారించనందున రజ్జువందు సర్పభ్రాంతి కలిగినందున భయకంపాదులు కలిగినట్లు తనకు బంధత్వము కలదని నిశ్చయబుద్ధితో నున్నాఁడు. నిజమును కార్యకారణములను విచారించిన జగజ్జీవభావములు ఆత్మయం దారోపితములని తెలియును. అపుడు విచారణ

వలన సర్పభ్రమ వదలి నిజమైన రజ్జుజ్ఞానము కలిగినప్పుడు భయకంపాదులు వదలి తిరిగి కలుగనేరవని తాత్పర్యము.

శ్రు. న నిరోధో న చోత్పత్తి ర్న బంధో న చ సాధనం,
న ముముక్షు ర్న వై ముక్త ఇత్యేషా పరమార్థతా.

తా. సత్యస్వరూప బ్రహ్మవస్తువునకు బంధమోక్షములు లేవని యీశ్రుతి తెలుపుచున్నది.

ఇది శ్రీమత్త్రిపురసుందరీ పరాభట్టారికాముఖపంకజాయత్న నిస్సారితంబును, కామేశ్వరీ అపరావతారులును, స్వరూపజ్ఞాననిష్ఠులును, నిగమాగమ రహస్య సకల సంకేతాభిజ్ఞులును, సమయాచారపరులు నగు పుణ్యానందమునీంద్ర విరచితంబగు 'కామకలావిలాస సూత్రపంచ పంచాశత్' అనెడి ఆత్మవిద్యాప్రతిపాదకమైన ఈమూలగ్రంథమందలి ప్రకాశాది చిద్బిందుమయ కామకలానిరూపణరూప తురీయపాదమునకు శ్రీమత్పదవాక్యప్రమాణోభయభాషాప్రవీణ సమయాచారతత్పరుండును, శ్రీమత్త్రిపురసుందరీప్రసాదలబ్ధ ప్రతిభాసమేతుండును, కృష్ణయజుర్వేదషడశీతిశాఖాంతర్గత తైత్తిరీయశాఖాఽన్వితాపస్తంబసూత్ర కౌశిక సగోత్రుండును, వేగినాడీసముద్భవుండును, జగత్ప్రసిద్ధ ప్రయాగక్షేత్ర నివాసియు, సింహంభట్ల భాగీరథీరామేశ్వరద్వితీయపుత్రుండును, జ్ఞానానందనాథేతి దీక్షానామాంకితరామమూర్తివిద్వద్విరచితంబగు రహస్యార్థ బోధినియను నాంధ్రభాషాటీక తురీయపాదము.

సంపూర్ణము.



# అవిద్యాపాదప్రారంభము

## సృష్టి క్రమము.

---

### ౯ సూత్రము, పంచభూతోత్పత్తి.

మూ. స్ఫుటితాదరుణాద్బిందోర్నాదబ్రహ్మాంకురో రవో వ్యక్తః,
తస్మాద్గగనసమీరణదహనోదకభూమివర్ణ సంభూతిః.

అన్వ. స్ఫుటితాత్=వికసనమును పొందిన, అరుణాత్ బిందోః=రక్త బిందువువలన, నాదబ్రహ్మాంకురః = నాదమనెడి బ్రహ్మమే అంకురముగా గల, రవః=శబ్దబ్రహ్మము, వ్యక్తః = ఆవిర్భూతమయినది. తస్మాత్ = ఆ నాదమువలన, గగనసమీరణదహనోదకభూమివర్ణసంభూతిః=ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి యనే పంచభూత ప్రకృతికమయిన అకారాదిహకారాంతముగల పంచాశద్వర్ణములుగల మాతృకయుత్పన్న మయినది.

### ౧౦ సూత్రము.

మూ. అథ విశదాదపి బిందోర్గగనానిలవహ్నివారిభూమిజనిః,
ఏతత్పంచకవికృతిర్జగదిదమణ్వాద్యజాండపర్యంతమ్.

అన్వ. అథ=శబ్దబ్రహ్మోదయానంతరమందు, విశదాదపి బిందోః= శుక్లబిందువికసనమువల్లనున్ను, గగనానిలవహ్నివారిభూమిజనిః=ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమియను పంచభూతములు నుత్పన్న మయినవి. అణ్వాద్యజాండపర్యంతం = అణువు మొదలుకొని బ్రహ్మాండ పర్యంతముగల, జగత్=జగత్తు, ఏతత్ = వెనుకచెప్పిన, పంచకవికృతిః= ఈ పంచభూతమువలన కలిగిన కార్యసముదాయముగా నున్నది.

విశేషార్థము:—గ్రంథకర్త వెనుక తురీయపాదమందు అకార హకారము లను రెండుకలలచే నాదిశక్తియగు త్రిపురసుందరీరూప మును బిందుమయముగా నిరూపించి, ఆవర్ణద్వయసంపుటము మహా బిందువుగా చెప్పి, యీ అవిద్యాపాదమందు నాబిందువికసనమువలన నామరూపాత్మక జగదుత్పత్తిని, శ్రీచక్రాదిజ్ఞానసాధనములను చెప్పుట

కారంభించినారు. కామప్రకృతి కీమహాబిందువువలననే సకలజగదుత్పత్తియగాన నిట్లు నిరూపించుచున్నారు.

వెనుక ప్రకాశవిమర్శబిందువులను శుక్ల రక్త బిందువులుగా చెప్పి, ఆ బిందుద్వయమేళనము మిశ్రబిందువుగా చెప్పినందున నీమిశ్రబిందువునం దుభయబిందువు లున్నందున, నీబిందువికసనమువలన నిందుగల రక్తబిందువువలన నాదబ్రహ్మ మంకురమయి, యందువలన పంచభూతప్రకృతికములయిన అకారాది హకారాంత పంచాశత్కలలు, వర్ణ పద మంత్రములు నుత్పన్నమయి, వానివలన నామాత్మకమయిన శాఖ ప్రపంచకమందు విస్తరిల్లినది.

అటులనే మిశ్రబిందువునందుగల శుక్లబిందూద్రేకముచే ఆకాశాది పంచభూతోత్పత్తి గలిగి వానివలన కలాతత్త్వభువనాత్మకమయిన రూపాత్మకశాఖ విస్తరిల్లినది. ఈ నామరూపములే ప్రపంచమందు ప్రత్యక్షములుగా నున్నవని పామరజన నిశ్చయము.

ఇందువలన నవమసూత్రము శబ్దబ్రహ్మోత్పత్తిని గురించియు, దశమసూత్రము పంచభూతాత్మకమయి కలాతత్త్వభువనాత్మకరూపశాఖను గురించియు చెప్పఁబడినవి.

ఇందుకు లోకదృష్టాంతము. ఒక మానుషద్వంద్వమునకు ఒక గర్భమందు స్త్రీపురుష యమలము జననమగును. అందు రక్తబింద్వాధిక్యముచే స్త్రీశిశువును, శుక్లబిందుభాగాధిక్యముచే పురుషశిశువును జనించిరని యూహింపఁదగినది. అటులనే రక్తశుక్లబిందుభాగముల న్యూనాధికముల ననుసరించి బిందునాదకలలుగల నామాత్మకశాఖయు, కలాతత్త్వభువనాత్మకమయిన రూపాత్మకశాఖయు నుత్పన్నమయినవి. ఈయంశము ముందు పరిలేఖనమందు విస్పష్టమగును.

ఈ పంచభూతవికారమే నామరూపాత్మకమయిన జగత్తని యీ గ్రంథకర్త యీరెండు సూత్రములచే నీప్రకరణమును ముగించెను గాని; సాధకజనులకు స్వరూపజ్ఞానబోధకొఱకు ఈ నామరూపశాఖల యుత్పత్తిక్రమము, శారీరవిచారణ, అంతరంగవస్తువిభాగము, సృష్టిక్రమము, జీవేశ్వరవిభాగము, అవిద్యాస్వరూపము తెలియుట యావశ్యకముగాన నీయంశము లుపనిషత్తులనుంచి సంగ్రహించి యిచట చెప్పఁబడుచున్నవి.

# అశ్వత్థవృక్షము

శ్రు. ఊర్ధ్వమూలో౽వాక్శాఖ ఏషో౽శ్వత్థ స్సనాతనః, తదేవశుక్రం తద్బ్రహ్మ... తదు నాత్యేతికశ్చన. (కఠ.)

శ్రు. చత్వారి వాక్పరిమితాపదాని=వదంతి.

వర్ణ-పద-మంత్రములు. నామాత్మకశాఖ, ఆగమం

శ్రీ (పరమాత్మ)

శ్రు. ఇంద్రియేభ్యః పరాహ్యర్థాః= [సాపరా గతిః.

శ్రు. ఆత్మన ఆకాశస్సంభూతః.

కలా-తత్వ-భువనములు.



ఇందు 39-వ పుటలో చూపించిన అశ్వత్థవృక్షరూపమయిన పరిలేఖనమునకు ప్రమాణములు:—

కఠోపనిషత్:—

శ్రు. ఊర్ధ్వమూలో హ్యవాక్శాఖ ఏషో ఽశ్వత్థస్సనాతనః,
తదేవ శుక్రం తద్బ్రహ్మ తదేవామృత ముచ్యతే,
తస్మిఁ ల్లోకా స్థితా స్సర్వే తదు నాత్యేతి కశ్చన.
ఏత ద్వై తదితి.

తా. పైన చూపించిన పరిలేఖనము అనాదియయిన అశ్వత్థవృక్షము. ఈవృక్షము మూలము ఊర్ధ్వముగను, శాఖలు క్రిందుగను గలది. ఇదియే బ్రహ్మస్వరూపము. సనాతనమయినది. శుక్రమని, అమృతమని చెప్పఁబడుచున్నవి. దీనియందు సకలలోకములును ఇమిడియున్నవి. దీనితో సంబంధించని వస్తువేదియు లేదు గాన నిది అశ్వత్థమని,పరదేవతాశారీరవృక్షమని యీ ప్రకరణమునందు వాడఁబడును. ఇది నామరూపాత్మకమయిన ప్రపంచసృష్టిక్రమమును, తన నిజరూపమును బోధించుచున్నది.

జగత్తు నామరూపాత్మకముగాన నీ వృక్షమును నామరూపములను రెండుశాఖలను కలిగియున్నది. అందు ప్రత్యగాత్మయనే సర్వోర్ధ్వబిందువు మూలము. అది సృష్ట్యాదివస్తువు. ఆబిందుప్రభవలన కోణత్రయచక్ర ముత్పన్నమయినది. ఇది యవ్యక్తమనియు, మూలప్రకృతి యనియుఁ జెప్పఁబడును. ఈయుభయబిందువులవలనను నామరూపము లను రెండుశాఖ లుత్పన్నమయినవి.

అందు చూపరుల వామభాగమందున్నది నామాత్మకశాఖ. దీని సృష్టిక్రమముయొక్క ఆదినున్నది బిందువు. ఆబిందువికసనము కోణత్రయరూపమును పొందినపు డందు నాద ముత్పన్నమయినది. ఆనాదము వలన క్రమముగా అకారాదిస్వరములును, వానివలన వ్యంజనములు నుత్పన్నమయి క్రమముగా వర్ణ, పద, మంత్రరూపములను పొంది చతుర్దశభువనములయందుఁగల సకల నిగమాగమభాషారూపముగా విజృంభించి యీనామాత్మకశాఖ ప్రకాశించుచున్నది.

ఇక చూపరులకు దక్షిణభాగమందున్న రూపాత్మకశాఖయొక్క యుత్పత్తిక్రమము సర్వోర్ధ్వబిందువు సృష్ట్యాదినున్న బ్రహ్మావస్తువు. సృష్ట్యావిర్భావకాలము సమీపించినపుడు "సర్వశక్తి పరం బ్రహ్మ" యను శ్రుతివలన బ్రహ్మమందు సకలశక్తులు ఇమిడియున్నందున శ్రు. సోఽకామయత బహు స్యాం ప్రజాయేయేతి. స ఈక్షత.

ఆబ్రహ్మావస్తువునకు ప్రపంచస్మరణ కలిగినది. ఆకాలమందే ఇచ్ఛాశక్తి పురోభాగమం దావిర్భవించినది. అదియ కోణచక్రాకృతి గలిగి మూలప్రకృతి యనియు, అవ్యక్తమనియు చెప్పఁబడుచున్నది. ఇది త్రిగుణాత్మకము. ఈయుభయబిందురూప శివశక్తిసామరస్యమువలన మూడవదగు మహత్తత్వ ముత్పన్నమయినది. అందువలన అహంకార బిందువు, దానివలన మనస్తత్వము, దానిచే ఆకాశము, అందు వాయువు, దానియం దగ్ని, అం దుదకము, అచట భూమి యిటుల క్రమక్రమముగా నుత్పన్నమయినవి. ఈ ఆకాశాదిపంచభూతములధర్మములు శబ్ద స్పర్శ రూప రస గంధములు, త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణము లనే జ్ఞానేంద్రియపంచకమును, వాక్పాణిపాదపాయూపస్థలనే కర్మేంద్రియ పంచకమును, ఈపంచభూతములవలననే కలిగినవి. ఇవి ఆరోహణ క్రమమందు పృథ్వినుంచి అవ్యక్తమువఱకు లెక్కింపఁగా అవ్యక్తము ఇరువదినాలుగవ దగునుగాన నివి చతుర్వింశతితత్వములని నిగమ సిద్ధము.

శ్రు. పంచవిగ్ంశ ఆత్మా భవతి.

అనేశ్రుతివలన ఆదిబిందువు శివశక్తిమేళనవస్తువుగా నున్నది. అదియే సర్వతత్త్వాతీతము. ఈచతుర్వింశతితత్త్వములు క్రమముగా వ్యాపించి కలా, తత్త్వ, భువనాకారములను పొందియున్నవి. ఇది అశ్వత్థవృక్షమందు రూపాత్మకమయిన శాఖ.

ఈబిందువులలో దిగువదానికి పైబిందువు కారణము. దిగువది కార్యము. అటులనే పైది బింబము, దిగువది ప్రతిబింబములుగా నున్నవి. అటులనే క్రమముగా శక్తియును తగ్గుచున్నది.

ఇక నీవృక్షమందున్న కమలవిభాగము. మూలాధారాది సహస్రాంతకమలములకు సహస్రారము ఆదిది. అందువల్ల ఆజ్ఞాకమలము,

దానివలన విశుద్ధము, దాని ప్రభ అనాహతము, దానిచే మణిపూరము, అందు స్వాధిష్ఠానము, దాక్రింద మూలాధారము నుత్పన్నమయినవి. ఈకమలములయందు నామరూపములగు రెండుశాఖలును ఇమిడి యున్నవి. ఎట్లనిన విశుద్ధాది మూలాధారాంత కమలము లయిదును ఆకాశాది పంచభూతముల కాకరములు. ఇందువలన రూపశాఖ ఇమిడి యున్నది. ఆజ్ఞాదిమూలాధారాంత షట్కమలముల దళములు ఏఁబది. ఈదళములయందు పంచాశద్వర్ణమయమాతృక, దళమునకొక వర్ణము చొప్పున నీవర్ణములే యోగినీరూపములను ధరించియున్నవి. అందు వలన నామాత్మకశాఖయు కలదని చెప్పిరి. సహస్రారమునుంచి మూలా ధారమువరకును వ్యాపించి సుషుమ్నానాడి కలదు. ఆనాడియం దీకమ లములు పద్మమాలవలె నున్నవి. ఇదియే బ్రహ్మనాడియని ఆగమ రహస్యము. దాని యిరుప్రక్కలను ఇడాపింగళలనే రెండునాడు లున్నవి. ఇంక నీవ్యుత్పత్తిని గురించిన ప్రమాణములు.

శ్రు. ఆత్మన ఆకాశస్సంభూతః, ఆకాశాద్వాయుః, వాయో రగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృథివీ, పృథివ్యా ఓషధయః, ఓషధీభ్యో ఽన్నం, అన్నా త్పురుషః. ఇతి తైత్తిరీయే.

తా. ఆత్మవలన ఆకాశాదిపంచభూతములు క్రమముగా ఒక దానివలన ఒకటి కలిగినట్లు అగుపడుచున్నది. పరిలేఖనమందుచూపించిన అవ్యక్తమహత్తత్త్వాహంకారమనస్సులు నీశ్రుతియం దేల చెప్పలేదనిన ఈనాలుగును తురీయకూటమందుగల వస్తుప్రభేదములుగాన ఆత్మ స్వరూపముగానే యీశ్రుతియందు గ్రహించదగినది.

కఠోపనిషత్. శ్రు. ఇంద్రియేభ్యః పరా హ్యర్థాః అర్థేభ్యశ్చ పరం మనః, మనసశ్చ పరా బుద్ధిః బుద్ధేః పరంతరం మహాః, మహతః పర మవ్యక్తం అవ్యక్తా త్పురుషః పరః, పురుషా న్న పరం కించి త్సా కాష్ఠా సా పరా గతిః.

తా. ఇందువలన ఇంద్రియములు మొదలుకొని ఆత్మవరకు ఒక దానికన్న ఒకటి పైగానున్నట్టును, శ్రేష్ఠమయినట్టును తెలియఁచున్నది.

శ్రు. పంచవింగ్శ ఆత్మా భవతి.

తా. ఇందువల్ల ఆత్మవలననే సకలమును ఉత్పన్నమయినట్లు తెలియుచున్నది. ప్రత్యగాత్మ పరమాత్మల భేదము ఉపాధినిష్ఠ మయినంతవఱకు ప్రత్యగాత్మ యనఁబడును. పిండాండబ్రహ్మాండములయొక్క బాహ్యమందు వ్యాపించియున్నది పరమాత్మ. మఱియు దేహేంద్రియాదులయందు వాని సంపర్కములేక వేరుగా నున్నందునను ప్రత్యగాత్మ యనఁబడును.

మఱియు నీవృక్షమందు అంతటను సత్వరజస్తమస్సులనే గుణత్రయమును, చంద్రాగ్నిసూర్యులనే మండలత్రయమును, బ్రహ్మాండ పిండాండ శ్రీచక్ర శ్రీవిద్యా మాతృకాదులును, సకలనిగమాగమములును సామరస్యమును పొందుచున్నవి. ఈగ్రంథబోధకంతకు నీ వృక్షము సాధకముగానున్నది.

ఈబ్రహ్మాండాది సృష్టిక్రమమును గురించి పైంగలోపనిషత్తులో నుంచి కొన్నివాక్యము లుదాహరణార్థమై యిచట నిరూపింపఁబడుచున్నవి:—

శ్రు. అథ హ పైంగలో యాజ్ఞవల్క్య ముపసమేత్య ద్వాదశవర్ష శుశ్రూషాపూర్వకం పరమరహస్య కైవల్య మనుబ్రూహీతి పప్రచ్ఛ. సహోవాచ యాజ్ఞవల్క్యః. సదేవ సౌమ్యేకమగ్ర ఆసీత్, తం నిత్యముక్త మవిక్రియం సత్యజ్ఞానానందం పరిపూర్ణాం సనాతన మేకమేవాద్వితీయం బ్రహ్మ.

శుక్లయజుర్వేదీయా పైంగలోపనిషత్.

తా. పైంగలుఁడనే మహాఋషి ద్వాదశవర్ష శుశ్రూషాపూర్వకముగా యాజ్ఞవల్క్యఋషి నాశ్రయించి పరమరహస్యమైన కైవల్యము నా కుపదేశింపుమని ప్రార్థించగా నత డామోదించి చెప్పుచున్నాఁడు. సృష్టికి పూర్వము సద్వస్తువు మాత్ర మున్నది. అది ఏవస్తుసంబంధము లేనిది, వికారరహితము, సత్యము, ప్రకాశము, ఆనందము స్వరూపముగా గలది; సనాతనము ఏకవస్తువు సర్వవ్యాపకము ద్వితీయవస్తురహితము. ఇదియే బ్రహ్మ, ఆత్మ యనఁబడును అని చెప్పిరి. ఇది వెనుక చెప్పిన అశ్వత్థవృక్షమందు గల ప్రథమబిందువుగా నున్నదని గ్రహించవలెను.

### అవ్యక్తస్వరూపము.

శ్రు. తస్మిన్మరుశుక్తికా స్థాణుస్ఫటికాదౌ జలరౌప్య పురుష రేఖాదివ ల్లోహిత శుక్లకృష్ణగుణమయీ గుణసామ్యాఽనిర్వాచ్యా మూలప్రకృతి రాసీత్. తత్ప్రతిబింబితం, యత్తత్సాక్షిచైతన్య మాసీత్. సా పున ర్వికృతిం ప్రాప్యసత్త్వోద్రిక్తా వ్యక్తాఖ్యావరణశక్తి రాసీత్. తత్ప్రతిబింబితం యత్తదీశ్వరచైతన్య మాసీత్, సస్వాధీనమాయః. సర్వజ్ఞ స్సృష్టిస్థితిలయానా మాదికర్తా జగదంకురరూపో భవతి. తస్మిన్విలీనం సకలం జగ దావిర్భావయతి. ప్రాణికర్మవశా దేష పటో యద్వత్ప్రసారితః. ప్రాణికర్మక్షయా త్పున స్తిరోభావయతి. తస్మిన్నేవాఖిలం విశ్వం సంకోచితపటవ ద్వర్తతే.

తా. పరిలేఖనమందుఁ గలప్రథమబిందుస్వరూపమయిన పరమాత్మయందు ద్వితీయబిందువగు శక్తిస్వరూపము సముద్రమందు తరంగాదులవలె మాయాజృంభణమువలన "సోఽకామయత, స ఈక్షత" అనే స్పందశక్తి కలిగినందున మరుభూమియందు జలభ్రమవలెను, శుక్తియందు రజతభ్రమవలెను, స్ఫటికమందు పురుషరేఖవలెను, స్థాణువునందు చోరభ్రాంతివలెను, రజ్జువందు సర్పభ్రమవలెను, దర్పణమందు ప్రతిబింబమువలెను, రక్తశుక్లకృష్ణవర్ణములుగల సత్త్వరజస్తమోగుణమిశ్రమమయిన మూలప్రకృతి అంగనారూపముగా పరమేశ్వరపురోభాగమందద్దమువలె ఆవిర్భవించినది. అందు ప్రతిబింబించిన ఆత్మప్రతిబింబము సాక్షి యనఁబడుచున్నది.

ఆ ప్రకృతి రూపాంతరమును పొంది సత్త్వోద్రిక్తమయి అవ్యక్తమనే ఆవరణశక్తి యయినది. ఇందు ప్రతిఫలించిన ప్రతిబింబము ఈశ్వరచైతన్య మయినది. ఈప్రతిబింబోపాధియే మాయ యనఁబడును. ఈ యీశ్వరునకు మాయ స్వాధీనముగా నున్నది. ఇతఁడు భావిబ్రహ్మాండముయొక్క సృష్టి స్థితి లయములకు నాదికర్తగా నున్నాఁడు. జగత్తున కంకురరూపముగా నున్నాఁడు. చిత్రపటమందుండిన చిత్రములవలె భావిసకలజగత్తును ఇతనియం దిమిడియున్నది. సంకోచ వికోచము లితని స్వాధీనమం దున్నవి. సృష్టి స్థితి లయములని తాత్పర్యము.

శ్రు. ఈశాధిష్ఠితావరణశక్తితో రజోద్రిక్తా, మహదాఖ్యా,

విక్షేపశక్తి రాసీత్. తత్ప్రతిబింబితం యత్తద్ధిరణ్యగర్భచైతన్య మాసీత్, సమహత్తత్వాభిమానీ స్పష్టాస్పష్టవపు ర్భవతి.

తా. తృతీయబిందు వగు మహత్తత్వస్వరూపమును చెప్పుచున్నారు. వెనుక చెప్పిన యీశ్వరప్రతిబింబకారణశక్తి రజోద్రిక్తమయి మహదాఖ్యగల విక్షేపశక్తి యావిర్భవించినది. అందుఁగల ప్రతిబింబము హిరణ్యగర్భుఁడు. ఇతఁడు దృశ్యాదృశ్యమయిన రూపము కలిగి మహత్తత్వాభిమానిగా నున్నాఁడు.

శ్రు. హిరణ్యగర్భాధిష్ఠిత విక్షేపశక్తిత స్తమోద్రిక్తాఽహంకారాభిధా స్థూలశక్తి రాసీత్. తత్ప్రతిబింబితం యత్త ద్విరాట్చైతన్య మాసీత్. స తదభిమానీ స్పష్టవపు స్సర్వస్థూలపాలకో విష్ణుః ప్రధానపురుషోఽభవత్.

తా. చతుర్థబిందువగు అహంకారస్వరూపమును చెప్పుచున్నారు. హిరణ్యగర్భునితోఁ గూడిన విక్షేపశక్తి తమోద్రిక్తమయి అహంకారమనే స్థూలశక్తి యావిర్భవించినది. అందుఁగల ప్రతిబింబము సర్వస్థూలపాలకుఁడయిన విష్ణువను ప్రధానపురుషుఁ డయినాఁడు.

**భూతపంచీకరణము.**

శ్రు. తస్మా దాత్మన ఆకాశ స్సంభూతః, ఆకాశా ద్వాయుః, వాయో రగ్నిః, అగ్నే రాపః, అద్భ్యః పృథివీ, తాని పంచతన్మాత్రాణి గుణా భవంతి. స్రష్టుకామో జగద్యోని స్తమోగుణ మధిష్ఠాయ, సూక్ష్మతన్మాత్రాణి భూతాని స్థూలీకర్తుం సోఽకామయత. సృష్టేః పరిమితాని భూతాన్యేక మేకం ద్విధా విధాయ తయో రేకం పున శ్చతుర్ధా కృత్వా స్వస్వేతరద్వితీయాంశైః పంచపంచధా సంయోజ్య పంచీకృతభూతై రనంతకోటి బ్రహ్మాండాని తత్తదండోచితచతుర్దశభువనాని తత్తద్భువనోచిత గోళకస్థూలశరీరాణ్యసృజత్.

తా. ఆ విష్ణుఁడనే ప్రధానపురుషుఁడగు ఆత్మవలన ఆకాశాదిపంచభూతములును క్రమముగా నొకదానివలన నొకటి సూక్ష్మతన్మాత్రలుగా కలిగినవి. జగత్సృష్టికాముఁడయిన జగత్కారణుఁడగు నావిష్ణువు తమోగుణము నధిష్ఠించి సూక్ష్మతన్మాత్రలను స్థూలములుగా చేయఁదలంచెను.

అపరిమితములగు నాసూక్ష్మతన్మాత్రలలో తాను చేయఁగోరు సృష్టికి కావలసినంత మాత్రము వేరుగా నేర్పరిచి, ఒక్కొక్కభూతమును రెండేసి భాగములుగా విభజించి యందొకభాగమును నాలుగుభాగములుగా నేర్పరిచి, పైనున్న ప్రథమభాగములలో తనభూతమును విడిచి తక్కిన నాలుగుభూతములకును నీనాలుగు భాగములను చేర్చవలెను. ఇటులనే ప్రతిభూతమును సంస్కరించినపుడు ప్రతిభూతమునందును అర్ధము స్వాంశమును ద్వితీయార్ధము తక్కిన భూతచతుష్టయాంశలుగలవయి స్థూలములగును. ఆ పంచీకృతభూతములచేత ననంతకోటి బ్రహ్మాండములను, ఆయాఅండములయం దుచితమయిన చతుర్దశభువనములను, ఆయాభువనోచితములయిన గోళకస్థూలశరీరములను సృజించినారు.

శ్రు. అథాపంచీకృత మహాభూతరజోంశ భాగత్రయ సమష్టితః, ప్రాణమసృజత్, ప్రాణాపానవ్యానోదానాః ప్రాణవృత్తయః, వచనాదానాగమన విసర్గానందా స్తద్విషయాః, నాగకూర్మకృకర దేవదత్త ధనంజయా ఉపప్రాణాః, హృదయాసననాభికంఠసర్వాంగాని స్థానాని.

శ్రు. ఆకాశాది రజోగుణాంశ తుర్యభాగేన కర్మేంద్రియాణ్యసృజత్, వాక్పాణి పాద పాయూపస్థాస్తద్వృత్తయః. వచనాదానాగమనానంద విసర్గాస్తద్విషయాః. ఏవం భూతసత్వాంశభాగత్రయసమష్టితోఽంతఃకరణ మసృజత్, అంతఃకరణమనోబుద్ధిచిత్తాహంకారా స్తద్వృత్తయః, సంకల్పనిశ్చయ స్మరణాభిమానానుసంధానా స్తద్విషయాః గళవదన నాభి హృదయ భ్రూమధ్యాని స్థానాని.

శ్రు. భూతసత్వతుర్యభాగేన జ్ఞానేంద్రియాణ్యసృజత్, శ్రోత్ర త్వక్చక్షు ర్జిహ్వాఘ్రాణాని తద్వృత్తయః, శబ్దస్పర్శరూపరసగంధా స్తద్విషయాః, సత్వసమష్టిత ఇంద్రియపాలకా నసృజత్. దిగ్వాతార్క ప్రచేతోఽశ్వివహ్నీంద్రో పేంద్రమృత్యుకాః, చంద్రో విష్ణు శ్చతుర్వక్త్ర శ్శంభుశ్చ కరణాధిపాః.

* * * * * * *

శ్రు. ఈశః పంచీకృతమహాభూతలేశా నాదాయ, వ్యష్టిసమష్ట్యాత్మక స్థూలశరీరాణి యథాక్రమ మకరోత్. కపాలచర్మాంత్రాస్థిమాంస నఖాని పృథివ్యంశాః, రక్తమూత్రలాలాస్వేదా అబంశాః, క్షుత్తృష్ణోష్ణ

మోహమైథునా అగ్న్యంశాః, ప్రచారోణోత్తారణ శ్వాసాదికావా య్వంశాః, కామక్రోధాదయో వ్యోమాంశాః. ఏతత్సంఘాతం కర్మణి సంచితం తగ్వాదియుక్తం బాల్యాద్యవస్థాభిమాని బహుదోషాశ్రయం స్థూలశరీరం భవతి.

శ్రు. తాని సృష్టాన్యండే ప్రాక్షిపత్, తదాజ్ఞయా సమష్ట్యండం వ్యాప్య తాన్యతిష్ఠన్. తదాజ్ఞయాఽహంకారసమన్వితో విరాట్సర్వస్థూలాన్యసృజత్. హిరణ్యగర్భస్తదాజ్ఞయా సూక్ష్మాణ్యపాలయత్. అండస్థాని తాని తేన వినా స్పందితుం చేష్టితుం వా న శేకుః. తాని చేతనీకర్తుం సోఽకామయత. బ్రహ్మాండం బ్రహ్మరంధ్రాణి సమస్తవ్యష్టి మస్తకాని విదార్య తదేవానుప్రవిశత్. తదా జడాన్యపి తాని చేతనవత్ స్వస్వకర్మాణి చక్రిరే.

శ్రు. సర్వజ్ఞేశో మాయాలేశసమన్వితో వ్యష్టిదేహం ప్రవిశ్య తయా మోహితో జీవత్వ మగమత్. శరీరత్రయతాదాత్మ్యాత్తత్కర్తృత్వభోక్తృత్వ మగమత్. జాగ్రత్స్వప్నసుషుప్తిమూర్ఛామరణ ధర్మయుక్తో ఘటీయంత్రవ దుద్విగ్నో జాతో మృత ఇవ కులాలచక్రన్యాయేన పరిభ్రమతీతి.

**అథ పంచకోశవిచారః.**

శ్రు. అథాన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయానందమయాః పంచకోశాః. అన్నరసేనైవ భూత్వాన్నరసేనాభివృద్ధిం ప్రాప్య-అన్నమయపృథివ్యాం యద్విలీయతే సోఽన్నమయకోశః. తదేవ స్థూలశరీరం కర్మేంద్రియైః సహ ప్రాణాదిపంచకం ప్రాణమయకోశః. జ్ఞానేంద్రియైస్సహ మనోమయకోశః. జ్ఞానేంద్రియైస్సహ బుద్ధి ర్విజ్ఞానమయకోశః. ఏతత్కోశత్రయం లింగశరీరం. స్వరూపాజ్ఞానమానందమయకోశః. తత్కారణశరీరం.

**విద్యారణ్యవిరచితపంచదశ్యాం.**

శ్రు. యథా ముంజాదిషీకైవమాత్మా యుక్త్యా సముద్ధృతః,
పంచకోశవివేకేన లభతే నిర్వృతిం పరాం. ౧
గుహాహితం బ్రహ్మ యత్తత్పంచకోశవివేకతః,
బోద్ధుం శక్యం తతః కోశపంచకం ప్రవివిచ్యతే. ౨

దేహా దభ్యంతరః ప్రాణః ప్రాణా దభ్యంతరం మనః,
తతః కర్తా తతో భోక్తా గుహా సేయం పరంపరా. ౩
పితృభుక్తాన్నజా ద్వీర్యాజ్జాతోఽ న్నే నైవ వర్ధతే,
దేహోఽన్నమయో నాత్మా ప్రాక్చోర్ధ్వం తదభావతః, ౪
పూర్వజన్మన్యసన్నేత జ్జన్మ సంపాదయే త్కథం,
భావి జన్మన్యసత్కర్మ న భుంజీతేహ సంచితం. ౫
పూర్ణో దేహో బలం యచ్ఛన్నక్షాణాం యత్ప్రవర్తకః,
వాయుః ప్రాణమయో నాసావాత్మా చైతన్యవర్జనాత్. ౬
అహంతాం మమతాం దేహే గేహాదౌ చ కరోతి యః,
కామాద్యవస్థయా భ్రాంతో నాసావాత్మా మనోమయః. ౭
లీనా సుప్తౌ వపుర్బోధే వ్యాప్నుయా దానఖాగ్రగా,
చిచ్ఛాయోపేతధీ ర్నాత్మా విజ్ఞానమయశబ్దభాక్, ౮
కర్తృత్వకరణత్వాభ్యాం విక్రియేతాంతరింద్రియం,
విజ్ఞానమనసీ అంతర్బహిశ్చైతే పరస్పరం. ౯
కాచి దంతర్ముఖా వృత్తి రానందప్రతిబింబభాక్,
పుణ్యభోగే భోగశాంతౌ నిద్రారూపేణ లీయతే. ౧౦
కదాచిత్కత్వతో నాత్మా స్యాదానందమయోఽప్యయం,
బింబభూతో య ఆనందః ఆత్మాఽసౌ సర్వదా స్థితేః. ౧౧
నను దేహ ముపక్రమ్య నిద్రానందాంతవస్తుషు,
మాభూదాత్మత్వ మన్యత్తు న కశ్చి దనుభూయతే. ౧౨
బాఢం నిద్రాదయస్సర్వేఽనుభూయంతే న చేతరః,
తథాఽప్యేతేఽనుభూయంతే యేన తం కో నివారయేత్. ౧౩
స్వయంజ్యోతి ర్భవత్యేష పురోఽస్మాద్భాసతేఽఖిలాత్,
తమేవ భాంత మన్వేతి తద్భాసా భాస్యతే జగత్. ౧౪
యేనేదం జానతే సర్వం తత్కేనాన్యేన జానతాం,
విజ్ఞాతారం కేన విద్యా చ్ఛక్తం వేద్యేతు సాధనం. ౧౫
పంచకోశపరిత్యాగే సాక్షిబోధావశేషతః,
స్వస్వరూపం స ఏవ స్యాచ్ఛూన్యత్వం తస్య దుర్ఘటమ్. ౧౬

ఇతి పంచకోశవిచారః.

## శరీరత్రయము—తత్తదధిపతులు.

| తురీయము. | తురీయాభిమాని సాక్షి. |
|---|---|
| సమష్టి-బ్రహ్మాండము.<br>కారణశరీరము. అధిపతి ఈశః. | వ్యష్టి - జీవుఁడు.<br>కారణశరీరాభిమాని ప్రాజ్ఞుఁడు. |
| సూక్ష్మశరీరము.<br>హిరణ్యగర్భుఁడు. | సూక్ష్మశరీరాభిమాని<br>తైజసుఁడు. |
| స్థూలము విరాట్<br>వైశ్వానరుఁడు. | స్థూలశరీరాభిమాని<br>విశ్వుఁడు. |
| అన్నమయకోశము.<br>స్థూలశరీరము. ౧.<br>ప్రాణమయం మనః. | విజ్ఞానకోశత్రయము<br>సూక్ష్మదేహము. ౨. ఆనంద<br>మయము, కారణము. ౩. |

శ్రు. అథ జ్ఞానేంద్రియపంచకం కర్మేంద్రియపంచకం ప్రాణాది పంచకం వియదాదిపంచకం అంతఃకరణచతుష్టయం అవిద్యా కామకర్మ తమాంసి చ పురం, ఈశాజ్ఞయా విరాట్ వ్యష్టిదేహం ప్రవిశ్య బుద్ధిమధిష్ఠాయ విశ్వత్వ మగమత్. విజ్ఞానాత్మా చిదాభాసో - విశ్వో - వ్యావహారికో, జాగ్రస్థూల దేహాభిమానీ కర్మభూరితి చ విశ్వస్య నామ భవతి.

శ్రు. ఈశాజ్ఞయా సూత్రాత్మా వ్యష్టిసూక్ష్మశరీరం ప్రవిశ్య మన అధిష్ఠాయ, తైజసత్వ మగమత్. తైజసః ప్రాతిభాసికః స్వప్నకల్పిత ఇతి తైజసస్య నామాని భవంతి.

శ్రు. ఈశాజ్ఞయా మాయోపాధి రవ్యక్తసమన్వితో వ్యష్టి కారణ శరీరం ప్రవిశ్య ప్రాజ్ఞత్వ మగమత్. ప్రాజ్ఞః అవిచ్ఛిన్నః - పారమార్థిక స్సుషుప్త్యభిమానీతి ప్రాజ్ఞస్య నామ భవతి.

శ్రు. అవ్యక్తలేశాజ్ఞానాచ్ఛాదిత పారమార్థిక జీవస్య - తత్త్వమస్యాదివాక్యాని బ్రహ్మైకతాం జగుః. నేతరయో ర్వ్యావహారికప్రాతి

భాసికయోః. జాగ్రత్స్వప్నసుషుప్తిమూర్ఛానామన్యా బ్రహ్మాదిస్తంబ పర్యంతం సర్వజీవభయప్రదా స్థూలదేహవిసర్జనీ మరణావస్థా భవతి. కామకర్మాన్వితాఽవిద్యాభూతవేష్టితో జీవో దేహాంతరం ప్రాప్య-లోకాంతరం గచ్ఛతి. ప్రాక్కర్మపరిపాకేనావర్తాంతర కీటవద్విశ్రాంతిం నైవ గచ్ఛతి. సత్కర్మపరిపాకతో బహూనాం జన్మనా మంతే నృణాం మోక్షేచ్ఛా జాయతే. తదా సద్గురు మాశ్రిత్య, చిరకాలసేవయా బంధాన్మోక్షం కశ్చి త్ప్రయాతి.

శ్రు. అవిచారకృతో బంధః, విచారా న్మోక్షో భవతి. తస్మా త్సదా విచారయేత్. అధ్యారోపాపవాదతస్స్వరూపం నిశ్చయీకర్తుం శక్యతే. తస్మా త్సదా విచారయే జ్జగజ్జీవపరమాత్మనః. జీవభావజగద్భావ బాధే ప్రత్యగభిన్నం బ్రహ్మైవ శిష్యతేత్యుపనిషత్.

సహోవాచ యాజ్ఞవల్క్యః అమానిత్వాది సంపన్నో ముముక్షు రేకవింశతికులం తారయతి. బ్రహ్మవిన్మాత్రేణ కుల మేకోత్తరశతం తార యతీతి పైంగలోపనిషత్. తత్సత్.

## అథ తత్త్వవికల్పాని.

తత్వం నామ:—

శ్లో. ఆప్రలయం యస్తిష్ఠతి సర్వేషాం భోగదాయి భూతానాం,
తత్తత్వ మితి ప్రోక్తం న శరీరఘటాది తత్వ మతః.

తా. బ్రహ్మాండప్రలయమువరకును, సకలప్రాణులకు వారివారి పుణ్యపాపకర్మల ననుసరించి ఆయాఫలముల నిచ్చుచునుండే యీశ్వర శక్తి తత్వమనిపించుకొనును. ఇదియే అనేకరూపములను పొందినది.

ఈతత్వములను ప్రాచీనులు అనేకవిధములుగా నిర్ణయించిరి. ఆగమవేత్తలు తత్వత్రయమనియు, శ్రౌతమతము చతుర్వింశతి తత్వము లనియు, మతాంతరము షట్త్రింశత్తత్వములనియు, శైవపురాణములందు ఏకపంచాశత్తత్వములనియు, మరికొందఱు షణ్ణవతితత్వములనియుఁ జెప్పిరి.

ఈవ్యాఖ్యానము నిగమాగమసామరస్యముగా రచింపఁబడినది. చతుర్వింశతితత్వములు సర్వసమ్మతములు. తక్కిన తత్వభేదములు ఈ

చతుర్వింశతితత్త్వములలో నంతర్భూతములుగా నున్నవి. అయినను భ్రమనిరసనార్థము వివరింపఁబడును.

**తత్త్వత్రయము**

తత్త్వత్రయము:—ఆత్మతత్త్వము, విద్యాతత్త్వము, శివతత్త్వము. ఈతత్త్వత్రయవివరము ముందు విద్యాపాదమందు కామకలా ఏకాక్షరీ మంత్రార్థవిచారణావసరమందు స్పష్టపరచఁబడును. గంభీరముగానున్నందున ఇచ్చట విస్తరించలేదు.

**చతుర్వింశతి తత్త్వములు**

ఆకాశాదిభూతపంచకము, తన్మాత్రాపంచకము, జ్ఞానేంద్రియపంచకము, కర్మేంద్రియపంచకము, మనోబుద్ధిచిత్తాహంకారములనే అంతఃకరణ చతుష్టయ సహితమని కొందఱును, మనస్తత్త్వము, అహంకారము, మహత్తత్త్వము, అవ్యక్తము నీచతుష్టయము కలసి ౨౪ - చతుర్వింశతి తత్త్వములని కొందఱిమతము. అంతఃకరణచతుష్టయము వృత్తిభేదముగాని మనస్సు ఏకతత్త్వముగాన అవ్యక్తాంతమే సామరస్యముగానున్నది. ఇవియే తత్త్వవృక్షమందు చూపింపఁబడినవి - శ్రుతిసిద్ధములుగానున్నవి.

తంత్రములం దివి రూపాంతరములుగా నిరూపింపఁబడినవి.

శ్లో. పంచభూతాని శాక్తాని మాయాదీని శివస్య తు,
మాయా చ శుద్ధవిద్యా చ మహేశ్వరసదాశివౌ.
పంచవింశతితత్త్వాని తత్రైవాంతర్భవంతి తే,
శివశక్త్యాత్మకం విద్ధి జగదేతచ్చరాచరమ్.

**ఇతి కామికాయాం.**

తా. వీరిమతము పృథివ్యాది మనస్తత్త్వాంతము ఏకవింశతి తత్త్వములు శక్త్యంశములనియు, మాయా-శుద్ధవిద్యా-ఈశ్వర-సదాశివతత్త్వములు నాలుగును శివతత్త్వములనియు, జగత్తు శివశక్త్యాత్మకము గాన పంచవింశతి తత్త్వములనియు, సర్వతత్త్వాతీతము షడ్వింశమని తెలియుచున్నదిగాని ఈమతము బహుశ్రుతివిరోధము. శ్రుతి ప్రమాణరహితముగానున్నది. ఇక వెనుక వ్రాసిన తత్త్వవృక్షమందు అవ్యక్తాది పృథివ్యంతము ౨౪ చతుర్వింశతి తత్త్వములుగాను ౨౫ వది ఆత్మగాను చూపింపఁ

బడినది. ఇందు మాయాది శివతత్త్వములు అంతర్భూతములుగానున్నవి. ఎట్లనిన: మాయా-ఈశ్వరతత్త్వములు అవ్యక్తమనే రెండవబిందువునందును, శుద్ధవిద్యాసదాశివతత్త్వములు సర్వోర్ధ్వబిందువగు ప్రథమ బిందువునందును, ఇట్లు మాయా-శుద్ధవిద్యా-ఈశ్వర సదాశివతత్త్వములు ఆత్మా-అవ్యక్తములనే బిందుద్వయమునం దంతర్భూతములుగా నున్నవి గాన, పైన చూపించిన అశ్వత్థవృక్షము నిగమాగమ సంప్రదాయ సిద్ధముగా నున్నది.

ఆధునికులగు కొందఱు ఇతరగ్రంథ వ్యాఖ్యాతలు ఈమాయా శుద్ధవిద్యా - ఈశ్వర - సదాశివతత్త్వములను వేఱువేఱుగా భావించి మనస్తత్త్వము ౨౧ వదిగాను, మాయాది తత్త్వచతుష్టయము కలసి పంచవింశతితత్త్వములనియు, శివశక్తిమేళనవస్తువు షడ్వింశమనియు అదియే భాగవతతత్త్వమని అభిప్రాయముతో తమవ్యాఖ్యానములందుఁ బ్రచురించిరి గాని అది సమంజసముగా నుండదు. ఎందువలననఁగా శుద్ధ విద్యయనఁగా శుద్ధసత్వము. అది అద్దమువంటి ఉపాధిగా నున్నపుడు అందుఁ బ్రతిబింబించిన నిర్గుణబ్రహ్మప్రతిబింబము సదాశివనామమును పొందెను. ఉపాధియు ప్రతిబింబమును ఏకమేగాని తత్త్వద్వయము గానేరవు. ఇది ప్రథమబిందువు. అటులనే మాయోపాధియందుఁ గల సదాశివప్రతిబింబము ఈశ్వరనామమును పొందును. ఇచటను ప్రతి బింబకారణమయిన మాయారూపమయిన ఉపాధికిని, దానియందుఁగల ప్రతిబింబమునకును భేదమున్నట్లగుపడును గాని భేదములేదు. అపుడు శుద్ధవిద్యా సదాశివులు అశ్వత్థవృక్షపరిలేఖనమందుఁగల సర్వోర్ధ్వముగా నున్న ప్రథమ బిందువుగాను, మాయా - ఈశ్వరులు ప్రథమబిందువు క్రిందనున్న కోణత్రయ చక్రాకారమును పొందిన మూలప్రకృతియనే ద్వితీయబిందువుగానున్నవి. అందువలన మాయా-శుద్ధవిద్యా-ఈశ్వర-సదాశివతత్త్వములు నాలుగును ద్వంద్వములుగా ప్రథమద్వితీయబిందువులుగా నున్నవి. అపుడు పృథివ్యాది అవ్యక్తాంతము ౨౪ తత్త్వములు గాను, సర్వోర్ధ్వబిందు శివశక్తి మేళనమగు (౨౫) పంచవింశతివస్తువుగా నున్నది. ఇదియే భాగవతతత్త్వమనిపించుకొనును. కాని షడ్వింశమనేది మరియొకటి కలదన్నమాట యప్రసిద్ధముగా నున్నది. పైనఁ దెలిపిన అంశము నిగమాగమసిద్ధము. సకల శ్రుతి సమ్మతముగా నున్నది.

శ్రు. పంచవిగ్ంశ ఆత్మా భవతి. ఈశ్రుతివలన తత్త్వములు ౨౪ అనియు, ౨౫వది ఆత్మగాను, అదియే తత్త్వాతీతమని తెలియు చున్నది.

శ్రు. కఠోపనిషత్:—"ఇంద్రియేభ్యః పరా హ్యర్థాః" అని ప్రారంభించి, "అవ్యక్తాత్పురుషః పరః పురుషాన్న పరం కించిత్సా కాష్ఠా సా పరా గతిః" ఇందువలనను, ఇంద్రియము లారంభించి ఉత్త రోత్తరతత్త్వములు శ్రేష్ఠములనియు క్రిందితత్త్వమునకు పైతత్త్వము ప్రకృతిగానున్నట్లును, ఇట్లురాగా దిగువతత్త్వములన్నిటికి అవ్యక్తము ప్రకృతిగాను దానికి పురుషుఁడు ప్రకృతిగాను, ఆపురుషునికిపైన ఏమియు లేనందున ఈఅవ్యక్తమే మూలప్రకృతిగా నున్నట్లు ఈశ్రుతి చెప్పు చున్నది. ఆపురుషుఁడనేది ౨౫వ దగు సర్వోర్ధ్వబిందువు. ఇతఁడే ఉత్తమ పురుషుఁడుగా నున్నాఁడు.

శ్రు. వేదాహమేతం పురుషం మహాంతం, ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్, తమేవం విద్వానమృత ఇహ భవతి, నాన్యః పంథా అయ నాయ విద్యతే.

భా. తమసః పరస్తాత్ స్థితం ఆదిత్యవర్ణం మహాంత మేతం పురుషం యో విద్వాన్ తమసః పరస్తాదితి వేద సః ఇహైవ అస్మిన్నేవ జన్మని అమృతః అవిద్యావిముక్తస్సన్ జననమరణరహితః జీవన్ముక్తో భవతీతి. అయనాయ మోక్షాయ అన్యః పంథా మార్గాంతరం న నాస్తీతి.

ఇందువలనను 'తమసః పరస్తాత్' అని చెప్పుటవలన, తమశ్శబ్దము అవ్యక్తస్వరూప కోణచక్రరూప ద్వితీయబిందు పరముగాను, ఆపై బిందువు పురుషస్వరూపమనియు, అదియే ౨౫వదిగా నున్నదని తెలియు చున్నది. ఇదిగాక గాయత్రీ తురీయపాదమునందు

శ్రు. పరోరజసిసావదోమ్. రజసః అవ్యక్తాత్పరః, పరోరజః, సదా శివః యా చిచ్ఛక్తిః, తస్మిన్సదాశివే స్థితా సా పూర్వోక్త గాయత్రీ రూపకామేశ్వరీశక్తి నః అవతు రక్షతు. బ్రహ్మే పరోక్షజ్ఞాన స్ఫురణాం దదాత్వితి ప్రార్థనేయం.

తా. ఇచటను రజస్సుకన్న పరమయిన పురుషుఁడని యున్నది. రజశ్శబ్ద తమశ్శబ్దములు, అశ్వత్థవృక్షమందున్న ద్వితీయబిందువగు అవ్యక్తపరములు. ఇందువలనను, "ఆత్మా వా ఇద మగ్ర ఆసీత్ - సదేవ సౌమ్యే ద మగ్ర ఆసీత్." ఇత్యాది శ్రుతులచే చెప్పఁబడిన ఆత్మ వస్తువే ప్రథమవస్తువుగా నున్నదనియు, "సోఽకామయత-సఈక్షత" అనే శ్రుతులవలన నాఆత్మయొక్క స్ఫురణరూప చిచ్ఛక్తి పురోభాగ మందావిర్భవించినది. అదియే అవ్యక్తమని, రజస్సని, తమస్సని శ్రుతు లందు వాడుకగానున్నది.

**అవ్యక్తవివరము.**

న+వ్యక్తం=అవ్యక్తం బీజమందు వృక్షమువలె సకలతత్త్వ సముదాయమును, సకల వర్ణకదంబమును గర్భమందుఁ గలది. అస్పష్ట పదార్థములు గలదిగాన అవ్యక్తమనియు, మహత్తత్త్వము అంకురము వంటిదిగాన మూఁడవ బిందువు వ్యక్తమని మహత్తత్వమనియు సంజ్ఞ కలది.

సాంఖ్యసప్తశతియందు:—

శ్లో. సూక్ష్మ మలింగ మచేతన మనాదినిధనం తథా ప్రసవధర్మి చ,
నిరవయవ మేక మేవ హి సాధారణ మేత దవ్యక్తం.

లైంగ్యే:—

ప్రధానమవ్యక్తం, యోనిరవ్యక్తం, ప్రకృతిస్తమః,
విష్ణో రేతాని నామాని, నిత్యం ప్రసవధర్మిణ ఇతి.
త్రయోవింశతితత్త్వాని వ్యక్తశబ్దేన సూరయః,
వదంత్యవ్యక్తశబ్దేన ప్రకృతిం చ పరాం తథేతి.

ఈతత్త్వవిచారణ కాకదంతపరీక్షవలె నిష్ప్రయోజనమనినటుల కాదు. వల్మీకగర్భమందు మహాసర్పము నివసించియుండఁగా, వల్మీక తాడనమువలె అవిద్యయనేది తత్త్వగర్భమందుండఁగా కాయశోషణ ధనవ్యయాదులచే ప్రయోజనములేదు. తత్త్వవిచారణవలన స్వరూప నిశ్చయము కలుగుచున్నదిగాన నీతత్త్వవిచారణ సార్థకముగా నున్నది.

ఈఅవ్యక్తము సత్వరజస్తమస్సులనే గుణత్రయసమ్మేళన వస్తు వుగానున్నందున నిందువల్ల కలిగిన సకలతత్త్వములు ఆ గుణత్రయ

భాగల న్యూనాధికముగా గుణత్రయముచే నిండియున్నవి. దిగువ చెప్పం బడెడు తత్త్వవికల్పములు నీచతుర్వింశతి తత్వములం దిమిడి యున్నవి గాన, సకల పిండాండ బ్రహ్మాండములును ఈ ౨౪ తత్త్వములచే భరితమయియున్నవి. ౨౪ వదే పరమాత్మ గాని ౨౬ వది అప్రసిద్ధము.

శ్రు. మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినంతు మహేశ్వరం,
అస్య అవయవభూతాస్తు వ్యాప్తం సర్వమిదం జగత్.

**షట్త్రింశత్ (౩౬) తత్త్వస్వరూపము.**

తత్త్వచూడామణౌ:—

శ్లో. పృథివ్యాదీని భూతాని తన్మాత్రాపంచకం తథా,
దశేంద్రియాణి మనసా ఏకవింశతిసమ్మితాః.
త్వగాదిధాతవ స్సప్త తథా వాయోశ్చ పంచకం,
మాయా చ శుద్ధవిద్యా చ మహేశ్వరసదాశివౌ,
షట్త్రింశత్తత్త్వరూపాణి తత్త్వాతీతా చ శాంభవీ.

ఇతి కామికాయాం.

పృథివ్యాదీని షట్త్రింశత్తత్త్వాన్యాగమవేదిభిః,
ఉక్తాన్యముష్య తత్త్వాఖ్యా శుక్లమజ్జాస్థితత్త్వధృత్.

**ఏకపంచాశత్తత్త్వములు. (౫౧)**

వాయవ్యసంహితాద్యష్టైవాగమేషు ప్రసిద్ధాని:—

శ్లో. పంచభూతాని తన్మాత్రా పంచకం చేంద్రియాణి చ,
జ్ఞానేంద్రియాణి పంచైవ తథా కర్మేంద్రియాణి చ.
త్వగాదిధాతవస్సప్త పంచప్రాణాదివాయవః,
మనశ్చాహంకృతిః ఖ్యాతిః గుణాః ప్రకృతిపూరుషౌ.
రాగో విద్యాకళా చైవ నియతిః కాల ఏవ చ,
మాయా చ శుద్ధవిద్యా చ మహేశ్వరసదాశివౌ.
శక్తిశ్చ శివతత్త్వం చ తత్త్వాని క్రమశో విదుః.

ఇత్యేకపంచాశత్తత్త్వాని.

**షణ్ణవతితత్త్వములు. (౯౬)**

వెనుక చూపించిన ఏకపంచాశత్తత్త్వములలో (౫౧ లో) మరి ౪౫ తత్త్వములు కలిసి ౯౬ తత్త్వము లగుచున్నవి. ఆ ౪౫ ను వివరింప

బడుచున్నవి. నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయములను ఉపప్రాణములు ౫.

కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్య, పుణ్య, పాపములను కామాదిశక్తులు ౮.

వచనాదానాగమనానంద విసర్గహానోపాదానోపేక్షలను వచనాదిశక్తులు ౮.

అలంబుసా, కుహూ, విశ్వోదరీ, వరుణా, హస్తిజిహ్వా, యశస్వీ, అశ్వినీ, గాంధారీ, పూషా, శంఖినీ, సరస్వతీ, ఇడా, పింగలా, సుషుమ్నా యని అలంబుసాది నాడీశక్తులు ౧౪.

రేచక, పూరక, శోషక, దాహక, పావక, అమృతములను రేచకాదిశక్తులు ౫.

శీతోష్ణసుఖదుఃఖేచ్ఛలను శీతోష్ణాదిశక్తులు ౫. సమష్టి ౪౫

వెనుకటి (౫౧) ఏకపంచాశత్తత్వములు కలసి (౯౬) షణ్ణవతి తత్త్వము లగుచున్నవి.

ఇది తత్త్వవివేకము.

## బంధమోక్షస్వరూపము, పాశవివరము.

తదుక్తం లైంగ్యే:—

శ్లో. బ్రహ్మాద్యా స్థావరాంతాశ్చ దేవదేవస్య శూలినః,
పశవః పరికీర్త్యంతే సమస్తాః పశువృత్తయః.

శ్రు. తథేతరేషాం పశూనా మశనా పిపాసే ఏవాభిజ్ఞానం, న విజ్ఞాతం వదంతి, న విజ్ఞాతం పశ్యంతి, న విదు శ్శ్వస్తనం, న లోకాలోకానితి.

తా. పామరజనులు పశువృత్తిగలవారై పిపాసాశనజ్ఞానము మాత్రము కలవారై ఆత్మ నుచ్చరించరు. చూడలేరు. తెలుసుకొనరు గాన పాశబద్ధులయి యున్నందున పశువులనే చెప్పఁబడుదురు.

శ్రు. నమశ్శంగాయచ పశుపతయేచ. ఈశ్రుతివలన నట్టి పాశబద్ధులయిన పశువులకు పాశవిముక్తి చేయువాఁడు గాన పశుపతి యని ఈశ్వరనామము గలదు.

శ్లో. చతుర్వింశతి తత్త్వాని మాయాకర్మగుణా ఇతి,
విషయా అపి కీర్త్యంతే పాశా జీవనిబంధనాత్.
తైర్బద్ధాశ్శివభక్త్యైవ ముచ్యంతే సర్వదేహిన ఇతి.

తా. చతుర్వింశతితత్త్వములు, మాయ, కర్మ, గుణత్రయము జీవులను బంధించుచున్నవిగాన నివే పాశము లనఁబడును. వీరు శివభక్తిచేతనే ఈ పాశవిమోచనమును పొందుచున్నారు.

**పంచవిధక్లేశములు.**

పంచవిధక్లేశము లనుపాశములు. లైంగ్యే:—

శ్లో. అవిద్యా అస్మితా రాగం ద్వేషశ్చ ద్విపదాంవర,
వదంత్యభినివేశశ్చ క్లేశాన్పంచత్వమాగతాన్.
తమోమోహో మహామోహ స్తామిస్రమథ పండితాః.
అంధతామిస్రమిత్యాహుః క్లేశాన్వై పంచధా స్థితాన్.
అవిద్యా తమ ఇత్యాహు రస్మితా మోహ ఇత్యపి,
రాగం చైవ మహామోహం ద్వేషం తామిస్ర ఇత్యపి,
అంధతామిస్రకం మిథ్యాఽభినివేశం ప్రచక్షత ఇతి.

తా. అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము ఈ యయిదును పంచవిధ క్లేశము లనఁబడును. వీనిచే బద్ధులయి యున్నందున నివియు పాశము లనఁబడును.

అవిద్యయనఁగా: ఆత్మానాత్మ వివేకాభావము గాన నిది తమస్సనఁబడును. అస్మిత యనఁగా: అనాత్మలగు దేహాదులందు ఆత్మత్వవిపర్యయభావన అస్మిత యనఁబడును. దీనిని మోహమని చెప్పిరి. రాగమనఁగా: దేహోపభోగ సాధనములయిన స్రక్చందనాదులందుఁ గల అభిలాష. ఇది మహామోహము. ద్వేషమనఁగా నా యభిలషితమునకు విరోధము కలిగినందున జనించిన క్రోధము. దీనిని తామిస్రమని చెప్పిరి. అభినివేశమనఁగా: వెనుకటి వన్నియు అయుక్తములని తెలిసిన్ని యజ్ఞులవలెనే వానిని విడువకపోవుట. ఇది అంధతామిస్రము. ఇవియే పాశములుగా నున్నవి.

**యత్తు-దేవీభాగవతే:—**

శ్లో. తమోవివేకో మోహస్స్యాదంతః కరణవిభ్రమః,
మహామోహస్తు విజ్ఞేయో గ్రామ్యభోగసుఖైషణా,
మరణం త్వంధతామిస్రం తామిస్రం క్రోధ ఉచ్యతే,
అవిద్యా పంచపర్వైషా ప్రాదుర్భూతా మహాత్మన ఇతి.

అత్ర తమః ప్రభృతీ న్యవిద్యాదీనామేవ నామాంతరాణి; మరణ శబ్దోఽభినివేశపరః.

**పాశ ప్రభేదములు.**

శ్లో. తమసోఽష్టవిధో భేదో మోహశ్చాష్టవిధస్స్మృతః,
మహామోహప్రభేదాస్తు బుధై ర్దశ విచింతితాః,
అష్టా విధా స్తథా ప్రాహు స్తామిస్రశ్చ విచక్షణాః,
అంధతామిస్ర భేదాశ్చ తథాఽష్టాదశ కీర్తితాః.

సర్వసమిష్ట్యా ద్విపంచాశత్పాశాః తామిస్రస్యాప్యష్టాదశత్వమాశ్రిత్య ద్విషష్టిపాశా ఇతి కేచిత్. ప్రకారాంతరం యత్తు కులార్ణవే:—

శ్లో. ఘృణా శంకా భయం లజ్జా జుగుప్సా చేతి పంచమీ,
కులం శీలం చ జాతి శ్చేత్యష్టౌ పాశాః ప్రకీర్తితాః.

అధికారిభేదేన పాశానాం విలక్షణత్వం. దేవీభాగవతే:—

శ్లో. ప్రసుప్తాస్తత్వవేత్తౄణాం దగ్ధదేహాస్తు యోగినామ్,
అవిచ్ఛిన్నోదార రూపాః క్లేశావిషయసంగినా మితి.

తా. ఈపంచవిధ క్లేశములు గ్రామ్యభోగేచ్ఛగలవారికి సంపూర్ణ శరీరములు కలిగియున్నవనియు, తత్త్వవేత్తలకు నిద్రించుచున్నవనియు, యోగులకు స్వరూపనిష్ఠులకు దగ్ధదేహములు కలవని చెప్పఁబడినది.

**శివరహస్యే:—**

శ్లో. పంచక్లేశైః ద్విపంచాశత్పాశై ర్బధ్నాతి యః పశూన్,
స ఏవ మోచకస్తేషాం భక్త్యా సమ్య గుపాసిత ఇతి.

పౌరాణికరీత్యా నిష్కర్షః.

**ఆగమరీత్యా:—**

అణవమలం, మాయికమలం, కార్మికమలమితి మలత్రయరూపా స్త్రయఃపాశా ఇతి. స్థూలశరీరాభిమానిత్వ మణవమలం, సూక్ష్మశరీరాభిమానిత్వం మాయికమలం, కారణశరీరాభిమానిత్వం కార్మికమలం. తత్తు ప్రత్యభిజ్ఞాశాస్త్రే.

శ్లో. స్వాతంత్ర్యహానిర్బోధస్య స్వతంత్రస్యాప్యబోధతా,
ద్విధాఽఽణవం మలమిదం స్వస్వరూపాపహారతః. ౧
భిన్నవేద్య ప్రథాఽఽత్రైవ మాయీయం జన్మభోగదం,
కర్తర్యబోధే కార్మస్తు మాయాశక్త్యైవ తత్త్రయ మితి.

**శైవాగమే స్పష్టముక్తం:—**

శ్లో. నన్వేవంవిధవిశ్వస్య చైతన్యం చేద్వపుస్తదా,
కథం బంధస్య సంబంధ ఇతి శంకా వ్యపోహితుం,
అశ్లేషాశ్లేషపాశాభ్యాం సూత్రమాహ మహేశ్వరః.

**అజ్ఞానం బంధః:—**

అజ్ఞానమితి తత్రాద్యం చైతన్యస్వాపరరూపిణీ,
ఆత్మన్యనాత్మతాఽ జ్ఞానం జ్ఞానం పునరనాత్మని.
దేహాదా వాత్మమానిత్వం ద్వయ మప్యేత దాణవం,
మలం స్వకల్పితం స్వస్మిన్ బంధస్వేచ్ఛావిభావితః.
కిమాణవమలాత్రైవ బంధోఽయం నేత్యుదీర్యతే.

తా. చైతన్యస్వరూపమయిన ఆత్మయం దనాత్మభావనయు, అనాత్మలయిన దేహాదులం దాత్మభావనయు నీరెండు కలసి అణవమలమని చెప్పఁబడినది. శ్లో. ఆత్మనోఽణుత్వహేతుత్వా దణుర్మాలిన్యతో మలమితి, సౌరసంహితావచనం. ఇది అణవమలస్వరూపము.

**మాయికమలస్వరూపము:—**

శ్లో. యోనిర్భేదః ప్రథాహేతు ర్మాయా వర్గస్తదుత్థితః,
కాలాదిక్షితిపర్యంతం తత్త్వరాశిస్తదాత్మకః,
మాయీయాఖ్యం మలం తత్తద్భిన్నవేద్యప్రథామయం,
కలేతి కాయ మావిశ్య పరిచ్ఛేదకరీ నృణాం,

తా. ఏకరూపముగానున్న ఆత్మను అనేకరూపములుగా భిన్న భావన చేయుట, శివాదిక్షిత్యంతమయిన షట్త్రింశత్తత్వభేదము మాయచే కల్పింపఁబడినందున మాయిక మలమని చెప్పఁబడినది.

**కార్మికమలస్వరూపము:—**

శ్లో. వ్యాప్తృత్తిః పుణ్యపాపాత్మా శరీరం యస్య తత్పునః,
కార్మణం మలమేతస్మిన్ ద్వయే బంధోఽనువర్తత ఇతి.

తా. విహిత నిషిద్ధక్రియలవలన కలిగి శరీరోత్పత్తికి హేతువయిన (అదృష్టరూపమయిన) పుణ్యపాపరూపద్వివిధకర్మయు కార్మికమల మనిపించుకొనును.

**పశుత్వం త్రివిధం:—**

శ్లో. పశవస్త్రిప్రకారా స్స్యు స్తేష్వేకే సకలా మతాః,
ప్రలయాకలనామాన స్తేషాం కేచి న్మహేశ్వరి.
విజ్ఞానకేవలా స్త్వన్యే తేషాం రూపం క్రమాచ్ఛృణు.

తా. ఈపాశబద్ధులు మూడువిధములుగా నున్నారు. సకలాః, ప్రలయకలాః, విజ్ఞానకేవలాః. ఈలాగు నని.

**అందు సకలుల నేవారిలక్షణము:—**

శ్లో. అనాదిమలసంచ్ఛన్నో మాయాకర్మాన్వితోఽశుచిః,
శరీరశివతత్త్వజ్ఞో భేదైకరసికో లఘుః.
సర్వదా కర్మకర్తా చ స్వకర్మఫలభోజకః,
నిత్యం విషయసంరక్తః సకలః పశురుచ్యత ఇతి.

తా. వీరు పాశత్రయబద్ధులు, పూర్ణమాయాగ్రస్తులుగా నున్నారని చెప్పిరి.

**ప్రలయకలాపశులక్షణము:—**

శ్లో. మిశ్రాప్రమాతృరూపాస్స్యుః ప్రలయాకలసంజ్ఞికాః,
పుర్యష్టకశరీరాశ్చ పృథక్కర్మవశాత్ప్రియే.
సర్వయోనిషు సంపాద్య భోగాద్యం స్వస్వకర్మణాం,
భుక్త్వా భోగాని శేషాణ తు కర్మసామ్యే శివస్స్వయం.
సుపక్వమలకర్మాణ స్తాన్ కించిదనుగృహ్య చ,
జలతత్త్వాది తత్త్వానాం మధ్యేలోకేశ్వరాస్త్రిధేతి.

**విజ్ఞానకేవలాః అణవమలమాత్రబద్ధాః:—**

శ్లో. మలమాత్రేణ సంబద్ధః పశుర్విజ్ఞానకేవలః,
సుపక్వమలవిజ్ఞానకేవల స్స స్వయం ప్రియేతి.

తేపి. సమాప్తకలుషాః, అసమాప్తకలుషా ఇతి. సమాప్తకలుషాః చిద్విద్యారతాః. అసమాప్తకలుషాః చిద్విద్యేతరసప్తకోటిమంత్రరతాః.

**సర్వపాశపరిహారః.**

శ్లో. అథానాదిమలాపేత స్సర్వకృత్సర్వదృక్శివః,
పూర్వం వ్యత్యాసితస్యాణోః పాశజాలం వ్యపోహతీతి.

**ఆగమికా అపి:—**

శ్లో. భుక్తిం ముక్తిమథాణూనాం స్వవ్యాపారే సమర్థానాం,
జడవర్గస్య విధత్తే సర్వానుగ్రాహకశ్శంభుః.

శ్రు. జాగ్రత్స్వప్నసుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే,
తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా సర్వబంధైః ప్రముచ్యతే.

**శ్రుత్యంతరే:—**

భిద్యతే హృదయగ్రంథి శ్ఛిద్యంతే సర్వసంశయాః,
క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే.
న నిరోధో న చోత్పత్తిర్న బంధో న చ సాధనం,
న ముముక్షు ర్న వై ముక్త ఇత్యేషా పరమార్థతా.
దేహాత్మజ్ఞానవద్జ్ఞానం దేహాత్మజ్ఞానబాధకం,
ఆత్మన్యేవ భవేద్యస్య స నేచ్ఛన్నపి ముచ్యత ఇతి.

**త్రివిధమలశోధనార్థం తత్త్వాచమనవిధిః.**

౧. ఐం. ఆత్మతత్త్వం-అణవమలశోధనార్థం-స్థూలదేహం పరిశోధయామి స్వాహా.

౨. క్లీం. విద్యాతత్త్వం - మాయికమలశోధనార్థం సూక్ష్మదేహం పరిశోధయామి స్వాహా.

3. సౌః. శివతత్త్వం - కార్మికమలశోధనార్థం కారణదేహం పరిశోధయామి స్వాహా. ఇతి తత్త్వాచమనం.

శ్రు. పాదోఽస్య విశ్వాభూతాని - త్రిపా దస్యామృతం దివీతి, ఈశ్రుతివలన నీ అవిద్యాపాదము మాత్రము మాయాశబలితమనియు, తక్కిన పాదత్రయమును శుద్ధబ్రహ్మస్వరూపమనియు తెలియుచున్నది.

శ్లో. భూమౌ స్ఖలితపాదానాం భూమిరేవావలంబనం,
త్వయి జాతాపరాధానాం త్వమేవ శరణం శివే.

ఇది శ్రీమత్త్రిపురసుందరీ పరాభట్టారికాముఖ పంకజాయత్న నిస్సరితంబును, కామేశ్వరీ అపరావతారులును, స్వరూపజ్ఞాననిష్ఠులును, నిగమాగమరహస్య సకలసంకేతాభిజ్ఞులును, సమయాచారపరులునగు పుణ్యానందమునీంద్రవిరచితంబగు కామకలావిలాస సూత్రపంచ పంచాశతి యనెడి ఆత్మవిద్యాప్రతిపాదకమైన యీమూలగ్రంథమందలి బ్రహ్మాండ పిండాండ శ్రీవిద్యా శ్రీచక్రాదిసృష్టిక్రమంబును, తత్త్వవిచారణయు, అష్టవిధపాశస్వరూపముగల అవిద్యాపాదమను ప్రథమ పాదమునకు శ్రీమత్పదవాక్యప్రమాణోభయభాషాప్రవీణ సమయాచార తత్పరుండును, శ్రీమత్త్రిపురసుందరీ ప్రసాదలబ్ధప్రతిభాసమేతుండును, కృష్ణయజుర్వేద షడశీతిశాఖాంతర్గత తైత్తిరీయశాఖాన్వితాపస్తంబ సూత్ర కౌశికసగోత్రుండును, వేగినాడీసముద్భవుండును, జగత్ప్రసిద్ధ ప్రయాగక్షేత్రనివాసియు, సింహాంభట్ల భాగీరథీరామేశ్వర ద్వితీయ పుత్రుండును, జ్ఞానానందనాథేతి దీక్షానామాంకిత రామమూర్తివిద్వద్విరచితంబగు రహస్యార్థబోధినియను నాంధ్రభాషా టీక యనే అవిద్యా పాదము.

సంపూర్ణము.



ఓం

# విద్యాపాదప్రారంభము

## మంత్రసంకేతము

౧౧ సూత్రము.

**మూ.** బిందు ద్వితయం యద్వద్భేదవిహీనం పరస్పరం తద్వత్,
విద్యాదేవతయోరపి న భేదలేశో ఽస్తి వేద్యవేదకయోః.

అ. యద్వత్ = ఏలాగున, బిందుద్వితయం = రక్త, శుక్లస్వరూప మయిన రెండుబిందువులును, పరస్పరం = అన్యోన్యమును, భేదవిహీనం= భేదములేనిదో, తద్వత్ = అటులనే, విద్యాదేవతయోరపి = మంత్రదేవత లకును, వేద్యవేదకయోః = దేవతోపాసకులకును, భేదలేశో ఽపి = ఈషద్భేదమయినను, నాస్తి = లేదు.

విశేషార్థము:—ఇదివఱకు ప్రకాశవిమర్శాత్మక రక్తశుక్లబిందు స్వరూపబ్రహ్మవస్తువుచేతనే సర్వమును సృజింపఁబడినదని చెప్పఁబడెను. అందువలన నా బిందుద్వయమునకు భేదములేదని తెలియుచున్నది. ఆ బిందుద్వయదృష్టాంతముచే మంత్రదేవతలకును, దేవతోపాసకులకును భేదములేదని యిచట నిప్పుడు చెప్పఁబడుచున్నది.

వేద్యము త్రిపురసుందరీదేవి, వేదకము పంచదశీమంత్రము. ఇవే విద్యాదేవతలు, వాచ్యవాచకములుగా నున్నవి గాన మంత్రదేవత లకు భేదములేదు.

శ్లో. సర్వే వర్ణాత్మకా మంత్రా స్తే చ శక్త్యాత్మకాః ప్రియే,
శక్తిస్తు మాతృకా జ్ఞేయా మాతృకాతు శివాత్మికేతి.

ఈ మొదలగు వచనములచేత సకలవిద్యలకును, సకలవేదాది శబ్ద ముల యుత్పత్తికిని, మూలకారణమయిన అహమనే వర్ణద్వయమధ్య గత పంచాశద్వర్ణాత్మక మాతృకయేగాన నా అహమనునదియే శక్తి స్వరూపము గాన మంత్రదేవతలకు భేదములేదని చెప్పిరి.

**విద్యావిద్యలవివరము.**

శ్రు. విద్యాం చావిద్యాం చ య_స్తద్వేదోభయగ్ం సహ,
అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయాఽమృత మశ్నుత ఇతి.

**ఈశావాస్య.**

తా. విద్యావిద్యలను రెంటిని తెలుసుకొని, అవిద్యవలన మృత్యువును దాటి, విద్యవలన అమృతత్వమును పొందుచున్నాఁడు. అవిద్యవలన మృత్యుతరణ మెట్టిదనిన; ఆశ్రమధర్మ విహితములయిన అగ్నిహోత్రాది కర్మలను, కామ్యముతో చేసినపుడు అవిద్యాపాశబద్ధుఁడగుచున్నాఁడు. ఈస్వరూపమును తెలుసుకొని నిష్కాముఁడయి విహితకర్మల నాచరించువాఁడు అవిద్యయనే మృత్యువు నతిక్రమించినవాఁడగును. ఇక విద్యచేతను (దేవతాత్మైక్య జ్ఞానముచేతను) అమృతం = జననమరణధర్మరహితమయిన దేవతాత్మభావమును పొందుచున్నాఁడని తాత్పర్యము.

శ్రు. ద్వే విద్యే వేదితవ్యే ఇతి హస్మయద్బ్రహ్మవిదో వదంతి-పరా చైవాపరాచ, తత్రాపరా ఋగ్వేదాదివిద్యారూపిణీ, పరా, యయా తదక్షర మధిగమ్యతే ఇతి.

**ముండకోపనిషత్.**

విద్యా-స్వాత్మరూపం జ్ఞానం, అవిద్యా-భేదభ్రాంతిరూపం జ్ఞానం:—

శ్లో. తస్య శ_క్తి పరా విష్ణో ర్జగత్కార్యపరిక్షమా,
భావాభావస్వరూపా సా విద్యావిద్యేతి గీయతే.
బ్రహ్మైవ సా ఽతిదుష్ప్రాపా విద్యావిద్యాస్వరూపిణీతి.
విద్యావిద్యేతి దేవ్యా ద్వే రూపే జానీహి పార్థివ,
ఏకయా ముచ్యతే జంతు రన్యయా బధ్యతే పున రితి.

**బృహన్నారదీయే.**

లైంగ్యే:—

భ్రాంతి ర్విద్యా పరం చేతి శివరూపమిదం త్రయం,
అర్థేషు భిన్నరూపేషు విజ్ఞానం భ్రాంతి రుచ్యతే.
ఆత్మాకారేణ సంవి_త్తి ర్బుద్ధే ర్విద్యేతి కథ్యతే,
వికల్పరహితం త_త్త్వం పర మిత్యభిధీయత ఇతి.

మోక్షప్రదజ్ఞానరూపత్వాద్విద్యా; ఉక్తం చ శైవతంత్రే:—

శ్లో. మాయాకార్యవివేకేన వేత్తి విద్యాపదం యదా,
సా కలా పరమా జ్ఞేయా విద్యాజ్ఞానక్రియాత్మికేతి.

విద్యా నామ శ్రీవిద్యైవ. ఉక్తం చ బ్రహ్మాండపురాణే:—

శ్లో. న శిల్పాదిజ్ఞానయుక్తే విద్వచ్ఛబ్దోఽభియుజ్యతే,
మోక్షైకహేతుర్విద్యా వా యస్య విద్యానితీర్యతే.
మోక్షైకహేతుర్విద్యాతు శ్రీవిద్యా నాత్ర సంశయః.
విద్యావిహీనః పశురితి. సర్వే జీవాః పశవ ఏవ. లైంగ్యే:—
బ్రహ్మాద్యా స్థావరాంతాశ్చ దేవదేవస్య శూలినః,
పశవః పరికీర్త్యంతే సమస్తాః పశువృత్తయః. తత్రైవ.
చతుర్వింశతి తత్త్వాని మాయాకర్మగుణా ఇతి,
విషయా అపి కీర్త్యంతే పాశా జీవనిబంధనాత్.
తైర్బద్ధా శివభక్త్యైవ ముచ్యంతే సర్వదేహిన ఇతి.

**విష్ణుపురాణే:—**

యజ్ఞవిద్యా మహావిద్యా గుహ్యవిద్యా చ శోభనే,
ఆత్మవిద్యా చ దేవి త్వం విముక్తిఫలదాయినీతి.

**రహస్యాగమే:—**

ధ్యానైకదృక్ స్యాద్ జ్ఞానాంగీ విద్యాత్మా హృదయాస్పదా,
ఆత్మైక్యానుక్తిమాయాతి చిరానుష్ఠానగౌరవాత్. ఆపస్తంబః.
న శబ్దశాస్త్రాభిరతస్య మోక్షో న చైవ రమ్యావసథప్రియస్య,
ఏకాంతశీలస్య దృఢవ్రతస్య మోక్షో భవేత్ప్రీతినివర్తకస్య.
యః ప్రాప్తః పృశ్నిభావం వా యది చా శంకరస్స్వయం,
తేనైవ లభతే విద్యా శ్రీమత్పంచదశాక్షరీతి.
తంత్రేషు బహుధా శ్రీవిద్యాయాః మహిమోచ్యతే.

తా. పైనచెప్పిన శ్రుతిస్మృతులవలన ప్రథమసూత్రమందు చెప్పిన ప్రకాశాంతర్గత విమర్శశక్తియే సంవిద్రూప విద్యాపదవాచ్యము

గాను, అందు ప్రతిబింబించినదియు, నా ప్రతిబింబకారణభూతాశ్రయ మును, మాయారూపములయినందున సకలజగత్కార్యనిర్మాణశక్తిగల మూలప్రకృతియే అవిద్యయనియు, విద్య ఆత్మస్వరూపముగను, దేహేంద్రియజగదాదులు అవిద్యాస్వరూపములుగను తెలియుచున్నది.

**అవిద్యాలక్షణము.**

**ముండకోపనిషత్ :—**

శ్రు. అవిద్యాయామంతరే వర్తమానాః, స్వయంధీరాః పండితం మన్యమానాః, పర్యంతి మూఢా అంధేనైవ నీయమానా యథాంధాః.

**ఈశావాస్య:—**

శ్రు. అంధంతమః ప్రవిశంతి యేఽవిద్యాముపాసతే,
తతో భూయ ఇవ తమో య ఉ విద్యాయాగ్ రతాః.

శ్రు. ఇంద్ర మగ్నిం చ యే విదుః సికతా ఇవ సంయంతి రశ్మిభిస్సముదీరితాః, అస్మాల్లోకా దముష్మాచ్చ.

**ఉపదేశవిషయము.**

**ఛాందోగ్య:—**

శ్రు. ఆచార్యవాన్ పురుషో వేద తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యేఽదసంపత్స్యత ఇతి.

తా. ఏపురుషుఁడు సద్గురువువలన తత్త్వోపదేశమును, (పరోక్షాపరోక్షజ్ఞానజనకములయిన మహావాక్యములను తదర్థమును) ఉపదేశమును పొందుచున్నాఁడో ఆపురుషుఁడు ఆకాలమందే అవిద్యాముక్తుఁడగుచున్నాఁడనియు, అట్టి ఉపదేశరహితుఁడు అవిద్యాముక్తిని పొందలేఁడని తాత్పర్యము.

**బృహదారణ్యకే:—**

శ్రు. ఇహైవ సంతోఽథ విద్మ స్తద్వయం న చేదవేదీ న్మహతీ వినష్టిః,
యఏత ద్విదు రమృతా స్తే భవంత్య థేతరే దుఃఖమేవాపి యాంతీతి.

తా. దుర్లభమయిన యీ బ్రాహ్మణజన్మ కలిగినప్పుడే పరోక్షాపరోక్షజ్ఞానములను తెలుసుకొనవలెను. లేనియెడల గొప్పనష్టము కలదు. కాన నెవరు ఈపరోక్షాపరోక్షజ్ఞానములను గురువులవలన తెలుసుకొనుచున్నారో, వారు బ్రహ్మతత్త్వమును పొందుచున్నారు. లేనివారు దుఃఖపరంపరను పొందుచున్నారు.

**తలవకారము:—**

శ్రు. ఇహాచే దవేదీ దథ సత్య మస్తి నచేదిహావేదీ న్మహతీ వినష్టిః, భూతేషు భూతేషు విచింత్య ధీరాః ప్రేత్యా స్మాల్లోకా దమృతా భవంతీతి.

కేనోపనిషత్.

తా. జననమరణములతోఁ గూడిన దేహాదులును, ప్రపంచమును, మాయాస్వరూపములనియు; బ్రహ్మవస్తువు, త్రికాలాబాధ్యము, సత్యస్వరూపము, పరమాత్మ యని యీశరీరమందుండఁగనే గురుముఖతః తెలుసుకొని సకలభూతములందును పరమాత్మను చూచువాఁడు జీవన్ముక్తుఁడగునని యీశ్రుతితాత్పర్యము.

శ్రు. పరీక్ష్య లోకా న్పుణ్యచితాన్ బ్రాహ్మణో నిర్వేద మాయా న్నాస్త్యకృతః కృతేన, తద్విజ్ఞానార్థం సగురు మేవాభిగచ్ఛే త్సమిత్పాణి శ్శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్.

ముండకోపనిషత్.

తా. బ్రాహ్మణుఁడు దుష్కర్మఫలములచేత క్లేశములను పొందుచున్నజనులను చూచి పశ్చాత్తాపముగలవాఁడై లోకమందు విరక్తి కలిగి జనుఁడు కర్మలచేత తరించలేఁడనియు, జ్ఞానముచే ముక్తుఁడు కావలెననియు తెలుసుకొని, అట్టి జ్ఞానము నుపదేశమును పొందుటకై సమిధను మాత్రము హస్తమందు ధరించి, శ్రోత్రియుఁడును బ్రహ్మనిష్ఠుఁడునగు సద్గురువును గురించి వెళ్లవలెనని యీశ్రుతి చెప్పుచున్నది.

గురులక్షణము.

బోధసారే:—

తత్త్వద్వివేకవైరాగ్యయుక్తవేదాంతయుక్తిభిః,
శ్రీగురుః ప్రాపయత్యేవ సపద్మ మపి పద్మతాం.
ప్రాపయ్య పద్మతా మేనం ప్రబోధయతి తత్క్షణాత్,
తస్మా త్సర్వప్రయత్నేన సేవ్యశ్శ్రీగురుభాస్కరః.
గురుదేవపరాశక్తిరీశ్వరానుగ్రహాత్మికా,
అవకాశ ప్రదానేన సైవ యాయా దుపాయతాం.

తా. బ్రహ్మస్వరూపపరదేవత తనకు మార్గమును(అంతర్ముఖత్వాది జ్ఞానసాధనములను) గలుగఁజేయుటకై గురురూపమును పొంది తనకు ప్రాప్తించినదని తలంచవలెను.

శ్లో. అకృత్రిమాహమామర్శ స్వరూపాద్యంతవేదనాత్,
పరమేష్టిసమత్వేన పరమోపాయతా గురోః.

తా. లోకమందు వేదశాస్త్రాదివిద్యలను, చిద్విద్యేతరమంత్రముల నుపదేశించువారును గురువులని చెప్పఁబడుదురు గాని నిజమగు గురువులుకారు. ఎవరు అహమనే ప్రకాశవిమర్శాత్మకమయిన వర్ణద్వయమనే ఈయాత్మమంత్రముయొక్క మంత్రవీర్యమును, ఈవర్ణద్వయముయొక్క ఉత్పత్తిని, లయమును, పరోక్షాపరోక్షజ్ఞానద్వయమును ఉపదేశింతురో వారు ఈశ్వరతుల్యులనియు, అట్టివారే యథార్థముగ గురువులనియు, మోక్షప్రదులనియు తాత్పర్యము.

శ్లో. గురో ర్లక్షణ మేతావ దాదిమాంత్యం నివేదయేత్,
సగురు ర్మత్సమః ప్రోక్తో మంత్రవీర్యప్రకాశకః.
ఆదిమధ్యాంతహీనాస్తు మంత్రా స్స్యు శ్శరదభ్రవత్.

తా. తా ముపదేశించిన మంత్రార్థమును, ఆమంత్రోత్పత్తి లయములను చెప్పినవారు తనతో సమానులని ఈశ్వరవాక్యము. ఆది మధ్యాంతములు తెలియని మంత్రములు శరత్కాలమేఘమువంటివి. ఫలముల నీయఁజాలవు.

౧౨ వ సూత్రము, త్రిపుట్యావిర్భావము. బీజత్రయోత్పత్తి.




మూ. వాగర్థౌ నిత్యయుతౌ పరస్పరం శక్తిశివమయావేతౌ,
సృష్టిస్థితిలయభేదౌ త్రిధా విభక్తౌ త్రిబీజరూపేణ.

అర్థము. ఏతౌ=పూర్వోక్తరక్తశుక్లబిందువులు, త్రిధా విభక్తౌ= మూడుభాగములుగా విభజింపఁబడినవయి, త్రిబీజరూపేణ = వాగ్భవకామరాజశక్తిబీజరూపముచేతను, సృష్టిస్థితిలయభేదౌ = సృష్టిస్థితిలయములనే భేదముకలవై, వాగర్థౌ=వాగర్థరూపములయి, పరస్పరం= అన్యోన్యమును, నిత్యయుతౌ = సర్వదా మేళనస్వరూపముగలవై, స్యాతాం = అగుచున్నవి.

రహస్యార్థము:—ప్రకాశ విమర్శాత్మకమయిన అన్యోన్య మేళన రూపమగు వేదాదిద్వంద్వము స్వేచ్ఛచేతనే మూఁడువిధములుగా భేదము పొందెనని వివరించుచున్నారు.

ఆప్రకాశవిమర్శబిందువులు ప్రపంచావిర్భావపరిపాలనలయములు గలవి. నిత్యయుతములు. వాగర్థరూపములని చెప్పినందున పైని చూపించిన పరిలేఖనమందుఁగల మధ్యబింఁదువు ప్రకాశవిమర్శాత్మకముగా నున్నది. అదియే ఆత్మ (సృష్ట్యాదివస్తువు) అందు శివశక్తులనే

వస్తుద్వయమేళనము గలదు. అది భావిసృష్టికి కారణము. సృష్టికొఱకు స్వేచ్ఛచే సత్వరజస్తమస్సులనే గుణత్రయరూపములను పొందినది. అవియే కోణబిందువులుగా నున్నవి. ఆకోణబిందువులు త్రిగుణమయ రూపములుగాను, వాగ్భవకామరాజశక్తిబీజములుగాను, అందు ప్రతి బిందువునందును ప్రకాశవిమర్శశక్తు లిమిడియున్నందున వాణీ హిరణ్య గర్భ ద్వంద్వమును, లక్ష్మీనారాయణద్వంద్వమును, ఉమామహేశ్వర ద్వంద్వమును అయియున్నవి. ఇక ఈ కో॥ బిందుత్రయమే సృష్టిలో ప్రధానవస్తువులగు చంద్రాగ్ని సూర్యమండలముల కాస్పదమైనది. వీని వలన ఆకాశాదిపంచభూతములును, వాటివలన శాఖోపశాఖలుగా సృష్టి అంతయు పెరిగినది.

ఈ యోనిచక్రము అవ్యక్తస్వరూపము. అనఁగా మధ్యనున్న సంవిద్బిందుప్రభ సృష్ట్యావిర్భావకాలమందు ఈ త్రిరేఖాకారమును పొందినది. మధ్యబిందువందు లీనమయియున్న శబ్దబ్రహ్మస్వరూప మయిన పంచాశద్వర్ణాత్మక మాతృక ఒక్కొకరేఖయందు ౧౬ వర్ణ ములుగా మూడు రేఖాకారములును పొంది అస్ఫుటవర్ణములు కలిగి యున్నది. కోణబిందువులయందు హ-ళ-క్ష అను ఈవర్ణములు కలది గాన అవ్యక్తనామము కలవి. క్రమముగా విశుద్ధాదికమలరూపమును పొందినపుడు వ్యక్తమాతృకయగును.

శ్రుతి. అజా మేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీం ప్రజాం జన యంతీగ్ం సురూపాం.

**శ్రుత్యంతరం, నృసింహోత్తరతాపిన్యామ్:—**

ఏషా మాయా స్వావ్యతిరిక్తాని పూర్ణాని క్షేత్రాణి దర్శయిత్వా జీవేశావాభాసేన కరోతి. మాయా చావిద్యా చ స్వయమేవ భవతి సైషా చిత్రా సుదృఢా బహ్వంకురా అంకురేష్వపి గుణభిన్నా సర్వత్ర బ్రహ్మ విష్ణు శివరూపిణీ చైతన్యదీప్తా తస్మా దాత్మన ఏవ త్రైవిధ్యం సర్వత్ర యోనిత్వమితి.

**తదుక్తం దేవీపురాణే:—**

శ్లో. త్రికోణం మండలం చాస్యాః భూపురం చ త్రిరేఖగమ్,
మంత్రోఽపి త్ర్యక్షరః ప్రోక్తః తథా రూపత్రయం పునః.

త్రివిధా కుండలీశక్తిః త్రిదేవానాం చ సృష్టయే,
సర్వత్రాపి త్రయం యస్మా త్తస్మాత్తు త్రిపురా మతేతి.
త్రీణి పురాణి-త్రిబిందురూపాణి యస్యా స్సా త్రిపురా.

**విష్ణుపురాణే:—**

యోగేశ్వరీ శరీరాణి కరోతి వికరోతి చ,
నానాకృతిక్రియారూపానామవృత్తిస్వలీలయా.
త్రిధా యద్వర్తతే లోకే తస్మాత్సా త్రిగుణోచ్యతే.

**వాయుపురాణే:—**

సర్వభూతేషు సర్వాత్మన్యా శక్తి రపరా తవ,
గుణాశ్రయా నమ స్తస్యై శాశ్వతాయై సురేశ్వరీతి.

**కాళికాపురాణే: —**

శ్లో. ప్రధానేచ్ఛావశాచ్ఛంభోశ్శరీరమభవత్త్రిధా,
తత్రోర్ధ్వభాగస్సంజాతః పంచవక్త్రాచ్చతుర్ముఖః,
పద్మకేసరగౌరాంగః కాయో బ్రాహ్మో మహేశ్వరీ.
తన్మధ్యభాగో నీలాంగః ఏకవక్త్ర శ్చతుర్భుజః,
శంఖచక్రగదాపద్మపాణిః కాయ స్స వైష్ణవః.
అభవత్తదధోభాగే పంచవక్త్రశ్చతుర్భుజః,
స్ఫటికాభ్రమయశ్శుక్లః సకాయ శ్చంద్రశేఖరః.

**నామరూపములను గురించి.**

"వాగర్థౌ నిత్యయుతౌ పరస్పరం శక్తిశివమయా వేతౌ" అని మూలమునం దున్నందున వాగర్థములు ప్రకాశవిమర్శాంశములుగా నున్నవి. ఆరెండును నామరూపములుగా నున్నవి. ఇందు రూపము చతుర్వింశతత్త్వాత్మకము. నామము పంచాశద్వర్ణాత్మకము. ఈరెంటి కిని కారణము మధ్యబిందువు. ఆబిందువికసనమువలన నాదము, నందు వలన కలలు నుత్పన్నమయినందున సర్వదా యీనామరూపములు నిత్యయుతములుగా నున్నవి.

**మాతృకావివేకే:—**

స్వాభావికీ స్ఫురత్తా విమర్శరూపాఽస్య విద్యతే శక్తిః,
సైవ చరాచరమఖిలం జనయతి జగదేతదపి చ సంహరతే.

వాచకేన విమర్శేన వినా కింవా ప్రకాశ్యతే,
వాచ్యేనాపి ప్రకాశేన వినా కిం వా విమృశ్యతే,
తస్మాద్విమర్శే విస్ఫూర్తౌ ప్రకాశం సమపేక్షతే,
ప్రకాశశ్చాత్మనో జ్ఞానే విమర్శం సమపేక్షత ఇతి.

శ్రు. అస్తి భాతి ప్రియం రూపం నామ ఇత్యంశపంచకం,
ఆద్యత్రయం బ్రహ్మభాగం నామరూపాత్మకం జగదితి.

**షడధ్వలవివరము.**

తదుక్తం ప్రపంచసారే:—

శ్లో. అస్య విమర్శస్య గుణాః పదమంత్రార్ణాత్మకస్త్రిధా భవతి,
పురతత్త్వకలాధ్వోఽర్థః ధర్మిణ ఇత్థం ప్రకాశస్యేతి.

తా. కలాతత్త్వభువనాధ్వలు ప్రకాశాంశములుగాను వర్ణపద మంత్రాధ్వలు విమర్శాంశమునుగాను ఉన్నవి. ఇందు ప్రకాశాంశములును రూపమును తెలుపుచున్నవి. విమర్శాంశములు నామమును తెలుపుచున్నవి గాన జగత్తు నామరూపాత్మకము. ఇవి శివశక్త్యాత్మకమని తాత్పర్యము. సమష్టిని ఏకపదార్థముగా నున్నవని తెలియుచున్నది.

**౧౩-వ సూత్రము విద్యాకూటత్రయనిరూపణము.**

సూ. మాతా మానం మేయం బిందుత్రయబీజభిన్నరూపాణి,
ధామత్రయ పీఠత్రయ శక్తిత్రయ భేదభావితాన్యపి చ.

అ. మాతా=జ్ఞాతయగు పరమేశ్వరుఁడును, మానం=జ్ఞానసాధనభూతమగు పంచదశీవిద్యయును, మేయం = జ్ఞేయభూతమయిన మహాత్రిపురసుందరియును, బిందుత్రయబీజభిన్నరూపాణి = రక్త శుక్ల మిశ్రబిందువులనే వాగ్భవకామరాజశక్తిబీజములు మూడును వేరువేరు రూపములు గలవి, అపిచ=మరియు, ధామత్రయ పీఠత్రయ శక్తిత్రయ భేదభావితాన్యపి చ = సోమసూర్యాగ్ని మండలత్రయమును, కామగిరి పూర్ణగిరి, జాలంధరాఖ్యపీఠత్రయమును, ఇచ్ఛా జ్ఞాన క్రియలనే శక్తిత్రయమును, పృథగ్భావమును పొందినవై, స్యుః=అగుచున్నవి.

తా. వెనుకటిసూత్రమందు వర్ణించిన త్రిపురసుందరీరూపమునే యిచటను ప్రచురించుచున్నారు. గ్రంథాదిని సత్యజ్ఞానానందలక్షణ

ములుగల పరమాత్మను ప్రకాశబిందురూపముగా నిర్దేశించి, యందు సంవిద్రూపిణియగు విమర్శశక్తి అంతర్గతముగా నున్నట్టు చూపించిరి. ఆబిందువికసనమున రక్తశుక్లమిశ్రబిందువు లుత్పన్నములయి కామకలాంగనావయవములుగా నున్నట్టు చెప్పిరి. తరువాత అవిద్యాపాదమందు రక్తశుక్లబిందువులవలన పంచభూతోత్పత్తియయి వాటికార్యవర్గముచే సకలజగన్నిర్మాణమయినట్టు చెప్పిరి.

శ్రు. అధ్యారోపాపవాదాభ్యాం ప్రపంచం నిష్ప్రపంచ్యతేతి. శ్రుత్యంతరం.

అధ్యారోపాపవాదాభ్యాం స్వరూపం నిశ్చయీకర్తుం శక్యతఇతి.

తా. ప్రత్యక్షముగానున్న ప్రపంచముయొక్క ఉత్పత్తిని దాని యథార్థమును తెలుసుకొనిన బ్రహ్మవస్తువునందు జగత్తు మాయచే నారోపింపఁబడినట్టును, తదపవాదచే జగత్తు మిథ్యయని తెలుపుటయు ప్రథమశ్రుత్యర్థము.

అధ్యారోపాపవాదములచేత స్వరూపమును నిశ్చయించవచ్చునని రెండవ శ్రుతివలన తెలియుచున్నది గనుక, అవిద్యాపాదమందు జగద్భావజీవభావము లాత్మయం దారోపితములయినవి. వాని యపవాదకొఱకు నీవిద్యాపాద మారంభించినారు. ఇందు జ్ఞానసాధనమైన చిద్విద్యను నిరూపింపఁదలఁచి చిన్మయములయిన రక్త శుక్ల మిశ్ర బిందువులను భావి పంచదశీవిద్యయొక్క భాగత్రయముగా నున్నవనియు, వాగ్భవకామరాజశక్తిబీజములుగాను, ఇవి పరంజ్యోతిస్వరూపములే యనియు, సత్వ రజ స్తమోగుణములుగాను, మాతృమానమేయములుగాను, చంద్రాగ్నిసూర్యమండలములుగాను, బ్రహ్మవిష్ణురుద్రద్వంద్వములుగాను, పీఠత్రయముగాను, ఇచ్ఛాజ్ఞానక్రియలనే శక్తిత్రయముగ నున్నవని చెప్పిరి.

ఈచరాచరాత్మకమయిన జగత్తు సత్వరజస్తమోగుణములచే వ్యాప్తమయినట్టు శ్రుతిస్మృతులు చెప్పుచున్నవి. పరమాత్మ గుణాతీతుఁడనియు చెప్పుచున్నవి. అందువలన నీగుణముల యపవాదము తెలియుట స్వరూపజ్ఞానమునకు ఆవశ్యకముగా నున్నది. ఈగుణత్రయముయొక్క ఆరోపణ తెలియనిది అపవాదకు శక్యముకాదు గనుక నీగుణము

లెచటనుంచి యుత్పన్నమయినవి ? ఎట్టి స్వభావముకలవి ? ఎచట లయమగునని విచారించుట ఆవశ్యకముగా నున్నది.

**గుణత్రయనిరూపణము.**

శ్రు. ఆత్మా వా ఇద మగ్ర ఆసీత్. శ్రు. సదేవ సౌమ్యేద మగ్ర ఆసీత్, ఏక మేవాద్వితీయం బ్రహ్మ.

ఇత్యాది శ్రుతులవలన ఆదిని ఆత్మయనే బ్రహ్మవస్తువు మాత్రమున్నది.

శ్రు. సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ; సచ్చిదానందం బ్రహ్మ. అదియే ప్రకాశబిందువు. దాని స్వరూపము సత్యము, జ్ఞానము, ఆనందము అను ధర్మములు గలది. బ్రహ్మాండావిర్భావకాలము తటస్థించినపుడు "సోఽకామయత స ఈక్షత" అనే శ్రుతులవలన జగత్సృష్టికి ఇచ్ఛకలిగిన తత్క్షణము ఆకాశమందు మేఘోదయమువలెనే ప్రకాశబిందు ప్రతిఛాయా బింబమనే యొకానొక తమోబింబ మావిర్భవించినది.

శ్రు. నాసదాసీన్నో సదాసీత్తదా ఆసీత్.

తా. అది యెట్టిదనిన: అసత్ న = ప్రథమబిందువుకన్న వేరుగా ప్రత్యక్షముగా మరియొక బిందువగుపడుచున్నందున లేనిది కాదు. సత్ న=సద్వస్తువును కాదు. ఎందువలననఁగా సద్వస్తువు ప్రకాశస్వరూపము నిత్యము. ఇది తమోరూపము. విచారించినపుడు ఛాయాబింబమయినందున శూన్యముగా నున్నది గాన సద్వస్తువు కాదు. అందువలన తమస్సని తెలియఁచున్నది. దీని స్వరూపస్వభావము లెట్టివనిన.

శ్రు. తదేతజ్జడం మోహాత్మకం. ఈతమస్సు జడం - లోష్టశిలాదివత్ జడస్వభావము గలది. మోహామే ఆత్మగాఁ గలది. మోహామనఁగా అజ్ఞానము. వస్తుయథార్థము తెలియకపోవుట విపరీతజ్ఞానము. ఒకవస్తువును మరియొకవస్తువుగా తెలుసుకొనుట అను రెండు ధర్మములు గలది.

ఇటుల ఆత్మ ప్రకాశబిందువుగాను, ప్రతిచ్ఛాయ తమోబిందువుగాను రెండుబిందువు లేర్పడినవి. ఈ తమోబిందువునందు ప్రకాశబిందు తేజస్సంయోగమువలన (ఉభయబిందుమేళనము) మిశ్రబిందువనే

రక్తబిందువు మూఁడవది ఏర్పడినది. హరిద్రాచూర్ణము, శిలాచూర్ణము, కలిసినపుడు రక్తధాతువు కలుగును. నాగవల్లీదళము, ముక్తాచూర్ణము కలసినపుడు రక్తవర్ణము కలుగును. అటువలెనే శుక్ల, తమోబిందు మేళనమువలన రజోబిందు వుత్పన్నమయినది. ప్రకాశబిందు ప్రభ శుక్లబిందువు. అది సత్వగుణమని, తమోబిందువు తమోగుణమని, యుభయమేళనబిందువు రజోగుణమని తెలియుచున్నది. ప్రకాశబిందువునందు విమర్శబిందువు అంతర్భూతముగా నున్నందున నీ గుణత్రయమందును, ప్రత్యేకముగా ప్రతిగుణమందును, ప్రకాశవిమర్శశక్తు లిమిడియున్నవి.

ఈ గుణత్రయము సంకలితమై (అన్యోన్యమేళనమయి) అశ్వత్థవృక్షమందు చూపించిన అవ్యక్తమనేకోణచక్ర ముత్పన్నమయినది.

ఇందు ప్రతిఫలించిన ప్రతిబింబము సాక్షి యనఁబడును. ఇదియే తమస్సర్గమను ప్రథమసర్గముగా నున్నది. ఈ అవ్యక్తము గుణత్రయమేళనవస్తువు. సృష్టికి ప్రథమసాధనము. ఇచ్ఛాజ్ఞానక్రియలనే శక్తిత్రయము ఏకమయిన వస్తువుగాన నిది ప్రకృతియని, మాయయని, అవిద్యయని, ప్రధానమని నామములుగలదిగా నున్నది.

ఇందుగల శుద్ధసత్వోపాధిప్రతిబింబము ఈశ్వరుఁడని,

మాయోపాధి ఆవరణశక్తి యనియు,

రజోగుణోద్రిక్తమయిన మహత్తత్వమనే ఉపాధి ప్రతిబింబము హిరణ్యగర్భ చైతన్యమనియు,

తమోద్రిక్తమైన అహంకారోపాధియందుఁగల ప్రతిబింబము విరాట్టనియు, విష్ణువనియుఁ జెప్పఁబడును.

ఇట్లు బింబము, ఉపాధి, ప్రతిబింబము అను మూఁడును ఒకదానివలన నొకటి కలుగుచున్నవి. ఆత్మయొక్క ప్రథమ ప్రతిబింబము ఈశ్వరుఁడు. అతని ప్రతిబింబము హిరణ్యగర్భుఁడు. అతని ప్రతిబింబము విరాట్టు (విష్ణు). ఇటులనే ఉపాధులును. అవ్యక్తము (అస్పష్టరూపము) వృక్షమునకు బీజమువంటిది. మహత్తత్వము స్పష్టాస్పష్టరూపము కలది. ఇది సూర్యబింబాచ్ఛాదనకు సూక్ష్మమేఘము వంటిది. అహంకారము

సాంద్ర నీలమేఘము వంటిది. స్పష్టమయిన రూపముగలది. ఈ వివర మంతయు పైంగలోపనిషత్తు నుంచి వెనుక అవ్యక్తపాదమం దుదహరింపఁబడినది.

ఈ అహంకారమందు త్రిపుటి ఆవిర్భావమయినది గాన నిచట నీ గుణములు భేదమును పొందినవి. ప్రతిగుణమందును ఆఱుభాగములు కలవు. అందు మూఁడుభాగములు స్వంతము, రెండుభాగములు రెండవగుణము, ఒకభాగము మూఁడవగుణము గలది. ఇట్లు త్రివృత్తాత్మకముగా ప్రతిగుణమందును స్వగుణము అధికముగను, తక్కిన రెండు గుణములు తక్కువగను కలిగియున్నవి. ఈగుణత్రయముచే బ్రహ్మాండ మంతయు నిండియున్నది. ఈ గుణములభాగముల కూర్పునేర్పు పరాశక్తికే తెలియును. కించిద్జ్ఞులమగు మనము కనుగొనఁజాలము.

లోకమందుఁగల సకలప్రాణులలో నొకరూపముతో సరియగు రూపము లేదు. ఒకస్వరమును పోలినస్వరము మఱొకటి లేదు. వృక్షజాతిలో కరవీరము, మల్లిక, గులాబీ, మందారు, కమలము, నీలోత్పలము అను నీజాతులపత్రములు ఇంచుమించుగా నైల్యము కలిగియే యున్నవి. పుష్పములు పరిమళము వేరువేరుగా నున్నవి. అరణ్యమందు పలురంగులుగల పక్షులున్నవి. ఆరంగులచిత్రమునుపోలి మనుష్యులు నిర్మించలేరు. ఇదంతయు నీగుణత్రయ మేళనభేదమువలనఁ గలుగుచున్నది.

త్రిమూర్తులు, వారివారిశక్తులు ఈ గుణములు ప్రధానముగా నున్నారు. రుద్రుఁడు బహిస్సత్త్వము, అంతస్తమము కలిగియున్నాఁడు. విష్ణువు బహిస్తమము, అంతస్సత్త్వముగలవాఁడు. బ్రహ్మ ఉభయత్ర రజోగుణప్రధానుఁడుగా నున్నాఁడు. ఇటులనే పంచభూతములును, వానివలనకలిగిన ఇంద్రియాదులును, ఆయా అధిదేవతలును, గుణమయములుగా నున్నట్లు శ్రుతులచే తెలియుచున్నది.

కాన నీగుణములు మాయాశక్తిస్వరూపములుగా నున్నవి.

శ్రు. తే ధ్యానయోగానుగతా అపశ్యన్ దేవాత్మశక్తిం స్వగుణైర్నిగూఢామితి.

తా. పరమాత్మయందు స్వశక్తి తనగుణములతోఁగూడ ఇమిడి యున్నదని, బ్రహ్మవేత్తలు ధ్యానయోగముచే చూచిరని యీ శ్రుతి వలన తెలియుచున్నది. ఇది బ్రహ్మశక్తిగా నున్నది.

శ్రు. అజా మేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీం ప్రజాం జనయంతీగ్ం సురూపామితి.

"సైషా చిత్రా సుదృఢా బహ్వాంకురా స్వయం గుణభిన్నా అంకు రేష్వపి గుణభిన్నా."

ఈ మొదలగు శ్రుతులచే ప్రతిపాదింపఁబడుచున్నది.

శ్రు. మాయాం తు ప్రకృతిం వింద్యా న్మాయినం తు మహే శ్వరం, అస్యా అవయవభూతే స్తు తాభ్యాం సర్వం ప్రకల్పితమితి.

మాయానిష్ఠమయిన సత్వగుణోపాధియందు గల బ్రహ్మ ప్రతి బింబము ఈశ్వరుఁడు. ఇతఁడు బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివు లనే పంచబ్రహ్మలలో నాలుగవవాఁడు. ఇతనిపైవాఁడు సదాశివుఁడు. ఇతఁడే ఆత్మతత్త్వము. శివశక్తి మేళనవస్తువుగా నున్నాఁడు. ఈ నాలవ వాఁడైన ఈశ్వరుఁడు బ్రహ్మాదులకు నియామకుఁడు. ఇతని ఆజ్ఞాను సారము బ్రహ్మ లోకములను సృజించుచున్నాఁడు. విష్ణువు పరిపాలించు చున్నాఁడు. రుద్రుఁడు సంహరించుచున్నాఁడు. పంచభూతములు, సకల తత్త్వములు, చంద్రాగ్ని సూర్యులు ఇతని ఆజ్ఞానువర్తులు.

శ్రు. భీషా ఽస్మా ద్వాతః పవతే భీషోదేతి సూర్యః,
తమేవ భాంత మనుభాతి సర్వం తస్య భాసా సర్వ మిదం విభాతీతి.

పైనిచెప్పిన శ్రుతులవలన నీశ్వరాదులందఱును త్రిగుణాత్మకు లుగా నున్నారు. ఆగుణత్రయమే వెనుకటిసూత్రమందున్న యోని చక్రమందుగల కోణబిందువులు. ఇవియే శుక్ల, రక్త, మిశ్ర బిందువులు. ఇవే విద్యాబీజత్రయముగా నున్నవి. ఇఁక పంచదశీవిద్యాకూటత్రయ మును వివరించుచున్నారు.

౧౪-వ సూత్రము, త్రిపుటీ ఆవిర్భావము.

మూ. తేషు క్రమేణ లింగత్రితయం తద్వచ్చ మాతృకా త్రితయం,
ఇత్థం త్రితయపురీయా తురీయపీఠా చ భేదినీ విద్యా.

అ. తేషు = ఆధారాదులందు, క్రమేణ = ఆనుపూర్వికగా, లింగ త్రితయం = మూర్తిత్రయమున్ను, తద్వచ్చ = అటులనే, మాతృకా త్రితయం=అ, క, థాది మాతృకాత్రితయమున్ను, ఇత్థం = ఈలాగున, యా = ఏపరాశక్తి, త్రితయపురీ = త్రితయమే స్థానముగాఁగలదిగ్నై, తురీయపీఠా చ = సర్వకారణవస్తువై, భేదినీ = నానాప్రకారోల్లాసము కలదై, విద్యా = అఖండసంవిదాత్మకత్రిపురసుందరిదేవి, స్యాత్ = అగుచున్నది.

తా. ౧౨-వ సూత్రమందున్న పరిలేఖనరూపకోణచక్రమందున్న కోణబిందుత్రయము బీజత్రయమే. ఇచట లింగత్రయము వెనుక చెప్పిన సత్వరజస్తమోగుణత్రయమే మూర్తిత్రయముగా నున్నది. ఇది అవ్యక్తమాత్మక. ౨౦-వ సూత్రమం దిది స్ఫుటమగును. ఇట్లు లోకమందుఁగల త్రిపుటియే అవయవములుగాఁ గలదై మధ్యబిందువగు సంవిద్రూపపరమాత్మయే ప్రపంచావిర్భావతిరోభావ భూమియయి నానాప్రకారోల్లాసము గలదై స్వాత్మయందు ప్రకాశించుచున్న సకలతత్త్వకదంబముగల త్రిపురసుందరీదేవి ప్రకాశించుచున్నదని తాత్పర్యము. ఇట్లు త్రివిధముగానున్న సర్వవస్తువులకును పూర్వముగా నున్నందున పరాశక్తికి త్రిపురానామము ప్రసిద్ధమయినది.

అఖండాకారమయిన పరాశక్తికి నీత్రివిధభేద మెందుకు కలిగెననిన:

శ్రు. చరాచరాత్మకజగ దధిష్ఠానాత్మకం బ్రహ్మైకమేవ. చరాచరభేదేన ద్వివిధం చరం పిండాండం. అచరం బ్రహ్మాండం. అనేకం చ.

**దేవీభాగవతే:—**

శ్లో. యతీనాం మంత్రిణాం చైవ జ్ఞానినాం యోగినాం తథా,
ధ్యానపూజానిమిత్తం హి తనూ స్గృహ్ణాతి మాయయేతి.

**కాళికాపురాణే:—**

మాఙ్గైకా భిన్నరూపేణ కమలాఖ్యా సరస్వతీ,
సావిత్రీ సా చ సంధ్యా చ భూతకార్యస్య భేదతః.

బృహన్నారదీయే:—

శ్లో. ఉమేతి కేచి దాహు స్తాం శక్తిం లక్ష్మీం తథా పరే,
భారతీత్యపరే చైనాం గిరిజేత్యంబికేతి చ.
దుర్గేతి భద్రకాళీతి చండీ మాహేశ్వరీతి చ,
కౌమారీ వైష్ణవీ చేతి వారాహీ చ తథాపరే.
బ్రాహ్మీతి విద్యావిద్యేతి మాయేతి చ తథా పరే,
ప్రకృతిశ్చ పరాచేతి వదంతి పరమర్షయః.

స్మృతిశ్చ:—

ఏకథా బహుధా చైవ దృశ్యతే జలచంద్రవదితి.

౧౫-వ సూత్రము, సూక్ష్మభూతనిరూపణము.

**మూ. శబ్దస్పర్శౌ రూపం రసగంధౌ చేతి భూతసూక్ష్మాణి,**
**వ్యాపకమాద్యం వ్యాప్తం తూత్తరమేవం చ పంచదశ.**

అ. శబ్దస్పర్శౌ = శబ్దస్పర్శములు, రూపం=రూపము, రసగంధౌ= రసగంధములు, ఇతి=ఈలాగున, భూతసూక్ష్మాణి = పంచభూతసూక్ష్మాంశములు, ఆద్యం=మొదటిది, వ్యాపకం=వ్యాపకమనియు, ఉత్తరం = తరువాతది, వ్యాప్తం = వ్యాప్తమనియు, క్రమేణ = ఈక్రమముగా, పంచదశ=పదిహేనుగుణము లగుచున్నవి.

తా. ఈసూత్రము మొదలు మూడుసూత్రములచేత వెనుక చెప్పిన ఆకాశాదిపంచభూతములందుగల గుణవర్ణనద్వారా అక్షర సంఖ్యావిశిష్టమయిన మహామంత్రరాజమయిన శ్రీవిద్యాపంచదశీస్వరూపమును నిరూపించుచున్నారు.

ఆకాశాదిపంచభూతములయందుగల శబ్ద - స్పర్శ-రూప-రస - గంధములు భూతసూక్ష్మాంశములు. ఆదినున్న ఆకాశము వ్యాప్యము. స్పర్శాదులు వ్యాపకములు. ఈక్రమమున వ్యాప్యవ్యాపకభావమును పొంది పదినైదు సంఖ్యగలవిగా నున్నవి. ఎట్లనిన; ఆకాశమందు శబ్దము, వాయువందు శబ్దస్పర్శములు, అగ్నియందు శబ్దస్పర్శరూపములు, జలమందు శబ్దస్పర్శరూపరసములు, పృథివియందు శబ్ద-స్పర్శ-రూప-రస గంధములు నున్నవి. సమష్టిని అయిదుభూతములందుగల సూక్ష్మాంశములు పదినై

దుగానున్నవి. ఈసంఖ్య ననుసరించి భూతసూక్ష్మములే మంత్రవర్ణము లుగా పరిణమించినవి.

**౧౭-వ సూత్రము, శ్రీవిద్యాపంచదశీ ఆవిర్భావము.**

**మూ. పంచదశాక్షరరూపా నిత్యా చైషాహి భౌతికాఽభిమతా,**
**నిత్యాశ్శబ్దాది గుణప్రభేదభిన్నా స్తథాఽనయా వ్యాప్తాః.**

అ. ఏషా=ఈ త్రిపురసుందరీపరాశక్తి ఏ హేతువుచేత, భౌతికా ఽభిమతా = భూతసంబంధమయినదిగా ఇష్టమయినదో (అంగీకరింపఁబడి నదో) అందువలన, పంచదశాక్షరరూపా = పదునైదుబీజములుకలదై, నిత్యా = కూటస్థమహానిత్యయనే కామకలాస్వరూపము గుచున్నది. నిత్యాః = కామేశ్వర్యాదిచిత్రాంతములగు పంచదశనిత్యలును, శబ్దాదిగుణప్రభేద భిన్నాః = శబ్దాదిగుణభేదముచేత అత్యంతభేదముకలవై, తథా = అదే ప్రకారము, అనయా = కూటస్థమయిన షోడశీకలారూపమహానిత్యతో, వ్యాప్తాః = తాదాత్మ్యమును పొందుచున్నవి.

తా. పంచదశీవిద్యకును, ఈవిద్యాధిదేవతయగు త్రిపురసుందరికిని అభేదమును చెప్పుచున్నారు. 'ఏషా భౌతికాఽభిమతా' అని చెప్పినందున వెనుకసూత్రమందు భూతసూక్ష్మములు అయిదును మంత్రబీజములుగా పరిణమించినవని చెప్పిరి గాన, అందువలన నీమంత్రబీజములు పదియయి దును కామేశ్వర్యాదిచిత్రాంతములగు పంచదశనిత్యాదేవతలుగా నున్న వనియు, ఇవి ధ్రువకలయయిన షోడశీకలవలన ఉత్పన్నములయినందున, తిరిగి నాకలయందు తాదాత్మ్యమును పొందుచున్నవనియు తాత్పర్యము.

**రహస్యార్థము:—**

శ్రు. తస్మా ద్వా ఏతస్మా దాత్మన ఆకాశ స్సంభూత ఇతి.

తైత్తిరీయే.

ఇందు 'తస్మాద్వా ఏతస్మా' దనినందున ఆత్మవలన అవ్యక్తము, దాని వలన మహత్త్వము, అందువలన అహంకారము నీమూఁడును క్రమ క్రమముగా ఒకదానివలన నొకటి బింబప్రతిబింబములుగా జనించినవి. ఇందు ఆత్మ నిర్గుణము, నిరంశము, నిత్యము. అందువలన కలిగిన అవ్య క్తము గుణత్రయసంవలితము. (మిశ్రరూపము) అందువలన కలిగినమహ

త్తత్త్వము స్పష్టాస్పష్టశరీరము కలది. అందువలనఁ గలిగిన అహంకారము స్పష్టమయిన రూపముగలది. ఇది గుణత్రయవిభాగమును పొందినది గాన నిచట త్రిపుటి ఉత్పన్నమయినది. సర్వకారణమయిన ఆత్మవలననే యీఅవ్యక్త, మహత్తత్త్వాహంకారములు కలిగినందున నీ నాలుగు బిందువులకు ఆత్మయని సంకేతము. ఇదియే తురీయకూటముగా నున్నది. ప్రథమమందున్న ఆత్మవలనను, స్పష్టశరీరముగల అహంకారమువలనను ఆకాశ ముత్పన్నమయినది. అందు వాయువు, అం దగ్ని, అందు జలము, అందు పృథివి యిట్లు క్రమముగా నుత్పన్నమయినవి. ఇవి శబ్దస్పర్శాది పంచదశగుణములుగలవి. వీనివలన క్రమక్రమముగా అనేకవస్తువు లుత్పన్నములయి, తిరిగి యథాక్రమముగా వికసించిన చిత్రపటము సంకోచమును పొందినభంగి అవ్యక్తమందు లీనమగును. అది ఆత్మయందు లీనమగునని పైశ్రుతివలనఁ దెలియుచున్నది.

ఇందువలన ప్రథమకారణమయిన ఆత్మయే మహానిత్య. అదియే ధ్రువకలగాను షోడశీకలగా నున్నది. దానివలన కలిగిన పంచభూత సూక్ష్మాంశములు పంచదశమంత్రవర్ణములు. అవియే కామేశ్వర్యాదిపంచదశనిత్యాదేవతలు. ఆత్మయందు గలిగినగుణములు, భూతములు ఆత్మయందు లీనమగుచున్నవి గాన, నీ నిత్యలును వానికి స్థానమయిన మహానిత్యయందు లీనమగుచున్నవి. "షోడశకలః పురుషః" పురుషుండు పదియాఱుకలలు గలవాఁడని యీశ్రుతివలనఁ దెలియుచున్నది. ఉపనిషత్తులందు ఆత్మావ్యక్తములకు పురుషప్రకృతులని వాడుక. "పూర్షు=స్థూల-సూక్ష్మ-కారణ కారణశరీరేషు తిష్ఠతీతి పురుషః" శరీరత్రయమందుండియు, అస్పర్శముగల సాక్షిస్వరూపియగునాత్మ పురుషుఁ డనిపించుకొనును.

శ్రు. వేదాహమేతం పురుషం మహాంతం, ఆదిత్యవర్ణం తమసః పరస్తాదితి. అసంగో హ్యాయం పురుషః. అసంగో నహి సజ్యత ఇతి, అసంగో హ్యయమాత్మేతి. బృహదారణ్యకే.

ఇందువలన సహస్రారాంతర్గత షోడశకలాత్మక చంద్రమండలము ఆత్మయని తెలియవచ్చుచున్నది. అందున్న ధ్రువకల సాక్షిగాను వృద్ధిక్షయరహితమయిన పదియాఱవకల సాదాఖ్యకల (ధ్రువకల) యనియు,

అందువలన పంచదశకళలు ఉత్పన్నమయి వృద్ధిక్షయములు గలిగి పంచదశనిత్యలుగా నున్నవనియు, నవియే పంచదశీమంత్రవర్ణములుగాను, ఆవర్ణములు భూతపంచకము, జ్ఞానేంద్రియపంచకము, అవ్యక్తమహత్తత్త్వాహంకారములును, జీవేశ్వరులు, నీపదియ యిదువస్తువులుగానుండి షోడశీకలయగు ఆత్మరూపమహాత్రిపురసుందరియందు తిరిగి తాదాత్మ్యమును పొందుచున్నవని ఆగమరహస్యము. ఇందువలన మంత్రదేవతలకును, నిత్యాదేవతలకును, త్రిపురసుందరికిని, జీవేశ్వరసాక్షులకును, బింబప్రతిబింబకారణధర్మము కలుగుటవలన భేదము లేదు.

### శ్రీవిద్యాపంచదశీ ఉద్ధారము.

**ఋగ్వేదే త్రిపురోపనిషది:—**

శ్రు. కామో యోనిః కమలా వజ్రపాణి ర్గుహాహసామాతరిశ్వాభ్రమింద్రః, పునర్గుహాకమలామాయయా చ పురూచ్యేషా విశ్వమాతాఽఽదివిద్యా.

తా. గాయత్రీపాదచతుష్టయమువలన శ్రీవిద్యాపంచదశీ బీజములు ఉత్పన్నమగుచున్నవి గాన ముందు తెలియుచున్నది. అందువలన నీశ్రుతివలనను అవియే గ్రహించదగినవి గాన నిచట నీశ్రుతిసంకేతము వివరించలేదు.

### గాయత్రీచిద్విద్యల కభేదము.

శ్లో. తద్జ్ఞానార్థ ముపాయా విద్యా లోకే చతుర్దశ ప్రోక్తాః,
తేష్వపి చ సారభూతా వేదా స్తత్రాపి గాయత్రీ.
తస్యా రూపద్వితయం తత్రైకం యత్ప్రసిద్ధ్యతే స్పష్టం,
వేదేషు చతుర్ష్వపి పరమత్యంతం గోపనీయతర మితి.

తా. ఆత్మజ్ఞానమును తెలుసుకొనుటకు లోకమందు చతుర్దశవిద్యలుత్పన్నమయినవి. వానిలో వేదములు సారభూతములు. అందుగాయత్రి సారము. అది రెండు రూపములు గలది. అందు ఒకటి సకలబ్రాహ్మణోపాసనలోనున్న ద్వాత్రింశదక్షరరూపమయినది. రెండవది వేదములందు బహుగుప్తముగా నున్నది. అదియే శ్రీవిద్యాపంచదశిగా నున్నది గాన గాయత్రీపంచదశీవిద్యలకు భేదములేదు. గాయత్రీపంచదశీవిద్యలు రెండును పరాశక్తిశరీరములుగా నున్నవి.

**చతుర్దశవిద్యలవివరము.**

శ్లో. పురాణన్యాయమీమాంసా ధర్మశాస్త్రాంగమిశ్రితాః,
వేదా స్థానాని విద్యానాం ధర్మస్య చ చతుర్దశేతి.

యాజ్ఞవల్క్యః.

శ్లో. అంగాని వేదాశ్చత్వారః మీమాంసా న్యాయవిస్తరః,
ధర్మశాస్త్రం పురాణం చ విద్యా హ్యేతాశ్చతుర్దశేతి.

మనుః.

**పూర్ణగాయత్ర్యాపంచదశీఉద్ధారః.**

**త్రిపురాతాపిన్యాం:—**

శ్రు. అథైతస్య పరం గహ్వరం వ్యాఖ్యాస్యామో మహామనుసంభవః. తదితి బ్రహ్మశాశ్వతం, పరో భగవాన్ నిష్కళో నిరంజనో నిరుపాధి రాధిరహితో దేవః ఉన్మీలతే పశ్యతి వికాసతే చైతన్యభావం కామయతఇతి స ఏకో దేవశ్శివరూపే దృశ్యత్వేన వికాసతే యతిషు యజ్ఞేషు యోగిషు కామయతే, కామం జాయతే నిరంజనోఽకామత్వేనోజ్జృంభతే, అ క చ ట త ప య శ వర్గాన్ సృజతే, తస్మాదీశ్వరః కామోఽభిధీయతే. తత్పరిభాషయా కామః కకారం వేద్యం వ్యాప్నోతి, కామ ఏ వేదం
(క) తత్తదితి కకారో గృహ్యతే. తస్మాత్తత్పదార్థ ఇతి య ఏవం వేద.

• సవితుర్వరేణ్య మితి షూన్ ప్రాణిప్రసవే, సవితా ప్రాణేన సూతే, ప్రసూతే, శక్తి స్సూతే, త్రిపురాశక్తి రాద్యేయం, త్రిపురా పరమేశ్వరీ త్రికోణశక్తి రేకారేణ మహాభాగేన
(ఏ) ప్రసూతే, తస్మాదేకార ఏవ గృహ్యతే.

వరేణ్యం శ్రేష్ఠం భజనీయ మక్షరం నమస్కార్యం తస్మాద్వరేణ్య మేకాక్షరం గృహ్యతే. భర్గో దేవస్య ధీమహీతి ధకారో ధారణాధిరేవ ధార్యతే, భగవాన్ పరమేశ్వరో భర్గో దేవో మధ్యవర్తి తురీయ మక్షరం సాహో త్తురీయగ్ సర్వాగ్ సర్వాంతరభూతం తురీయాక్షర మీకారం పదానాం మధ్యవర్తిత్వేనం వ్యాఖ్యాతం. భర్గో రూపం వ్యాచక్షతే తస్మా ద్భర్గో దేవస్య
(ఈ) ధీమహీత్యేవ మీకారాక్షరం గృహ్యతే.

మహీతత్త్వస్య వ్యాఖ్యానం మహత్త్వం జడత్వం కాఠిన్యం విద్యతే యస్మిన్నక్షరే తన్మహీ లకారః, పరం ధామ కాశి స్వార్థం ససాగరం సపర్వతం ససప్తద్వీపం సకానన ముజ్జ్వల
(ల) ద్రూపం మండల మేవోక్తం లకారేణ పృథ్వీ దేవీ మహీ తత్త్వనేన వ్యాచక్షతే.

ధియో యో నః ప్రచోదయాత్ పరమాత్మా సదాశివ ఆదిభూతః పరః, స్థాణుభూతేన లకారేణ జ్యోతిర్లింగ మాత్మా నం ధియః బుద్ధయః, పరే వస్తుని జ్ఞానేచ్ఛారహితే నిర్వి కల్పకే ప్రచోదయాత్ప్రేరయే దిత్యుచ్ఛస్వరరహితం చేతసైవ చింతయిత్వా భావయే దితి.

'పరోరజసిసావదో'మితి తదవసానే పరం జ్యోతి రమలం హృది దైవతం చైతన్యం చ లింగం హృదయాగారవాసినీ హృల్లే
(హ్రీం) ఖేత్యాదినా స్పష్టం వాగ్భవకూటం పంచాక్షరం పంచభూతజనకం
౧. పంచకలామయం వా పఠ్యత ఇతి వాగ్భవకూటం నిష్పన్నం.

---

అథ తు పరం, కామకలాభూతం, కామకూట మాహ తత్స వితుర్వరేణ్య మిత్యాదిద్వాత్రింశదక్షరీం పఠిత్వా, తదితి పర మాత్మా సదాశివాక్షరం.

విమలం నిరుపాధి తాదాత్మ్యప్రతిపాదనేన హకారాక్షరం
(హ) శివరూపం నిరక్షర మక్షరం వ్యాలిఖ్యత ఇతి.

తత్పరాగవ్యావృత్తి మాదాయ శక్తిం దర్శయతి, తత్సవితు
(స) రితి పూర్వేణాధ్వనా సూర్యాధశ్చంద్రకాం వ్యాలిఖ్య.

మూలాది బ్రహ్మరంధ్రగం సాక్షర మద్వితీయ మాచక్షత ఇత్యాహ భగవంతం దేవం శివశక్త్యాత్మక మేవోదితం.

శ్లో. శివోఽయం పరమం దేవం శక్తిరేషాతు జీవజా,
సూర్యాచంద్రమసో ర్యోగా ద్ధంస స్తత్పద ఉచ్యతే.
తస్మా దుజ్జృంభతే కామః కామా త్కామః పరశ్శివః,
(క) కార్ణోఽయం కామదేవోఽయం వరేణ్యం భర్గ ఉచ్యతే.

తత్సవితు ర్వరేణ్యం భర్గో దేవః ఈకారగ్ సేచనీయ మక్షరం సమధుఘ్న మక్షరం పరమాత్మ జీవాత్మనో ర్యోగా త్తదితి స్ఫుట మక్షరం తృతీయగ్ం హ ఇతి తదేవ సదాశివ ఏవ నిష్కల్మష
(హ) ఆద్యో దేవో౽న్త్యమక్షరం వ్యాక్రియతే పరమం పదం.

ధీధారణం విద్యతే జడత్వధారణం మహతి, లకార శ్శివాధ స్తాత్తు, లకారాత్ స్సృష్ట మంత్యమక్షరం, పరమం, చైతన్యం,
(ల) ధియో యో నః ప్రచోదయాత్.

పరోరజసి సావదోమిత్యేవం కూటం కామకలాలయం షడధ్వ
(హ్రీం) పరివర్తకో వైష్ణవం పరం ధామేతి, కామరాజకూటం
౨. నిష్పన్నం.

---

అద్వైతస్మా దపరం శక్తికూటం ప్రతిపద్యతే:—ద్వాత్రింశ దక్షరాగాయత్ర్యా తత్సవితు ర్వరేణ్యం. తస్మా దాత్మన ఆకాశ ఆకాశాద్వాయు స్ఫురతే, తదధీనం వరేణ్యం సముదీర్యమాణం సవితుర్వాయో ర్యో జీవాత్మపరమాత్మసముద్భవస్తం ప్రకాశ
(స) శక్తిరూపం జీవాక్షరం సృష్ట మాపద్యతే.
(క) భర్గో దేవస్య ధీమహీత్యనేనాధారరూప శివాత్మాక్షరం.
(ల) మహీత్యాదినా శేషం.

ధియో యో నః ప్రచోదయాత్, పరోరజసి సావదోమితి
(హ్రీం) హృల్లేఖా గృహ్యతేతి. కామ్యం రమణీయం దృశ్యం కామ్యగ్ం
3. రమణీయగ్ం శక్తికూటం సృష్టీకృతమ్.

---

ఇత్యేవం పంచదశాక్షరం త్రైపురం యో౽ధీతే, స సర్వా న్కామా నవాప్నోతి, స సర్వా న్భోగా నవాప్నోతి, స సర్వా ల్లోకాన్ జయతి, స వైష్ణవం ధామం భిత్వా పరం బ్రహ్మ ప్రాప్నోతి, యఏవం వేదేత్యుపనిషత్.

**సమష్టి మనుబీజాని.**

క ఏ ఈ ల హ్రీం, హసకహల హ్రీం, సకలహ్రీం.

ఏవం ద్వాత్రింశద్వర్ణాత్మక గాయత్ర్యుద్ధృతా పంచదశాక్షరీ మనుః. వాగ్భవ-కామరాజ-శక్తిరితి-కూటత్రయాత్మకం.

శ్రు. కర్ణాత్కర్ణాంతరం ప్రాప్తం పుస్తకాద్గ్రహణాం నసదితి ప్రమాణాం.

శ్లో. కత్రయం హద్వయం చైవ శైవోభాగః ప్రకీర్తితః,
శేషాణి శక్తిబీజాని హ్రీంకార ఉభయాత్మకః.
ఏవం విభాగ మజ్ఞాత్వా శ్రీవిద్యాజపశాలినః,
న తేషాం సిద్ధిదా విద్యా కల్పకోటిశతైరపీతి.

**పంచదశీవిద్యాద్వాదశభేదాః.**

శ్లో. మను శ్చంద్రః కుబేరశ్చ లోపాముద్రా చ మన్మథః,
అగస్తిరగ్ని స్సూర్యశ్చ ఇంద్ర స్స్కంద శ్శివ స్తథా,
క్రోధభట్టారకో దేవ్యాద్వాదశామీ ఉపాసకాః.

తా. మనువు, చంద్రుఁడు, కుబేరుఁడు, లోపాముద్ర, మన్మథుఁడు, అగస్త్యుఁడు, అగ్ని, సూర్యుఁడు, ఇంద్రుఁడు, కుమారస్వామి, ఈశ్వరుఁడు, దూర్వాసఋషి ఈపండ్రెండుగురును దేవీ ఉపాసకులు. వీరు స్వయముగా నీ పంచదశీమంత్రమును వేదమునుంచి వేరువేరుగా నేర్పరిచి వారువారు ఉపాసనచేసిరి, గాన నీవిద్య పండ్రెండువిధములుగా కూటత్రయమందు భేదము కలిగియున్నది. ఇందులో పైన ఛూపించిన "కామో యోనిః" అనేశ్రుతియు, గాయత్రీనుంచి ఏర్పడినవిద్యయు, శివవిద్యయనియు, కాదివిద్యయనియు తెలియుచున్నది. పైనచెప్పిన ద్వాదశవిద్యలలో హాదివిద్యా సాదివిద్యలు అనునవి రెండును అనేకవిధ సంపుటీభేదములు కలిగియున్నవి. ఈ కాదివిద్యయే సమయమతపరంపరగా వచ్చుచున్నది. ఈ కాదివిద్యోపాసకులకు నా ద్వాదశవిధ విద్యలు లభించినపుడు పారాయణవతుగా గ్రహించవలెనని సంప్రదాయము.

**మంత్రవిద్యాభేదః.**

శ్లో. స్త్రీదైవత్యా స్తు విద్యాస్స్యుః మంత్రాః పుందేవతా స్స్మృతాః,
దేవతాంధ్యాసే ఐచ్ఛికో వికల్పః.
పుంరూపం వా స్మరేద్దేవీం స్త్రీరూపం వా విచింతయేత్,

అథవా నిష్కళం ధ్యాయేత్సచ్చిదానందలక్షణమితి.
మంత్రాణాం పిండకర్తర్యాదిభేదః. నిత్యాతంత్రే:—

శ్లో. మంత్రా ఏకాక్షరాః పిండాః కర్తర్య స్త్ర్యక్షరా మతాః.
వర్ణత్రయం సమారభ్య నవార్ణావధిబీజకాః.
తతో దశార్ణ మారభ్య యావద్వింశతి మంత్రకాః,
అత ఊర్ధ్వం గతా మాలా స్తాసు భేదో న విద్యతేతి.

**౧౭-వ సూత్రము, నిత్యాప్రకరణము.**

**సూ. నిత్యా స్తిథ్యాకారా స్తిథయశ్శివశక్తిసమరసాకారాః,**
**దివసనిశామయ్యస్తాశ్శ్రీవర్ణా స్తేఽపి తద్ద్వయీరూపాః.**

అ. తాః నిత్యాః = వెనుక చెప్పిన కామేశ్వరీ మొదలగు పంచదశనిత్యలును, తిథ్యాకారాః = ప్రతిపదాదిపంచదశతిథిరూపములుగానున్నవి. తాస్తిథయః = ఆతిథులున్ను, దివసనిశామయ్యః = దినరాత్రిరూపములయి, శివశక్తిసమరసాకారాః = ప్రకాశవిమర్శ శబలములుగానున్నవి. తేశ్రీవర్ణా అపి = పూర్వోక్త పంచదశీవిద్యావర్ణములును, తద్ద్వయీరూపాః = శివశక్తిస్వరూపములు గలవి.

తా. ఇంతవరకు శివాదిక్షిత్యంతమయిన చరాచరములనే బ్రహ్మాండపిండాండములు చతుర్వింశతి తత్త్వమయములనియు, నా తత్త్వములు శివశక్తిస్వరూపము లనియు నిరూపింపఁబడినవి.

ఇచట కాలమును గూడ బ్రహ్మస్వరూపమనియు, నిత్యమనియు చెప్పుచున్నారు. వెనుకటి సూత్రమందు చిద్విద్యాపంచదశ బీజములును, కామేశ్వరీమొదలగు పంచదశనిత్యలుగా నున్నవని చెప్పిరి ఆవర్ణములు పరంజ్యోతిస్వరూపమయిన కామకల యనే ధ్రువకలవలన కలిగినవని చెప్పిరి. ఆమంత్రవర్ణస్వరూపమయిన పంచదశనిత్యలు ప్రతిపదాది పంచదశతిథిరూపములుగా నున్నవి. ఆతిథులును దినరాత్రి

రూపమయిన శివశక్తిస్వరూపములు గలవి. మంత్రవర్ణములును శివశక్తి రూపములు గలిగియున్నవి. అట్టి శివశక్తిస్వరూపము లగు తిథులవలన కాలజ్ఞానము కలుగుచున్నది గాన, కాలమును శివశక్త్యాత్మకబ్రహ్మ స్వరూపముగా నున్నది. జ్యోతిశ్శాస్త్రే:—

శ్లో. ప్రతిపన్నామ సా జ్ఞేయా చంద్రస్య ప్రథమా కలా,
ద్వితీయా వా ద్వితీయా స్యాత్పక్షయోశ్శుక్లకృష్ణయోః.

ఈ ప్రమాణమువలన చంద్రుని ప్రథమకల ప్రతిపత్తనియు, రెండవకల ద్వితీయయనియు, కాలాత్మకమైన సూర్యమండలమునుంచి శుక్లపక్షమందు నాసంఖ్యగలకల నిర్గమించినదనియు, కృష్ణపక్షమందు నాసంఖ్య గలకల సూర్యమండలమందుఁ బ్రవేశించినదనియు, నిటుల పౌర్ణమి అమావాస్యల పర్యంతము పంచదశకలలును, పంచదశ తిథులుగా నున్నవని గ్రహింపవలెను. సూర్యచంద్రులకు సమసప్తకము స్థితిగలతిథి పౌర్ణమి యనఁబడును. నాఁడు చంద్రుఁడు షోడశకలాయుక్తుఁడుగా నుండును. సూర్యచంద్రసమాగమమునాఁడు ఆతిథి అమావాస్య యనఁబడును. అపుడు చంద్రుని పంచదశకలలును సూర్యునియందుఁ బ్రవేశించి ధ్రువకలమాత్రము చంద్రునియం దుండును.

ఈవృద్ధిక్షయములు చంద్రసూర్యగతిభేదమువలనఁ గలిగినవి. అందువలననే అహోరాత్రిభేదము జనించినది. ఈ కాలభేదము కూటత్రయ లోకత్రయమందు మాత్రము గలదు. తురీయకూటమునందు అహోరాత్రివిభాగము, కాలభేదము లేనందున నచటనున్న సహస్రారాంతర్గత చంద్రమండలము సదాషోడశకలాయుక్తమని ఆగమసిద్ధము.

ఈ కలాశబ్దము అకారాది పంచాశద్వర్ణములందును, వస్తురూపములయిన తత్త్వములందును, సంఖ్యావాచకముగను నున్నది. "కలాతు షోడశో భాగః" అనే నిర్ణయముచే చంద్రకలయందు వర్తించుచున్నది.

విద్యావర్ణములు ఖండత్రయముగా నున్నందున, ప్రతిపక్షమందు నీతిథులును ప్రతిపదాది పౌర్ణిమాంతము మూడుఖండములుగా నున్నవి. అవి నందా, భద్రా, జయా, రిక్తా, పూర్ణాశ్చ, తిథయః మాదితి—పర్యవసానము. ప్రతిపదాదితిథులకు కామేశ్వర్యాది పంచదశీనిత్యలును ఆయాతిథ్యధిదేవతలుగా నున్నారు. కృష్ణపక్షమందు చిత్రాదికామేశ్వరాంతము అధిదేవతలుగా నున్నారు. ఈవివరము ముందు తెలియును. ఈయుభయపక్షములందుగల దినరాత్రులకు వేరువేరుగా శ్రుతులందు నామాంతరములు చెప్పఁబడినవి. ఆశ్రుతులును తిథినిత్యలను తెలిపేచక్రములును చూపింపఁబడును.

**తైత్తిరీయే కాఠకేషు, శుక్లపక్షదిననామాని:—**

శ్రు. సంజ్ఞానం విజ్ఞానం ప్రజ్ఞానం జాన దభిజానత్,
సంకల్పమానం ప్రకల్పమాన ముపకల్పమాన ముపక్లప్తం క్లప్తమ్,
శ్రేయో వశీయ ఆయ స్సంభూతం భూతమితి. తై. బ్రాహ్మణ.

**శుక్లపక్షరాత్రినామాని:—**

శ్రు. దర్శా దృష్టా దర్శితా విశ్వరూపా సుదర్శనా,
అప్యాయమానా ప్యాయమానా ప్యాయా సూనృతా ఇరా,
ఆపూర్యమాణా పూరయంతీ పూర్ణా పౌర్ణమాసీతి,

**కృష్ణపక్షదిననామాని:—**

శ్రు. ప్రస్తుతం విష్టుతగ్ం సగ్‌స్తుతం కళ్యాణం విశ్వరూపం శుక్రమమృతం తేజస్వి తేజ స్సమిద్ధం, అరుణం భానుమ న్మరీచిమ దభితప స్తపస్వీదితి.

**కృష్ణపక్షరాత్రినామాని:—**

శ్రు. సుతా సున్వతీ ప్రసుతా సూయమానా విషూయమానా, ప్రీతీ ప్రపా సంపా తృప్తి స్తర్పయంతీ, కాంతా కామ్యా కామజాతాఽఽయుష్మతీ కామదుఘా ఇతి.

# నిత్యాచక్రము

| శుక్లపక్షము. | | | | కృష్ణపక్షము. | | | |
|---|---|---|---|---|---|---|---|
| తిథి. | నిత్యానామాని. | దివసనామాని. | రాత్రినామాని. | తిథి. | నిత్యానామాని. | దివసనామాని. | రాత్రినామాని. |
| ౧ | కామేశ్వరీ | సంజ్ఞానం | దర్శా | ౧ | చిత్రా | ప్రస్తుతం | సుతా |
| ౨ | భగమాలినీ | విజ్ఞానం | దృష్టా | ౨ | జ్వాలామాలినీ | విష్టుతం | సున్వతీ |
| ౩ | నిత్యక్లిన్నా | ప్రజ్ఞానం | దర్శితా | ౩ | సర్వమంగళా | సంస్తుతం | ప్రసుతా |
| ౪ | భేరుండా | జానత్ | విశ్వరూపా | ౪ | విజయా | కల్యాణం | సూయమానా |
| ౫ | వహ్నివాసినీ | అభిజానత్ | సుదర్శనా | ౫ | నీలపతాకా | విశ్వరూపం | అభిషూయమాణా |
| ౬ | మహావజ్రేశ్వరీ | సంకల్పమానం | ఆప్యాయమానా | ౬ | నిత్యా | శుక్రం | ప్రీతీ |
| ౭ | శివదూతీ | ప్రకల్పమానం | ఆప్యాయమానా | ౭ | కులసుందరీ | అమృతం | ప్రపా |
| ౮ | త్వరితా | ఉపకల్పమానం | ఆప్యాయా | ౮ | త్వరితా | తేజస్వి | సంపా |
| ౯ | కులసుందరీ | ఉపక్లప్తం | సూనృతా | ౯ | శివదూతీ | తేజః | తృప్తిః |
| ౧౦ | నిత్యా | క్లప్తం | ఇరా | ౧౦ | మహావజ్రేశ్వరీ | సమిద్ధం | తర్పయంతీ |
| ౧౧ | నీలపతాకా | శ్రేయః | ఆపూర్యమాణా | ౧౧ | వహ్నివాసినీ | అరుణం | కాంతా |
| ౧౨ | విజయా | వశీయః | పూర్యమాణా | ౧౨ | భేరుండా | భానుమత్ | కామ్యా |
| ౧౩ | సర్వమంగళా | ఆయత్ | పూరయంతీ | ౧౩ | నిత్యక్లిన్నా | మరీచిమత్ | కామజాతా |
| ౧౪ | జ్వాలామాలినీ | సంభూతం | పూర్ణా | ౧౪ | భగమాలినీ | అభితపత్ | ఆయుష్మతీ |
| ౧౫ | చిత్రా | భూతం | పౌర్ణమాసీ | ౧౫ | కామేశ్వరీ | తపస్విత్ | కామదుఘా |

కాలజ్ఞానఫలము.

ఏతేషా ముభయేషాం శుక్లకృష్ణపక్షాహోరాత్రాణాం నామధే యాని యో వేద తస్య ఫలమాహ:—

శ్రు. స యోహవా మధుకృతశ్చ మధువృషాగ్ శ్చ వేద కుర్వతి హాస్యైతా అగ్నౌ మధునాస్యేష్టాపూర్తం ధయంతీతి.

తా. ఈరాత్రులు మధువును సంపాదించునవి. దినములు మధువును వర్షించేవి. ఈసంకేతము నెవరు తెలుసుకొనుచున్నారో యట్టి జ్ఞాతలకు నీకాలజ్ఞానము బైందవస్థానమందు సుధాసింధువులు కలుగఁ జేయుచున్నది. వారియొక్క వాంఛితార్థములను సఫలముగాఁ జేయును. ఎవరు తెలుసుకొనరో వారిబైందవస్థానమందు మధుశూన్యమయి ఇష్టాపూర్తి కానేరదు.

తదుక్తం చంద్రకలాజ్ఞానే:—

శ్లో. అంతరగ్నౌ మధుస్రావం కుర్వతాం శిశిరాత్మనాం,
ఇష్టాపూర్తాదికర్మాణి ఫలంతి కిల కాలతః. ౧
అంతస్రావవిహీనానాం సదా సంతప్తచేతసాం,
కర్మాణి క్రియమాణాని కాలో గ్రసతి తత్క్షణాత్. ౨
కాలకర్షిణికైవాంతః కరోతి మధు వర్షతి,
ఇతి యో వేద తస్య స్యాద్బ్రహ్మారంధ్రాత్సుధాస్రుతిః. 3
వైదేహీ జనయామాస సరఘా కాలకర్షిణీ,
అహోరాత్రైరిమాం విద్యాం దశపంచభిరక్షరైః. ౪

తృతీయచతుర్థశ్లోకయోరయమర్థః—కాలకర్షిణ్యాఖ్యా దేవీమధు కరోతీతి మధుకృత్, రాత్రిరూపా మధు వర్షతీతి మధువృషా, అహోరూపా, ఇతి ప్రకారేణభిన్నాం దేవీం యో వేదేత్యాది విగతో దేహో యస్య స విదేహః, అనంగః కామేశ్వరః, తత్సంబంధినీ వైదేహీ కామేశ్వరీ, అహోరాత్రాభిన్నైః పంచదశవర్ణైరిమాం పంచదశీ విద్యాం జనయామాస, తథా చ శ్రుతిః—

జనకోహి వైదేహః అహోరాత్రైస్సమాజగామేతి.
ఏషైవ చ మధుకర్తృత్వా త్సరఘా
ని. సరఘా మధుమక్షికేత్యమరః.

శ్రు. ఇయంవానరసఘూ తస్యాగ్ని రేవ సారఘం. మధ్విత్యలం.

సుధావృష్టినిగుఱించి:—"అంతరగ్నౌ మధుస్రావ" మని ప్రథమ శ్లోకమందు చెప్పఁబడినది. ఈ అంతరగ్నిమధువర్షములను గుఱించి అంతరంగవస్తువివరము తెలియనిది ప్రయోజనములేదు గాన నిందును గుఱించి కొంత వివరింపఁబడుచున్నది. సావధానముగా గ్రహింపఁదగినది.

శ్రు. "ఏకమేవాద్వితీయం", "ఏకం ఏవ అద్వితీయం." ఈశ్రుతి యందుఁగలపదత్రయము ఐక్యమును, అవధారణను, ద్వైతపరిహారమును తెలుపుచున్నది. ఏకమనేపదమువలన "నాన్య త్కించన మిషత్" ఆత్మ కన్న వేరు ఏదియు లేదనియు జీవాత్మపరమాత్మల కైక్యమును తెలుపు చున్నది. ఏవకారముచే పూర్వార్థమును నిశ్చయపరచుచున్నది. అద్వి తీయమనినందున ద్వితీయవస్తురహితమును తెలుపుచున్నది. ఈవాక్యము వలన స్వరూపజ్ఞానానంతరవస్తువుగాను నీవిచారణాత్పూర్వము ద్వైత వస్తువు ఉన్నట్లు స్పష్టమగుచున్నదిగాన, నాద్వైతవస్తువు ఏది యని నిరూపింపవలసియున్నది. "బ్రహ్మారంధ్రాత్సుధాస్రుతిః" అనినందున శరీర మందుఁగల అమృతవృష్టి కారణవస్తువని తెలియవలసియున్నది గనుక నీవిషయములు నిచట వివరింపఁబడుచున్నవి.

శ్రు. "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్."

ఇతి తైత్తిరీయే.

ఈశ్వరుఁడు పంచభూతములను, ఇంద్రియపాలకులను, చతుర్వింశతితత్త్వాత్మకశరీరమును సృజించి, దానియందు తాను ప్రవేశించెనని తెలియుచున్నది.

శ్రు. స ఈక్షత కథన్విదం మదృతే స్యాదితి స ఈక్షత కతరేణ ప్రపద్యా ఇతి. సఏతమేవ మూర్ధ్ని సీమానం విదార్యైతయా ద్వారా ప్రాపద్యత తస్యైషా విదృతిర్నామద్వాస్త దేతన్నాందనమితి.

ఐతరేయే.

తా. పూర్వశ్రుతివలెనే ఆత్మ గర్భస్థజంతుశరీరమును సృజించి నేనులేనిది యీ యింద్రియాదులకు నేమిప్రయోజనము? వానికి చేత నత్వ మెట్లు కలుగునని యోచించెను. తాను శరీరమందుఁ బ్రవేశించ

నిశ్చయించి ప్రవేశించుటకు ద్వారమును చూడఁగా ఇంద్రియమార్గము లందు నింద్రియపాలకు లగుదేవత లున్నందున వారికి బాధ కలుగునని యోచించి, మూర్ధసీమాంతమును (శిరోమధ్యభాగమును) భేదించి తద్వారా ప్రవేశించి యచటనే నివసించెను. అందువలన నాస్థానము నాందనమని బ్రహ్మరంధ్రమని చెప్పఁబడుచున్నది. నందతీతి నాందన మితి.

"సప్తమే మాసి జీవప్రవేశ ఇతి" ఏడవమాసమందు జీవప్రవేశ మని గర్భోపనిషత్తునందుఁ గలదు. పైంగలోపనిషత్.

శ్రు. అండస్థాని తాని తేన వినా స్పందితుం చేష్టితుం వా న శేకుః. తాని చేతనీకర్తుం సోఽకామయత. బ్రహ్మాండం బ్రహ్మరంధ్రాణి సమస్తవ్యష్టిమస్తకాని విదార్య తదేవానుప్రవిశత్. తదా జడాన్యపి తానిచేతన త్స్వస్వకర్మాణి చక్రిరేతి.

పైన చెప్పిన శ్రుతులవలన గర్భస్థజంతుశరీరమందు బ్రహ్మ రంధ్రముద్వారా ఆత్మ ప్రవేశించి సకలతత్త్వములకును చేతనత్వము గలుగఁజేసి, తాను రాజుగాను, ఇంద్రియాదులు ప్రజలుగాను ఉన్న దని తెలియుచున్నది. ఈ ప్రవేశించిన కలయే చిత్కళగా నున్నది. దీని తేజఃప్రసారముచే సకలశరీరమునకును చైతన్యము కలిగినది. ఇది ఇంద్రియాదులకు వేఱైనదిగాన ప్రత్యగాత్మ యనియు, అసంగముగా నున్నందున సాక్షి యనియుఁ జెప్పఁబడుచున్నది. ఇది బ్రహ్మరంధ్రాధో భాగమందు శుక్లవర్ణముగల ఒకానొక మృదుపదార్థము నాశ్రయించి ప్రకాశించుచున్న తేజోరూపము. ఇది సుధాస్థానముగా నున్నందున చంద్రమండలమని యాగమవేత్తలు చెప్పుచున్నారు.

"నిరాలంబోపనిషది కతిపదార్థా ఇతి ప్రశ్నే. సదసన్మిథ్యా చేతి త్రయ ఇతి."

తా. పిండాండబ్రహ్మాండములందు ఎన్నిపదార్థములని ప్రశ్న పైని 'సత్ అసత్ మిథ్యా' అను నీమూటికన్న వేరు లేదని ఉత్తరువు. "సదేవాత్ర బ్రహ్మ; అసత్తుచ్ఛం, జగత్కల్పితం బ్రహ్మణ్యసత్యం;" సత్ప దార్థమే బ్రహ్మ, ఏమియు లేదనేది తుచ్ఛము. బ్రహ్మమందు జగత్తు కల్పితముగాన అసత్యమని యీమూడువస్తువులకన్న వేరులేదని చెప్పిరి.

ఇందువలన 'సత్యము కల్పితము' అని రెండువస్తువు లున్నట్లు తోఁచు చున్నది. శారీరపక్షమందు బ్రహ్మరంధ్రమందున్న సాక్షి యనే చంద్ర మండలము ప్రథమవస్తువు స్థిరపడినది. ఇక రెండవది నిర్ణయించవలెను.

శ్రు. ఏష హి దేవః ప్రదిశోను సర్వాః పూర్వోహి జాత స్సఉ గర్భే అంతః, స విజాయమాన స్స జనిష్యమాణః ప్రత్యఙ్ముఖా స్తిష్ఠతి విశ్వతోముఖ ఇతి.

తా. వెనుక చెప్పిన ఆత్మప్రవేశాంతోత్తరక్షణమందు ప్రకాశ రూపమయిన ఆత్మయందుఁగల విమర్శశక్తి అనఁగా నాచిన్మండలతేజః పుంజము బ్రహ్మరంధ్రమునుంచి అధోముఖముగా విద్యుల్లతవలె బయలుదేరి మూలాధారమును పొంది స్వాధిష్ఠానము స్థానముగా నున్నది. దీనిని సుషుమ్నానాడి యనియు, జీవనాడి బ్రహ్మనాడి యని ఆగమవేత్తలు చెప్పుదురు. ఇది అగ్నిస్వరూపము. ఇదియే చిత్కళల యొక్క ప్రథమవికసనముగాన అన్నిటికన్న పూర్వము జనించినదని శ్రుతి చెప్పుచున్నది. ఇదియే పరాశక్తిగానున్నది.

శ్రు. అగ్నిషోమాత్మకం చక్ర మగ్నిషోమాత్మకం జగదితి.

ఇచట చక్రమన చతుర్వింశతత్త్వసమూహము చక్ర మనిపించు కొనును. జగత్తును శరీరమును చంద్రాగ్నులమేళనమని (శివశక్త్యాత్మక ముగా నున్నవని) తాత్పర్యము.

ఇటుల చంద్రాగ్ను లేర్పడినవి. ఈబ్రహ్మనాడీమార్గమందున్న సంకేతములు మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞా, సహస్రారములని సప్తకమలములు గలవు. వీనిస్థానములు పాయు, ఉపస్థ, నాభి, హృదయ, భ్రూమధ్య, బ్రహ్మరంధ్రములు. ఈవెనుక చెప్పిన సుషుమ్న యనే విద్యుల్లత యీకమలములను స్పృశించుచు, పుష్పమాల యందు సూత్రమువలెనుండి స్వాధిష్ఠానాగ్నిదీప్తిని సహస్రారమునకు వేధించుచు, అందువలన కలిగిన అమృతధారాప్రవాహమువలన (72) ద్విసప్తతిసహస్రసంఖ్యానాడీసముదాయమునకు తృప్తిని కలుగఁజేయుచు నుండును. ఈ అగ్నియొక్క ఉష్ణాధిక్యము అమృతవృష్టివలన శమిం చును. ఈవృష్టివలన కలిగిన శీతాధిక్య మీయగ్నివలన శాంతించును గాన, సమశీతోష్ణమయి ప్రాణులకు సుఖము గలుగుచుండును.

సంతప్తచేతస్కులకు సుధాస్రావము లేదని వెనుక చెప్పిరి. అది యెట్టిదనిన, శరీరమందు మూడుస్థానములు శ్రేష్ఠమయినవి. హృదయము, భ్రూమధ్యము, సహస్రారము. ఇందు సహస్రారము సాక్షియగు చిత్కళాస్థానము. భ్రూమధ్యము పంచబ్రహ్మలలో తురీయుఁడగు ఈశ్వరునియొక్కస్థానము. హృత్కమలము జీవస్థానముగా నున్నది. ఉష్ణ మోహములు అగ్నిగుణములు. కామక్రోధములు వ్యోమాంశములు. భయదుఃఖమోహములు తమోరూపములు. ఇవియన్నియు జీవధర్మములుగాన నీగుణములు ఉద్రేకించియున్నపు డుష్ణాధిక్యమువలన సహస్రారమునుంచి సుధావృష్టి కలుగనేరదనియు, నదివరకున్నదియును హరించుననియు, పైనచెప్పినగుణము లుద్రేకించక యంతఃకరణశాంతిగా నున్నపుడు సహస్రారమునుంచి అమృతస్రావమగుననియుఁ దాత్పర్యము. అట్టివారు చేసిన సకలకర్మలును సఫలమగునని చెప్పిరి. ఇది సుధావృష్టి వివరము.

### జీవస్వరూపము.

అమృతవృష్టికిని అంతఃకరణశీతలత్వమునకు కామ, క్రోధ, భయ, మోహాదులు ప్రతిబంధకములని చెప్పిరి గదా! ఆకామాదులకు పరిహారము లేదా యనిన, జీవస్వరూపమును తెలిసికొనుటయే పరిహారముగాన జీవస్వరూపవివర మావశ్యకముగా నున్నది.

### జీవునకు ముఖ్యస్థానము హృదయము.

శ్రు. పద్మకోశప్రతీకాశగ్ం హృదయం చాప్యధోముఖం,
అధోనిష్ట్యా వితస్త్యాంతే నాభ్యా ముపరి తిష్ఠతి,
సంతతగ్ం శిరాభిస్తు లంబత్యాకోశసన్నిభం,
తస్యాంతే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్సర్వం ప్రతిష్ఠితమ్.

తా. నాభికి వితస్తిమాత్రముమీఁదుగా పద్మముకుళమువలె అధోముఖముగా హృదయ మనే మాంసపిండము గలదు. అది అనేక సిరలచే (సూక్ష్మనాడులచే) పరివేష్టితమయి యుండును. దాని అగ్రమందు సూక్ష్మరంధ్రము గలదు. దానియందు ముందు వివరింపఁబోవు సకలపదార్థములును కలవు.

శ్రు. తస్య మధ్యే మహానగ్నిర్విశ్వార్చిర్విశ్వతోముఖః,
సోఽగ్రభు గ్విభజ న్తిష్ఠ న్నాహార మజరః కవిః,

తిర్యగూర్ధ్వమధశ్శాయీ రశ్మయస్తస్య సంతతా,
సంతాపయతి స్వం దేహ మాపాదతలమస్తకమ్.

తా. ఆపద్మకోశమందు చిదగ్నికణము దీప్యమానజ్వాలాసముదాయము కలిగియున్నది. అది ఆహారమును పచనము చేసి రసపిష్ట జలములను విభజించి యారసమును బ్రహ్మరంధ్రమును పొందించును. అచటనుంచి సుషుమ్నాద్వారా నాభిగతమయి సకలనాడులకు యథాభాగములుగా పంచఁబడును. అచటనున్న అగ్నికలలు ఊర్ధ్వాధోతిర్యక్ప్రసారములయి శరీరము పాదము మొదలు శిరస్సువరకు వ్యాపించి తపింపఁజేయుచుండును.

శ్రు. తస్య మధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః,
నీలతోయదమధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరా,
నీవారశూకవత్తన్వీ పీతా భాస్వత్యణూపమా,
తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః,
స బ్రహ్మా స శివస్స హరిస్సేంద్రస్సోఽక్షరః పరమస్స్వరాట్.

తా. ఆపద్మకోశమధ్యమందు వహ్నిశిఖ అణుమాత్రప్రమాణము గలది. ఊర్ధ్వజ్వాల కలిగియున్నది. అది నీలమేఘమధ్యనున్న విద్యుల్లేఖ వలెఁ బ్రకాశించుచు, నివరిధాన్యపు సూక్ష్మాగ్రమువలె నతిసూక్ష్మమయి అణుమాత్రము పచ్చనికాంతితోఁ బ్రకాశించుచుండును. ఆ అగ్నిశిఖా మధ్యను పరమాత్మ యుండును. అతఁడే బ్రహ్మ విష్ణు రుద్ర ఇంద్రాది దేవతారూపుఁడు. అతఁడే నాశరహితుఁడనినందున ఈహృదయమందు అగ్ని యున్నట్లును, అది ఆత్మస్థానమనియు నీశ్రుతివలనఁ దెలియుచున్నది. ఈహృదయము జీవస్థానము. ఆకల జీవుఁడు.

దేహమందు అగ్ని మూడుస్థానములయందున్నది. జ్ఞానాగ్ని, దర్శనాగ్ని, కోష్ఠాగ్ని యని. జ్ఞానాగ్నిస్థానము మనస్సు. దర్శనాగ్నిస్థానము ఇంద్రియములు. కోష్ఠాగ్నిస్థానము దహరాకాశము. ఇదియే పైశ్రుతి యందు వర్ణింపఁబడినది. హృదయము దక్షిణాగ్ని. ఉదరమందు గార్హపత్యము. ముఖమం దాహవనీయము. ఇట్లు దేహమం దగ్నిత్రయ మున్నది.

శ్రు. పంచప్రాణమనోబుద్ధి దశేంద్రియసమన్వితం,
అపంచీకృతభూతోత్థం లింగాంగం భోగసాధనం.

తా. పంచప్రాణములు, మనస్సు, బుద్ధి, దశేంద్రియములు ఈ పదిహేడు తత్త్వములుగల తేజశ్శరీరము లింగ మనిపించుకొనును.

శ్రు. చైతన్యం యదధిష్ఠానం లింగదేహశ్చ యః పునః,
చిచ్ఛాయలింగదేహస్థా తత్సంఘో జీవ ఉచ్యతే.

తా. లింగదేహకల్పనాధారభూతమయిన చైతన్యమును, నా చైతన్యమందు కల్పితమయిన లింగదేహమును, దానియందుఁ బ్రతిబింబించిన చిదాభాసయు, (ప్రతిబింబమును) వీనియొక్క సంఘము (సముదాయము) జీవుఁడని చెప్పఁబడుచున్నది.

వెనుక సహస్రారకమలమధ్యను బ్రహ్మరంధ్రద్వారా చిత్కళ ప్రవేశించి యున్నదనియు నాతేజఃపుంజము పరానాడిరూపముగా మూలాధారమువరకు వ్యాపించినదని చెప్పఁబడినది. ఈమధ్యభాగమందు జీవేశ్వరస్థానము లున్నవి. భ్రూమధ్యము ఈశ్వరస్థానము. ఇతఁడు (ఈశ్వరుఁడు) మాయోపాధియనే శుద్ధసత్త్వోపాధియందుఁ బ్రతిబింబించిన సహస్రారమధ్యవర్తియయిన చిత్కళాప్రతిబింబముగా నున్నాఁడు. ఇతఁడు బ్రహ్మాదులకు నియామకుఁడుగానుండి ఈశ్వరుఁడనిపించుకొనును. ఇఁక జీవస్వరూపము:—రజస్తమోగుణములచే కలుషమయిన అవిద్యోపాధి యందుఁగల చిత్కళాప్రతిబింబము జీవుఁడుగా నున్నాఁడు. లింగదేహము చైతన్యమందు కల్పితము. ఆలింగమే అవిద్య. అది త్రిగుణాత్మకము. ప్రతిబింబమునకు అద్దమువంటిది గాన నీప్రతిబింబము ఉపాధియయిన అవిద్యకు స్వాధీనము. ఈశ్వరుఁడనే ప్రతిబింబమునకు మాయ స్వాధీనముగా నున్నదిగాన అతఁడు స్వతంత్రుఁడు. ఈజీవుఁడు అస్వతంత్రుఁడు. 'జీవత్వం ప్రాణధారణాత్' ప్రాణధారణచే నీ అవిద్యాప్రతిబింబము జీవుఁ డనిపించుకొనును.

అంతకును అధిష్ఠానము (ప్రతిబింబకారణము) పైనున్న చిత్కళయే ప్రధానముగా నున్నది. పరమాత్మకలను జీవునిగా నేశక్తి కల్పించినదో, అదియే ఆజీవునకు మోహమునుగూడ కలుగఁజేసినది. అందువలన నాజీవుఁడు మోహితుఁడయి స్వరూపవిస్మృతిగలవాఁడయి అహం

మహామని స్వపరభేదములు కలిగి కామక్రోధాదులు, సుఖదుఃఖములు, భయాదులు కలిగి సంసారమందు అవిద్యాబద్ధుఁడయి యున్నాఁడు. ఇట్టుల జీవస్వరూపము నిశ్చితమయినది.

కాన ఇందువలన జీవుఁడు చిత్కళయనే సహస్రారాంతర్గతసాక్షి యొక్క ప్రతిబింబమనియు, నా ప్రతిబింబమున కాశ్రయమయిన అవిద్యాలింగదేహాదులు చిచ్ఛాయయందు కల్పితములనియుఁ దెలియు చున్నది. ఇదంతయు వెనుకచెప్పిన హృదయమందున్నది. ఇందువలన రజ్జువునందు కల్పితమయిన సర్పమువలెనే యున్నది. ఆసర్పభ్రమ అజ్ఞానముచేఁ గలిగినది. విచారణవలన జ్ఞానము కలిగి నిజము తెలియును గాన జీవస్వరూపము ప్రతిబింబసదృశము గాన నిజము కాదనియు, 'అహ' మనేది సాక్షియయిన చిత్కళయందుఁగాని జీవునియందు కాదనియు గ్రహింపఁదగినది.

అంతఃకరణయందు చిదాభాసుఁడయిన జీవునకు అవిద్యవలన భయశోకమోహాదులు కలిగినవి. ఆచిదాభాసుఁడును, అందులకు కారణ మయిన అంతఃకరణము మిథ్యలుగా తెలిసినపు డచట మనస్సు లేదు. అందువలన భయాదులు లేక సంతోషము కలిగినపుడు అమృతవృష్టి కలిగి యంతయు చల్లనగును.

### త్రివిధాహంకారము.

శ్రు. అహం సర్వమిదం విశ్వం పరమాత్మాఽహమచ్యుతః,
నాన్యదస్తీతి సంవింద్యాత్పరమా సాహ్యహంకృతిః.
సర్వస్మాద్వ్యతిరిక్తోఽహం వాలాగ్రాదప్యహం తనుః,
ఇతి సంవిచ్ఛ యా బ్రహ్మన్ ద్వితీయాఽహంకృతిశ్శుభా.
మోక్షాయైషా న బంధాయ జీవన్ముక్తస్య విద్యతే.
పాణిపాదాదిమాత్రోఽహమితి యస్యైష నిశ్చయః,
అహంకారస్తృతీయోఽసౌ లౌకికస్తుచ్ఛ ఏవ సః.
వర్జ్య ఏవ దురాత్మాఽసౌ కందస్సంసారదుస్తరోః.
ప్రథమౌ ద్వావహంకారావంగీకృత్య త్వలౌకికౌ,
తృతీయాహంకృతిస్త్యాజ్యా లౌకికీ దుఃఖదాయినీతి.

వికల్పకలికాకారం దేశకాలక్రియాస్పదం,
చితోరూపమిదం బ్రహ్మన్ క్షేత్రజ్ఞ ఇతి కథ్యతే.
వాసనాః కల్పయన్సోఽపి యాత్యహంకారతాం పునః,
అహంకారో వినిర్ణీతః కలంకీ బుద్ధిరుచ్యతే. మహోపనిషత్.

**చతుర్విధనిశ్చయము.**

తత్రైవ.

శ్రు. జాయతే నిశ్చయస్సాధో పురుషస్య చతుర్విధః,
ఆపాదమస్తకమహం మాతాపితృవినిర్మితః,
ఇత్యేకో నిశ్చయో బ్రహ్మన్ బంధాయ సవిలోకనాత్.
అతీతస్సర్వభావేభ్యో వాలాగ్రాదప్యహం తనుః,
ఇతి ద్వితీయో మోక్షాయ నిశ్చయో జాయతే సతాం.
జగజ్జాలపదార్థాత్మా సర్వ ఏవాహ మక్షయః,
తృతీయో నిశ్చయశ్చోక్తో మోక్షాయైవ ద్విజోత్తమ.
అహం జగద్వా సకలం శూన్యం వ్యోమసమం సదా,
ఏవ మేష చతుర్థోఽపి నిశ్చయో మోక్షసిద్ధిదః.
ఏతేషాం ప్రథమః ప్రోక్తస్తృష్ణయా బంధయోగ్యయా,
శుద్ధతృష్ణాత్రయస్స్వచ్ఛా జీవన్ముక్తా విలాసినః.
సర్వం చాప్యహమేవేతి నిశ్చయో యో మహామతే,
తమాదాయ విషాదాయ న భూయో జాయతే మతిః.

ఇతి చతుర్విధనిశ్చయః.

**ఆత్మబ్రహ్మలవివరము.**

**బృహదారణ్యకే:—**

శ్రు. ఆత్మానం చేద్విజానీయాదయమస్మీతి పూరుషః,
కిమిచ్ఛన్కస్య కామాయ శరీరమనుసంజ్వరేదితి.

అయమాత్మా బ్రహ్మేతి శ్రుతిః. అసంగం బ్రహ్మ ఆత్మత్వే నోపదిశతి. అహం మనుష్య ఇత్యాద్యహంబుద్ధిః, దేహాది తాదాత్మ్యేనాత్మానం గృహ్ణాతీతి సందిగ్ధం వస్తు. తన్నిశ్చయేన ముక్తిలక్షణం ప్రయోజనం. శ్రుత్యా విద్వదనుభవేన చ ప్రసిద్ధం. తస్మాద్వేదాంతవాక్య

విచారముఖేన విచారణీయం. విచారితే సతి అయ మాత్మా బ్రహ్మైవేతి అద్వైతత్త్వం సిధ్యతీతి.

తా. 'అయమాత్మా బ్రహ్మ' అని శ్రుతి. ఈ శ్రుతి అసంగబ్రహ్మ వస్తువే ఆత్మస్వరూపమని చెప్పుచున్నది. ఆత్మ దేహేంద్రియాదులందు వాడుకగా నున్నది. అట్టి ఆత్మ బ్రహ్మవస్తువు ఏలాగు కాఁగలదని సందిగ్ధము. పైన చెప్పిన జీవేశ్వర ఆత్మలవిచారణవలన జీవభావజగద్భావములు ప్రతిబింబసదృశములు గాన, అహ మనేది సాక్షియందు నిజముగా వర్తించుచున్నందున, అట్టి సాక్షియే ప్రత్యగాత్మగా నున్నందున ఆత్మ బ్రహ్మకావచ్చునని సమాధానము.

వెనుక చెప్పిన జీవనిరూపణము, అహంకారత్రయము, చతుర్విధనిశ్చయము, "అయమాత్మా బ్రహ్మ" యనుమహావాక్యము వీనివలన తెలిసినఫలిత మేమనిన, జీవస్వరూపజ్ఞానమువలన కులరూపవయోవిశిష్టమైన దేహేంద్రియాదులు అహ మనే వ్యవహారజ్ఞానము తుచ్ఛముగాను, అంతఃకరణయందుగల చిదాభాసుఁడగు జీవునియందు అహమహ మనే వ్యవహారము నెంతవరకు నుండునో అంతవరకు ఆజీవునికి లోకాంతరగమనాదులు, జననమరణాదులు, పుణ్యపాపఫలానుభవము గలదనియు నెపుడు నీజీవత్వము ఆభాసయనియు, నిందుఃకాధారమయిన అంతఃకరణ యనేది చైతన్యమందు కల్పితమని తెలియునో, అపుడు నీఆశ్రయప్రతిబింబములకు హేతువయిన సాక్షియగు చిత్కళయందు అహ మనేది నిశ్చయమగుచున్నది. అపుడు జీవునియందుగల అధ్యాస (అభిమానము) (నిశ్చయము)తప్పి యంతకుముందున్న విశ్వాసము మిథ్య యగుచున్నది. అపుడు అవిద్యాబంధము జననమరణాదిజీవధర్మములు జీవత్వముతోఁ బాటు మిథ్యలగుచున్నవి. "ద్వితీయాద్వై భయం భవతీతి." ఈశ్రుతి వలన రెండవవస్తువువలన భయము కలుగుచున్నదని, ఆత్మవలననే సకలము కలిగినందున, నంతయు ఆత్మ యనే యూహింపవలెను గాన నపుడు ద్వితీయమే లేదుగాన అద్వితీయము సత్యముగా నున్నది. ఇందువలన జగత్తు, 'సత్ అసత్ మిథ్య' యని మూఁడువస్తువులు గలదని ముందు చెప్పఁబడినది. శరీరమందును నీమూఁడువస్తువులే యున్నవి. సత్ చిత్కళ (సాక్షి). అసత్ దేహేంద్రియాదులు. మిథ్యలు జీవాదులు.

ఇందువలన సహస్రారాంతర్గతచంద్రమండలరూపమయిన సాక్షీ యనే చిత్కళ అహమహ మనే వ్యవహారయోగ్యమని నిశ్చయమయినది. ఇదియే ఆత్మస్వరూపముగా నున్నది.

ఈహృదయస్థానము సంవిత్కమలమనియు, సౌరమండలమనియు సకలాగమసిద్ధము. మూలాధారస్వాధిష్ఠానములు అగ్నిమండలముగాను, విశుద్ధ ఆజ్ఞాకమలములు చంద్రమండలముగాను, ఈచంద్రాగ్ని మేళనము మణిపూరానాహతములు సౌరమండలమని యీకమలములు ముందు వివరింపఁబడుచున్నవి.

మూలాధారాదిషట్కమలములు కూటత్రయాత్మకము. ఆజ్ఞోపరిసహస్రారాంతము తురీయకూటము. సమిష్టి నీకూటత్రయము శక్తిభాగము. తురీయకూటము శివభాగము. బిందుస్థానము ఉభయాత్మకముగా నున్నది.

ఇచట బిందుస్థానము చంద్రమండలముగా చెప్పుచు విశుద్ధాజ్ఞాకమలములు సోమఖండ మనినందున చంద్రద్వయ మప్రసిద్ధము కదా యనిన, బిందుమండలమే వాస్తవచంద్రమండలము. అదియే సుధాసింధువు. నాచంద్రబింబకలలచే దిగువ ఆజ్ఞోపరిచంద్రుఁ డుజ్జీవితుఁడు. ఇది ప్రతిబింబముగానున్నది.

శ్రు. అపాగ్ రసముదయగ్ సర్ సూర్యే శుక్రం సమాభృతం,
అపాగ్ రసస్య యో రసః, తం వో గృహ్ణామ్యుత్తమమితి.

తా. ఉదకములను వర్ణించుచు అపాగ్రసం = చంద్రుఁడు ఉదయించినవాఁడై యుండఁగా, సూర్యునియందు అమృతము పూరింపఁబడుచున్నది. సహస్రారస్థితచంద్రమండలగళత్పీయూషధారలవలననే హృదయస్థితసూర్యమండలోజ్జీవనమని తాత్పర్యము. ఉదకముల సారభూతమయిన ఉత్తమచంద్రుని అనఁగా సహస్రారగతచంద్రుఁడు ఉత్తమచంద్రుఁడనియు, నాచంద్రకలలవలన ఆజ్ఞోపరిచంద్రుఁడు, సూర్యుఁడు, అగ్నియు ఇవి ఉజ్జీవితములనియు, ఉత్తమచంద్రుఁడు ఉదకములవలననే కలిగినవాఁడని యీశ్రుతి ఉదకములను స్తుతించుచున్నది గాన ఉత్తమచంద్రుఁడు, చంద్రుఁడు ఇట్లున్నారని తెలియుచున్నది.

వామకేశ్వరతంత్రే:—

శ్లో. బిందుస్థానం సుధాసింధుః పంచయోన్యస్సురద్రుమాః,
తత్రైవ నీపశ్రేణీ చ తన్మధ్యే మణిమంటపం.
తత్ర చింతామణికృతం దేవ్యా మందిరముత్తమం,
శివాత్మకే మహామంచే మహేశానోపబర్హణే.
అతిరమ్యతరే తత్ర కశిపుశ్చ సదాశివః,
భృతకాశ్చ చతుష్పాదా మహేంద్రశ్చ పతద్గ్రహః.
తత్రాస్తే పరమేశానీ మహాత్రిపురసుందరీ,
శివార్కమండలం భిత్వా ద్రావయంతీందుమండలం.
తదుద్భూతామృతస్యంది పరమానందనందితా,
కులయోషిత్కులం త్యక్త్వా పరం వర్షణమేతి సా.
కులాంగనైషాప్యథ రాజవీథీంప్రవిశ్య సంకేతగృహాంతరేషు,
విశ్రమ్య విశ్రమ్యపరేణపుంసాసంగమ్యసంగమ్యరసంప్రసూతా.

తా. ఈవచనములవలన సహస్రారాంతర్గతచంద్రమండలము, బిందుస్థానమనియు నదియే సుధాసింధువనియు, కులాంగన = "కుః పృథివీ తత్వం యత్ర లీయతే తత్కులం మూలాధారం తత్రస్థితా కులాంగనా సజాతీయానాం మూలాధారాది ఆజ్ఞాంతానాం కమలానాం సమూహోవా కులం, తత్ర స్థితావా, కుండలినీస్వరూప పరాశక్తి" యని తాత్పర్యము. సర్పాకారముగా నీసుషుమ్నానాడి యున్నందునఁకుండలినీ నామారోపణ కలిగినది. ఈకులాంగన సంకేతగృహములైన అనాహతాది కమలములందు విశ్రమించుచు సహస్రారమును పొందినందున, చంద్రాగ్ని మేళనమున సుధావృష్టికలిగి ద్విసప్తతిసహస్రనాడీసముదాయమును తృప్తిని పొందించును.

యోగశిఖశ్రు:—

తస్యా మధ్యగతాస్సూర్యసోమాగ్నిపరమేశ్వరాః,
భూతా లోకాదిక్షేత్రాణి సముద్రాః పర్వతాశ్శిలాః.
ద్వీపాశ్చ నిమ్నగా వేదాశ్శాస్త్ర విద్యా కలాక్షరాః,
సర్వమంత్రపురాణాని గుణాస్సతత్వాదయోఽపి చ.
బీజం జీవాత్మకాస్తేషాం క్షేత్రజ్ఞాః ప్రాణవాయవః,
సుషుమ్నాంతర్గతం విశ్వం తస్మిన్సర్వం ప్రతిష్ఠితమితి.

# అథ నిత్యాపరివర్తసచక్రము

| తిథి శు | స్వరము | బీజము | నిత్యానామములు | స్థానము | సప్తద్వీప-సప్తసముద్రములు | తిథి బ |
|---|---|---|---|---|---|---|
| ౧౬ | అం | శ్రీం | లలిత | ద్వాదశాంతము-మహాశూన్యము. | సుధాసింధువు | ౧౬ |
| ౧౫ | అః | హ్రీం | చిత్రా | కర్ణిక-చంద్రమండలము. | మేరువు | ౧ |
| ౧౪ | ఔం | ల | జ్వాలామాలిని | శూన్యం | జలార్ణవము | ౨ |
| ౧౩ | ఓం | క | సర్వమంగళా | సహస్రారము | పుష్కరద్వీపము | ౩ |
| ౧౨ | ఐం | స | విజయ | శూన్యం | క్షీరసముద్రము | ౪ |
| ౧౧ | ఏం | హ్రీం | నీలపతాకా | ఆజ్ఞా-భ్రూమధ్యం | శాల్మలీద్వీపము | ౫ |
| ౧౦ | ౡం | ల | నిత్యా | శూన్యం | దధిసముద్రము | ౬ |
| ౯ | ఌం | హ | కులసుందరీ | విశుద్ధము-కంఠము | శాకద్వీపము | ౭ |
| ౮ | ౠం | క | త్వరితా | శూన్యం | సర్పిసముద్రము | ౮ |
| ౭ | ఋం | స | శివదూతీ | అనాహతము - హృదయము | క్రౌంచద్వీపము | ౯ |
| ౬ | ఊం | హ | మహావజ్రేశ్వరి | శూన్యం | సురాసముద్రము | ౧౦ |
| ౫ | ఉం | హ్రీం | వహ్నివాసిని | మణిపూరం-నాభి | కుశద్వీపము | ౧౧ |
| ౪ | ఈం | ల | భేరుండా | శూన్యం | ఇక్షుసముద్రము | ౧౨ |
| ౩ | ఇం | ఈ | నిత్యక్లిన్నా | స్వాధిష్ఠానము - లింగము | ప్లక్షద్వీపము | ౧౩ |
| ౨ | ఆః | ఏ | భగమాలినీ | శూన్యం | లవణసముద్రము | ౧౪ |
| ౧ | అం | క | కామేశ్వరి | మూలాధారము-పాయువు | జంబూద్వీపము | ౧౫ |

## నిత్యాపరివర్తన క్రమము.

నిత్యాతంత్రే:—

శ్లో. కృతాదివర్షాదారభ్య ప్రతిపక్షమితి స్థితాః,
ద్వితీయాదిషు వర్షేషు క్రమాత్తాః పరివృత్తిభిః.
షోడశాబ్దే పరే వ్యోమ్ని లలితా సలిలాంబుధౌ,
చిత్రాది భవతీత్థం హి భజంతే పరివర్తనమితి.

తా. పైనచూపించిన నిత్యాచక్రమందుగల ప్రథమకక్షలో నంకములు, శుక్లపక్షమందుగల ప్రతిపదాదితిథులు. రెండవకక్షలోనివి షోడశస్వరములు. మూడవకక్షలోనివి పంచదశీమంత్రవర్ణములు. నాలుగవ కక్షలోనివి పంచదశనిత్యలు. ఈపంచదశషోడశీయగు మహానిత్యాకలవలన కలిగి తిరిగి అందు లయమగుచున్నవని వెనుక చెప్పఁబడినది మంత్రవర్ణములు. ఈపంచదశనిత్యలు షోడశనిత్యాస్వరూపములు. షోడశస్వరములును నిత్యారూపములు. ఈనిత్యలు పంచదశతిథ్యధిదేవతలు. మహానిత్య కామేశ్వరీత్రిపురసుందరి. ఇదియే ధ్రువకలగా నున్నది. అయిదవకక్ష మూలాధారాదిద్వాదశాంతమువరకును పదియాఱుస్థానములు. ఆఱవకక్ష సప్తద్వీప, సప్తసముద్ర మేరు, సుధాసింధువు లనుపదియాఱు. ఏడవకక్ష కృష్ణపక్షతిథులు. లలితాంబతో పదియాఱు నిత్యలును నీపదియాఱుస్థానములయందును నొక్కొకస్థానమం దొక్కొక నిత్యచొప్పున పరివర్తన చేయుచున్నారు.

పరివర్తనక్రమము:—కృతాదియుగములు నాలుగు. ప్రతియుగమందును వర్షములు నాలుగు. ఇట్లు చతుర్యుగసమిష్టివర్షములు పదియాఱు. ఈ పదియాఱులో పది యైదువర్షములు కాలభేదమును తెలుపుచు తిథిరూపములతో నున్నవి. పదియాఱవది వృద్ధిక్షయరహితము, దేశకాలవస్తువిభాగము లేనిది గాన, నిచట వర్షము లనఁగా తిథులని గ్రహింపవలెను. ప్రతితిథియందును ఈ షోడశనిత్యలు [illegible]క స్థానమం[illegible]ండును. ప్రతివారును (౧౫) పదిహేను రోజులకు [illegible] వారు సుధాసింధువును పొందుచుందురు. మరుసటిదినమున వెనుక వారు ముందుకు నడచుచుందురు. సుధాసింధువునందున్న వారు కృష్ణపక్షతిథులందు నవతరింతురు. శుక్లపక్షమునం దారోహణక్రమము, బహుళ

పక్షమం దవరోహణాక్రమము. ఇట్లు పంచదశనిత్యలు సప్తద్వీప, సప్త సముద్ర, మేరు, సుధాసింధువులను నిత్యము పరివర్తనము చేయు చున్నారు. బ్రహ్మాండ, పిండాండములు సమానధర్మములు గలవిగాన మూలాధారాది పరాకాశముపర్యంతము నాయాస్థానము లందున్న ఆయా ద్వీపసముద్రములందు నాయాతిథులందు నాయా నిత్యాదేవతలు పరివర్తనము చేయుచున్నారని తాత్పర్యము.

**నిత్యామాతృకానామపారాయణవిషయము. ౨౦౬౩౭ నామాలు.**

**మాతృకావివేకే:—**

శ్లో. అఆఈపల్లవితైః పరస్పరయుతైర్ద్విత్రిక్రమాద్యక్షరైః
కాదిక్షాంతగతైస్స్వరాదిభిరథ క్షాంతైశ్చ తైస్సైస్స్వరైః,
నామాని త్రిపురే భవంతి ఖలు యాన్యత్యంతగోప్యాని తే,
తేభ్యో భైరవపత్ని వింశతిసహస్రేభ్యః పరేభ్యో నమః.

అర్థస్తు. అఆ ఇఈ ఇత్యారభ్య క్షాంతాని భగవత్యా నామాని భవంతి. అకార ఏకః. కకారాదయః పంచత్రింశదిత్యేవం షట్త్రింశదక్షరాణి షట్త్రింశద్వర్ణరూపాణి. తేష్వేకైకస్య షోడశభిస్స్వరైర్యోగే క్రమేణ తావంతో మాసాః. తేన షట్సప్తత్యుత్తరాణి పంచశతాని వర్ణాని భవంతి. ఏతాని ప్రథమాక్షరాణి. ఏష్వేకైకం ప్రథమం కృత్వా ద్వితీయవర్ణస్థానేషు షట్త్రింశత్క్రమేణ నిక్షిపేత్. అంతే చ అం ఈ మితి పల్లవం తతో నమ ఇతి యోజయేత్. తతశ్చ వింశతిసహస్రాణి సప్తశతాని షట్త్రింశచ్చ నామాని భవంతి. తేషాం చ పారాయణం పంచధోక్తం.

దినతో వారతః పక్షతో మాసా త్షట్త్రింశతా దివసైర్వా ఇత్యాదినా తదిదం నామపారాయణాక్రమం.

**దేవీభాగవతే ద్వితీయస్కంధే:—**

అకారాదిక్షకారాంతైస్స్వరైర్వర్ణైస్తు యోజితైః,
అసంఖ్యేయాని నామాని భవంతి రఘునందనేతి.

ప్రథమశ్లోకతాత్పర్యము:—నామోద్ధారము. అకారాది స్వరములు ౧౬. ఇవి నిత్యాక్షరములు. కాదిక్షాంతవ్యంజనములు ౩౫.

ఇందులో అకారము చేర్చేది. అపుడు ౩౬ అగును. ఇవి వర్షములు. స్వరసంఖ్యచే వర్షసంఖ్యను గుణింపఁగా స్వరగుణితవర్షములు ౫౭౬. ఇవి మాసములు. వర్షసంఖ్యచే మాసములను గుణింపఁగా ౨౦౭౩౬. ఇది నామసంఖ్యయగుచున్నది. ప్రతినామమును సప్తాక్షరములు గలది. అందు ఆం ఈం నమః ఈనాలుగు అక్షరములు పల్లవములు. నామాదినున్న బీజత్రయము నిత్యాక్షర, యుగాక్షర, మాసాక్షరములు. ఇవి మారు చుండును. ఇందు స్వరములు విమర్శాంశములు, వర్ణములు ప్రకాశాంశ ములుగాన, నీ యుభయసంయోగము బ్రహ్మస్వరూపముగా నున్నది. ఉదాహరణము. ౧ అం కం అం ఆం ఈం నమః. ౨ అం కం కం ఆం ఈం నమః. ౩ అం కం ఖం ఆం ఈం నమః. ౪ అం కం గం ఆం ఈం నమః. ౫ అం కం ఘం ఆం ఈం నమః. ఈరీతిని ౨౦౭౩౬ ఇరవైవేల ఏడువందల ముప్పదియారు నామములను ఉద్ధారముచేసి పారాయణ చేయవలెను. పారాయణక్రమము ఒకరోజునగాని, ఒకవారముగాని, ఒకపక్షముగాని, మాసముగాని, ౩౬ దినములకుగాని ఒకపారాయణను ఈ అయిదువిధములుగా చేయవలెనని తాత్పర్యము.

౧౪-వ సూత్రము, విద్యాయాః తత్త్వాత్మకత్వం.

**మూ.** అజ్వ్యంజనబిందుత్రయసమష్టిభేదైర్విభావితాకారా,
షట్త్రింశత్తత్త్వాత్మా తత్త్వాతీతా చ కేవలా విద్యా.

అ. అచః స్వరాః, వ్యంజనాని హలః, బిందుత్రయం అనుస్వార త్రయం. అజ్వ్యంజనబిందుత్రయసమష్టిభేదైః = స్వరములు వ్యంజనములు అనుస్వారత్రయము అను మూఁడువిధములయిన, సమష్టి-వ్యష్టిభేదముచేత, విభావితాకారా=విభజింపఁబడినస్వరూపముగలదై, షట్త్రింశత్తత్త్వాత్మా = ముప్పదియాఱుతత్త్వములు శరీరముగాఁగలదియు, కేవలా = ఏకా కిగానున్నందున, తత్త్వాతీతా చ=సకలతత్త్వములకన్న వేఱుగానున్నది అయిన, విద్యా = పంచదశీవిద్య, జయతి = సర్వోత్కర్షగా ప్రకాశించు చున్నది.

తా. ప్రకృతమందు వర్ణించుచున్న పంచదశీవిద్యకు విశ్వాత్మ కత్వమును, విశ్వాతీతత్వమును చెప్పుచున్నారు:— ఈ పంచదశీవిద్య, సమష్టి వ్యష్టిభేదముచేత శివాది క్షిత్యంతమందున్న షట్త్రింశత్తత్త్వము

లును తన శరీరములుగాగలదిగాన, విశ్వాత్మకత్వము నీతత్త్వములకన్న వేరుగనున్నందున విశ్వాతీతత్వమును గలదని తెలియుచున్నది. షట్త్రింశత్తత్త్వవిభాగము:—ఈపంచదశీవిద్య వాగ్భవకామరాజశక్తికూట ములని మూడుకూటములు గలది. అందు ప్రథమకూటమందు ౫ బీజ ములును, ద్వితీయకూటమందు ౬ బీజములును, తృతీయకూటమందు ౪ బీజములును గలిగియున్నది. అందు స్వరములు, వ్యంజనములు, బిందు వులు అను నీ మూడువిధముల భేదముచేత ౩౬ విధములు రూప ములుగల వర్ణములు కలిగియున్నందున నీవర్ణములు షట్త్రింశత్తత్త్వము లుగా సూచనమగుచున్నది గనుక, నీమంత్రాధిదేవతకు తత్త్వాత్మకత్వ మును, సకలతత్త్వాతీతముగాన ఏకాకియు గావున తత్త్వాతీతత్వమును, విశ్వోత్తీర్ణత్వమును గలది.

ఇందుగల షట్త్రింశద్వర్ణవిభజనక్రమము నీవిద్య కాదిహాది భేదము కలిగి సకలనిగమాగమప్రసిద్ధముగా నున్నది. అందు కాదివిద్య యందు

ప్రథమఖండమందు సప్తస్వరాః; పంచవ్యంజనాని; ౭ ఏడు స్వర ములు, ౫ అయిదు వ్యంజనములు సమష్టి ద్వాదశసంఖ్యగలది.

ద్వితీయఖండమందు ౬ షట్స్వరములు, ౮ అష్టవ్యంజనములు, సమష్టి ౧౪ చతుర్దశవర్ణములు.

తృతీయఖండమందు ౪ నాలుగు స్వరములు, ౬ ఆరు వ్యంజన ములు, సమష్టి ౧౦ దశవర్ణములుగలది. ఇది కాదివిద్యాక్రమము.

హాదివిద్యలో ప్రథమకూటమందు మాత్రము పంచస్వరములు, సప్తవ్యంజనములు, తక్కినది సమానము. సర్వసమష్టి ౩౬ షట్త్రిం శత్ వర్ణములు గలది. ఈతత్త్వములు శివాదిక్షిత్యంతము వ్యాపించి యున్నందున నీవిద్యయు తత్త్వాత్మకత్వము గలదని చెప్పిరి. 'కేవలా' యనినందున కామకలాస్వరూపిణిగ నున్నదని చెప్పిరి.

ఈ విశ్వాత్మకత్వనిస్తోత్తీర్ణములు ఆగమరహస్యము. సాధక జనశరీరములు చతుష్కూటాత్మకములు. మూలాధారాది ఆజ్ఞాంతము నకు కూటత్రయము. ఆజ్ఞోపరితురీయకూటము. ఈ తురీయకూటమందు

మహానిత్యాకల, ధ్రువకల సాక్షిగానున్నది. ఆ కలవలన నీపంచదశ కలలు ఉత్పన్నమగుచున్నవి. ఈ షట్త్రింశత్తత్త్వములును నాబిందువు వలననే ఉత్పన్నమగుచున్నవిగాన విశ్వమనఁగా శరీరము. తిరిగి యీ ధ్రువకలయందే యీ పంచదశకలలు నేకీభవించుచున్నందున విశ్వాతీతత్వమని చెప్పిరి.

చంద్రకలాజ్ఞానే:—

శ్లో. "ఆధారే తరుణార్కబింబరుచిరం హేమప్రభం వాగ్భవం,
బీజం మన్మథమింద్రగోపసదృశం హృత్పంకజే సంస్థితం,
రంధ్రే బ్రహ్మపదే చ శాక్తమపరం సోమప్రభాభాసురం,
యే ధ్యాయంతి పదత్రయం తవ శివే తే యాంతి సౌఖ్యంపదం" ఇతి.

**౧౯-వ సూత్రము, దేవ్యాఅపి తత్త్వాత్మకత్వం.**

**మూ. విద్యాపి తాదృగాత్మా సూక్ష్మా సా త్రిపురసుందరీ దేవీ,**
**విద్యావేద్యాత్మకయోరత్యంతాభేదమామనంత్యార్యాః.**

అ. విద్యా = చిదానందస్వరూపిణియు, సూక్ష్మా = అపరిచ్ఛేద్యమయిన, దేవీ=స్వచ్ఛప్రకాశ రూపమయిన, లేక విశ్వసర్జనాదిక్రీడాపరాయణ యగు, సా = ప్రసిద్ధమయిన, త్రిపురసుందరీ = త్రిమూర్తివర్గాత్రిలోకాపురాణా, త్రయీమయిత్వాత్తేజోభిన్నాత్మకప్రకృతిత్రయాత్పూర్వగపి సత్వాచ్చ త్రిపురా, సర్వయోగిభి రుపాస్యత్వేన స్పృహణీయత్వా త్సుందరీ ఏవంభూతా దేవతాఽపి = త్రిపురసుందరిదేవియు, తాదృగాత్మా=సకలతత్త్వాత్మకత్వము, తత్త్వాతీతత్త్వము గలది. విశ్వాత్మకత్వము విశ్వోత్తీర్ణత్వమును గలదని తాత్పర్యము. అతః = అందువలన, విద్యావేద్యాత్మకయోః = మంత్రమంత్రాధిదేవతలయిన పంచదశీవిద్యాత్రిపురసుందరిలకు, అత్యంతాభేదం=సార్వకాలికైక్యమును, ఆర్యాః = పరమేశ్వరప్రముఖులు (బ్రహ్మవేత్తలు), ఆమనంతి=చెప్పుచున్నారు.

శ్లో. అహం పంచాక్షరీ సాక్షాత్త్వం తు పంచదశాక్షరీ.

తా. వెనుకటి సూత్రమందు పంచదశీవిద్యకు తత్త్వాత్మకత్వమును, తత్త్వాతీతత్వమును చెప్పఁబడినది. ఇందు నామంత్రాధిదేవతయగు త్రిపురసుందరీ దేవియును నటులనే, తత్త్వాత్మకత్వమును తత్త్వా

తీతత్వమును కలదనియు; మంత్రదేవతల కభేదమని చెప్పిరి. మూర్తిత్రయ, బీజత్రయ, శక్తిత్రయ, ధామత్రయ, తేజస్త్రయములకు ముందున్నదిగాన త్రిపురాయనియు, సర్వయోగులును ఉపాస్యమానత్వేన కోరుచున్నందున, లోకోత్తరసౌందర్యము కలిగినందున, త్రిపురసుందరీయనియు నామము కలిగినదని చెప్పిరి.

ఆత్మవలన ఆకాశాది పంచభూతములును, వానివలన సకల తత్త్వములు కలిగి తిరిగి ఆయాత్మయందు లయమగుచున్నందున, నీపరాశక్తి ఆత్మస్వరూపిణియని రహస్యార్థము. ఈప్రకరణమందు బాలా, పంచదశి, షోడశీవిద్యలును, బాలా, లలితా, రాజరాజేశ్వరీ, మహాత్రిపురసుందరు లాయామంత్రాధిదేవతలుగా నున్నారు. ౧౨-వ సూత్రమందు బాలాబీజత్రయము వ్యక్తమయినది. ౧౬-వ సూత్రమందు పంచదశీవిద్య నిరూపింపఁబడినది. అవశిష్టమయిన షోడశీవిద్యయు మంత్రార్థములును నిచట సూచన మగుచున్నందున నిరూపింపఁబడుచున్నవి.

### శ్రీవిద్యాషోడశాక్షరీస్వరూపము.

**విద్యా ఉద్ధారకశ్రుతిః, వామకేశ్వరతంత్రే:—**

మామాయా స్మరవాగ్భవాశ్చ సపరాః వేదాదిబీజం తతో
హ్రల్లేఖాస్మరమాతృబీజసహితా కూటత్రయం తద్వత్,
శక్తిర్వాగ్భవమారమాయరమయా యుక్తం త్వదీయం మను
ర్భావ్యం షోడశబీజరాజసహితం శ్రీరాజరాజేశ్వరీ ఇతి.

ఈమంత్రబీజములు ముందు మంత్రార్థమందు స్పష్టమగుచున్నవి. ఇందు కూటత్రయమనఁగా, పంచదశీవిద్యాకూటత్రయము మూఁడు బీజములుగా గ్రహింపఁబడినది. ఈకూటత్రయము విభజనమయినపుడు అష్టావింశతి వర్ణములగును.

"విద్యా హ్యష్టావింశతివర్ణమయి" అని గౌడపాదసూత్రము.

**నిత్యాతంత్రే:—**

శ్లో. కోటిభిర్వాజపేయానాం యథా షోడశకోటిభిః,
ప్రియతేఽంబా తథైకేన షోడశ్యుచ్చారణేన చేతి.
శివేచ్ఛయా పరాశక్తిః శివతత్త్వైకతాం గతా,

తతః పరిస్ఫురత్యాదౌ సర్గే తైలం తిలాదివ.
బ్రహ్మణోఽభిన్న శక్తిస్తు బ్రహ్మైవ ఖలు నాపరా,
తథా సతి వృథా ప్రోక్తం శక్తిరిత్యవివేకిభిః,
శక్తిశక్తిమతో ర్విద్వాన్ భేదాభేదస్తు దుర్ఘటః.

**అథ శ్రీవిద్యామహాపాదుకామంత్రోద్ధారః.**

**హంసరహస్యే:—**

శ్రు. హంసశ్శివస్సోహముక్త్వా తారత్రయమతఃపరం,
కుమారిమోంఖేచరీం చ శ్రీవిద్యాషోడశాక్షరీ.
హాదిపంచదశీం తుర్యాం శ్రీప్రాసాదమతఃపరం,
ఆనందభైరవద్వంద్వం పరాప్రాసాదమేవ చ.
పఠేద్వాక్యాని చత్వారి స్వప్రకాశపదం తతః,
పరిపూర్ణమహాప్రకాశవిమర్శాత్మకమేవ చ.
శ్రీశివానందనాథశ్రీ గురుశ్రీపాదుకాం వదేత్,
పూజయామి నమోఽంతం చ పఠేన్మంత్రం సుధీః క్రమాత్.

ఇతి శ్రీవిద్యామహాపాదుకామంత్రోద్ధారః. మంత్రస్తు గురుముఖైకవేద్యం. అత్రస్థహాదివిద్యాయాః లోపాముద్రావిద్యేతి ప్రసిద్ధిః.

**అథ కామకలాఏకాక్షరీవిద్యా.**

అస్య శ్రీసౌభాగ్యలక్ష్మీ కామకలా ఏకాక్షరీమహామంత్రస్య, దక్షిణామూర్తి ఋషిః, నృచద్గాయత్రీ ఛందః, సౌభాగ్యలక్ష్మీ ర్దేవతా, శం బీజం, ఈం శక్తిః, రం కీలకం, చతుర్వర్గ పురుషార్థసిద్ధ్యర్థే వినియోగః. శ్రాం-అం, శ్రీం-త, శ్రూం-మ, శ్రైం-అనా, శ్రౌం-కని, శ్రః-కర. ఏవం హృదయాదిన్యాసః. భూర్భువస్సువరోమితి దిగ్బంధః.

**ధ్యానమ్.**

శ్లో. అగ్రబిందుపరికల్పితాననా మన్యబిందురచితస్తనద్వయీం,
నాదబిందురశనాగుణాస్పదాం నౌమి తే పరశివాం పరాం కలాం.
ఈకారోర్ధ్వగతో బిందు ర్ముఖం భాను రధో ముఖౌ,
స్తనౌ దహనసీతాంశూ యోని ర్హార్ధకలా భవేత్.

చతుర్భుజే చంద్రకలావతంసే కుచోన్నతే కుంకుమరాగశోణే,
పుండ్రేక్షుపాశాంకుశపుష్పబాణహస్తే నమస్తే జగదేకమాతః.

ఇతి స్వశిరసి సహస్రకమలాంతర్గతచంద్రమండలమధ్యస్థాం పరాదేవతాం స్వాత్మాభిన్నాం ధ్యాత్వా, లమిత్యాదిపంచోపచారైః స్వం పూజ్య, మనుః. శ్రీం ఇత్యేకాక్షరీమనుంజపేత్.

ద్వాదశలక్షజపాత్సిద్ధిః.

తర్పణహోమశాంత్యాదికం తత్తద్దశాంశం కార్యం. సదా అంతే శ్రీసూక్తం జపేత్. స సర్వాన్కామా నవాప్నోతి, ఆత్మానం చ విందతి, స జీవన్ముక్తో భవతి, ఇతి ఋగ్వేదీయా సౌభాగ్యలక్ష్మ్యుపనిషత్ప్రోక్తం.

శ్లో. సచ్ఛిష్యాయోపదేష్టవ్యా గురుభక్తాయ సా కలేతి.

ఈప్రకరణమందు షోడశకలలు వర్ణింపఁబడుచున్నవి. అందు పంచదశకలలు వృద్ధిక్షయములు గలవనియు, షోడశీకల వృద్ధిక్షయరహితమనియు, నది ధ్రువకలగాను, ప్రకాశవిమర్శాత్మకమనియు నిరూపింపఁబడుచున్నది. ఇట్లు వివరించుటకు ఆగమమందు మాత్రమా, నిగమములందుఁగూడ నీధ్రువకలను గురించి ప్రసంగము గలదాయనిన, నిగమవిరుద్ధమైన ఆగమము లేదు. ఆగమవిరుద్ధనిగమము నుండదు. కాన కొన్నివిషయములు నిగమములందు బీజములుగానుండి ఆగమమందు విస్తరింపఁబడుచున్నవి. అట్లే ఆగమమందు బీజములుగానుండి నిగమములందు స్పష్టమగుచున్నవి. కాన నీసమయమతము నిగమాగమసమ్మతముగా నున్నది. ఈవ్యాఖ్యానము నిగమాగమవిద్వదనుభవముల సామరస్యముగా రచింపఁబడినది.

**షోడశీకలను ప్రతిపాదించునట్టి శ్రుతులు.**

**ప్రశ్నోపనిషత్:—**

శ్రు. ఇమా నద్య స్స్యందమానా స్సముద్రాయణా స్సముద్రం ప్రాప్యాస్తం గచ్ఛంతి, భిద్యేతే తాసాం నామరూపే సముద్ర ఇత్యేవం ప్రోచ్యతే.

ఏవమేవాస్య పరిద్రష్టు రిమా షోడశకలాః పురుషాయణాః పురుషం ప్రాప్యాస్తంగచ్ఛంతి, భిద్యేతే తాసాం నామరూపే పురుష ఇత్యేవం ప్రోచ్యతే, సఏషోకలోఽమృతో భవతి తదేష శ్లోకః.

అరాఇవ రథనాభౌ కలాయస్మిన్ ప్రతిష్ఠితాః,

తం వేద్యం పురుషం వేద యథా మావో మృత్యుః పరివ్యథాఇతి.

తా. జగత్తునందుఁగల గంగా, గోదావరీ మొదలగు నదులు వేరు వేరు నామరూపములు గలిగి యున్నవి. ఇవి సముద్రోదకము సూర్యకిరణములద్వారా గ్రహింపఁబడి మేఘరూపమున వర్షించిన జల ప్రవాహములు కలవై, నామరూపములు గలిగి తిరిగి ఆసముద్ర మందు నామరూపములతోఁ గూడ లయమగుచున్నవి. అటులనే షోడశీ కలాస్వరూపమయిన పరమాత్మయనే పురుషునివలన అవ్యక్తమహత్తత్త్వాహంకారమనఃప్రాణములనే పంచకమును, శబ్దస్పర్శాదిసూక్ష్మభూత పంచకమును, జ్ఞానేంద్రియ పంచకమును, నీపంచదశకలలును ఉత్పన్నము లయి వేరువేరునామరూపములు గలిగి తిరిగి ఆయాత్మయందు యథా క్రమముగా లయమగుచున్నవి.

రథనాభియందు చక్రఖండము లున్నట్లు, పరమాత్మయం దీకలలు పదిహేనును ఆధారము కలవయి యున్నవి. ఇట్లు తెలుసుకొనఁదగిన షోడశీకలాస్వరూపమయిన బిందుమండల మధ్యవర్తియగు ప్రత్యగాత్మను తెలుసుకొనినవారు అవిద్యారూపమృత్యువిముక్తు లగుచున్నారని యీ శ్రుతితాత్పర్యము.

**ముండకోపనిషత్ :—**

శ్రు. గతాః కలాః పంచదశ ప్రతిష్ఠాః దేవాశ్చ సర్వే ప్రతిదేవతాసు,

కర్మాణి విజ్ఞానమయశ్చ ఆత్మ పరేఽవ్యయే సర్వ ఏకీభవంతి.

యథా నద్యస్స్యందమానాస్సముద్రే ఽస్తం గచ్ఛంతి నామ రూపే విహాయేతి.

తా. పిండాండమందుఁగల ఇంద్రియపాలకులయిన మిత్ర, వరుణ, అర్యమ, ఇంద్ర, బృహస్పతులును; చంద్ర, విష్ణు, చతుర్వక్త్ర, శంభు లనెడి అంతఃకరణాధిదేవతలును, వీరియందు ప్రతిష్ఠింపఁబడిన ఇంద్రి

యాదిపంచదశకలలును, ఈదేవతలును, వీరివలన జరిగే శబ్దస్పర్శాదికర్మలును, నీభేదమును తెలుసుకొనే జ్ఞానశక్తియు, సర్వసమష్టి రూపమయిన అహమనే ఆత్మయును, సచ్చిదానంద స్వరూపమయిన పరమాత్మయనే షోడశీకలయందు సముద్రమందు నదులువలెనే ఏకీభవించు చున్నవని తాత్పర్యము.

శ్రు. షోడశకలః పురుషః పంచదశాహానిమాశీః. కామ మపః పిబాపోమయః ప్రాణో న పిబతో విచ్ఛేత్స్యత ఇతి.

యథా సోమ్య మహతో ఒభ్యాహితం తస్యైకో౽ంగారః ఖద్యోతమాత్రం పరిశిష్టం తం తృణై రుపసమాధాయ ప్రజ్వాలయేత్తతో౽పి బహు దహేత్. ఏవగ్ం సోమ్య తే షోడశానాం కలానామేకా కలా౽తి శిష్టా భూత్సాన్నేన సోపసమాహితా ప్రాజ్వాలీ త్తయైతర్హి వేదాననుభవత్యన్నమయగ్ం హి సోమ్య మన, ఆపోమయః ప్రాణ స్తేజోమయో వాగితి తద్ధాస్య విజజ్ఞావితి విజజ్ఞావితి.

ఛాందోగ్యోపనిషత్. ప్రపా. ౬. ఖం. ౭.

తా. పురుషుఁడు షోడశకలలు గలవాఁడు. ప్రాణము జలమయము. మనస్సు అన్నమయము. వాక్కు తేజోమయము. పదియయిదు దినములు జలపానముచేయుచుండిన ప్రాణము నిలుచును. అన్నము లేనందున మనస్సు క్షీణించును. ఖద్యోతమాత్రము అగ్నికణమును శుష్కతృణములచే వృద్ధినొందింపవచ్చును. ఆవృద్ధినైన అగ్నివలన అనేకము దహింపవచ్చును. అటులనే అణుమాత్రమయిన జ్ఞానమును వృద్ధినొందించినయెడల సర్వజ్ఞుఁడు కాఁగలఁడు గాన, పురుషునియందుఁగల పదియాఱుకలలలో నొకకల జ్ఞానమనేది ఉత్కృష్టమయినది. అది అన్నముచే వృద్ధినొందునుగాన నాకలవలన అవిద్యా విముక్తుఁడయి, స్వస్వరూపమును పొందఁగలఁడని అరుణపుత్రుఁడయిన ఉద్దాలకమహర్షి శ్వేతకేతువనే తనశిష్యున కిట్లుపదేశించెను.

శ్రు. స ఏష సంవత్సరః ప్రజాపతిఃషోడశకల స్తస్యరాత్రయ ఏవపంచదశకలాధ్రువైవాస్య షోడశీ కలా సరాత్రిభి రేవాచపూర్యతే౽చపక్షీ

యతే తస్మా దేతాగ్ం రాత్రిం ప్రాణభృతః ప్రాణం న విచ్ఛింద్యాదపి కృకలాసస్యైతస్యా ఏవ దేవతాయా అపచిత్యై.

బృహదారణ్య. ౧. అధ్యా. ౕ. బ్రా. ౧౪.

యోవై స సంవత్సరః ప్రజాపతిః షోడశకలోఽయమేవ సయోఽయమేవం విత్పురుష స్తస్య విత్తమేవ పంచదశకలా ఆత్మైవాస్య షోడశీ కలా సవిత్తేనైవ పూర్యతేఽచ క్షీయతే.

బృహదారణ్యకోపనిషత్. ౧. అధ్యా. ౕ. బ్రా. ౧౫

తా. షోడశకలలకు సంవత్సరమనేది కాలస్వరూపప్రజాపతి యనే నామము గలదిగా నున్నది. ఆ సంవత్సరమునకు నీ షోడశకలలు అవయవములుగానున్నవి. అందు షోడశీకల ధృవకలగానున్నది. ఈ ప్రజాపతిశబ్దము సృష్టికర్తయందును ౩౬౦ దినరూపకలలకు అధిపతియయిన సంవత్సరమందును వర్తించుచున్నది. ఇందు రాత్రులు ముఖ్యములు. షోడశీకల రాత్రులచేతనే వృద్ధిక్షయములను పొందుచున్నది. శుక్లపక్షరాత్రులచే వృద్ధినిపొంది పౌర్ణమాసి యనిపించుకొనును. కృష్ణపక్షరాత్రులచే క్షయమునుపొంది అమావాస్య యనిపించుకొనును. ఆదినమందు ధ్రువకలమాత్రము నిలిచియుండును. ఆ కల అమావాస్యయందు ప్రాణులందును లీనమయియుండును గాన, నాదినమందు నేప్రాణికిని హింసకలుగఁజేయఁగూడదు. కృకలాసమన ఊసరవెల్లి యనే ఒకపాపజంతువు. దానిని చూచిన అమంగళమని జనులు హింసింతురు. అట్లే అమావాస్య కలారహితముగాన నాదినమున నెంత మాత్రము ప్రాణిహింస కూడదని అభిప్రాయము. రాత్రిరూపమయిన కాలకర్షిణియనే సరఘ, (మధుమక్షిక) శుక్ల, కృష్ణపక్షభేదముచే పంచదశకలలనే ధనమును పూరించుచు హరించుచు నుండును. కాన నీ పంచదశకలలు నీ షోడశీకలయొక్క ధనముగా నున్నవి. ఆధ్రువకలయే పరమాత్మయని యాజ్ఞవల్క్య మహాఋషి తమ శిష్యుల కుపదేశించినట్లు తెలియుచున్నది.

కనుక నీషోడశీకల సకలనిగమాగమములందును శ్రుతిస్మృతిపురాణేతిహాసములచేతను ప్రతిపాదితమయి, జగద్విశ్రాంతమయి యున్నది.

ఇతి ధ్రువకలానిరూపణం.

**అథ మంత్రార్థవిచారః.**

ఆదౌ ద్విజత్వసాధనీభూతగాయత్రీమన్త్వార్థవిచారః.

శ్లో. తద్జ్ఞానార్థ ముపాయా విద్యా లోకే చతుర్దశ ప్రోక్తాః,
తేష్వపి చ సారభూతా వేదా స్తత్రాపి గాయత్రీ.
తస్యా రూపద్వితయం తత్రైకం యత్ప్రకర్యతే స్పష్టం,
వేదేషు చతుృష్వపి పరమత్యంతం గోపనీయతరమితి.

విశ్వామిత్రకల్పే.

**త్రిపాదగాయత్రీవర్ణాధిదేవతాః.**

శ్లో. అక్షరాణాం తు దైవత్వం సంప్రవక్ష్యామ్యతఃపరం,
ఆగ్నేయం ప్రథమం జ్ఞేయం వాయవ్యం చ ద్వితీయకం.
తృతీయం సూర్యదైవత్యం ఈశాన్యం తు చతుర్థకం,
ఆదిత్యం పంచమం జ్ఞేయం షష్టమాంగీరసం స్మృతం.
పైతృకం స్యాత్సప్తమం తు భర్గాఖ్యం చాష్టమం విదుః,
అర్యమ్ణం నవమం జ్ఞేయం గాంధర్వం దశమం తథా.
పౌష్ణమేకాదశం ప్రోక్తం మైత్రావరుణ మతఃపరం,
త్వాష్ట్రం త్రయోదశం జ్ఞేయం వాసవం తు చతుర్దశం.
వామదేవ్యం పంచదశం మిత్రావరుణషోడశం,
జ్ఞేయం సప్తదశం ధాత్రం వైశ్వదేవ మతఃపరం.
వైష్ణవం చైకోనవింశం ప్రాజాపత్యం తు వింశకం,
సర్వదేవమయం ప్రోక్త మేకవింశ మతఃపరం.
కౌబేరం తు తతః ప్రోక్తం త్రయోవింశం తథాఽఽశ్వినం,
బ్రాహ్మం చతుర్వింశతిక మేతా హ్యక్షరదేవతాః.
జపకాలే తు సంస్మృత్య తాసాం సాయుజ్యమాప్నుయాత్.

**శ్రీగాయత్రీపరమార్థః, యోగయాజ్ఞవల్క్యః.**

శ్లో. తచ్ఛబ్దేన తు యచ్ఛబ్దో బోద్ధవ్య స్సతతం బుధైః,
ఉదాహృతే తు యచ్ఛబ్దే తచ్ఛబ్దస్స్యాదుదాహృతః.
సవితా సర్వభూతానాం సర్వభావాన్ ప్రసూయతే,
సవనాత్ప్రేరణాచ్చైవ సవితా తేన చోచ్యతే.

దీప్యతే క్రీడతే యస్మా ద్రోచతే ద్యోతతే దివి,
తస్మా ద్దేవ ఇతి ప్రోక్తః స్తూయతే సర్వదేవతైః.
చింతయామో వయం భర్గంధియో యో నః ప్రచోదయాత్,
ధర్మార్థకామమోక్షేషు బుద్ధివృత్తీః పునఃపునః.
భృజః పాకే భవే ద్ధాతు ర్యస్మా త్పాచయతే హ్యసౌ,
భ్రాజతే దీప్యతే యస్మాత్ జగదంత్యే హరత్యపి.
కాలాగ్నిరూప మాస్థాయ సప్తార్చి స్సప్తరశ్మిభిః,
భ్రాజతే తత్స్వరూపేణ తస్మా ద్భర్గ స్స ఉచ్యతే.
భేతి భాసయతే లోకాన్ రేతి రంజయతే ప్రజాః,
గ ఇత్యాగచ్ఛతేఽజస్రం భరగో భర్గ ఉచ్యతే.
ఆదిత్యాంతర్గతం యచ్చ జ్యోతిషాం జ్యోతిరుత్తమం,
హృదయే సర్వభూతానాం జీవభూతస్స తిష్ఠతి.
హృద్వ్యోమ్ని తపతి హ్యేష బాహ్యే సూర్యస్య చాంతరే,
అగ్నౌ వా ధూమకేతౌ చ జ్యోతి శ్చిత్రకరం చ యత్.
హృద్యాకాశే చ యో దేవస్సాధకై రుపవర్ణ్యతే,
స ఏవాదిత్యరూపేణ బహి ర్నభసి రాజతే.
వరేణ్యం వరణీయం చ జన్మసంసారభీరుభిః,
ఆదిత్యాంతర్గతం యచ్చ భర్గాఖ్యం వై ముముక్షుభిః.
జన్మమృత్యువినాశాయ దుఃఖస్య త్రివిధస్య చ,
ధ్యానేన పురుషో యస్తు ద్రష్టవ్యస్సూర్యమండలే.
ఈశ్వరం పురుషాఖ్యం తు సత్యధర్మాణ మచ్యుతం,
భర్గాఖ్యం రుద్రసంజ్ఞం తు జ్ఞాత్వా త్వమృతమిచ్ఛతి.
రవిమధ్యే స్థిత స్సోమ స్సోమమధ్యే హుతాశనః,
తేజోమధ్యే స్థితం సత్యం సత్యమధ్యే స్థితోఽచ్యుతః.
అంగుష్ఠమాత్రః పురుషః పూర్వమేవ మయేరితః,
శంకరేణ తథా దృష్టః ప్రభవ స్సర్వతేజసాం,
స విష్ణు ర్భువనాధారో యస్యేదం సకలం జగత్.

**విద్యారణ్యకృతమ్.**

తదిత్యవాఙ్మనోగమ్యం ధ్యేయం యత్సూర్యమండలే,
సవితు స్సకలోత్పత్తిస్థితిసంహారకారిణః.

వ రేణ్య మాశ్రయణీయం యదాధారమిదం జగత్,
(న) భర్గః స్వసాక్షాత్కారేణావిద్యాతత్కార్యదాహకం.
దేవస్య ద్యోతమానస్య హ్యానందాత్క్రీడతోఽపివా,
ధీమహ్యాహం స ఏవేతి తేనైవాభేదసిద్ధయే.
(స్త్రీ) ధియోఽంతఃకరణస్య త్తేశ్చ ప్రత్యక్ప్రవణచారిణీః,
(పుం) య ఇత్యలింగధర్మ్యం యత్సత్యజ్ఞానాదిలక్షణం.
నోఽస్మాకం బహుధా ఽభ్యస్తభిన్న భేదదృశాం తథా,
ప్రచోదయాత్ప్రేరయతు ప్రార్థనేయం విచార్యతే.

**అత్ర ఖండరాజః.**

యస్సూర్యః ప్రేరయతి నో బుద్ధీర్దీప్తస్య తస్య వై,
ఖ్యాతం స్వరూపం ధ్యాయేమ సేవ్యం పాపాదిభర్జకం.

అర్థః—యస్సవితా, నః = అస్మాకం, ధియః = బుద్ధివృత్తీః, ప్రచోదయాత్ = ప్రేరయతి, సవితుః = జగత్ప్రసవితుః, దేవస్య = దీప్తస్య, వరేణ్యం = సేవ్యం, భర్గః = అవిద్యాపాపాదిభర్జకం, తత్ = ప్రసిద్ధ స్వరూపం, ధీమహి=ధ్యాయేమ, యః = పుం, ధియః=స్త్రీ, భర్గః=నపుంసక లింగం.

**అత్ర సాయణః.**

శ్లో. బుద్ధీః కర్మాణి వా స్మాఽకం యః ప్రేరయతి తస్య తత్,
దేవస్య సవితుః ఖ్యాతం వరేణ్యం చింతయే మహః.

అర్థః—యస్సవితా, నః = అస్మాకం, ధియః=ప్రజ్ఞాః, కర్మాణివా, ప్రచోదయాత్=ప్రేరయతి, తస్య = సవితుః, ప్రేరకస్య, అంతర్యామిణః, దేవస్య = ప్రకాశమానస్య (పరమాత్మనః) వరేణ్యం = వరణీయం (ప్రార్థనీయం) (సుఖైకతానరూపం) సర్వైస్సుఖైస్యైవ ప్రార్థనీయత్వాత్, భర్గః = సంసారదాహకం, తత్ = సర్వేషు వేదేషు లోకేషు చ ప్రసిద్ధం బ్రహ్మస్వరూపం, ధీమహి=ధ్యాయామః.

**గాయత్రీతురీయపాదస్య అర్థవిచారః.**

పరోరజసిసావదోం. పరో రజసి సా అవతు ఏవం పదవిభాగః. రజసః పరః పరోరజః తస్మిన్ పరోరజసి రజసః మూలప్రకృతేః పరః

అగ్రే స్థితం య త్తేజః సంవిద్రూపం వా మూలప్రకృతేః పరః పురుషః తస్మి న్సంవిద్రూపేణ యా స్థితా సా సర్వోపనిషత్ప్రతిపాదిత బ్రహ్మశ క్తిర్వా, రజసః శబలబ్రహ్మాత్మకపూర్వోక్తపాదత్రయా త్పరం శుద్ధబ్రహ్మమయ అసంగచిద్రూపా ధ్రువకలా నామ త్రిపురసుందరీ వా నః సాధకపుంగ వాన్ అవతు రక్షత్వితి అత్ర జ్ఞానయోగప్రకరణే రజశ్శబ్దతమశ్శబ్దౌ మూలప్రకృతివాచకౌ.

శ్రు. వేదాహ మేతం పురుషం మహాంతం ఆదిత్యవర్ణం తమసఃపరస్తాత్,
తమేవం విద్వా నమృత ఇహ భవతి.

అత్రాపి తమసః పరస్తాత్. మూలప్రకృతే ర్యః పరస్తాత్. అసంగత్వేన అన్యథా స్థితః తం పురుషం యస్సాధకః వేద సః ఇహఅస్మి న్నేవజన్మని అమృతః మరణధర్మరహితో భవతి; బ్రహ్మభూతో భవతీతి యావత్. అన్యచ్చ.

శ్రు. ఇంద్రియేభ్యః పరాహ్యర్థాః అర్థేభ్యశ్చ పరం మనః,
మనసశ్చ పరా బుద్ధిః బుద్ధేః పరతరం మహాః.
మహతః పర మవ్యక్తం అవ్యక్తా త్పురుషః పరః,
పురుషా న్న పరం కించి త్సా కాష్ఠా సా పరా గతిః.

అత్ర తు అవ్యక్తనామకగుణత్రయసంవళితమూలప్రకృతి రేవేతి.

శ్రుతిప్రమాణసిద్ధః సకలభావాతీతసచ్చిదానందస్వరూపిణీ పరా శక్తిః అనేకజన్మవాసనావాసితభిన్నభేదయుక్తా న్నః అపరోక్షజ్ఞానరూప స్వసాయుజ్యం దత్వా అవతు రక్షత్వితి స్వస్వరూపజ్ఞానం దేహీతి ప్రార్థనారూపో௨యం తురీయపాదార్థః.

**విశ్వామిత్రకల్పే, యథాహ యాజ్ఞవల్క్యః.**

శ్లో. జ్ఞాత్వా పదాని శ్రుత్వా௨థ తురీయపద మవ్యయం,
బ్రహ్మణా యాతి తత్సామ్యం పదం జ్ఞాత్వా తురీయకం. 1
యోగాయత్రీ త్రిచరణా సా త్రిమూర్తిస్వరూపిణీ,
ఉపాస్యానంతరం విప్రైస్త్రిసంధ్యాసు త్రిమూర్తిషు. 2
తురీయపాద మేతస్యాః జ్ఞాత్వా చోపాస్తి మాచరేత్,
స కృత్స్నపూర్ణాం పృథివీం గృహ్ణాన్నో దోషభాగ్భవేత్. 3

బ్రహ్మా కేశవ రుద్రాది దేవతాభి రుపాసితాం,
సంధ్యాంతాం తాం నవేదేత విప్రస్స్యాదభిలాషుకః. ౪
ఇయం సమస్తశ్రుతిభిర్గాయత్రీ చేత్యుదాహృతా,
విధినై వాభ్యసేద్యావత్తురీయం పరమం పదం. ౫
భూరిత్యాదిత్రిభిస్మంత్రైర్జప్యా గాయత్ర్యనారతం,
తస్య ప్రథమపాదేన భూర్భువ స్స్వర్జగత్త్రయం. ౬
వ్యాప్యం ద్వితీయపాదేన వేదానాం త్రితయం తథా,
తృతీయేన తు పాదేన ప్రాణం వ్యాన మపానకం. ౭
వ్యాప్తం చతుర్థపాదేన పరమం రవిమండలం,
క్రమేణానేన సంక్రాంతం యథావ్యాప్త మిదం జగత్. ౮
గాయత్రీ సర్వదేవానాం మాతా సాక్షా ద్ద్విజాశ్రయా,
తామేవ ప్రజపే ద్భక్త్యా ధ్యాయేచ్చ సతతం ద్విజః. ౯
అథాహమర్థం గాయత్ర్యాః ప్రవక్ష్యామి యథాతథా,
ద్విజోత్తమానాం సద్భక్త్యా జపాదీని ప్రకుర్వతాం. ౧౦
విశ్వాస భక్తిజనక మంత్రై ర్యద్జ్ఞాన ముత్తమం,
తస్మా దర్థం విజానీయా ద్యత్నేన జపకృద్ద్విజః. ౧౧
ద్వాభ్యాం విశ్వాసభక్తిభ్యాం జపాదీనాం మహత్తరం,
ఫలం లభేజ్జపకృతా మితి వేదేషు భాషితమ్. ౧౨
పదాని దశ మంత్రస్య తదాదీని యథాక్రమాత్,
పదం ప్రత్యర్థనిష్పత్తిః స్పష్టం తు క్రియతే ఽత్రహి. ౧౩
ఏషా వ్యాఖ్యాతు గాయత్ర్యాస్సర్వపాపప్రణాశినీ,
విజ్ఞాతవ్యా ప్రయత్నేన ద్విజైస్సర్వశుభేచ్ఛుభిః. ౧౪
జపస్యాభ్యంతరే వ్యాఖ్యా స్మర్తవ్యా మనసా ద్విజైః,
స్మరణా త్సర్వపాపాని ప్రణశ్యంతి న సంశయః. ఇతి శివం.

సప్తకోటిమహామంత్రేషు గాయత్ర్యాస్సర్వోత్తమత్వం ద్విజానా మావశ్యకతాపరాణ్యనేక ఋషిప్రోక్తాని వచనాని శతశః సహస్రశః సంతి. గ్రంథవిస్తరభయా దత్ర న లిఖితం.

**వసిష్ఠకల్పే:—**

అథ వసిష్ఠకల్పే గాయత్ర్యర్థో నిర్దిశ్యతే.

తత్ర గాయత్రీ ప్రణవాదిక సప్తవ్యాహృత్యుపేతా శిరస్సమేతా సర్వదేవతాస్వరూపేతి, ఏవంవిశిష్టగాయత్రీ ప్రణవవ్యాహృతి త్రయ యుక్తా సర్వదేవతాత్మికా జపాదికస్య తత్సవితురిత్యాదిపదైః నిర్దిశ్యతే.

ఓం. తదితినిర్దేశో బ్రహ్మణస్త్రివిధః. తచ్ఛబ్దేన పరబ్రహ్మోచ్యతే. సవితురితి సృష్టిస్థితిలయోపలక్షణం. సర్వప్రపంచాధికత్వలక్షణం. వరేణ్యం ఇతి నిరతిశయానందస్వరూపం, భర్గ ఇతి ఆధ్యాదిదోషవర్జనం, దేవస్యేతి సర్వాధిష్ఠానభూతం, ధీమహీతి జడప్రపంచనిరసనాత్ బ్రహ్మణి ఏకత్వం భవతి. ధియోయోనః ప్రచోదయాదితి. నిర్దిష్టస్యాత్మనః పరబ్రహ్మ భవతి, సర్వాత్మికేయం గాయత్రీ బ్రహ్మబోధకస్సంపద్యతేతి.

**సప్తవ్యాహృతీనామయమర్థః.**

భూరితి-సన్మాత్ర ఉచ్యతే, భువ ఇతి-సర్వంభావయతి, ప్రకాశయతి. సువరితి-సర్వం ప్రియమాణం సుఖస్వరూపం, మహ ఇతి-మహీయతే, సర్వాతిశయత్వం, జనఇతి-జనయతీతి సర్వకారణత్వముచ్యతే, తపఇతి-లోకేశస్వరూపముచ్యతే, సత్యమితి బ్రహ్మైవ, ఆత్మనశ్చిద్రూపాత్మ భావాదితి, యద్వా-భూరాదిసప్తలోకాః, తద్వ్యతిరిక్తం కించిన్నాస్తి. వ్యాహృతయోఽపి సర్వాత్మబ్రహ్మబోధకాః.

**గాయత్రీశిరసోఽప్యయమర్థః.**

ఓమాపో జ్యోతీ రసోఽమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమితి గాయత్రీశిరోమంత్రః. ఆపఇత్యాప్నోతీతి వ్యాపిత్వ ముచ్యతే, జ్యోతిరితి ప్రకాశరూపం, రసఇతి సర్వాతిశాయిత్వం, అమృతమితి మరణాది సంసారనిర్ముక్తత్వం, బ్రహ్మోచ్యతే, భూర్భువస్సువరోమితి సచ్చిదానంద ముచ్యతే. ఏవం సర్వవ్యాపి స్వప్రకాశం సర్వాతిశయం బ్రహ్మగాయత్రీ శిర ఇత్యర్థః ప్రదర్శితః. ఏవం సప్రణవ సప్తవ్యాహృతిపూర్వకపాద చతుష్టయవిశిష్టగాయత్రీజపకర్తుః గాయత్ర్యర్థానుసంధానం వినా గాయత్రీ స్వరూపప్రాప్తిర్న సిధ్యతి. ఇతి బ్రహ్మగాయత్ర్యాః వసిష్ఠ కల్పోక్తప్రకారేణ విశిష్టగాయత్ర్యర్థో నిరూపితః.

శ్లో. అష్టోత్తరసహస్రం వా అష్టోత్తరశతం తు వా,
అష్టావింశతిరేవాథ గాయత్రీం దశకం జపేత్.

ఓంకారః పురుషశ్చైవ గాయత్రీ సుందరీ తథా,
తయోస్సంయోగకాలే తు వస్త్రమాచ్ఛాద్య గణ్యతే.
వరేణ్యం విరలం ప్రోక్తం జపకాలే విశేషతః,
పారాయణే తు యుక్తం స్యాదన్యథా విఫలం భవేత్.
గాయత్రీరహితో విప్రశ్శూద్రాదప్యతిరిచ్యతే,
గాయత్రీబ్రహ్మతత్త్వజ్ఞాస్సంపూజ్యంతే జనైర్ద్విజాః. ౧
క్రియాహీనస్య మూర్ఖస్య మహారోగిణ ఏవ చ,
యథేష్టాచరణస్యాహుః మరణాంత మశౌచకం. ౨
గాయత్రీ నామ పూర్వాహ్నే సావిత్రీ మధ్యమే దినే,
సరస్వతీ చ సాయాహ్నే సైవ సంధ్యా త్రిషు స్మృతా. ౩
ప్రతిగ్రహాన్న దోషాచ్చ పాతకా దుపపాతకాత్,
గాయత్రీ ప్రోచ్యతే తస్మాద్గాయంతం త్రాయతే యతః. ౪
సవితు ర్ద్యోతనాత్సైవ సావిత్రీ పరికీర్తితా,
జగతః ప్రసవిత్రృత్వాద్వాగ్రూపత్వాత్సరస్వతీ. ౫
సర్వాత్మనా హి యా దేవీ సర్వభూతేషు సంస్థితా,
గాయత్రీ మోక్షహేతుర్వై మోక్షస్థానకలక్షణం. ౬

**సంపూర్ణగాయత్రీమంత్రార్థము. పదవిభాగము.**

ఓం భూః. భువః. సువః. తత్. సవితుః. వరేణ్యం. భర్గః. దేవస్య. ధీమహి. ధియః. యః. నః. ప్రచోదయాత్. పరోరజసి. సా. అవతు.

పుం:—యః = లింగధర్మ రహితమయిన సత్యజ్ఞానాది లక్షణములు గల ఏపరమాత్మ, నః = చిరకాలమునుంచి అభ్యాసమయిన భిన్నభేద భావముగల మాయొక్క,

స్త్రీ:—ధియః = అంతఃకరణవృత్తులను, ప్రచోదయాత్ = ప్రేరణ చేయుచున్నదో, తస్యసవితుః = సకలజగదుత్పత్తి స్థితిసంహారకారకుఁడయిన, అంతర్యామిరూపుఁడగు ప్రేరకస్వరూపముగల, దేవస్య=ప్రకాశమానమయిన పరమాత్మయొక్క, వరేణ్యం = ఏది సకలజగత్తుకును నాధారముగా నున్నదో అట్టి ఆశ్రయించదగిన సుఖస్వరూపమయిన,

నః:—భర్గః = స్వసాక్షాత్కారముచేత అవిద్యను దానికార్యవర్గమైన ఆవరణమును విక్షేపమును సంసారమును పాపాదులను దహించెడి,

తత్ =వాఙ్మనస్సులకు అగోచరమయిన సూర్యమండలమందు ధ్యానించ తగిన సకల వేదములందును సకలలోకములందును ప్రసిద్ధముగానున్న ఆబ్రహ్మస్వరూపమును, ధీమహి = నేను ఆబ్రహ్మస్వరూపుఁడనని అట్టి బ్రహ్మతో తనకు అభేదము సిద్ధించుటకొఱకు ధ్యానించుచున్నాను. పరో రజసి=రజసః పరం పరోరజః తస్మిన్ పరోరజసి మూలప్రకృతికంటె వేరుగా నున్న ఏపరమాత్మ గలదో, సా=సకల శ్రుతులయందు ప్రసిద్ధముగా నున్న ఆబ్రహ్మశక్తి, నః = మమ్ములను సాధకపుంగవులను గురుశిష్యులను, అవత్ = తన సాయుజ్యమును నిచ్చి రక్షించుఁగాక. అవిద్యానివృత్తి పూర్వకస్వస్వరూపజ్ఞానము కలుగఁజేయుఁగాక.

ఇందువలన తెలియవలసిన ముఖ్యాంశము.

ఈగాయత్రీమంత్రమును గుఱించి కొంత వెల్లడించుచున్నాను. ఈమంత్రమునకు ద్విజత్వసాధనీవిద్యయని గ్రంథములందు వాడుక గలదు. ఇందుకు కారణము నాలోచింపఁగా మనపూర్వులు అయిదు మొదలుకొని ఎనిమిదిసంవత్సరములకు లోపుగా నుపనయనదీక్షనిచ్చి అందు బ్రహ్మోపదేశమును గాయత్రీ ఉపదేశమును నిచ్చుచున్నారు.

శ్లో. "జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః" అనే వచనమువలన ప్రపంచజ్ఞానము కలుగకపూర్వమే బ్రహ్మజ్ఞానసాధనమగు నీవిద్య నుపదేశించిరి. ఈగాయత్రికి స్థూలమని, సూక్ష్మమని రెండు రూపములు కలవు. అందు వెల్లడిగానున్న చతుర్వింశతివర్ణాత్మకమయిన పాద త్రయముగా నున్నది. అది స్థూలరూపమనియు, నీవిద్యయొక్క తురీయ పాదమును, శ్రీవిద్యాప్రకరణమును సూక్ష్మరూపములుగా నున్నవి. అందువలన ఉపనయనము లఘుదీక్షగాను, శ్రీవిద్యామంత్రదీక్ష పూర్ణ దీక్షగాను వాడుక గలదు. అందువలననే నీగాయత్రీ ఉపాసన ఆరంభ ములో సగుణోపాసనగా, పాదత్రయము మాత్ర ముపాసించుచు అధి కారము కలిగినకొలది నిర్గుణబ్రహ్మప్రతిపాదకమయిన తురీయపాదసహిత ముగా నుపాసించుట శిష్టజనాచరణలో నున్నది.

వసిష్ఠ విశ్వామిత్రాది కల్పములలో గాయత్రీఉపాసననుగుఱించి వివరించినపు డారంభములో నొకలక్షజపమునకు సంకల్పించి ఆదిని త్రిపదాగాయత్రిని ఇరువదివేలు జపముచేసి, పిమ్మట తురీయపాద సహిత

ముగా నొకలక్షజపము చేయవలెననియు, అంతటనుంచి ఆమరణాంత మును తురీయపాదసహితముగనే కాలత్రయమందును ఉపాసించవలె నని చెప్పిరి. పూర్వము ప్రణవవ్యాహృతిత్రయము, తరువాత త్రిపదా గాయత్రి, పిమ్మట తురీయపాదము గలది పూర్ణగాయత్రియని సంకే తముగాన, గాయత్రీజపపరులు ప్రణవవ్యాహృతిత్రయసహితమయిన పాదచతుష్టయమును ఉపాసించుట సంపూర్ణఫలప్రదము. "ఓంభూర్భువ స్సువః" ఇది వ్యాహృతిత్రయము. "భూః భువః సువః మహః జనః తపః ఓగ్ం సత్యం" ఇవి సప్తవ్యాహృతులు.

"ఓమాపో జ్యోతీ రసోఽమృతం బ్రహ్మ భూర్భువ స్సువరోం" ఇది గాయత్రిశిరోమంత్రము.

బ్రహ్మచారి గృహస్థులు ప్రణవత్రయసహితగాయత్రియు, వాన ప్రస్థులు పంచప్రణవసహితముగాను, సన్యాసులు ఏకప్రణవమాత్ర మును ఉపాసించవలెనని వసిష్ఠాది ఋషిమతము. ప్రణవత్రయమనఁగా వ్యాహృతిత్రయపూర్వమందును, ప్రథమపాదాదియందును, తురీయ పాదాదియందునుగలది ప్రణవత్రయయుతము. ఆద్యంతప్రణవములు రెండు. గాయత్రీమంత్రపాదత్రయాది నున్న ప్రణవములు మూఁడును కలసి పంచప్రణవయుతగాయత్రి యనఁబడును. గాయత్రీపాదత్రయము వ్యాహృతిత్రయములో లయమయి యావ్యాహృతిత్రయము ప్రణవ మందుఁగల అకార, ఉకార, మకారములందు లయమయినందున యతు లకు ఏకప్రణవముమాత్ర ముపాసింపఁదగినదని తెలియుచున్నది.

**అథ బాలాత్రిపురసుందరీ మన్వర్థః.**

ఐ మితిబీజం వాగ్భవం క్లీం కామరాజాఖ్యం సౌః పరాబీజం అ ఇతి స్థితే. సూ. అకస్సవర్ణే దీర్ఘః. ఆ ఇతి స్థితే. సూ. వృద్ధిరాదైచ్ ఇతి వృద్ధిః, ఐ ఇతి భవతి, అ. అగ్నిమీడే పురోహితం, ఇ. ఇషేత్వో ర్జేత్వా, అ. అగ్నఆయాహివీతయే, బిందోశ్శంనో్దేవీరితి, వాగ్భవ బీజమితి సంజ్ఞా. తదుక్తం:—

వాగ్భవం ప్రథమం బీజం ద్వితీయం కామరాజకం,
తృతీయం శక్తిబీజాఖ్యం నిగమత్రితయోద్ధృతమితి.

తృతీయను పరాబీజమితి పాఠాంతరం.

అస్యార్థః. ఐం వేదచతుష్టయస్వరూపం, బ్రహ్మ విష్ణు మహేశ్వర తురీయస్వరూపం పరాపశ్యంతీమధ్యమా వైఖరీస్వరూప శబ్దబ్రహ్మాత్మకం.

క్లీం క్లీంకారాంతర్గతకకారస్య బ్రహ్మార్థః, ఈకారస్య తేజః పుంజాత్మక చిచ్ఛక్తిరిత్యర్థః, లకారస్య లాతి=గృహ్ణాతీతి వ్యుత్పత్త్యా తద్విశిష్టమిత్యర్థః, ప్రసిద్ధత్వాదకర్మకః, అంతర్యామిరూపేణ ప్రతిపాదితో బిందుః, శివస్వరూప ఇత్యర్థః.

సౌః. సః ఔ ఇతి భేదః, ఏచోలోపి చ్చేత్ పాదపూరణమితిసంధిః, తచ్ఛబ్దస్య పూర్వోక్తస్వరూపాభిన్న బ్రహ్మవస్తు, విసర్గవాచ్యోఽహం చతుర్దశస్వరవాచ్యః, అభిన్నోఽస్మీత్యర్థః. అహం బ్రహ్మాస్మి. బ్రహ్మైవాహమస్మీతి.

ఐం క్లీం సౌః అహం బ్రహ్మాస్మి. సౌః క్లీం ఐం. బ్రహ్మైవాహమస్మి. ఇతి బాలామంత్రార్థః. శివం.

**అథ పంచదశాక్షరీవిద్యావ్యాఖ్యానప్రారంభః.**

అత్రాయం పదవిభాగః, క. ఏ. ఈల. హ్రీం. హస కహల. హ్రీం. సకల హ్రీం. అర్థస్తు. ఇణోగతా విత్యస్మాద్ధాతోరిచ్. ఏమాయాత్మికే (పరదేవతే) కే. బ్రహ్మవిషయే, హ్రియం ఛాందసత్వాచ్ఛాందసీతి పూర్వరూపం లజ్జాం లజ్జోపలక్షితాష్టపాశాత్మికామవిద్యాం ఈల=నివర్తయ. ఈల ప్రేరణ ఇతి ధాతోః కాషిాదిత్వాల్లత్వం పరస్మైపదం ఛాందసం. హేర్లుక్ బ్రహ్మవిషయకాజ్ఞానం నివర్తయేత్యర్థః. కహల హ్రీం కన దీప్తావిత్యస్మాద్ధాతోః, హల గ్రహణ ఇతి ధాతోరపి, కస్య=బ్రహ్మణః హలహ్రీం=గ్రాహకశక్తిం, హస=ప్రకాశయహసిహస ఇతి ధాతోః లోణ్మధ్యమః. బ్రహ్మపరోక్షవృత్తిం ప్రకాశయేత్యర్థః. సకలహ్రీం = సర్వాంతఃకరణవృత్తిం ఈలేత్యనువృత్త్యావ్యాఖ్యేయం. ఈల=నివర్తయ. సకలవృత్త్యుపశాంత్యాఽఖండ ప్రకాశ చిదానందరూపాపత్తిం సంపాదయేత్యర్థః.

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య గోవింద భగవత్పాద శిష్య శ్రీశంకర భగవత్పాదస్య కృతిః. పంచదశీవ్యాఖ్యా బ్రహ్మవిద్యా విలాసః. ఇతి శివం.

### అథ శ్రీవిద్యాషోడశాక్షరీ మన్వర్థః.

**వామకేశ్వరతన్త్రే శ్రీవిద్యార్థవిచారణే ప్రపంచితం:—**

౧. శ్రీమితి బిందువిశిష్ట శవర్ణేన సుఖశబ్దవాచ్య మానంద ముచ్యతే. మహామాయాత్మకేకారస్య బిందుద్వయాత్మకత్వేన రేఫస్యైకబిందురూపత్వేన సమష్ట్యా బిందుత్రయేణ గుణత్రయముచ్యతే. తథా చ శ్రీమితి ప్రథమబీజేన, కాంస్యపాత్రస్థ జలమధ్యవిలీనకాచవద్దృశ్యమానగుణత్రయవిశిష్టావిద్యాశబలపర్యాయాంతర్లీన విమర్శలోలీభావాపన్నం ప్రకాశాత్మకం బ్రహ్మ ప్రతిపాద్యతే.

౨. హ్రీమితి ద్వితీయబీజేనావ్యక్త ముచ్యతే. అవ్యక్తం నామ జగత్కారణీభూతా మాయా బ్రహ్మణ్యుచ్ఛూనతా దశాయాం గుణత్రయస్య పరస్పరం మేళనానంతరం సంసృష్టగుణత్రయసంవలితం బ్రహ్మ హ్రీమితి బీజేన ప్రతిపాద్యతే. మాయాబీజస్యావ్యక్తవాచకత్వం దధీచిసంహితాయాం విష్ణునా భువనేశ్వరీకల్పే ప్రతిపాదితం.

శ్లో. జగదేతత్పూర్వ మాసీదవ్యక్తం ప్రకృతం ప్రియే,
జగతోవ్యక్తరూపాయా సాఽవస్థా సముదాహృతా.
ప్రకృత్యవస్థా దేవేశి సా చ శక్తిశ్శివస్య తు,
శివాత్మికాఽఽదిజననీ చిద్రూపా భువనేశ్వరీతి.

3. క్లీమితి తృతీయబీజఘటకబిందుయుక్త కకారేణ బ్రహ్మ ప్రతిపాద్యతే "కం బ్రహ్మేతి శ్రుతేః. లకారస్యేంద్రబీజత్వేన లమితి పరమైశ్వర్యేతి ధాతునా లకారేణ పరమైశ్వర్య ముచ్యతే. శ్రు. ఇంద్రో మాయాభిః పురురూప ఈయత ఇతి శ్రుత్యాచ, మహామాయాబీజవిశిష్ట కకార లకారాత్మక తృతీయబీజేన ప్రపంచసృజనేచ్ఛయా పరిచ్ఛిత్తిరూపేణాంకురిత మహత్తత్త్వాపరపర్యాయ మాయావిచ్ఛిన్న బ్రహ్మ ప్రతిపాద్యతే.

౪. ఐమితి చతుర్థబీజేన షట్త్రింశత్తత్త్వపరమాద్యవర్ణగర్భిణీ.

శ్లో. సోఽహం భావాత్పరం బిందుం ప్రవిశ్య ధ్వనితాం గతః,
సోఽపి నాదాత్మికాం యోని మేత్య యాతి స్వశక్తితామితి.

శంభుచండికావచనా న్నాదాత్మక మహంభావాపన్న మహంకారాత్మకం బ్రహ్మ ప్రతిపాద్యతే.

౫. సౌః ఇతి సకారేణ బ్రహ్మ ప్రతిపాద్యతే. విసర్గవిశిష్టచతుర్దశస్వరేణ శక్తిః ప్రతిపాద్యతే. తథాచ సముదాయేన స్త్రీపుంభావాత్మకమర్ధనారీశ్వరాత్మకం బ్రహ్మ ప్రతిపాద్యతే.

౬. ఓమితి బీజేన పార్వతీపరమేశ్వరద్వంద్వ ముచ్యతే. శ్రు. సప్రపంచోఽయ మోంకారః సప్రపంచస్య శూలిన ఇతి శ్రుతేః.

౭. హ్రీమితి బిందువిశిష్ట హకారస్యాహమిత్యంతఃకరణవృత్తిరూపత్వేన చ ఆదిజీవస్వరూపస్య చతుర్ముఖహిరణ్యగర్భరూపబ్రహ్మణః తద్బీజరూపత్వం. కిం చ హకారస్య బ్రహ్మరూపత్వం కామకలాబీజేన సరస్వతీ ఏవంచ హ్రీమితి సప్తమబీజేన వాణీహిరణ్యగర్భాత్మకద్వంద్వం ప్రతిపాద్యతే.

౮. శ్రీమిత్యష్టమబీజేన లక్ష్మీనారాయణాత్మకద్వంద్వం ప్రతిపాద్యతే. బిందుయుక్తశవర్ణేన పుంరూపత్వం రేఫతురీయస్వరాభ్యాం లక్ష్మీరూపత్వం ద్యోత్యతే. శివస్య దారుకావనవిహారకాలే క్షీరాబ్ధిమథనప్రకరణేఽపి విష్ణోః స్త్రీరూపత్వ ముక్తం, తేన కామకలాబీజేన లక్ష్మీనారాయణద్వంద్వం ప్రతిపాద్యతే.

౯. ౧౦. ౧౧. పంచదశీకూటత్రయం నవమ దశమ ఏకాదశరూప బీజత్రయత్వేన గృహీతం.

౧౨. ౧౩. ౧౪. ౧౫. ౧౬. పునః వ్యత్యస్తబీజపంచకవిశిష్టసౌః ఐమితిశక్తి వాగ్భవ బీజద్వయేన అగ్నిషోమాత్మకద్వంద్వం ప్రతిపాద్యతే. సకారస్య చంద్రబీజత్వా ద్వాగ్భవబీజస్యైకారప్రవృత్తికత్వేన మతాంతరాగ్నిబీజత్వేన చ బీజద్వయస్యాగ్ని షోమాత్మకద్వంద్వం ప్రతిపాద్యతే. క్లీం హ్రీ మితి మదనమాయాబీజద్వయేన భూతపంచకం, కంశిరోంబునోరితి కోశాత్. కకారస్య జలవాచకత్వం, లకారస్య భూవాచకత్వం, మాయాబీజ ఘటక హకారేణవియత్ప్రతిపాద్యతే. రేఫేణ తేజః ప్రతిపాద్యతే. తథాచ బీజసముదాయేన సందంశినీన్యాయేన పృథివ్యప్తేజో వాయురాకాశాః ప్రతిపాద్యంతే. శ్రీమితి బీజఘటకశవర్ణేన సుఖం ప్రతిపాద్యతే. తథాచ శం సుఖం రాతి గృహ్ణాతీతి వ్యుత్పత్త్యా శ్రీబీజేన ప్రతిబింబరూపేణ బ్రహ్మగ్రాహిణీ పరాశక్తిః ప్రతిపాద్యతే.

నవమదశమఏకాదశబీజైః హే పరబ్రహ్మాత్మికే హే మాయే హ్రీం = లజ్జాం (అవిద్యాం) ఈల=నివర్తయ, కహలహ్రీం = బ్రహ్మాపరోక్ష వృత్తిం, హస=ప్రకాశయ, సకలహ్రీం=సకలవిషయకాజ్ఞానం, ఈల(నివర్త య) ఇత్యనుషంగః.

తథా చ యావన్మంత్రేణ కాంస్యపాత్రస్థ జలమధ్యవిలీనకాచవ ద్దృశ్యమాన గుణత్రయవిశిష్టా విద్యాశబల పర్యాయ విమర్శలోలీ భావాపన్న ప్రకాశాత్మకోచ్ఛ్రాయణగుణత్రయాత్యంతసంవలిత ప్రపంచ సృజనేచ్ఛయాంకురితమహత్తత్వాపరపర్యాయ షట్త్రింశద్గర్భాఢ్య నా దాత్మకాహంభావాపన్నాహంకారాత్మక స్త్రీ. పుం. భావాపన్న పార్వతీ పరమేశ్వరాత్మక వాణీ హిరణ్యగర్భాత్మక లక్ష్మీనారాయణాత్మక అగ్నిషోమాత్మక పృథివ్యప్తేజోవాయ్వాకాశాత్మక ప్రతిబింబరూపేణ బ్రహ్మగ్రాహక బ్రహ్మస్వరూపమాయే మదీయాజ్ఞాననివృత్తిపూర్వక బ్రహ్మాపరోక్షవృత్తిం ప్రకాశయే త్యఖండార్థః.

ఇత్యేవం రాజరాజేశ్వరీశ్రీవిద్యామహాషోడశాక్షరీమంత్రార్థః స్పష్టః.

**అథ కామకలా ఏకాక్షరీమన్వర్థః, వామకేశ్వరతంత్రే.**

శ్రీమితి కామకలావిద్యా వ్యాఖ్యాయతే:—కామకలావిద్యా స్థూలసూక్ష్మ పరాభేదేన అహమితి, శ్రీమితి, ఈమితి, త్రిధా వ్యవహ్రి యతే. ప్రథమ తృతీయయోః శ్రీమితి ద్వితీయవిద్యాయామంతర్భావః కథమితిచేత్. శవర్ణ, రేఫ, ఈకార బిందురూపవర్ణ చతుష్టయసంపుటం శ్రీమిత్యుచ్యతే. తత్ర శవర్ణం సుఖబీజత్వాత్సుఖ మానందరూపత్వా త్ప్రకాశాంశత్వేన అకారో గృహ్యతే. రేఫస్త్వగ్నిబీజత్వేన విమర్శాం శతయా హకారో గృహ్యతే. ఏవంచ ప్రకాశవిమర్శాంశగ్రహణే నాహ మిత్యాత్మమంత్రాత్మకత్వముక్తం. పరారూపతురీయకలాతుసాక్షా త్సిద్ధ మేవ. తస్మాత్త్రివిధవిద్యారూపత్వం శ్రీమిత్యేతత్కామకలాబీజే త్రివిధవిద్యాత్మకత్వం సిద్ధం.

అస్య ప్రకాశాదిబిందుచతుష్టయాత్మకత్వం. అత్రస్థశవర్ణం ప్రకాశ బిందురూపం. రేఫస్తు విమర్శబిందుః. తురీయస్వరం మిశ్రబిందురూపం. సర్వాంత్య బిందు ర్నాదబిందుః. ఏవం బిందుచతుష్టయాత్మకత్వమనేన

ఆత్మా, అవ్యక్త, మహత్తత్త్వాహంకారాః, మాయా, శుద్ధవిద్యా, ఈశ్వర, సదాశివాత్మకచతుష్కలాయుక్తం తురీయకూటత్వం చ సిద్ధం.

**అస్య కామకలాంగనా స్వరూపత్వం మాతృకావివేకే:—**

శ్లో. ఈకారోర్ధ్వగతో బిందుర్ముఖం భాను రథోముఖౌ,
స్తనౌ దహనశీతాంశూ యోని హార్ధకలా భవేత్.

**అస్యార్థః—**

ఏతత్కామకలాబీజస్థ సర్వాంత్యబిందుర్ముఖస్థానీయం భానుమండలత్వేన; శవర్ణరేఫౌ శుక్లరక్తబిందుత్వేన; చంద్రాగ్నిస్వరూపావితి తావేవ స్తనద్వయం; తురీయస్వరం కటిస్థానీయ; మేవం సర్వసమష్టిబీజేన కామకలాంగనాస్వరూపసిద్ధిః.

అస్య బీజరాజస్య షోడశకలాత్మకత్వ ముచ్యతే. అత్రస్థశవర్ణం అకచటాద్యష్టవర్గేషు, అష్టమవర్గే సంభవాత్. ప్రథమాద్యష్టకలా గృహ్యంతే. రేఫస్తు యవర్గే ద్వితీయవర్ణత్వా త్కలాద్వితయగ్రహణం తురీయస్వరేణ, కలాచతుష్టయం బిందునా ఏకకలాగ్రాహ్యతే, ఏవంచ తస్మి న్పంచదశకలానా మంతర్భావత్వం సూచితం, సర్వసమష్ట్యా పంచదశకలాత్మకత్వం స్వయం షోడశీకలాస్వరూపేణ స్థితా ఇతి. షోడశ కలాత్మకత్వముక్తం.

అస్య తత్త్వత్రయాత్మకత్వ ముక్తం. యథా ఆత్మతత్త్వం విద్యాతత్త్వం శివతత్త్వం చేతి తత్త్వత్రయ మేవాగమవేదిభి రంగీకృతం. ఆగమరహస్యే తత్త్వప్రకరణే.

శ్లో. మాయాంత మాత్మతత్త్వం విద్యాతత్త్వం సదాశివాంతంస్యాత్,
శక్తిశివౌ శివతత్త్వం తురీయతత్త్వం సమష్టి రేతేషామితి.

అస్మిన్బీజరాజే శవర్ణ రేఫతురీయస్వర బిందవ స్తిష్ఠంతి. పృథివ్యాది మనస్తత్త్వాంతాని ఏకవింశతితత్త్వాని మిళిత్వా ఆత్మతత్త్వమితి. అత్రస్థ తురీయస్వరం ప్రకృతిరూపత్వా న్మాయాతత్త్వం. తేన తురీయస్వరేణ ఆత్మతత్త్వం న సిద్ధం. మాయాశుద్ధవిద్యా-ఈశ్వరసదాశివాః, అహంకార మహత్తత్త్వఅవ్యక్త ఆత్మబిందవః విద్యాతత్త్వరూపాః. విద్యానామసంవిద్రూపిణీ జ్ఞానైకస్వభావః పరంజ్యోతిః అత్రస్థరేఫః ప్రకాశస్వరూపత్వాత్తేన విద్యాతత్త్వసిద్ధిః.

శక్తిశివా శివతత్త్వమితి అత్రస్థబిందుశవర్ణయోః, ప్రకాశాంశత్వం రేఫతురీయస్వరయో ర్విమర్శాంశకత్వ మేవం చ శివశక్త్యాత్మకత్వం, తేన శివతత్త్వం సిద్ధం సర్వసమష్టిబీజేన తురీయతత్త్వ ముక్తం.

ప్రకాశాంశభూత బిందుశవర్ణాభ్యాం, పృథివ్యాద్యవ్యక్తాంత సకల తత్త్వాత్మకత్వం విమర్శాంశభూత రేఫతురీయస్వరాభ్యాం, పరా పశ్యంతీ మధ్యమా వైఖరీరూపశబ్దబ్రహ్మాత్మకత్వ మనేన ప్రకాశవిమర్శాంశభూత నామరూపాత్మకత్వం సిద్ధమ్.

అత్రస్థవర్ణచతుష్టయేన క్రమేణ స్థూలసూక్ష్మ కారణచిచ్ఛరీరత్వం విశ్వతైజసప్రాజ్ఞసాక్షిస్వరూపత్వం చ జాగ్రత్స్వప్నసుషుప్తితురీయావస్థా చతుష్టయత్వం చోక్తం.

ప్రకాశాంశ విమర్శాంశ భూతవర్ణ చతుష్టయ మేళనేన జీవాత్మ పరమాత్మనోరైక్యమనుభూయతేతి.

అస్య సచ్చిదానందరూపత్వం అత్రస్థతురీయస్వరం సదంశమితి రేఫస్తు చిదంశః, బిందువిశిష్టశవర్ణస్సుఖబీజత్వాదానందాంశః. సర్వ సమష్టిబీజేన సచ్చిదానందస్వరూపం వాచ్యం భవతి. వాచకం తు శ్రీ మితి బీజరాజం. బ్రహ్మస్వరూపమితి. శ్రు. సచ్చిదానందం బ్రహ్మేత్యల మతివిస్తరేణ. ఇతి వామకేశ్వరతంత్రోక్తకామకలా ఏకాక్షరీమన్వర్థః.

తురీయస్వరం సాక్షాత్తురీయరూపమేవ. శ్రు. య ఈగ్ం శృణో త్యలకగ్ం శృణోతి నహి ప్రవేద సుకృతస్య పంథామితి శ్రుతేః.

తా. బిందుయుక్త ఈకారమాత్రశ్రవణస్తు లకార కకార రాహిత్యేన శ్రవణం, అతస్తద్వాన్-సుకృతస్య = సత్కర్మణః, పంథాం= ఉత్తమలోకాన్, న యాతి; కింతు నిర్గుణజ్ఞానస్యైవ లోకం ప్రాప్నో తీతి ఫలితం. కామబీజమాత్రేణ త్రివర్గసిద్ధిః, కామకలామాత్రేణ తు మోక్ష ఇతి పర్యవసితోఽర్థః.

అథ మహావాక్యార్థః.

యాజుషీ శుకరహస్యోపనిషత్ప్రోక్తచతుర్వాక్యానాం విభాగ శోఽర్థనిర్ణయకమంత్రాః.—

౧

అథ ప్రజ్ఞానం బ్రహ్మేతి ఋక్శాఖాంతర్గత ఐతరేయబ్రాహ్మణ గతస్య వాక్యస్యార్థమాహః—

శ్రు. యేనేక్షతే శృణోతీదం జిఘ్రతి వ్యాకరోతి చ,
స్వాద్వస్వాదు విజానాతి తత్ప్రజ్ఞాన ముదీరితం.

శుకరహస్యోపనిషత్. మ. ౧.

తా. ప్రజ్ఞానమే బ్రహ్మస్వరూపమని వాక్యార్థము. ఆవాక్య మందుఁగల ప్రజ్ఞానబ్రహ్మశబ్దములకు అర్థవిభజన చేయుచున్నారు. ఏవస్తువుచేత సకలమును చూడఁబడుచున్నదో, దేనిచే వినఁబడుచున్నదో, దేనిచే ఆఘ్రాణింపఁబడుచున్నదో, దేనిచే వాక్కు ఉచ్చరింపఁబడుచున్నదో, దేనిచే స్వాద్వస్వాదులు తెలియుచున్నవో, యావస్తువు ప్రజ్ఞానమని చెప్పఁబడుచున్నది.

శ్రు. చతుర్ముఖేంద్రదేవేషు మనుష్యాశ్వగజాదిషు,
చైతన్యమేకం బ్రహ్మాతః ప్రజ్ఞానం బ్రహ్మ మయ్యపి.

శుకరహస్యోపనిషత్. మం. ౨.

తా. బ్రహ్మేంద్రాది దేవతలందును, మనుష్యాశ్వ గజాదులందును చైతన్యస్వరూపమయిన బ్రహ్మవస్తువు ఏకస్వరూపముగా నున్నది. అందువలన నాయందును ఈచైతన్యస్వరూపబ్రహ్మవస్తువు కలదనియు; ఉత్తమస్వరూపులగు దేవతలందును, మధ్యములకు మనుష్యాదులందును, అధమములగు గజాశ్వాది దేహధారులందును, ఆకాశాదిభూతములందును గల యేచైతన్యము జగజ్జన్మాదిహేతుభూతమయినదో యదియే బ్రహ్మస్వరూపమనియు తనయందు నాచైతన్యమే గలదు గాన నీశరీర మందున్నచైతన్యము బ్రహ్మస్వరూపమని ఈవాక్యార్థము.

౨

అహం బ్రహ్మాస్మీతి యజుశ్శాఖామధ్యే బృహదారణ్యకోపనిష ద్గతవాక్యార్థమాహః—

శ్రు. పరిపూర్ణః పరాత్మాఽస్మిన్ దేహే విద్యాధికారిణి,
బుద్ధేస్సాక్షితయా స్థిత్వా స్ఫురన్నహ మితీర్యతే.
శుకరహస్యోపనిషత్, మం. 3.

తా. వెనుక ఋక్శాఖాంతర్గతవాక్యార్థమును చెప్పి యజుశ్శాఖాంతర్గతబృహదారణ్యకవాక్యార్థమును చెప్పుచున్నారు. ఈవాక్యమందున్న అహమనే పదమునకు అర్థము. పరిపూర్ణః=స్వభావతః దేశకాలవస్తుభేదరహితమయిన పరమాత్మ, అస్మిన్విద్యాధికారిణి దేహే = మాయా కల్పితమయిన జగత్తునందు విద్యాసంపాదనయోగ్యమయిన శ్రవణాదియోగ్యమయిన ఈమానుషదేహమందు, బుద్ధేస్సాక్షితయా స్థిత్వా=బుద్ధియనే సూక్ష్మశరీరమునకు సాక్షిగానుండి, (అవికారిగానుండి) స్ఫురన్ = ప్రకాశించుచు, (నాబుద్ధికి స్ఫురణశక్తిని గలుగఁజేయుచు) అహమితీర్యతే=అహమని చెప్పఁబడుచున్నది. జ్ఞానమును సంపాదించుటకు యోగ్యతగల యీశరీరమందు బుద్ధికి ప్రకాశతను (స్ఫురణశక్తిని) గలుగఁజేసే పరిపూర్ణుఁడయిన సాక్షియనే పరమాత్మయే అహమని చెప్పఁబడుచున్నది.

శ్రు. స్వతః పూర్ణః పరాత్మాఽత్ర బ్రహ్మశబ్దేన వర్ణితః,
అస్మీత్యైక్యపరామర్శ స్తేన బ్రహ్మ భవామ్యహమ్.
శుకరహస్యోపనిషత్, మం. ౪.

తా. బ్రహ్మశబ్దార్థమును చెప్పుచున్నారు. స్వతః పూర్ణః పరాత్మా స్వభావతః = దేశకాలాది భేదరహితమయిన పూర్వోక్త పరమాత్మయే, అత్ర=ఈమహావాక్యమందు బ్రహ్మయని చెప్పఁబడుచున్నది. "అస్మి" అనే పదమువలన, "అహం బ్రహ్మ" అను నీరెండుపదములకు భేదములేదని తెలియుచున్నది. ఆత్మబ్రహ్మలకును, జీవబ్రహ్మలకును భేదము లేదని తాత్పర్యము.

## 3

తత్త్వమసీతి సామవేదాంతర్గత ఛాందోగ్యోపనిషద్వాక్యార్థ మాహ:—

శ్రు. ఏకమేవాద్వితీయం సన్నామరూపవివర్జితం,
సృష్టేః పురాఽధునాప్యస్య తాదృక్త్వం తదుదీర్యతే.
శుకరహస్యోపనిషత్, మం. ౫.

తా. ఛాందోగ్యగతమయిన నీవాక్యమందుఁగల "తత్" అనే పదమునకు అర్థనిరూపణ చేయుచున్నారు. శ్రు. "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్. ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అను నీవాక్యములచేత సృష్టికి పూర్వమందు స్వగతాది భేదరహితమయిన, నామరూప రహితమయిన ఏ సద్వస్తువుగలదో, ఆసద్వస్తువున కిపుడున్ను, నీసృష్ట్యనంతరకాలమందును విచారదృష్టిచేత ఏకాకారముగనే యున్నది. ఆసద్వస్తువు తత్ అనిపించుకొనును.

శ్రు. శ్రోతుర్దేహేంద్రియాతీతం వస్త్వత్ర త్వంపదేరితం,
ఏకతాగ్రాహ్యతే ఒసీతి తదైక్య మనుభూయతా మితి.

శుకరహస్యోపనిషత్, మం. ౬.

తా. ఈవాక్యమందున్న త్వమనే పదమునకర్థము శ్రవణాద్యనుష్ఠానముచేతను, ఈవాక్యార్థము ననుసంధానముకొఱకు దేహేంద్రియాదులచే తెలియఁబడుచున్న స్థూలాది శరీరత్రయమునకు సాక్షిగాను, ఆశరీరత్రయమునకు విలక్షణముగానున్న వస్తువు త్వం పదార్థముగానున్నది. (సాక్షిస్వరూపమయిన ప్రత్యగాత్మయని భావము) అసి యనే పదముచేత వెనుక చెప్పిన సద్వస్తురూపపరమాత్మకును, దేహేంద్రియాదులకు సాక్షిగానున్న ప్రత్యగాత్మకును ఐక్యమును తెలుపుచున్నది. భేదములేదని తాత్పర్యము. తదైక్య మనుభూయతాం = ముముక్షువులచేత నా ప్రత్యగాత్మ పరమాత్మల ఏకత్వము ఏకభావనవలన కలిగెడి సుఖ మనుభవింపఁబడుచున్నది.

౪

అయమాత్మా బ్రహ్మేతి క్రమప్రాప్తాథర్వణవేదగతవాక్యార్థమాహ:—

శ్రు. స్వప్రకాశాపరోక్షత్వ మయ మిత్యుక్తితో మతం,
అహంకారాది దేహాంతా త్ప్రత్యగాత్మేతి గీయతే.

శుకరహస్యోపనిషత్, మం. ౭.

తా. ఈ వాక్యమందున్న అయమాత్మా అనే పదద్వయమునకు అర్థమును క్రమముగా చూపించుచున్నారు. అయమనే శబ్దముచేత స్వప్రకాశముగా నున్నందున అపరోక్షత్వము సిద్ధమగుచున్నది. అయ

మాత్మాయనే విశేషణద్వయమునకు కారణము. అదృష్టము స్వర్గాదుల వలె నిత్యపరోక్షత్వమును ఘటాదివత్ దృశ్యత్వమును, పరిహరించుట కొఱకు నీవిశేషణద్వయ ప్రయోగము. ఆత్మశబ్దమునకు ని. "ఆత్మా బ్రహ్మమనోజీవశరీరధృతిబుద్ధి"ష్వితి విశ్వః. ఈనైఘంటికవచనమువలన దేహేంద్రియాదులయందును ఆత్మశబ్దము వర్తించుచున్నందున వివక్షగా చెప్పుచున్నారు. అహంకారాది దేహాంతాత్ ప్రత్యక్-అహంకారము ప్రభృతి ప్రాణమనోదేహేంద్రియాదిసంఘాతముకన్న వేరుగానున్న సాక్షిస్వరూపమును నిచట గ్రహించవలెనని వివక్షగాచెప్పిరి. ఇందువలన అయమనినందున స్వర్గాదులవలె నిత్యపరోక్షముకాదనియు, ఘటాదుల వలె దృక్సిద్ధముకాదని.

శ్రు. దృశ్యమానస్య సర్వస్య జగతస్తత్త్వమీర్యతే,
బ్రహ్మశబ్దేన తచ్చబ్రహ్మ స్వప్రకాశాత్మరూపకమ్.

శుకరహస్యోపనిషత్, మం. ౧.

తా. బ్రహ్మశబ్దార్థమును నిరూపించుచున్నారు. బ్రాహ్మణాదు లందును బ్రహ్మశబ్దప్రయోగమున్నందున అట్టి భ్రమనివారణార్థమయి స్పష్టపరచుచున్నారు. అగుపడుచున్న సకలజగత్తునకును ఏది అధిష్ఠాన కారణముగా నున్నదో, మిథ్యాభూతమయిన జగత్తునకు ఆకాశాది భూతములకు పూర్వాపరములయందు కలిగి, పారమార్థికమయిన స్వప్రకాశాత్మస్వరూపమును సచ్చిదానందలక్షణములుకలది యేదియో ఆవస్తువు బ్రహ్మయని అర్థము.

ఇతి చతుర్ణాం మహావాక్యానా మర్థ స్స్పష్టః.

బ్రహ్మాత్మైక్యప్రతిపత్తయే సర్వేషాం వేదాంతానా మారంభః. బ్రహ్మాత్మనోర్భేదః బ్రహ్మనిందాతు, ఉపనిషత్సు యత్రకుత్రాపి న లక్ష్యతే. ఇతి శివం.

బృహదారణ్యకే:—

శ్రు. ఆత్మానం చేద్విజానీయా దయమస్మీతి పూరుషః,
కిమిచ్ఛన్కస్య కామాయ శరీరమనుసంజ్వరేత్,

ఈశ్రుతియును అపరోక్షజ్ఞానమునే తెలుపుచున్నది. ఈపరోక్షా పరోక్షజ్ఞానద్వయస్వరూపము ముందు అజ్ఞానాదిసప్తావస్థల వివరమందు స్పష్టమగును.

## శ్రీపాదుకాపంజరస్తోత్రము.



(౧) ద్వాదశాంతకమలము.

వామకేశ్వరతంత్రే:—

శ్లో. బ్రహ్మరంధ్రసరసీరుహోదరే నిత్యలగ్నమవదాతమద్భుతం,
కుండలీకనకకాండమండితం ద్వాదశాంతసరసీరుహం భజే. ౧

అర్థః. గురుపాదుకాస్థానమును వర్ణించుచున్నారు. బ్రహ్మరంధ్ర సరసీరుహోదరే = బ్రహ్మరంధ్రాధోభాగమందున్న సహస్రదళకమల కర్ణికామధ్యమందు, నిత్యలగ్నం = సంతతమున్నదియును, అవదాతం = తెల్లనివర్ణముకలదియు, అద్భుతం=ఆశ్చర్యకరమయినదియు, కుండలీకనక

కాండమండితం = పరాస్వరూపసుషుమ్నానాడియనే సువర్ణసమానమయిన నాళముచే ప్రకాశించుచున్నదియు, ఈసుషుమ్నానాడికి కుండలినీ సంజ్ఞ కుండలీరూపముగా నున్నందున యోగశాస్త్రమునందారోపితము మూలాధారమునుంచి సహస్రారమును వ్యాపించియున్నది. ఈనాడియందు హంసలు గమనాగమనములను చేయుచుండును. ద్వాదశాంత సరసీరుహం=ద్వాదశాంత మనే పద్మమును, అహం భజే=నేను సేవించుచున్నాను.

**ద్వాదశాంతవివరం.**

౧. కులపద్మము అనఁగా మూలాధారము క్రిందనున్న రక్తసహస్రదళకమలము. ౨. తదుపరి అష్టదళపద్మము. ౩. తదుపరి షడ్దళము. ౪. మూలాధారము. ౫. స్వాధిష్ఠానము. ౬. మణిపూరము. ౭. అనాహతము. ౮. విశుద్ధము. ౯. తత్కర్ణికలంబికాగ్రము అష్టదళము. ౧౦. ఆజ్ఞాకమలము. ౧౧. శుక్లసహస్రకమలము. ౧౨. తత్కర్ణిక. (అకులపద్మము.) ఇదియే బిందుస్థానము చంద్రమండలము. ఈద్వాదశకమలాంతమందున్నందున ద్వాదశాంతమని సంజ్ఞకలది.




శక్తిచక్రము (అవ్యక్తము.)

శ్లో. తస్య కందళితకర్ణికాపుటే క్లృప్తవర్ణ మకథాదిరేఖయా,
కోణలక్షితహళక్షమండలం భావలక్ష్య మబలాలయం భజే. ౨

అర్థః. తస్య = పూర్వోక్తసహస్రదళకమలముయొక్క, కందళిత కర్ణికాపుటే=వికసనమునుపొంది ప్రకాశించుచున్న కర్ణికామధ్యమందు, అకథాదిరేఖయా = అకారాది పదియారు స్వరములు ఒక రేఖగాను, కాది పదియారువర్ణములు రెండవ రేఖగాను, థాది పదియారు వర్ణములు మూడవ రేఖగాను, నీమూడు రేఖలచేతను; క్లృప్త వర్ణం=రచింపఁబడిన త్రికోణాకారముగలదియు, అస్పష్ట తేజోబిందు మయ అకథాదివర్ణములు గలదని, కోణలక్షిత హళక్షమండలం = హ-ళ-క్ష-అను వర్ణత్రయము కోణత్రయమందుఁగల, అనలాలయం = పరాశక్తికి స్థానమయిన యోనిచక్రమును, అహం భజే=నేను సేవించు చున్నాను.

శ్లో. త్రికోణరూపిణీ శక్తిర్బిందురూపః పరశ్శివ ఇతి.
అగ్నిషోమాత్మకం చక్ర మగ్నిషోమాత్మకం జగ దితి.

ఈ వచనములవలన అనలాలయమనఁగా శక్తిస్థానమయిన త్రికోణచక్రమని తాత్పర్యము. అది అవ్యక్తమాతృకారూపముగలదని బిందువును పరివేష్టించి బిందుప్రభయే యోనిచక్రాకారముగా నున్నది.



**మణిపీఠము.**

శ్లో. తత్పుటే పటుతటిత్కడారిమస్పర్ధమానపరిపాటలప్రభం,
చింతయామి హృది చిన్మయం సదా బిందునాదమణిపీఠమండలం. 3.

తత్పుటే = ఆయోనిచక్రమధ్యమందు, పటుతటిత్కడారిమస్పర్ధమాన పరిపాటలప్రభం=స్థిరమయిన మెరుపుతోను, సువర్ణముతోను సామ్య

మును పొందుచున్న, అత్యంతపాటలవర్ణ కాంతిగల, చిన్మయంవపుః = చిత్స్వరూపశరీరముగల, బిందునాద మణిపీఠమండలం = బిందునాదము లనెడు మాణిక్యవికారమందు పీఠమండలమును, హృది సదా చింత యామి=హృదయమందు సర్వదా ధ్యానించుచున్నాను.




హంసద్వంద్వము.

శ్లో. ఊర్ధ్వమూలహుతభుక్శిఖారుణం చిద్విలాసపరిబృంహణాస్పదం,
విశ్వఘస్మరమహాచ్ఛటాకులం భావయామి యుగమాదిహంసయోః.

అర్థము ఊర్ధ్వమూలహుతభుక్శిఖారుణం=ఆద్యంతములం దగ్ని జ్వాలలతో తుల్యమయిన ఎరుపుకాంతిగలదియు, చిద్విలాసపరిబృంహ ణాస్పదం=చిత్కళలయొక్క విలాసరూపమైన అత్యంతవ్యాపకత్వమునకు స్థానమయినదియు, విశ్వఘస్మరమహాచ్ఛటాకులం = ప్రపంచలయమందు సమర్థముగల అధికతేజస్సుతో వ్యాప్తమయిన, ఆదిహంసయోః = ఆది హంసలయొక్క, యుగం = ద్వంద్వమును, పురాణదంపతులగు శివశక్తి ద్వంద్వమును, భావయామి = విచారించుచున్నాను. (ధ్యానించు చున్నాను.)

హంసమాహేశ్వరే:—

శ్లో. వియద్బిందుసమాయుక్తం తదాదిస్సర్గసంయుతః,
అజపాఖ్యో మనుః ప్రోక్తో ద్వ్యక్షరస్సురపాదపః.

అర్థము:—వియత్=హకారము, బిందుసంయుక్తం=బిందువుతో కూడినదై, తదాదిః=దానికిముందున్న సకారము, సర్గసంయుతః=విసర్గలతోఁ గూడినదై, ద్వ్యక్షరః=ఈ రెండువర్ణములుగల, అజపాఖ్యః=అజపాఅనే, మనుః=మంత్రము, సురపాదపః=కల్పవృక్షమువంటిది, చతుర్వర్గఫలముల నిచ్చునదియని తాత్పర్యము.

**తంత్రరాజే అజపా నామ:—**

శ్లో. వినా జపేన దేవేశి జపో భవతి మంత్రిణః,
ఆజపేతి సమాఖ్యాతా జ్ఞానమోక్ష ప్రదాయినీతి.

**చతుశ్శత్యాం:—**

శాంతాంతం శక్తిరస్యోక్తా తదంతం బీజముచ్యతే,
విద్యాశక్తిర్భవేద్బీజం శివ ఏవ న చాన్యథా.
తేనాయం పరమో మంత్రః శివశక్త్యాత్మకః స్మృతః,
ఆత్మమంత్రస్య హంసస్య పరస్పరసమన్వయాత్.
యోగేన గతపాపానాం భావనా బ్రహ్మ చక్షతేతి.

**తంత్రరాజే:—**

శరీరిణామజపాంతం హంసత్వం పారదర్శనం,
హంసో హంసాక్షరం ప్రాప్య జీయాన్మరణజన్మనీతి.

**మహావాక్యోపనిషది:—**

శ్రు. అసావాదిత్యో బ్రహ్మేత్యజపయోపహితగ్ం హగ్ంస స్సోఽహం ప్రాణాపానాభ్యాం ప్రతిలోమానులోమాభ్యాగ్ం సముప లభ్యైవగ్ం సా చిరం లబ్ధ్వా త్రివృదాత్మని బ్రహ్మణ్యభిధ్యాయమానే సచ్చిదానందః పరమాత్మాఽవిర్భవతీతి.



రక్తచరణము, శుక్లచరణము.

శ్రీవిద్యా ఆదిగురుపాదద్వంద్వము.

శ్లో. తత్ర నాథచరణారవిందయోస్సంవిదామృతఝురీమరందయోః,
ద్వంద్వమిందుమకరందశీతలం మానసం స్మరతు మంగళాస్పదం.

అర్థము. తత్ర = ఆసహస్రారకమలకర్ణికయందు, ఇందుమకరంద శీతలం=చంద్రునియొక్క అమృతకిరణములచేత చల్లనైనదియు, మంగళాస్పదం = కళ్యాణముల కాస్పదమయినదియు, సంవిదామృతఝరీమరందయోః=జ్ఞానస్వరూపమయిన అమృతప్రవాహములనే మకరందముగల, నాథచరణారవిందయోః = శ్రీగురుచరణారవిందములయొక్క, ద్వంద్వం= యుగ్మమును, మానసం=మనస్సు, స్మరతు=స్మరించుంగాక.

శ్లో. పాదుకాపంజరస్తోత్రం పంచవక్త్రా ద్వినిర్గతం,
షడామ్నాయఫలం ప్రోక్తం ప్రపంచే చాతిదుర్లభం.

శ్లో. అప్రమేయమహావిద్యాశేఖరాంచితమస్తకామ్,
రక్తాంచతుర్భుజాం వందే శ్రీవిద్యాగురుపాదుకామ్.

ఇచట నాథచరణారవిందద్వంద్వమనియు, తత్ర అనినందున శ్రీవిద్యోత్పత్తి కాదిగురువులగు ఊర్ధ్వానందనాథులనే పరశివపాదద్వంద్వము గ్రహింపఁబడుచున్నది. అదియే వెనుకటిశ్లోకమందు హంసద్వంద్వముగా వర్ణింపఁబడినది. స్వస్వగురుపరంపరను తద్రూపముగా భావింపవలెనని తాత్పర్యము.

**ఇతి వామకేశ్వరతంత్రోక్తపాదుకాపంజరస్తోత్రం సంపూర్ణం.**

**మంత్రసారాంశము.**

గాయత్రి-బాలా-శ్రీవిద్యాపంచదశీ-శోడశాక్షరీ-
కామకలావికాక్షరీమంత్రముల అర్థవివరము.

**గాయత్రీమంత్రమందుఁ గల తాత్పర్యము.**

లోకమందు ప్రసిద్ధముగానున్న లింగధర్మరహితమయిన సచ్చిదానందలక్షణములుగల సూర్యమండలాంతర్గతమయిన ఏబ్రహ్మతేజస్సు మాయొక్క బుద్ధివృత్తులను ప్రేరణచేయుచున్నదో,

జగత్తుయొక్క సృష్ట్యాదిధర్మములుగల ప్రకాశమానమయిన సేవింపఁదగిన పాపములను (అవిద్యాదులను) హరించే సకలనిగమాగమప్రసిద్ధమయిన యాబ్రహ్మతేజస్సును ధ్యానించుచున్నాను.

సర్వజగత్కారణమైన ప్రకృతికన్న వేఱుగానున్న ఆ పరాశక్తి తనసాయుజ్యమును (బ్రహ్మపరోక్షకృతికన్న మమ్మును రక్షించుఁ

గాకయని గాయత్రి నాలుగుపాదములందుఁ గల ముఖ్యాంశము. ఈ గాయత్రియొక్క అర్థమును సూర్యపరముగా కొందఱును, విష్ణుపరముగా కొందఱును, రుద్రపరముగా కొందఱును, శక్తిపరముగా కొందఱును, ఇటుల పలువిధములుగ విశ్వామిత్ర వసిష్ఠాది ఋషులు వర్ణించినారు. ఎవరు ఏలాగు చెప్పినను ఈమంత్రమందుఁగల పాదత్రయము సగుణము, శబలబ్రహ్మస్వరూపము. నాలుగవపాదము నిర్గుణము, శుద్ధబ్రహ్మస్వరూపముగా నున్నదిగాన పర్యవసానము అద్వైతవస్తురూపమయినబ్రహ్మతేజస్సుపరముగా నున్నది. అందఱును వ్యాహృతులు తురీయపాదసహితముగా నుపాసనచేయవలెను.

## బాలామంత్ర తాత్పర్యము.

ఈమంత్రము "ఐం - క్లీం - సౌః" అనే మూఁడుబీజములు గలది. బీజమనఁగా: వట - చూత-అశ్వత్థాదిబీజములందు ముందు కలుగఁబోవు వృక్షమంతయునిమిడి సూక్ష్మాకారముగా నున్నటుల ఈమంత్రబీజములందనేకశక్తు లొక్కొకబీజమందు సూక్ష్మాకారముగా నిమిడియున్నవి. "ఐం" అనే ప్రథమబీజమందు "అ. ఈ. అ. ం." అనే నాలుగు బీజములున్నవి. ఇవి క్రమముగా ఋగ్యజుస్సామములనే వేదత్రయమును తెలుపుచున్నవి. సమష్టిబీజము - వేదత్రయరూపము - వాణీహిరణ్యగర్భశివశక్తిస్వరూపముగా నున్నది.

"క్లీ"మనే రెండవబీజమందు క-ల-ఈ-బిందువులున్నవి. కకార బిందువులు రెండును పుంరూపములుగాన విష్ణుస్వరూపములు. లకార ఈకారములు స్త్రీరూపములుగాన లక్ష్మీస్వరూపములు. సర్వసమష్టి బీజము లక్ష్మీనారాయణాత్మకము.

"సౌః" అనే మూఁడవబీజమునందు స-ఔ-విసర్గలున్నవి గాన శివశక్త్యాత్మకముగా నున్నది. ఈమంత్రము ఉత్పత్తి మూఁడుబీజములైనను అనులోమవిలోమములుగా ఆఱుబీజములుగా నుపాసన చేయుట శిష్టాచారము. నేను బ్రహ్మస్వరూపము అయితిని. బ్రహ్మనే నేను అయితినని సమష్టి మంత్రతాత్పర్యము.

## శ్రీవిద్యాపంచదశీతాత్పర్యము.

ఈమంత్రమందు మూఁడుకూటము లున్నవి. అందు—

ప్రథమకూటార్థము:—

మాయాస్వరూపమయిన హే పరదేవతే, బ్రహ్మవిషయకమయిన అష్టపాశాత్మకమయిన (స్వపరభేదమనే లజ్జారూపమయిన అవిద్యను) నివర్తింపఁజేయుము. (బ్రహ్మజ్ఞానమును గుఱించి నాకుఁగల అజ్ఞానమును నివర్తింపఁజేయుము.)

ద్వితీయకూటార్థము:—

బ్రహ్మయొక్క గ్రాహకశక్తిని (బ్రహ్మాపరోక్షవృత్తిని) ప్రకాశింపఁజేయుము.

తృతీయకూటార్థము:—

బ్రహ్మజ్ఞానమును గుఱించి నాకుఁగల సకలవిధమైన అజ్ఞానమును పోఁగొట్టుము. ఇది పంచదశీమంత్రతాత్పర్యము.

## శ్రీవిద్యాషోడశాక్షరీమంత్రతాత్పర్యము.

శ్రీం - హ్రీం - క్లీం - ఐం - సౌః=ఆత్మా - అవ్యక్త - మహత్తత్వ - అహంకార - అర్ధనారీశ్వరాత్మకమైన, ఓం - హ్రీం - శ్రీం=పార్వతీపరమేశ్వర - వాణీహిరణ్యగర్భ - లక్ష్మీనారాయణాత్మకమయిన, సౌః - ఐం - క్లీం - హ్రీం - శ్రీం=అగ్నిషోమాత్మక - పృథివ్యాదిపంచభూతాత్మక - ప్రతిబింబరూపముచేత బ్రహ్మగ్రాహకమయిన, హే పరదేవతే, (శబల బ్రహ్మస్వరూపమాయాశక్తే) బ్రహ్మజ్ఞానమునుగుఱించి నాకుఁగల అజ్ఞానమును పోఁగొట్టుము (నా నిజరూపమును నాకుఁ దెలియఁజేయుము).

నాకు బ్రహ్మాపరోక్షవృత్తిని కలుగఁజేసి (నీసాయుజ్యము నిచ్చి) రక్షించుమని ప్రార్థన.

### కామకలాసారాంశము.

"శ్రీం" అనే కామకలా ఏకాక్షరీమంత్రతాత్పర్యము.

ఈమంత్రమందు (బీజమందు), శ - ర - ఈ - ం-నాలుగు బీజము లున్నవి. వీనివలన ఆగమశాస్త్రసంకేతములచే అనేకార్థము లున్నవి. ఈబీజమందుఁగల నాలుగుబీజములును,

౧. ప్రకాశ-విమర్శ-మిశ్ర-సంవిద్బిందుమయమనియు,

౨. కామకలాంగనయొక్క ముఖ - స్తన - కటిప్రదేశములనే అవయవములుగాను,

౩. షోడశకలాత్మకముగాను,

౪. ఆత్మతత్త్వ-విద్యాతత్త్వ-శివతత్త్వ-బ్రహ్మస్వరూపముగాను,

౫. ప్రకాశాంశలగు అవ్యక్తాదితత్త్వసముదాయమును విమర్శాంశలగు వర్ణకదంబముగాను,

౬. జాగ్రదాద్యవస్థాచతుష్టయ, విశ్వ-తైజస-ప్రాజ్ఞ సాక్షులుగాను, పరా-పశ్యంతి మధ్యమవైఖరీలుగాను,

౭. సచ్చిదానందస్వరూపముగను,

౮. జీవాత్మ -పరమాత్మల నైక్యమును దెలుపుచున్నవి గాన నీబీజరాజము సర్వోత్తమముగా నున్నది. ఇదియే కామకలా బీజము. ఇదియే ధ్రువకల షోడశీకలగా నున్నది.

అథ ఆమ్నాయస్తవప్రారంభః.

**లఘుమార్గః. పూర్వామ్నాయః.**

శ్లో. శుద్ధవిద్యా చ బాలా చ ద్వాదశార్ధా మతంగినీ,
ద్విజత్వసాధనీ విద్యా గాయత్రీ వేదమాతృకా. ౧
గాణాపత్యం కార్తికేయం మృత్యుజి న్నీలకంఠకం,
త్ర్యంబకం జాతవేదాశ్చ తథా ప్రత్యంగిరాదయః. ౨
సద్యోజాతముఖోద్భూతా వైదికాస్తు ద్వికోటయః,
ఏతాః కామగిరింద్రస్థాః పూర్వామ్నాయస్య దేవతాః. ౩
గురుత్రయాదిపీఠాంతం చతుర్వింశత్సహస్రకం,
ఏతదావరణోపేతం పూర్వామ్నాయం భజామ్యహం. ౪
మూలాధారే భజేన్మంత్రీ పూర్వామ్నాయమనూన ప్రియే.

**ఇతి పూర్వామ్నాయః.**

**అథ దక్షిణామ్నాయః.**

సౌభాగ్యవిద్యా బగళా వారాహీ వటుకస్తథా. ౫
శ్రీతిరస్కరిణీ ప్రోక్తా మహామాయా ప్రకీర్తితా,

అఘోరం శరభం ఖడ్గరావణం వీరభద్రకం. ౬
రౌద్రం శాక్తం పాశుపతాద్యస్త్రశస్త్రాదిభైరవం,
దక్షిణామూర్తిమంత్రాద్యాశ్శైవాగమ సముద్భవాః. ౭
వామదేవముఖోద్భూతాః కోటిమంత్రా వరాననే,
పూర్వపీఠస్థితా దేవి దక్షిణామ్నాయదేవతాః. ౮
ద్విసహస్రం తు దేవ్య స్తాః పరివారసమన్వితాః,
భైరవాదిపదద్వంద్వం భజే దక్షిణ ముత్తమం. ౯
స్వాధిష్ఠానే స్మరేద్దేవి దక్షిణామ్నాయ ముత్తమం.

ఇతి దక్షిణామ్నాయః.

అథ పశ్చిమామ్నాయః.

లోపాముద్రా మహాదేవీ అంబా చ భువనేశ్వరీ. ౧౦
అన్నపూర్ణా కామకలా సర్వసిద్ధిప్రదాయినీ,
సుదర్శనం వైనతేయం కార్తవీర్యం నృసింహకం. ౧౧
నామత్రయం రామమంత్రం గోపాలం సౌరమేవ చ,
ధన్వంతరం చేంద్రజాల మింద్రాది సురమంత్రకం. ౧౨
దత్తాత్రేయం ద్వాదశాష్టౌ వైష్ణవాగమచోదితాః,
అఘోరముఖసంభూతాః మదంశాః కోటిసంఖ్యకాః. ౧౩
ఏతా జాలంధ్రపీఠస్థాః పశ్చిమామ్నాయదేవతాః.
దూత్యాది చ చతుష్షష్టిః సిద్ధాంతం త్రిసహస్రకం. ౧౪
ఆమ్నాయం పశ్చిమం వందే సర్వదా సర్వకామదం,
మణిపూరేస్మరేద్దేవి పశ్చిమామ్నాయజం మనుం. ౧౫

ఇతి పశ్చిమామ్నాయః.

అథోత్తరామ్నాయః.

తురీయాంబా మహార్థా చ అశ్వారూఢా తథైవ చ.
మిత్రాంబా చ మహాదేవీ శ్రీమద్వాగ్వాదినీ అపి. ౧౬
దుర్గా కాళీ దహచ్చండీ నకులీ చ పుళిందినీ,
రేణుకాలక్ష్మివాగీశా మాతృకాద్యాస్స్వయంవరా. ౧౭
పంచామ్నాయసమోపేతం శ్రీవిద్యాఖ్యం మదంశజం,
ముఖాత్తత్పురుషాజ్జాతా ద్వికోటీమంత్రనాయకాః. ౧౮

ఏతాశ్చోడ్యాణపీఠస్థాశ్శాక్తాగమసముద్భవాః,
ద్విసహస్రస్తు దేవ్యస్తాః పరివారయుతాః ప్రియే. ౧౯
ముద్రాదినవకం చైవ సిద్ధానాం నవకం తథా,
వీరావళీ చ నవకం భజేదామ్నాయ ముత్తమం. ౨౦
అనాహతాబ్జే స్మర్తవ్య ముత్తరామ్నాయముత్తమం.

ఇత్యుత్తరామ్నాయః.

అథ ఊర్ధ్వామ్నాయః.

పరాపరా చ సా దేవీ పరా శాంభవమేవ చ. ౨౧
ప్రాసాదం దహరం హంసం మహావాక్యాదికం పరం,
పంచాక్షరం మహామంత్రం తారకం జన్మతారకం. ౨౨
ఈశానముఖసంభూతాస్స్వాత్మానందప్రదాయకాః,
కోటిసంఖ్యా మహాదేవి మద్రూపాస్సర్వసిద్ధిదాః. ౨౩
ఏతాశ్శాంభవపీఠస్థాస్సహస్రపరివారితాః,
ఆరాధ్య మాలినీపూర్వం మండలాంతం తథైవ చ. ౨౪
సాయుజ్యహేతుకం నిత్యం వందే చోర్ధ్వకలాత్మకం,
ఊర్ధ్వామ్నాయస్య చ మనూనాజ్ఞాంతే తు విభావయేత్. ౨౫

ఇత్యూర్ధ్వామ్నాయః.

అథ అనుత్తరామ్నాయః.

స్మర్తవ్యా పాదుకా పూర్వం చరణం తదనంతరం,
పంచాంబా నవనాథాంబా మూలవిద్యా తతఃపరం. ౨౬
ఆధారవిద్యాషట్కం చ పునరంఘ్రిద్వయం క్రమాత్,
శాంభవీ చాథ హ్ల్లేఖా సమయాపరబోధినీ. ౨౭
కౌళపంచాక్షరీ పంచ దశార్ణా నుత్తరాత్మికా,
షోడశీ పూర్తివిద్యా చ మహాత్రిపురసుందరీ. ౨౮
ఊర్ధ్వశ్రీపాదుకా పూర్వం చరణాంతం గురోః క్రమాత్,
పశ్చాదనుత్తరం వందే పరబ్రహ్మస్వరూపిణీం. ౨౯
అనుత్తరామ్నాయమనూన్మండలాంతం యథాక్రమం,
సప్తకోటిమహామంత్రాన్ ద్వాదశాంతే సదా స్మరేత్. 30

శుచిర్వాప్యశుచిర్వాఽపి గచ్ఛన్ తిష్ఠన్ స్వపన్నపి,
మంత్రైకశరణో విద్వాన్మనసాఽపి సదా స్మరేత్. 30
తత్తత్సిద్ధ్యై చ సాహస్రం జపేత్సాధకపుంగవః.

ఇతి శ్రీరుద్రయామలతంత్రే ఉమామహేశ్వరసంవాదే శివేన విరచిత మామ్నాయస్తోత్రం సంపూర్ణం. శ్రీపర దేవతార్పణమస్తు.

అథ సర్వమంత్రాణాం ఋష్యాదిషడంగానామర్థజ్ఞానం.

ఋషిర్గురుత్వాచ్ఛిరసైవ ధార్య
శ్ఛందోఽక్షరత్వాద్రసనాగతం స్యాత్.
ఋషివర్ణాదికా ధాతూ స్తోగత్యాం ప్రాపణేఽపి చ,
తాభ్యాం యద్యత్స్వరూపం స ఋషిః స్యాద్గురువాచకః.
ఇచ్ఛాచ్ఛాదనార్థకౌ ధాతూ స్తచ్ఛబ్దాద్యశ్ఛదాదికః,
తయోరిచ్ఛా దదాతీతి ఛ్ఛందో మంత్రాక్షవాచకః.
ఆత్మనో దేవతాభావప్రదానా ద్దేవతేతి చ,
పదం సమస్తమంత్రేషు విద్వద్భిస్సముదీరితమితి.
హృదయం బుద్ధిగమ్యత్వా త్పాణినామస్యాన్నమఃపదం,
క్రియతే హృదయే నాత్ర బుద్ధిగమ్యా నమస్కృతిః.
తుంగార్థ స్సిరసే చేతి విషయాహరణే ద్విఠః,
శిరోమంత్రేణ చోత్తుంగవిషయాహృతిలక్షణా.
శిఖా తేజస్సముద్దిష్టా వషడిత్యంగ ముచ్యతే,
తత్తేజోఽస్య తనుః ప్రోక్తా శిఖామంత్రేణ మంత్రిభిః.
కచగ్రహణ ఇత్యస్మాద్ధాతోః కవచసంభవః,
హుం తేజస్తేజసా దేహో గృహ్యతే కవచం తతః.
అస్త్రాసాదికా ధాతూ సంక్షేపచలనాదికా,
తేనారిష్టం సమాక్షిప్య చాలయే త్షట్పదాగ్నినా.
నేత్రం దృష్టి స్సమాదిష్టా వౌషద్దర్శనముచ్యతే,
దర్శనం దృగ్విషయే న స్యా త్తత్తేజో నేత్ర వాచక మితి.
ఏవం షడంగవిన్యాసం కృత్వా పునర్బీజశక్త్యాదికం స్మరేత్.

సర్వమంత్రాణామపి ప్రకృతిర్దేవతా-అధిష్ఠాత్రీ దేవతా-అభిమానీ దేవతా చేతి దేవతాత్రైవిధ్యమస్తి సర్వతంత్రేషు. బ్రహ్మ బీజం - మాయాశక్తిః, శివోబీజం-బుద్ధిశ్శక్తిః. ఉదానోబీజం - సుషుమ్నా శక్తిః. తత్ర బ్రహ్మ - మాయాశబ్దాభ్యాం ప్రణవహృల్లేఖాఖ్య భూతే పరబ్రహ్మ - మూలప్రకృతీ ఉచ్యేతే. జీవబుద్ధిశబ్దాభ్యాం సర్వకారణభూతబ్రహ్మమాయయోః జ్ఞానభాగా ఉచ్యేతే. ఉదాన సుషుమ్నాశబ్దాభ్యాం బ్రహ్మమాయయోః ప్రవర్తకా ప్రపంచకారణత్వం ప్రణవహృల్లేఖయోః సమస్త మంత్రబీజశక్తికారణత్వం చోక్తం భవతి. తస్మాత్సమస్తమంత్రానుస్యూతబ్రహ్మాత్మకమాతృకామంత్రావగాహి ప్రణవహృల్లేఖావాచ్య మాయాశబలిత బ్రహ్మస్వరూప ప్రత్యగాత్మభూతాఖండసుఖచిత్ప్రకాశాత్, సమస్తాంగసహిత సర్వదేవతామంత్రమూర్తయః, సాధకస్య భాగ్యవశాత్ ప్రజ్వలితాగ్నేర్విస్ఫులింగా ఇవ ప్రాదుర్భూతా ఇతి భావయేత్. ఏవం సకలమహామంత్రాణాం ఋషి, చ్ఛందో, దేవతా, బీజశక్తి, కీలకా ఇతి షడంగ జ్ఞానమావశ్యకం.

తతః ప్రకాశవిమర్శాంశభూతహస్తద్వయాంగులీషు - పంచ భూతాత్మకేషు - మూలమంత్రపదైర్వర్ణైర్వా న్యాసం కుర్యాత్తేన తత్తద్దేవతామంత్రసాధకానాం తాదాత్మ్యసిద్ధిః. అనంతరం తత్తావిర్భాదిష్ట దేవతామయం తేజస్స్వశరీరే అంతర్బహిర్వ్యాప్నోతీతి భావయేత్. ఇతి సర్వమంత్రాణాం ఋష్యాదిజ్ఞానం సంపూర్ణం.

**చిద్విద్యాతంత్రస్వరూపము.**

**చతుశ్శత్యాం. వసిష్ఠసంహితాంతర్గతం చ:—**

శ్లో. భగవన్ సర్వతంత్రాణి భవతోక్తాని వైపురా,
తేషామన్యోన్యసాపేక్షాజ్జాయతే మతివిభ్రమః.
తస్మాత్తు నిరపేక్షమ్మే తంత్రం తాసాం వద ప్రభో.
ఇతి దేవ్యాప్రార్థిత ఉవాచ శంకరః.
శ్రుణు కాదిమతం తంత్రం పూర్ణమన్యానపేక్షయా,
గోప్యం సర్వప్రయత్నేన గోపనస్తంత్రచోదితః.

లలితావిద్యయా విద్యామన్యాం యంత్రేణ వాఽమునా,
యంత్రమన్యత్సమం వేత్తి యో ఽసౌ స్యాత్స్వార్థచేతనః.
గురుశిష్యపదే స్థిత్వా స్వయమేవ సదాశివః,
ప్రశ్నోత్తరపరైర్వాక్యైస్తంత్రం సమవతారయత్.
స్వయమేవేత్యనేన ప్రకాశవిమర్శభేదేనేతి.

ఇతి శ్రీవిద్యాతంత్రం స్వతంత్రతంత్రమితి, శ్రీచక్రం సిద్ధవజ్రాఖ్యమితి బహూవో వచనాని సంతి. శ్రుతిస్మృతిసిద్ధం.

గౌడపాదాచార్యవిరచితసుభగోదయే:—

శ్లో. చతుష్షష్టిస్తంత్రాణ్యపి కులమతం నిందితమిదం
తదేతన్మిశ్రాఖ్యం మతమపి భవేన్నిందితమిహ,
శుభాఖ్యాః పంచైతే శ్రుతిసరణిసిద్ధాః ప్రకృతయో
మహావిద్యాస్తాసాం భవతి పరమార్థా భగవతీతి.

శ్రీజగద్గురు శంకరాచార్యవిరచిత సౌందర్యలహర్యాం:—

శ్లో. చతుష్షష్ట్యా తంత్రైస్సకలమతిసంధాయ భువనం
స్థితస్తత్తత్సిద్ధిప్రసవపరతంత్రైః పశుపతిః,
పునస్త్వన్నిర్బంధాదఖిలపురుషార్థైకఘటనా
స్వతంత్రం తే తంత్రం క్షితితలమవాతీతరదిదం.
కర్ణాత్కర్ణోపదేశేన సంప్రాప్తమవనీతలమితి.

తా. పరమేశ్వరుఁడు జగత్తునందుఁగలప్రాణుల కామ్యసిద్ధుల కొఱకు ౬౪ చతుష్షష్టితంత్రములను సృజించి, ఆయాతంత్రములయం దాసక్తులగుప్రాణులను చూచి వినోదించుచుండఁగా కామేశ్వరీదేవి పరమేశ్వరుని ప్రార్థించినది. హేస్వామీ! తమరు తంత్రములను సృజించినారు. నాతంత్రములందు నొక్కొకదానియందు నొక్కొక కామ్యసిద్ధి మాత్రము గలిగియున్నది గాని నా తంత్రములందు చతుర్విధపురుషార్థసిద్ధి నొకతంత్రమువలన కలుగనేరదు. అవి అన్యోన్యాపేక్ష గలిగియున్నవి గాన చతుర్విధపురుషార్థములు నొకతంత్రమువలనఁ గలుగు నట్టిదానిని, నిరపేక్షగలదానిని నాకొఱ కొనరిమ్మని ప్రార్థించిన పైని నీ శ్రీవిద్యాతంత్రమును శ్రీచక్రమనుయంత్రమును నాపరమేశ్వరునిచే

నిర్మింపఁబడినవి. ఈతంత్రమునకు స్వతంత్రతంత్రమనియు, శ్రీచక్రమునకు సిద్ధవజ్రమనియు, సంకేతములను నిరూపించిరి. ఈ లలితా త్రిపురసుందరీవిద్యకు సమానవిద్యయు, నీ శ్రీచక్రమునకు సమానయంత్రమును లేవని ఇది సమయమతమని నిర్దేశించిరి.

**సమయమతనిరూపణము**

ఇట్లు పరమేశ్వరునిచే అగ్రవర్ణులకొఱకు సమయవిద్యా తంత్రమును, మిగతా త్రైవర్ణికులకొఱకు చతుష్షష్టితంత్రములును నిర్మింపఁబడిన పైని, సనకాదిఋషులు పైనిచెప్పిన తంత్రచోదిత వచనములను ఆచారములను చూచి బ్రాహ్మణులును భ్రమను పొందుదురని నీ కాదివిద్యా తంత్రమును విరివిగా నుపపాదించి, సంహితలను రచియించిరి. అవి సనకసంహిత, సనందనసంహిత, సనత్కుమారసంహిత, వసిష్ఠసంహిత, శుకసంహిత యని నీపంచసంహితలను నేర్పరిచి వీని ననుసరించిన అంతరంగబహిరంగ పూజానుసంధానాదులు అగ్రవర్ణోచితములనియు, ధర్మార్థకామమోక్షము లనెడు పురుషార్థచతుష్టయము అనాయాసముగా సిద్ధించుననియు, నీ శుభాగమపంచకమందు ప్రతిపాదించిన యాచారము సమయాచారమనియు, శ్రుతిస్మృతి సమ్మతమనియు నిర్ణయించిరి. అందువలన నీ సమయాచారము శిష్టజనాదరణీయముగా పరశివాదిస్వగురుపర్యంతమును పరంపరగా వచ్చుచున్నవి.

శ్లో. నారాయణం పద్మభువం వసిష్ఠం శక్తిం చ తత్పుత్రపరాశరం చ,
వ్యాసంశుకంగౌడపదంమహాంతంగోవిందయోగీంద్రమథాస్యశిష్యం,
శ్రీశంకరాచార్యమథాస్య పద్మపాదం చ హస్తామలకం చ శిష్యం,
తంత్రోటకం వార్తికకార మన్యా నస్మద్గురూన్సంతతమానతోఽస్మి.

ఇది సమయవిద్యాగురు పరంపరగా నున్నది. ఇదియే దివ్యౌఘ, సిద్ధౌఘ, మానవౌఘములుగా నస్మద్గురుపర్యంతము శాఖోపశాఖలుగా వికసనమును పొందియున్నది.

ఈ గ్రంథాంతమందు నీ బ్రహ్మవిద్యావతార క్రమమును నిరూపించినారు. అందూర్ధ్వానందనామక పరశివునిచే కామేశ్వరిదేవికొఱకు ఉపదేశింపఁబడినట్లును, నా పరాశక్తివలన త్రిమూర్తిపరంపరగా నీ విద్య అవతరించినట్లు తెలియుచున్నది.

ఈ శుభాగమపంచకము (నామా సంహితలు) సకలజనులకు లభించకపోయినను నందు చెప్పిన యాచారము శ్రుతిస్మృతి సమ్మతము గాను శిష్టజనానుష్ఠానములో నున్నది. అదియే సమయాచారము. ఈ సమయాచార, కౌలమతముల రెంటియందును అంతరంగ అను సంధానాదికమును, బహిరంగపూజాకలాపమును, పరస్పర భేదమును కలిగి యున్నవి. అందు కొన్ని యిచట చూపింపఁబడుచున్నవి.

**సమయమతము.**

శివవిద్య, కాదివిద్య, దక్షిణామూర్తి ఋషి, కామేశ్వరీ కామేశ్వరు లధిదేవతలు, అంతరంగకృత్యము, శ్రీచక్రమందు గలశక్తిచక్ర శివచక్రముల కైక్యమును సంపాదించి, నా చక్రాష్టకమునకు మూలాధారాదికమలముల కైక్యమును భావించి భావనోపనిషత్ప్రకారము నంతర్యాగము సలుపుటయు, శివతత్త్వప్రధానముగా సహస్రారమం దాత్మలయభావన సమయమత మనఁబడును.

**సమయైకదేశపక్షము:—**

శ్లో. "విప్రాః క్షోణిభుజో విశస్తదితరే క్షీరాజ్యమధ్వాసవైః" అను నభియుక్తవచనప్రకారము బాహ్యపూజాకలాపమందు క్షీర ద్రవ్యముచే బ్రాహ్మణులు కల్పసూత్రప్రకారము చక్రార్చనాదులు సలుపుటయు చతుర్విధైక్య షడ్విధైక్య మహానవమియందు మహావేధాదులగు అనుసంధానరహస్యములు గలది సమయమతము. ఇందుకు గౌడపాద కారిక:—

శ్లో. తవాజ్ఞాయాం విద్యున్నయతి నియుతాభాక్షరమయీ
స్థితా విద్యుల్లేఖా భగవతి విధిగ్రంధి మభినత్,
తతో గత్వా జ్యోత్స్నామయ సమయలోకం సమయయా
పరాఖ్యా సాదాఖ్యా జయతి శివతత్త్వేన మిళితా.

ఇది సమయమతరహస్యము.

**కౌలమతనిరూపణము.**

వామాచారము, భైరవఋషి, భైరవీభైరవు లధిదేవతలు, శివతత్త్వము శక్తితత్త్వమం దంతర్భావము, శక్తితత్త్వప్రధానము

అంతర్యాగమందు మూలాధార స్వాధిష్ఠాన కమలములయందు పూజా ఆత్మలయాదికలాపము, కుండలినీఉపాసన, కుండలినీప్రబోధాదికము, బాహ్యచక్రార్చనలో వామహస్తముతో తర్పణాదికలాపము, పరశురామ సూత్రప్రకారము సురామాంసాదులతో పూజకలాపము నీ సంకేతములు గలది వామాచారప్రధానమయిన కౌలమతమని బుధు లేర్పరిచిరి. ఇందుకు గౌడపాదాచార్యవిరచిత సుభగోదయమందు:—

శ్లో. భవేన్మూలాధారం తదుపరితనం చక్రమపి త
ద్ద్వయం తామిస్రాఖ్యం శశికిరణసమ్మేళనవశాత్,
తదేతత్కౌళానాం ప్రతిదినమనుష్ఠేయముదితం
భవత్యా వామాఖ్యం మతమపి పరిత్యాజ్యముభయమ్. ౪౩
అమీషాం కౌళానాం భగవతి భవేత్పూజనవిధి
స్తవ స్వాధిష్ఠానే తదను చ భవేన్మూలసదనం.
అతో బాహ్యే పూజా భవతి భగరూపేణ చ తతో
నిషిద్ధాచారోఽయం నిగమవిరహో నింద్యచరితమ్. ౪౪
సహస్రారం బిందుర్భవతి చ తతో బైందవగృహం
తదేతస్మాద్ జ్ఞాతం జగదిద మశేషం సకరణం,
తతో మూలాధారద్వితయ మభవత్తద్దశదళం.
సహస్రారాజ్జాతం తదితి దశధా బిందురభవత్. ౪౫
తదేతద్బిందో ర్యద్దశకమభవత్తత్ప్రకృతికం
దశారం సూర్యారం నృపదళమభూన్నేత్రకమలం,
రహస్యం కౌళానాం ద్వితయమభవన్మూలసదనం
తథాధిష్ఠానం చ ప్రకృతిమథ సేవంత ఇహ తే. ౪౬
అతస్తే కౌలాస్స్యుర్భగవతి దృఢప్రాకృతజనా
ఇతి ప్రాహుః ప్రాజ్ఞాః కులసమయమార్గద్వయవిదః,
మహాంతస్సేవంతే సకలజననీం బైందవగృహే
శివాకారాం నిత్యామమృతఝరికాం బైందవకళామ్. ౫౦

తదుక్తం సనత్కుమారసంహితాయాం:—

శ్లో. బాహ్యపూజా న కర్తవ్యా కర్తవ్యా బాహ్యజాతిభిః,
సా క్షుద్రఫలదా నౄణాం ఐహికార్థికసాధనాత్,
బాహ్యపూజారతాః కౌలాః క్షపణాశ్చ కపాలికాః,
దిగంబరా ఇతిహాసాః కామికా స్తంత్రవాదినః.
అంతరారాధనపరా వైదికా బ్రహ్మవాదినః,
జీవన్ముక్తాశ్చరంత్యేతే త్రిషు లోకేషు వర్తత ఇతి.

తా. కౌలాః = ఆధారపూజారతాః, క్షపణకాః = యోనిపూజారతాః, కాపాలికాః = దిగంబరాశ్చోభయత్రరతాః, బ్రహ్మవాదినః = శుభాగమపంచకోక్తాచారనిరతాః ఇతి.

కించ కౌలమతే, చంద్రకలాత్మకానాం షోడశనిత్యానాం ప్రతిదిన మేకైకస్యైవ తిథినిత్యాయాః పూజనం విహితం, సమయమతేతు షోడశకలాయాః. పంచదశకలాస్వంతర్భావాత్, బైందవస్థానే పంచదశకలానాం మహానిత్యాకలాయా మంతర్భావసంభవాచ్చ ప్రత్యహం పంచదశనిత్యానా మారాధనం విహితం సనత్కుమారసంహితాయాం. నిత్యానామాని పూర్వం నిత్యాప్రకరణే లిఖితాని. ఇతి సంక్షేపేణ కౌలమతనిరూపణం.

అనేన బ్రాహ్మణానాం కౌలమతేఽధికారో యత్రకుత్రాపి న దృశ్యతే ఇతి నిశ్చితం.

## అథ చతుష్షష్టితంత్రనామాని.

చతుశ్శత్యాం:—

శ్లో. చతుష్షష్టిశ్చ తంత్రాణి మాతౄణా ముత్తమాని చ,
మహామాయా శంబరం చ యోగినీ జాలశంబరం.
తత్త్వశంబరకం చైవ భైరవాష్టక మేవ చ,
బహురూపాష్టకం చైవ యమళాష్టక మేవ చ.
చంద్రజ్ఞానం మాలినీ చ మహాసమ్మోహనం తథా,
వామజుష్టం మహాదేవం వాతులం వాతులోత్తరం.
హృద్భేదతంత్రభేదం చ గుహ్యతంత్రం చ కామికం,

కళావాదం కళాసారం తథాఽన్యత్కుండికామతం.
మతోత్తరం చ వీణాఖ్యం త్రోతలం త్రోతలోత్తరం,
పంచామృతం రూపభేదం భూతోడ్డామర మేవ చ.
కులాసారం కులోద్దేశం కులచూడామణి స్తథా,
సర్వజ్ఞానోత్తమం చైవ మహాకాళీమతం తథా.
అరుణేశం మోదినీశం వికుంఠేశ్వర మేవ చ,
పూర్వపశ్చిమదక్షం చ ఉత్తరం చ నిరుత్తరం,
విమలం విమలోద్దేశం దేవీమత మతఃపరం.

**ఇతి చతుష్షష్టితంత్రాణి.**

తా. మాయాశంబరతంత్రము - మాయాప్రపంచనిర్మాణము ఫల
ముగాఁగలది. శంబ ము-యోగులకుఁగూడమాయను గలుగఁజేసెడిది. ఇది
శ్మశానవాసాదికుమార్గసాధ్యము నింద్యము. తత్త్వశంబరము-పృథివ్యాది
భూతములను చూపించుట. ఇదియే మహేంద్రజాలవిద్య. భైరవాష్టక
మనఁగా సిద్ధ, వటుక, కాలభైరవాది ఎనిమిది విధములగు తంత్రములు.
నిక్షేపాదులను చూచుట ఫలము. ఈఎనిమిదియు కాపాలికములగుటచే
వైదికమార్గదూరములు. బహురూపాష్టకము. బ్రాహ్మీమాహేశ్వర్యాది
అష్టమాతృకలపేర్లతో నెనిమిది తంత్రములు. ఈఅష్టకమును వేదమార్గ
దూరముగాన హేయము. ఇందు శ్రీవిద్యాప్రసంగము కలదు గాని
కౌలము వామాచారము. యమలాష్టకము దేవీమతప్రతిపాదకములగు
నెనిమిదిమంత్రములు. ఇవియు వామాచారప్రధానములు, వేదమార్గ
దూరములు. లోకమునందు శ్రీవిద్యామంత్రముల కన్నిటికిని యమల
ములనే సంజ్ఞకలదు. చంద్రజ్ఞాన మీతంత్రమందు షోడశనిత్యాప్రతి
పాదనకలిగినను కాపాలికమయినందున నింద్యము. మాలినీతంత్రము
సముద్రయానసాధనము, అవైదికము, నింద్యము. మహాసమ్మోహిని
జాగ్రదవస్థలోనున్నవానిని నిద్రఁజెందించుట, బాలజిహ్వాచ్ఛేదనాది
కుమార్గసాధ్యము నింద్యము. వామజుష్టతంత్రము కేవల వామాచార
ప్రధానము. వాతులం, వాతులోత్తరం, కామికం అనునీమూడుతంత్రము
లును ఏకదేశమందు వైదికమార్గప్రవృత్తి కలిగి అధికభాగము వామా
చారప్రవృత్తి కలిగియున్నందున నిషిద్ధము. హృద్భేదతంత్రము-షట్క
మలభేదనముచేసి సహస్రారప్రవేశము. వామాచారప్రవృత్తి, కాపా

లికమతము, నింద్యము. తంత్రభేదమనఁగా మూఁడుతంత్రములు. వీనియం దనేక ప్రాణిహింసలు కలుగుటచే వేదమార్గదూరము, నింద్యము.

కలావాదము-దీనియందు చంద్రకలాకర్షణ మోచకశక్తి కలుగుటచే కేవలకామపురుషార్థప్రదమయినందున, పరదారగమనాదినిషిద్ధాచారము కలిగినందున కాపాలికములో చేరినది. కుండికామతము-ఘుటికాది సిద్ధిప్రదము, వామాచారము. మతోత్తరము - రససిద్ధి, నింద్యము. వీణాతంత్రము - సంభోగయక్షిణీ స్వాధీనము నింద్యము. త్రోతలము, త్రోతలోత్తరము ఈరెండును వామాచారప్రధానములు. పంచామృతము - పృథివ్యాదిభూతములను స్వాధీనపరచుకొని మరణములేకుండుట - కేవలకాపాలికము, నింద్యము. రూపభేదము, భూతోడ్డామరము, కులాసారము, కులోద్దేశము, కులచూడామణి అను నీ అయిదు తంత్రములును దిగంబరమతములు, నింద్యములు. సర్వజ్ఞానోత్తమము, మహాకాళీమతము అను నీ రెండును దిగంబరక్షపణకమతములగుటచే అతిదూరములు.

ఇవి చతుష్షష్టితంత్రములు. వీనియందు ప్రవృత్తిగలజనులు దైవవంచితులని చెప్పఁబడుదురు. శూద్రాదులనుగుఱించి వామాచారప్రధానమయిన నీతంత్రములు ఈశ్వరనిర్మితములయినవి.

వీనిలో చంద్రకళాష్టకము అనఁగా, చంద్రకలా-జ్యోత్స్నావతి-కలానిధి - కులార్ణవము - కులేశ్వరము-భువనేశ్వరము - బార్హస్పత్యము-దూర్వాసమతము అనునీఎనిమిదితంత్రములు మిశ్రమములు. వీనియందు శూద్రుల కధికారము లేదు. బ్రహ్మక్షత్రియ వైశ్యులకు మాత్ర మధికారమున్నను మిశ్రమములగుటచే వామాచారము వేదబాహ్యముగాన, బ్రాహ్మణనింద్యములని బ్రాహ్మణులకొఱకు సమయాతంత్రము తిరిగి ఈశ్వరుచిచే నీకాదివిద్యాతంత్రము నిర్మింపఁబడినది. ఇది సమయమతసవిస్తరము.

శుభాగమపంచకము. వసిష్ఠసంహిత, సనకసంహిత, సనందనసంహిత, సనత్కుమారసంహిత, శుకసంహితలను నీపంచసంహితలందు సమయాచారము శ్రుతిస్మృతిసమ్మతముగా విస్తరింపఁబడినది. ఇదియే శిష్టజనాచరణలో నున్నది.

ఏవంసతిబహవో ఈశ్వరమాయయామువ్యాంతే. తత్తుమాయాకార్యం.

**మహామాయాస్వరూపం.**

**ఉక్తం చ కూర్మపురాణే శివేన:—**

శ్లో. జ్ఞానినామపి చేతాంసి దేవీ భగవతీ హి సా,
బలాదాకృష్య మోహాయ మహామాయా ప్రయచ్ఛతి.
ఇయం సా పరమా శక్తిర్మన్మయీ బ్రహ్మరూపిణీ,
మాయా మమప్రియా ఽనంతా యయేదం మోహితం జగత్.
అనయైతజ్జగత్సర్వం సదేవాసురమానుషం,
మోహయామి ద్విజశ్రేష్ఠాస్సృజామి విసృజామి చేతి.

**తత్రైవ హిమవంతం ప్రతి దేవీవచనం:—**

యాని శాస్త్రాణి దృశ్యంతే లోకే ఽస్మిన్వివిధాని తు,
శ్రుతిస్మృతివిరుద్ధాని ద్వైతవాదరతాని చ.
కాపాలం భైరవం చైవ శాకలం గౌతమం మతం,
ఏవంవిధాని చాన్యాని మోహనార్థాని తాని తు,
యే కుశాస్త్రాభియోగేన మోహయంతీవ మానవాన్,
మయా సృష్టాని శాస్త్రాణి మోహాయైషాం భవాంతరాత్

**సూతసంహితాయాం:—**

ప్రసాదహీనాః పాపిష్ఠాః మోహితా మాయయా జనాః,
నైవ జానంతి దేవేశం జన్మనాశాదిపీడితా. ఇతి.

**దేవీభాగవతే:—**

గర్భాంతజ్ఞానసంపన్నం ప్రేరితం సూతిమారుతైః,
ఉత్పన్నం జ్ఞానరహితం కురుతే యా నిరంతరం.
పూర్వాఽతిపూర్వసంఘాతసంస్కారేణ నియోజ్య చ,
ఆహారాదౌ తతో మోహ్య మమత్వం జ్ఞానసంశయం.
క్రోధావరోధలోభేషు క్షిప్త్వా క్షిప్త్వా పునః పునః,
పశ్చాత్కామే నియోజ్యాశు చింతాయుక్తమహర్నిశం.
ఆమోదయుక్తం వ్యసనాసక్తం జంతుం కరోతి యా,
మహామాయేతి సా ప్రోక్తా తేన సా జగదీశ్వరీతి.

స్వరూపజ్ఞానేన వినా మాయా న శామ్యతి. స్వరూపజ్ఞానే సతి తస్మిన్విలీనా భవతీతి సర్వవేదాంతనిశ్చయః.

**త్రిపురోపనిషది:—**

శ్రు. కామిా కలాం కామరూపాం చికిత్వా నరో జాయతే కామరూపశ్చ కామః; పరిస్రుతం ఝషమాజంపలం చ భక్తాని యోని స్సుపరిష్కృతాశ్చ, నివేదయ దేవతాయై మహత్యై స్వాత్మీకృతే సుకృతీ సిద్ధిమేతీతి.

తా. ఈ శ్రుతియందుఁగల పరిస్రుతం, ఝషం, ఆజంపలం అను నీశబ్దములకు సమయమత పరముగానున్న సంకేతార్థమును తెలిసికొనక అనేకులు మాయామోహితులయి యీపదములకు వామమార్గాను గుణముగా సుర, మత్స్య, ఛాగమాంసములకు అన్వయించుచు కౌల మున్ను వేదచోదితమని భ్రమను పొందుచున్నారు. వామాచారము గల కౌలమతమునకును, వేదమునకు నెచటను సంబంధముండదు.

పైనుదహరించిన పదములకు సంకేతార్థము. పరిస్రుతం=సంవిన్మయా మృతము.

శ్రు. అమృతస్య ధారా బహుధా దోహమానం చరణం నో లోకే సుధితాం కరోత్వితి.

సహస్రారాంతర్గతచంద్రమండలమునుంచి అమృతస్రావము సర్వదా కలుగుచున్నదని సమయమతరహస్యము.

శ్లో. సంవిదాసవయోర్మధ్యే సంవిదేవ గరీయసీతి వచనాచ్చ.

ఝషం మహామత్స్య దృష్టాంతమువలన జీవపరము. బృహదారణ్యక.

శ్రు. షష్ఠాధ్యాయము, తృతీయ బ్రాహ్మణము, ౧౮ మంత్రము:—

తద్యథా మహామత్స్య ఉభే కూలే అనుసంచరంతి పూర్వం చాపరం చైవ మేవాయం పురుష ఏతా వుభావంతా వనుసంచరతి స్వాపంచ బుద్ధాంతం చ.

తా. నదియందు మహామత్స్యము పూర్వకూలమునుంచి పర కూలము, పరకూలమునుంచి పూర్వకూలమునకును సర్వదా సంచరించు చుండును. అట్లే జీవుఁడును నిద్రనుంచి జాగ్రదవస్థను, జాగ్రదవస్థనుంచి నిద్రావస్థను, ఈజన్మనుంచి మఱొకజన్మను, ఇట్లు యాతాయాతము

కలిగియున్నందున జీవునికి మహామత్స్యదృష్టాంతమును చెప్పిరి గాన నిచట ఝషశబ్దము జీవపరముగా గ్రహింపఁబడుచున్నది.

ఆజం పలం - అజాయా ఇదం ఆజం, పలం - ఇంద్రియసమూహం, అజా = ప్రకృతిః. (అవిద్యా) దాని అవయవములు (ఇంద్రియాదులు) పలశబ్దముచే గ్రహింపఁబడుచున్నవి.

శ్రు. అజా మేకాం లోహిత శుక్ల కృష్ణాం బహ్వీం ప్రజాం జన యంతీగ్ సురూపామితి.

సహస్రారాంతర్గత స్రవదమృతధారను, జీవభావమును, అవిద్యను, అవిద్యవలన కలిగిన ఇంద్రియాదులను, ఈసమష్టికి కారణవస్తువును, సుపరిష్కృతాశ్చ=వేరువేరుగా స్పష్టముగా తెలుసుకొని, మహత్యై దేవతాయై నివేదయ౯ = త్రిమూర్తులకన్న పూర్వమున్న పరదేవతకు సమర్పించుచు, స్వాత్మీకృతే = ఈసకలమును, తాను పరమాత్మస్వరూప ముగా భావించిన పుణ్యపురుషులు బ్రహ్మభావమును పొందుచున్నా రని యీ శ్రుతితాత్పర్యము.

ఇది శ్రీమత్త్రిపురసుందరీ పరాభట్టారికాముఖ పంకజాయత్త నిస్సరితంబును, కామేశ్వరీ అపరావతారులును, స్వరూపజ్ఞాననిష్ఠులును, నిగమాగమరహస్య సకలసంకేతాభిజ్ఞులును, సమయాచారపరులునగు పుణ్యానందమునీంద్ర విరచితంబగు కామకలావిలాస సూత్రపంచ పంచాశతి యనెడి ఆత్మవిద్యా ప్రతిపాదకమైన యీమూలగ్రంథమందలి శ్రీవిద్యాపంచదశీమంత్రోద్ధారమంత్రార్థములు మొదలగు మంత్రసంకే తములుగల విద్యాపాదమునకు శ్రీమత్పదవాక్యప్రమాణోభయభాషా ప్రవీణ సమయాచారతత్పరుండును, శ్రీమత్త్రిపురసుందరీప్రసాదలబ్ధ ప్రతిభాసమేతుండును, కృష్ణయజుర్వేద షడశీతిశాఖాంతర్గత తైత్తిరీయ శాఖాన్వితాపస్తంబసూత్ర కౌశికసగోత్రుండును, వేగినాడీసముద్భవుం డును, జగత్ప్రసిద్ధ ప్రయాగక్షేత్రనివాసియు, సింహంభట్ల భాగీరథీ రామేశ్వర ద్వితీయపుత్రుండును, జ్ఞానానందనాథేతి దీక్షానామాంకిత రామమూర్తివిద్వద్విరచితంబగు రహస్యార్థబోధినియను నాంధ్రభాషా టీకగల విద్యాపాదము.

సం పూ ర్ణ ము.

ఓం

# ఆనందపాద ప్రారంభము

## చ క్ర సం కే త ము

---

౨౦-వ సూత్రము, పరాస్వరూపము.

**మూ. యా సాంతరోహరూపా పరా మహేశీ త్రిభావితా సైవ,**
**స్పష్టా పశ్యంత్యాది త్రిమాతృకాత్మాచ చక్రతాం యాతా.**

శ్లో. శ్రీశివానందనాథాంతం పరాపరగురుం పరం,
ప్రణమ్యానందపాదస్య వ్యాఖ్యానం క్రియతే మయా.

మూలసూత్రార్థము. యా=ఏశక్తి, సాంతరోహరూపా=అవాఙ్మానసగోచరమైనందున సంకల్పరూపేచ్ఛామాత్రస్వరూపముగల, మహేశీ =సర్వవ్యాపి కానియామికాస్వరూపిణియయిన, పరా = సర్వోత్కృష్టమైన పరాశక్తి, సైవ=అదియే, త్రిభావితా=మూడు ప్రకారములుగా నావిర్భవించినదై, స్పష్టా=స్పష్టమయిన, పశ్యంత్యాది త్రిమాతృకాత్మా=పశ్యంతి, మధ్యమా, వైఖరీలను మాతృకాస్వరూపముగా, చక్రతాం యాతా = శ్రీచక్రాకారమును పొందినది.

తా. ఇదివరకు మంత్ర దేవతలకు అభేదమును నిరూపించినారు. ఈసూత్రమందు ముందు వివరించెడి శ్రీచక్రము పరాస్వరూపమయిన పంచాశద్వర్ణాత్మక మాతృకవలన కలుగుచున్నందున, నా మాతృకయే శ్రీచక్రాకారమును పొందుచున్నందున నా పరాశక్తిస్వరూపమును వివరించుచున్నారు. ప్రథమసూత్రమందు "పాతు మహేశః ప్రకాశమాత్రతనుః" అని ప్రకాశాంశయగు కామేశ్వరుని నిర్దేశించి యా పరమేశ్వరుని సంకల్పము ఇచ్ఛయే విమర్శాంశయగు పరాశక్తి ఆవిర్భవించినదని రెండవ సూత్రమందు చెప్పిరి. ఆ విమర్శ ప్రకాశాంశలతో సకలజగత్తును నిండియున్నది.

శ్రు॥ అస్తి భాతి ప్రియం రూపం నామఇత్యంశపంచకం,
ఆద్యత్రయం బ్రహ్మభావం నామరూపాత్మకం జగత్.

ఈ పరిదృశ్యమానమయిన జగత్తు రెండుభాగములు కలదిగా నున్నది. సదసత్; సత్=బ్రహ్మవస్తువు, అసత్ = మాయాస్వరూపము, అందు అస్తి, భాతి, ప్రియం అను నీ మూడును బ్రహ్మాంశములు, నామము రూపము అను నీ రెండును మాయాంశములుగా నున్నవి. ఈ రూపనామములును పునః శివశక్తిభాగములుగా నున్నవి. అందు రూపము శివభాగము. ఇందుకు అవిద్యాపాదమంతయు తత్త్వవివరము నిదివరకు నిరూపింపఁబడినది. ఇక శక్త్యంశమయిన నామమును గుఱించి యిచట వివరింపఁబడును. ఆనామమనఁగా శబ్దబ్రహ్మము. ఆశబ్దము పరాస్వరూపము. ఆ పరాశక్తి, సాంతరోహరూపా సదాశివాది సాధక జనపర్యంతము అంతఃకరణయందుఁగల సంకల్పమే స్వరూపముగాఁగలది.

సైవ, త్రిభావితా, మాతృకాత్మాచ=ఆ పరాశక్తి పశ్యంతీ, మధ్యమా, వైఖరులని మూడు విధములగు సంజ్ఞలనుపొంది మాతృకా స్వరూపమును పొందినదని తెలియుచున్నది. మాతృక, పరా స్వరూప, శబ్ద-బ్రహ్మాకారమనియు పరా, పశ్యంతీ, మధ్యమ, వైఖరులని నాల్గు సంజ్ఞలుకలిగి నామాత్మకమయిన జగత్తునకు, శ్రీచక్రమునకు కారణముగా నున్నదని పర్యవసానము. ఈ అర్థమందు ప్రమాణములు.

**ఋగ్వేదీయా సరస్వతీరహస్యోపనిషత్:—**

శ్రు॥. దేవీంవాచ మజనయన్త దేవాస్తాం విశ్వరూపాః పశవోవదంతి,
సా నో మంద్రేషు మూర్జం దుహానా ధేనుర్వాగస్మానుపసుష్టుతైతు.

అర్థస్తు. దేవాః=మిత్రవరుణాది ఇంద్రియపాలకాః, (చంద్రవిష్ణ్వాద్యంతఃకరణాధిపాశ్చ) యాం=సర్వోపనిషత్ప్రసిద్ధాం, వాచం దేవీం=శబ్దబ్రహ్మస్వరూపిణీం, వాగ్దేవతాం=సరస్వతీం, పరారూపామిత్యర్థః. అజనయంత=జనయామాసుః. సృష్ట్యాదౌ ఇంద్రియాదీని మన ఆదీని తత్తత్పాలకాన్సృష్ట్వాఽండమధ్యే విసృష్టవా న్పరమేశః. అనంతరం వ్యవహారార్థం తత్తద్దేవైః ప్రార్థితః, పరారూపాం వాగ్దేవతా మసృజదితి భావః. తాం=పూర్వోక్తాం వాగ్దేవతాం, విశ్వరూపాః=స్థూలదేహాభిమానినో జీవాః, పశవః=పాశైర్బధ్యంత ఇతి పశవః, ఇంద్రియరూపపాశబద్ధా

నరాః. వదంతి = వాచా ఉచ్చరంతి, సా = పూర్వోక్తా వాగ్ధేనుః = వాగ్రూపధేనుః, నఃమంద్రేషు = పశ్యంతీరూపమంద్రస్వరేషు, మూర్జం= ప్రేరణశక్తిం, దుహానా=స్రావమానా, అస్మాన్=సాధకజనాన్, ఉపసుష్టుత ఏతు = సుష్టు యథాతథా రక్షత్వితి.

తా. ఇంద్రియపాలకులును అంతఃకరణపాలకులగు మిత్ర, వరుణ, చంద్ర, విష్ణు మొదలగు దేవతలు ఏ వాగ్దేవతను ఉత్పాదించిరో, ఆ పరాశక్తియొక్క వైఖరిని, స్థూలదేహాభిమానులగు విశ్వు లనుసంజ్ఞ గల మనుష్యులు జాగ్రదవస్థలో జిహ్వచే నుచ్చరించుచున్నారు. అట్టి వాగ్దేవతయను ధేనువు మాయొక్క మంద్రస్వరమందు స్ఫురణశక్తిని స్రవించుచు సాధకజనులను రక్షించుచుఁగాక. ఈవాగ్దేవతకును చతుష్పాద త్వము, వాగ్ధారారూపదోహత్రయము నున్నందున సకలకోరికలను నిచ్చేదిగాన సరస్వతికి ధేనుత్వారోపణ కలిగినది.

**తత్రైవ శ్రుత్యంతరం:—**

చత్వారి వాక్పరిమితా పదాని తాని విదుర్బ్రాహ్మణా యేమనీషిణః,
త్రీణి గుహా నిహితా నేంగయంతితురీయం వాచో మనుష్యా వదంతి.

అర్థః. యే, బ్రాహ్మణాః=సాధకజనాః, తాని=ప్రసిద్ధాని, చత్వారి వాక్పరిమితాపదాని=పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీరూపాణి చతు ర్విధవాక్ స్థానాని, విదుః=వేద్యంతే, తేపవమనీషిణః=విద్వాంస ఇత్యు చ్యంతే. తత్ర=పూర్వోక్తపరాదిచతుర్షు వాక్ప దేషు, త్రీణి=పరా పశ్యంతీ మధ్యమాః, ఏతాని త్రీణి గుహాయాం నిహితం, నరానాడీగుహాయాం స్థితిసంభవాత్, నేంగయంతి=కేఽపి న జానంతి, మనుష్యాః, తురీయం = వైఖరీరూపం, వాచా=జిహ్వయా, వదంతి=ఉచ్చరంతీతి.

తా. వాగ్దేవతకు పరా, పశ్యంతి, మధ్యమా, వైఖరీలని నాలుగు స్థానములు. ఈనాలుగుస్థానములను ఏ సాధకజనులు తెలుసుకొను చున్నారో, వారు విద్వాంసులని చెప్పఁబడుదురు. ఆనాలుగు స్థానా దులలో మూఁడు గుప్తముగా నున్నందున మనుష్యులు తెలుసుకొనఁ జాలరు. నాలుగవదియగు వైఖరిమాత్రము వాక్కుచే నుచ్చరింపఁబడు చున్నదని తాత్పర్యము.

రహస్యార్థము—బ్రహ్మాండ పిండాండ మాతృకలు శివశక్త్యాత్మకములు. సాధకజనశరీరములందు బ్రహ్మరంధ్రాధోభాగమందున్న సహస్రకమలాంతర్గతచంద్రమండలము, సర్వకారణబిందువు, శివస్వరూపముగను నున్నది. అది తేజోమయము. పరమాత్మయని తెలియుచున్నది. కటిప్రదేశమందున్న మూలాధారకమలకర్ణికనుంచి సహస్రారకర్ణికపర్యంతమును సుషుమ్నయనే పరానాడి వ్యాపించియున్నది. ఈనాడి శక్తిస్వరూపము, జీవనాడి యను సంజ్ఞ కలది. పైనున్న చంద్రమండలతేజస్సు ఈనాడీమార్గముగా మూలాధారమువఱకు వ్యాపించి మధ్యనున్న కమలములకు ప్రకాశత గలుగఁజేయుచుండును గాన నీనాడి మెరుపుతీగవలె కాంతగలిగి సూక్ష్మాకారము గలిగి స్వాధిష్ఠానమందున్న ఉష్ణత్వము నీనాడీమార్గముగా సహస్రారమునకు వ్యాపింపఁజేయుచుండును. అందువలన నచటనున్న చంద్రమండలము ఘనీభవించిన అమృతమయము గాన నీఅగ్ని వేధచే స్రవించుచుండును. ఈనాడి మధ్యమధ్యను కమలములందు మాతృకారూపముగా ప్రదక్షిణ క్రమముగా పైకి వ్యాపించినందున, కౌళులు, కుండలినియొక్క ఆకారముగా నున్నందున దీనిని కుండలినీశక్తియని వాడుదురు.

ఈనాడియందు పరమాత్మతేజస్సు జీవసంజ్ఞను పొందియున్నందున బ్రహ్మనాడియనియు, సరస్వతీరూపమయిన అకారాది - హకారాంతమయిన పంచాశద్వర్ణమయమగు మాతృక యీనాడీరూపముగా విశుద్ధాది ఆజ్ఞాంతకమలరూపమునుపొంది ఆయాదళములందున్నందున పరానాడియనియు, వేదాది సకలవిద్యలు, సకలమంత్రములు సకలవాగ్రూపవ్యవహారమునకు నిది కారణముగా నున్నందున బ్రహ్మనాడియనియు, వేదమందు వాడఁబడుచున్నది.

ఈపరావాగ్దేవతకు నాలుగుస్థానములు. పరా, పశ్యంతి, మధ్యమా, వైఖరీ అని సంజ్ఞలు కలవి. సకలవ్యవహారమును ప్రథమమందు సహస్రారమధ్యవర్తియగు సాక్షిస్థానమందు స్ఫురణశక్తి కలుగుచున్నది. పిదప నాక్రియ యేయింద్రియసంబంధమైనదో, యాయింద్రియము ప్రేరేపింపఁబడి యాయింద్రియముచే నాక్రియ జరుగును గాన నొకశబ్దముచ్చరించ దలఁచినపుడు ముందు సహస్రారమందు, ఇచ్ఛ జనించును.

గాన నది పరావాక్కు స్థానము. పిదప వాక్కునకు వాయువాధారము గాన నాశబ్దోచ్చారణ యిచ్ఛ జనించినవెంటనే అచటనుండి వ్యాపించి యున్న పరానాడీద్వారా ప్రేరణమయి మూలాధారమందు వాయువు ఉత్పన్న మగును. అది పశ్యంతీస్థానము. ఆవాయువు పరానాడీద్వారా స్వాధిష్ఠానమణిపూరములు దాటి అనాహతమను సంవిత్కమలమును పొందినపుడు మధ్యమ యనఁబడును. అంతటనుండి విశుద్ధకమలమును పొందినపుడు, వైఖరియని తేజోమయమయి స్పష్టాక్షరములు గలిగి యాశబ్ద ముచ్చరింపఁబడుచున్నది. ఈనాలుగు స్థానములలో 1 సహస్రారగతమయిన పరాస్థానమును, 2 మూలాధారగతమయిన వాయూత్పత్తిరూప పశ్యంతీస్థానమును, 3 సంవిత్కమలమును పొందిన మధ్యమ యనునదియు, నీమూఁడుస్థానములు తేజోమయములుగాన మనుష్యులు తెలుసుకొనఁజాలరు.

నాలుగవదియగు వైఖరీమాత్రము సకలజనుల వ్యవహారములో నున్నది.

శ్లో. అపదం పదమాపన్నం పదం చాప్యపదం భవేత్,
పదాపదవిభాగం చ యః పశ్యతి స పశ్యతి.

**మాతృకావివేకే:—**

శ్లో. మూలాధారాత్సముత్పన్నః పరాఖ్యో నామ సంభవః,
స ఏవోర్ధ్వతయా నీతః స్వాధిష్ఠానే విజృంభితః.
పశ్యంత్యాఖ్యామవాప్నోతి తయోరూర్ధ్వం శనైశ్శనైః,
అనాహతే బుద్ధితత్త్వసమేతో మధ్యమాభిధః.
తథా తయోర్ధ్వం నున్నస్సన్ విశుద్ధౌ కంఠదేశతః,
వైఖర్యాఖ్య ఇత్యాది శ్రుతిస్మృతి సిద్ధాపరావాగ్దేవీతి.

తా. ఈమాతృకావివేకవచనమందు పరావాక్ స్థానము మూలాధారమని యున్నది. ఇది కౌళమతపరము. సమయమతమువలన శివశక్తిరూప హంసద్వంద్వము, సహస్రారగతము వాక్కునకు ప్రథమమందు ఇచ్ఛ గలుగును. అది సహస్రారగతముగాన పరాస్థానము సహస్రారమని సమయమతము.

శ్రు. యత్కుమారీ మంద్రయతే యద్యోషి ద్యతపతివ్రతా,

అరిష్టం యత్కించ క్రియతే అగ్ని స్తదనువేధతే.

అస్యార్థః, శబ్దబ్రహ్మస్వరూప పరాశక్తికి పశ్యంతీ, మధ్యమా, వైఖరీ నామములు కలుగుటకు కారణము నీశ్రుతిచే చెప్పుచున్నారు. యత్ మంద్రయతే తస్మాత్కుమారీతి=పరావాగ్దేవత యెందువల్ల మూలాధారమందు మంద్రస్వరము గలదియో అందువల్ల కుమారీ అనిపించుకొనును. పరాకాశమందు స్ఫురణ కలుగఁగానే మూలాధారమందు వాయూత్పత్తి కలుగును. ఆకాలమందు సద్యోజాత శిశువు వలెనే మంద్రస్వరముతో నుండును గాన కుమారీనామము, పశ్యంతీ అవస్థయు కలిగినది. పిదప యద్యోషిత్ = సంవిత్కమలమును ఆ వాయువు పొందినపుడు పూర్వముకన్న స్పష్టమయిన స్వరముకలిగినందున యోషిత్సంజ్ఞ కలిగినది. ఇది మధ్యమావస్థ. యత్పతివ్రతా = విశుద్ధకమలమును ఆవాయువు పొందినపుడు వాక్స్పష్టాక్షరములు గలదై ప్రౌఢస్త్రీవలెనే యుండి వైఖరీనామమును పొందుచున్నది. ఇది గాక యత్ అరిష్టం క్రియతే అగ్ని స్తదనువేధతే.

పరానాడి రిష్టం = అశుభం, అరిష్టం = శుభం, సహస్రారగతమయి చంద్రమండలమునుంచి అమృతస్రావమును కలుగఁజేయుచు ౭౨ వేల నాడీసముదాయమునకును తృప్తిని గలుగఁజేయుచుండును. అమృతవృష్టికి స్వాధిష్ఠానాగ్ని యీనాడీద్వారా సర్వదా సహాయముగా నున్నదని యీశ్రుత్యర్థము.

ఈశ్రుతియందుఁగల కుమారీ, యోషిత్, పతివ్రతానామములు పరాస్వరూపులగు బాలాత్రిపురసుందరి, నవవర్షాత్మికగానుండి, కుమారీ సంజ్ఞ కలదిగాను, లలితాత్రిపురసుందరి, పంచదశవర్షవయోవిశిష్టగా నున్నందున యోషిత్సంజ్ఞ గలదిగాను, రాజరాజేశ్వరీమహాత్రిపుర సుందరి, షోడశవర్షవయోవిశిష్టగాన పతివ్రతయని సర్వదా సదాశివాంకోపరిభాగమందుండి ప్రౌఢాంగనాకృతిగా నున్నదనియుఁ దెలియుచున్నది.

ఈశ్రుతికి కౌళులు, హఠయోగులును, ఈసుషుమ్నానాడి సర్పాకారముగా నున్నందున కుండలినీశక్తియని వాడుచు వాయుధారణ, సూర్యచంద్రనాడులగు ఇడాపింగళులను బంధించినపుడు వాయు వహ్నిఘాతముచే సర్వదా నిద్రాస్వభావముగల మూలాధార

మందున్న కుండలిని మేలుకొని మంద్రస్వరము చేయుననియు, ఆనాడీ
ద్వారా అగ్నిసంయుక్తవాయువు హృత్కమలగత మయినపుడు
యోషిత్సంజ్ఞ యనియు, సహస్రారగతమయి అగ్నివేధ కలిగినపుడు
పతివ్రతాసంజ్ఞ కలదనియు, ఆవేధవలన నా చంద్రమండలమునుంచి
అమృతస్రావము కలిగినంతకాలము నాయోగికి సుఖప్రాప్తియనియు,
ఆధారణాంతమందు యథాప్రకారము కుండలినీశక్తి మూలాధార
గతమయి నిద్రించుననని వారిమతము. అందువలననే గౌడపాదాచార్యుల
వారు కౌళులు క్షణముక్తులని చెప్పిరి.

ఈవాయుధారణారూపమయిన హఠయోగము ప్రకృతకాల
మందు అనుభవసిద్ధమయిన గురుపరంపర లేకయే లోపించినది. ఉన్నను
అణిమాదిసిద్ధిప్రదము; కాని సహజముగా మోక్షము నీయఁజాలదు.
మోక్షాపేక్ష కలిగినపుడు తిరిగి జ్ఞానసాధనమగు స్వవిచారణయే చేయ
వలెను. హఠయోగికి ముక్త్యపేక్షకలిగినపుడు జ్ఞానము నభ్యసించవలెను.
కాని జ్ఞానయోగికి హఠయోగాపేక్ష యెన్నఁడును కలుగదు. ఈహఠ
యోగమువలన శరీరపాటవాది యిహసుఖములు మాత్రము కలుగును.
జ్ఞానయోగికి మాయామోహానివృత్తి కలిగి, మనశ్చాంచల్యము వదలి,
అఖండానందముతో జీవన్ముక్తుఁడయి ఉపాధివిలయపర్యంతము విహ
రించును. లోకమందు అనేకపామరజనులు ఈవాయుసాధనమే మోక్ష
సాధనమని, యిందువలన మనస్సు స్వాధీనమగు నను భ్రమలో మునిగి
యున్నారు గాని అది నిజముకాదు. ఈహఠయోగము వేదబాహ్యు
లగు క్షపణక, కాపాలిక, దిగంబరాది శూద్రవిరాగులకొఱకు ఈశ్వర
కల్పితము. మరియు నీహఠయోగము పూర్వమీమాంసలో వర్ణించిన
అర్చిరాది, ధూమాది మార్గములవంటిది. పైనచెప్పిన జ్ఞానయోగము
రాజయోగ మనిపించుకొనును. హఠయోగము వామదేవమార్గము
వంటిది. జ్ఞానయోగము శుకమార్గమువంటిది. ఈ శుకవామదేవమార్గ
సంకేతము ముందు తెలియును.

ఇఁక నీసుషుమ్నాడి పంచాశద్వర్ణాత్మకమాతృకారూపముగా
నున్నందున పరాస్వరూపమనియు, నీమాతృకావర్ణములే ఆజ్ఞాది
మూలాధారాంత షట్కమలాకారములను పొందినవనియు, ఇదే శ్రీ
చక్రాకారమును పొందుననియుఁ దెలియుచున్నది.

ప్రథమసూత్రమందు చెప్పిన ప్రకాశబిందువే మాతృకోత్పత్తికి కారణబిందువని చెప్పఁబడియున్నది. ఆబిందువు సహస్రారకమలగత చంద్రమండలాకారముగా పరాకాశమందున్నది. మాతృకోత్పత్తికి ఈబిందువు ప్రథమావస్థగా నున్నది. ఆబిందువికసనము త్రికోణ చక్రాకారపరిణామమువలన నాద ముత్పన్నమగుచున్నది. ఆనాదమందు స్వరములు అకారాది ౧౬ కలుగుచున్నవి. ఆస్వరసంయోగముచే వ్యంజనములగు కకారాదివర్ణోత్పత్తి యగుచున్నది. కాన బిందునాద కలలు పరస్పరసంబంధము, అభేదమును కలవిగా నున్నవి. కోణబిందువులు విసర్గలుగానున్నవి. కాన ౧ బిందువు, ౨ విసర్గలు, 3 స్వరములు, ర వర్ణములు. ఇట్లు పంచాశద్వర్ణాత్మకమయిన మాతృక యీనాలుగు సంజ్ఞలు కలిగి అందు అకారాదిస్వరములు ౧౬ ను విమర్శాంశముగను, కకారాదివర్ణములు 3౬ ను ప్రకాశాంశముగను ఇటుల సమష్టి మాతృక శివశక్త్యాత్మకముగా నున్నది.




అవ్యక్తమాతృకాచక్రము.

చతుశ్శత్యాం:—

శ్లో. మధ్యబిందువిసర్గాంతః సమా స్థానమయే పరే,
కుటిలారూపకే తస్యాః ప్రతిరూపం వియత్కలేతి.

అర్థస్తు. మధ్యబిందు విసర్గాంతః పరే స్థానమయే సమా = ఈ మాతృకాకారమును గుప్తమయిన సంకేతములచే వర్ణించుచున్నారు. మాతృకోత్పత్తికి కారణమయిన బిందువు వికసించినపుడు ఆకోణము లందు మూఁడుబిందువులు కలుగును. అధోభాగమందు గలది కారణ బిందువు. ఉపరిభాగమందున్న రెండుబిందువులు విసర్గలు. ఈమధ్యనున్న రేఖాత్రితయమందును, బిందువులందును సమగతి ఋజుమార్గముగా, అవ్యక్త మాతృక తేజోమయముగా సహస్రారమందు గలిగి పిమ్మట విశుద్ధాది కమలములందు, తస్యాః కుటిలారూపకే ప్రతిరూపం వియత్కలా=ఆ పరామాతృకయొక్క వక్రగతియందుగల ప్రతివర్ణమును మహానిత్యాకలాస్వరూపములని అవ్యక్త మాతృకావస్థయందు ఋజుమార్గముగలదియు (సృష్టిగతి) కమలదళములందు కుటిలగతి కలిగిన మాతృకయొక్క ప్రతివర్ణమును పరాస్వరూపమని తాత్పర్యము.

ఇటుపైన శ్రీచక్రోపన్యాసమందు చక్రగత నవచక్రములకును, సహస్రారాదిమూలాధారాంతకమలములకును ఐక్యము షడ్విధైక్య చతుర్విధైక్యములకొఱకు ప్రతిపాదింపఁబడును. కాన నీకమలజ్ఞానము సాధకులకు ఆవశ్యకముగా నున్నందున యోగశిఖా, యోగచూడామణి, సౌభాగ్యలక్ష్మి మొదలగు ఉపనిషత్తులందు ప్రసిద్ధములగు మూలాధారాది కమలములు ఇచట వివరింపఁబడుచున్నవి. అవి మాతృకోత్పత్తి ననుసరించి అవరోహణక్రమముగా విశుద్ధాదిగా నిరూపింపఁబడును.



## షట్కమలవిభాగము




విశుద్ధకమలము.

యోగినీహృదయే:—

శ్లో. గ్రీవాకూపే విశుద్ధౌ నృపదళకమలే శ్వేతవర్ణాం త్రినేత్రాం
హస్తైః ఖట్వాంగఖడ్గౌ త్రిశిఖమపి మహాచర్మ సంధారయంతీం,
వక్త్రేణైకేన యుక్తాం పశుజనభయదాం పాయసాన్నైకసక్తాం
త్వక్స్థాం వందేఽమృతాద్యైః పరివృతవపుషాం డాకినీం వీరవంద్యాం.

తా. కంఠస్థానమందు ఆకాశతత్త్వ ప్రకృతికమయి షోడశదళ పద్మమందు కమలము శ్వేతవర్ణము, యోగిని రక్తవర్ణమును, త్రినేత్రములు, ఏకముఖము, హస్తములందు ఖట్వాంగాద్యాయుధములుగలిగి పాయసాన్నమందు ప్రీతిగలిగి త్వగ్ధాతువున కధిదేవతయయి అకారాది పదియాఱు స్వరములను అమృతాదియోగినీగణపరివేష్ఠితయయి వీరాగ్రేసరులచే నుపాసించఁబడే డాకినియను యోగినిని గుఱించి నమస్కరించుచున్నానని తాత్పర్యము.

సౌందర్యలహర్యాం:—

శ్లో. విశుద్ధౌ తే శుద్ధస్ఫటికవిశదం వ్యోమజనకం
శివం సేవే దేవీ మపి శివసమాన వ్యవసితాం,
యయోః కాంత్యా యాంత్యా శశికిరణసారూప్యసరణే
ర్విధూతాంతర్ధ్వాంతా విలసతి చకోరీవ జగతి. ఇతి.




అనాహతకమలము.

శ్లో. హృత్పద్మే భానుపత్రే ద్వివదనలసితాం దంష్ట్రిణీం శ్యామవర్ణాం
చక్రం శూలం కపాలం డమరుమపి భుజైర్ధారయంతీం త్రినేత్రాం.
రక్తస్థాం కాళరాత్రిప్రభృతిపరివృతాం స్నిగ్ధభక్తైకసక్తాం
శ్రీమద్వీరేంద్రవంద్యామభిమతఫలదాం రాకినీం భావయామః.

తా. పదిరెండుదళములుగల హృత్పద్మమందు వాయుతత్త్వప్రధానమయి కమలము హేమవర్ణము, యోగిని శ్యామవర్ణము, రెండుముఖములు, త్రినేత్రములు, భుజములందు చక్రశూలాద్యాయుధములు కలిగి స్నిగ్ధాన్నప్రీతయయి, కకారాది ఠకారాంతద్వాదశ

వర్ణరూపయోగినీగణసేవితయయి సకలాభీష్టముల నిచ్చే రాకినియను యోగినిని ధ్యానించుచున్నానని తాత్పర్యము.

శంకరవిరచితం:—

శ్లో. సముస్మీలత్సంవిత్కమలమకరందైకరసికం,
భజే హంసద్వంద్వం కిమపి మహతాం మానసచరం,
యదాలాపాదష్టాదశగుణితవిద్యాపరిణతి
ర్యదా ధత్తే దోషాద్గుణమఖిలమద్భ్యః పయ ఇవ.




మణిపూరకమలము.

శ్లో. దిక్పత్రే నాభిపద్మే త్రివదనవిలసద్దంష్ట్రిణీం రక్తవర్ణాం
శక్తిందంభోళిదండామభయమపి భుజైర్ధారయంతీం మహోగ్రాం,
డామర్యాద్యైః పరీతాం పశుజనభయదాం మాంసధాత్వేకనిష్ఠాం
గౌడాన్నాసక్తచిత్తాం సకలసుఖకరీం లాకినీం భావయామః.

తా. మణిపూరమందు జలతత్త్వప్రకృతికము, కమలము నీల వర్ణము, యోగిని రక్తవర్ణము, వదనత్రయము, శక్తిదంభోళ్యాదులు

ధరించి మాంసధాతువు కధిష్ఠాతయయి డాది ఫాంతమయిన వర్ణరూప యోగినీయుక్తయునగు లాకినీని భావించుచున్నానని అభిప్రాయము.

**సౌందర్యలహరి:—**

శ్లో. తటిత్వంతం శక్త్యా తిమిరపరిపంథిస్ఫురణయా
స్ఫురన్నానారత్నాభరణపరిణద్ధేంద్రధనుషం,
తమశ్శ్యామం మేఘం కమపి మణిపూరైకశరణం
నిషేవే వర్షంతం హరమిహిరతప్తం త్రిభువనం.




స్వాధిష్ఠానకమలము.

శ్లో. స్వాధిష్ఠానాఖ్యపద్మే రసదళలసితే వేదవక్త్రాం త్రినేత్రాం
హస్తాభ్యాం ధారయంతీం త్రిశిఖగుణకలాపాభయాన్యాత్తగర్వాం,
మేదోధాతుప్రవిష్టామళిమదముదితాం బందినీముఖ్యయుక్తాం
పీతాం దధ్యోదనేష్టా మభిమతఫలదాం కాకినీం భావయామః.

తా. షడ్దళయుక్తమయిన స్వాధిష్ఠానకమలమందు పీతవర్ణము, నాలుగుముఖములు, త్రినేత్రములు, హస్తములందు త్రిశిఖాద్యాయుధములు ధరించి మేదోధాత్వధిష్ఠాతయయి బాది లాంతవర్ణములను

యోగినీలతోఁగూడి దధ్యోదనప్రీతయగు కాకినీయనే యోగినిని భావించుచున్నానని తాత్పర్యము.

**ఆచార్యవాక్యము:—**

శ్లో. తవ స్వాధిష్ఠానే హుతవహ మధిష్ఠాయ నిరతం,
తమీళే సంవర్తం జనని మహతీం తాం చ సమయాం,
యదా లోకే లోకాన్ దహతి మహతి క్రోధకలితే
దయార్ద్రాయా దృష్టిః శిశిర ముపచారం రచయతి.

ఇది స్వాధిష్ఠానస్వరూపము.




మూలాధారకమలము.

శ్లో. మూలాధారస్థపద్మే శ్రుతిదళలసితే పంచవక్త్రాం త్రినేత్రాం
ధూమ్రాభామస్థిసంస్థాం సృణిమపి కమలం పుస్తకం జ్ఞానముద్రాం,
బిభ్రాణాం బాహుదండైస్సులలితవరదాం పూర్వశక్త్యా వృతాంతాం
ముద్గాన్నాసక్తచిత్తాం మధుమదముదితాం సాకినీం భావయామః.

తా. చతుర్దళయుక్తమయిన మూలాధారకమలము పృథివీ తత్త్వప్రకృతికము, కమలము రక్తవర్ణము, యోగిని ధూమ్రవర్ణము,పంచ

వక్త్రములు, త్రినేత్రములు, సృణి, కమలము, పుస్తకము, జ్ఞానముద్రా వీనిని ధరించినది. అస్థిధాతువున కధిపతియయి ముద్గాన్నప్రీతి గలిగి వ. శ. ష. స. అను నీశక్తులతోఁ గూడియున్న సాకినిని ధ్యానించు చున్నానని తాత్పర్యము.

**సౌందర్యలహర్యాం:—**

శ్లో. తవాధారే మూలే సహ సమయయా లాస్యపరయా
నవాత్మానం మన్యే నవరసమహాతాండవనటం,
ఉభాభ్యామేతాభ్యాముదయవిధిముద్దిశ్య దయయా
సనాథాభ్యాం జజ్ఞే సకలజననీమజ్జగదిదమ్.




ఆజ్ఞాకమలము.

శ్లో. భ్రూమధ్యే బిందుపద్మే దళయుగకలితే శుక్లవర్ణాం కరాబ్జై
ర్బిభ్రాణాం జ్ఞానముద్రాం డమరుకకమలామక్షమాలాం కపాలం,
షడ్వక్త్రాధారమధ్యాం త్రినయనలసితాం హంసవత్యాదియుక్తాం
హారిద్రాన్నైకసక్తాం సకలశుభకరీం హాకినీం భావయామః.

తా. భ్రూమధ్యమందున్న రెండుదళములుగల ఆజ్ఞాకమలమందు శుక్లవర్ణము, ఆఱుముఖములు, త్రినేత్రములు కలిగి జ్ఞానముద్రాదికమును ధరించి, మజ్జాధాతువున కధిపతియయి హారిద్రాన్నాసక్తయు హం. క్షం. అనే యోగినీలతోఁ గూడియున్న హాకినీయను యోగినిని భావించుచున్నానని తాత్పర్యము.

శ్లో. తవాజ్ఞాచక్రస్థం తపనశశికోటిద్యుతిధరం
పరం శంభుం వందే పరిమిళితపార్శ్వం పరచితా,
యమారాధ్యన్ భక్త్యా రవిశశిరుచీనామవిషయే
నిరాలోకే లోకే నివసతి హి భాలోకభువనే.



సహస్రదళకమలము.

౩శ్లో. ముండవ్యోమస్థపద్మే దశశతదళకే కర్ణికాచంద్రసంస్థాం
రేతోనిష్ఠాం సమస్తాయుధకలితకరాం సర్వతోవక్త్రపద్మాం,

ఆదిక్షాంతార్ణశక్తిప్రకరపరివృతాం సర్వవర్ణాం భవానీం
సర్వాన్నాసక్తచిత్తాం పరశివరసికాం యాకినీం భావయామః.

తా. బ్రహ్మరంధ్రాధోభాగమందున్న పరాకాశమందుఁగల సహస్ర దళకమల కర్ణికాకారమగు చంద్రమండలము స్థానముగాఁ గలదియు, శుక్లధాతువున కధిదేవతయు, దశదిక్కులయందు ముఖములు గలిగి త్రినేత్రములును సర్వాయుధములును ధరించి, సర్వాన్నప్రీతిగలిగి తేజోమయమయిన అవ్యక్తరూపములగు అకారాదిక్షకారాంత పంచాశద్వర్ణమయ యోగినీగణపరివేష్టితమయిన పరశివపత్నియగు యాకినియనే మహాయోగినిని ధ్యానించుచున్నానని తాత్పర్యము.

సౌందర్యలహరి:—

శ్లో. మహీం మూలాధారే కమపి మణిపూరే హుతవహం
స్థితం స్వాధిష్ఠానే హృది మరుత మాకాశ ముపరి,
మనోఽపి భ్రూమధ్యే సకలమపి భిత్వా కులపథం
సహస్రారే పద్మే సహ రహసి పత్యా విహరసే.

పైన చూపించిన పరిలేఖనము సహస్రారకమలముయొక్క ఆకృతినిమాత్రము తెలుపుచున్నది. దళములు సంపూర్ణముగా లిఖించుటకు అసాధ్యమయినందున దళములు తక్కువగా నున్నవి.



గౌడపాదాచార్యులవారు కమలసమష్టిని వర్ణించిరి.

శ్లో. త్రికోణం తే కౌళాః కులగృహమితి ప్రాహురపరే

చతుష్కోణం ప్రాహుస్సమయిన ఇమే బైందవమితి,
సుధాసింధౌ తస్మిన్సురమణిగృహే సూర్యశశినో
రగమ్యే రశ్మీనాం సమయసహితే త్వం విహరసి.

తా. కౌళులు పూర్వకౌళులనియు, ఉత్తరకౌళులనియు రెండు విధములుగా నున్నారు. ఈయిరువురును వామాచారపరులుగానే యున్నారు. వీరిలో ఉత్తరకౌళులు స్వాధిష్ఠానకమలము (యోని చక్రము స్థానమని) అది కులగృహమని చెప్పుచున్నారు. యోనిచక్ర సంకేతముచే పరాశక్తిస్థానమని శ్లో. "త్రికోణరూపిణీ శక్తిః బిందు రూపః పరశ్శివః." ఈవచనమువలన ఉత్తరకౌళులు స్వాధిష్ఠానమందు సర్వకారణబిందువున్నదనియు, నచటనే జగదుత్పత్తి యనియు, నచట పరాపూజాదికలాపమును, లయభావనయు, ప్రత్యక్షయోనిపూజయుఁ గలవారనియు, అపరే = పూర్వకౌళులు చతుష్కోణమయిన మూలా ధారము కులగృహమనియు, కుః పృథ్వీతత్త్వం యత్ర లీయతే తత్కుల మితి, ఆధారకమలమందు పూజాదికము సర్వకారణబిందుభావన మనో లయ భావనాదులు గలవారనియు,

సమయమతస్థులకు, తాము మొదలగు సమయాచార పరులకు బైందవగృహం = పరాకాశమందుఁగల బిందుమండలము పరమాత్మ స్వరూపమనియు, శ్రు. "ఆత్మన ఆకాశ స్సంభూత ఇతి." ఈశ్రుతివలన నీబిందువువలన నీకమలము లుత్పన్నమయినవనియు, నిదియే సర్వకారణ బిందువనియు, నిదియే సుధాసింధువు, ఇచట మణిద్వీపము, అందు చింతామణి రచిత దేవీమందిరము, నందు పంచబ్రహ్మలనే ఆసనముపైన సదాశివ అంకోపరిభాగమందు నీవు విహరించుచున్నావని పరదేవతను స్తుతించిరి. ఈలోకమునకు సూర్యచంద్రకిరణప్రసారము కలుగనందున జ్యోత్స్నాలోకమనియు, నిచట అహోరాత్రకాలవిభాగము లేదని తాత్పర్యము.

### గ్రంథిత్రయవివరము, సాధారణము.

**వాయవ్యసంహితాయాం:—**

శ్లో. మూలాధారాదికం చక్రషట్కం కులమితి స్మృతం,
గ్రంథిత్రయం తత్ర దేవీచక్రత్రితయగర్భితం.
పృథ్వ్యాప్యచక్రద్వితయం బ్రహ్మగ్రంథిపదోదితం,
వహ్నిసూర్యమయం చక్రద్వయం తేజోమయం మహత్.
విష్ణుగ్రంథిపదేనోక్తం తైజసం సర్వసిద్ధిదం,
ఆకాశాజ్ఞాద్వయీరూపం చక్రద్వితయముత్తమం.
రుద్రగ్రంథిపదేనోక్తం మంగళాయతనం మహత్. ఇతి.

తా. మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూర, అనాహత, విశుద్ధ, ఆజ్ఞలను నీయాఱుకమలములకును కులమని సంకేతము. ఇంతవరకే సూర్యచంద్రగతియు, వారికిరణప్రసారము కాలభేదమును కలిగియున్నది లలాటోర్ధ్వము పరాకాశము, బ్రహ్మరంధ్రమువరకు తురీయస్థానము, జ్యోత్స్నలోకము మూలాధార, స్వాధిష్ఠానోపరిభాగమందు బ్రహ్మగ్రంథిస్థానము. మణిపూర, అనాహత, కమలోపరిభాగము విష్ణుగ్రంథిస్థానము. విశుద్ధ, ఆజ్ఞాకమలోపరి రుద్రగ్రంథిస్థానము. ఇటుల రెండేసి కమలములపైన నొక్కొక గ్రంథిచొప్పున నున్నవి. బ్రహ్మగ్రంథి అగ్నిమండలము. విష్ణుగ్రంధి సౌరమండలము. రుద్రగ్రంథి సోమమండలము. ఇట్లు రెండేసి కమలములు ఒక్కొకమండలముగా నున్నవి. ఆజ్ఞాకమలము మనస్తత్త్వస్థానము. తదుపరి తురీయకూటము. సమయలోకము.

సమయానామ:—శివేన పంచవిధసామ్యం యాతీతి సమయా. సామ్యమనఁగా అధిష్ఠానసామ్యము, అవస్థానసామ్యము, అనుష్ఠాన

సామ్యము, రూపసామ్యము, నామసామ్యము అని పంచవిధసామ్యములు త్రిపురోపనిషది.

శ్రు.సమప్రధానౌ సమసత్త్వౌ సమౌజౌ తయోశ్శక్తి రజరా విశ్వయోనిః,
శర్వస్సర్వస్య జగతో విధాతా ధాతా హర్తా విశ్వరూపత్వమేతీతి.

అధిష్ఠానసామ్యం - బిందుమండలాధిష్ఠానం, అవస్థా - పరానందాను భవరూపా, క్రియాసామ్యంతు - బ్రహ్మాండోత్పాదనాదికం, రూపమారుణ్యాదికం, నామసామ్యం_కామేశ్వర కామేశ్వరీతి శివేన పంచవిధసామ్యత్వాత్సమయా, తయోః లోకం - సమయలోకమితి.

ఈ కమలవిభాగమువలన మాతృక కమలస్వరూపమును పొంది యున్నందున, నామాతృకయు మండలత్రయాత్మకముగా నున్నదని తెలియుచున్నది. అకారాది స్వరములు పదియారును చంద్రఖండము. కాదిభాంతము ఇరువదినాలుగును సౌరఖండము. మాదిక్షాంతము పది యును అగ్నిఖండము. ఇట్లు మండలత్రయ, ఖండత్రయ, కూటత్రయా త్మకముగా పంచాశద్వర్ణరూపమాతృక యున్నది. మాతృకయొక్క ఆది వర్ణము అకారము. అంత్యవర్ణము క్షకారము గాన నీమధ్యనున్న వర్ణములన్నియు నక్షరములని వ్యవహారము. క్షరం=నాశం న భవతీత్య క్షరం బ్రహ్మస్వరూపమితి.

శ్లో. ఆధారే తరుణార్కబింబరుచిరం హేమప్రభం వాగ్భవం
బీజం మన్మథ మింద్రగోపసదృశం హృత్పంకజే సంస్థితం,
రంధ్రే బ్రహ్మపథేతు శాక్తమపరం సోమప్రభాభాసురం
యే ధ్యాయంతి పదత్రయం తవ శివే తే యాంతి సౌఖ్యం పదం.



# శ్రీ చక్రము

### ౨౧-వ సూత్రము, శ్రీచక్ర నిరూపణ.

మూ. చక్రస్యాపి మహేశ్యాన భేదలేశోఽపి భావ్యతే విబుధైః,
ఆనయోస్సూక్ష్మాకారా పరైవ సా స్థూలయోశ్చ కాపి భిదా.

అర్థము. చక్రస్య = శ్రీచక్రమునకును, మహేశ్యాఽపి = త్రిపుర సుందరీదేవతకున్ను, భేదలేశోఽపి = లేశమాత్ర భేదమును, విబుధైః = విద్వాంసులచేత, న భావ్యతే = తెలియఁబడదు. అనయోః = ఈ చక్రదేవతలయొక్క, సూక్ష్మాకారా = అపరిచ్ఛేద్యస్వరూపమైన, సా పరా ఏవ = పూర్వోక్తపరాశక్తియే, స్థూలయోః = త్రికోణాదిచక్రములకును, త్రిపురాది చక్రేశ్వరీలకును, న కాపి భిదా = ఇంచుకంతయు భేదములేదు.

తా. పందొమ్మిదవ సూత్రమందు విద్యాదేవతల కభేదమును చూపించి యిరువదియవసూత్రమందు నా మంత్రదేవతయే పరా స్వరూపముగా నున్నదనియు, నాపరాశక్తి స్థూలసూక్ష్మములనెడి రెండు రూపములుగా నుండి, యా రెండురూపములు శ్రీచక్రాకారమును

పొందినట్టు చెప్పఁబడినది. సూక్ష్మము సహస్రారాంతర్గత తేజోమయ బిందుస్వరూపము. స్థూలము వైఖరీరూపపంచాశద్వర్ణాత్మక మాతృక. ఈ రెండును పరాస్వరూపములుగా నున్నవి. ఈ సూత్రమందు శ్రీ చక్రమునకును పరాశక్తికిని కించిత్తైనను భేదములేదని చెప్పుచున్నారు.

ఈ చక్రదేవతలు రెండును సూక్ష్మస్థూలములనెడి రెండు ఆకృతులు గలిగియున్నవి. అందు సూక్ష్మరూపమయిన తేజోమయబిందువు బీజాంకురవృక్షన్యాయముగా పరిణమించినదై స్థూలాకారములైన త్రికోణాది స్థూలచక్రాకృతిని పొందుచున్నది. మరియు సూక్ష్మాకారపరాశక్తియే స్థూలాకార శ్రీచక్రాంతర్గత బిందురూపమును పొందుచున్నది గాన, స్థూలసూక్ష్మములగు శ్రీచక్రమధ్యగతబిందువునకును పరాశక్తికిని భేదము లేదనియు, స్థూలాకారమాతృకయే శ్రీచక్రాకారము బిందుత్రికోణాది చక్రరూపమును పొందినదనియు, సూక్ష్మాకారపరాశక్తియే త్రిపురాదిచక్రేశ్వరులరూపమును పొందినదనియు, అందువలన స్థూలసూక్ష్మములగు మాతృకాశ్రీచక్రములకును, పరాచక్రేశ్వరిలకును కించిత్తైనను భేదములేదని తాత్పర్యము.

ఇట్లు విద్యావిద్యలను, పరా అపరాస్వరూపములను, ఆత్మానాత్మలను తెలుసుకొనినవిద్వాంసు లీస్థూలసూక్ష్మములకు అభేదమును చెప్పిరి.

## శ్రీచక్రోద్ధారము.

**త్రిపురాతాపిన్యాం:—**

శ్రు. బిందుత్రికోణవసుకోణదశారయుగ్మ
మన్వస్రనాగదళషోడశపత్రయుక్తం,
వృత్తత్రయం చ ధరణీసదనత్రయం చ
శ్రీచక్రరాజ ఉదితః పరదేవతాయాః.

**గౌడపాదాచార్యైస్సుభగోదయే:—**

త్రికోణైరష్టారం త్రిభిరపి దశారం సముదభూ
ద్దశారం భూవేశ్మాదపి చ భువనాశ్రం సమభవత్,
తతోఽభూన్నాగారం నృపతిదళమస్మాత్త్రివలయం
చతుర్ద్వాఃప్రాకారత్రితయమిద మేవాంబ శరణమ్. ఇతి.

**శ్రీశంకరభగవత్పాదాచార్యైః:—**

శ్లో. చతుర్భిః శ్రీకంఠైః శ్శివయువతిభిః పంచభిరపి
ప్రభిన్నాభిశ్శంభోర్నవభిరపి మూలప్రకృతిభిః,
చతుశ్చత్వారింశద్వసుదళకళాశ్రత్రివలయ
త్రిరేఖాభిస్సార్ధం తవ శరణకోణాః పరిణతాః. ఇతి.

పైన చూపించిన ఉపనిషత్ప్రతిపాదితమయిన శ్రుతియందు వివరించిన శ్రీచక్రస్వరూపమును ఈగ్రంథకర్త ౨౨ వ సూత్రము నారంభించి ౩౮ వరకు ౧౭ సూత్రములచే నిరూపించుచున్నారు.

ఈ గ్రంథస్థమయిన ముఖ్యాంశముల కన్నిటికిని శ్రుతులు ప్రమాణములుగా నున్నవి. ఆశ్రుతులను, ఈసూత్రములను ప్రమాణములుగా గ్రహించి యీప్రకరణమం దితరగ్రంథము లుత్పన్నములయినవి. ఇందు గురుమండలవివరములో దివ్యౌఘ, సిద్ధౌఘ, మానవౌఘములని సంకేతము గలదు. అందు బ్రహ్మాదులు దివ్యౌఘముగను, సనక వసిష్ఠాదులు సిద్ధౌఘముగను, గౌడపాదాచార్య శంకరాచార్య విద్యారణ్యాచార్యాదులు మానవౌఘముగను నున్నారు. ఈ గ్రంథకర్త సిద్ధౌఘములోనివారుగ నీగ్రంథమువలనఁ దెలియుచున్నది. అందుచే నీ గ్రంథమునకు శ్రుతులే ప్రమాణములుగా నున్నవి. ఇందు నితరగ్రంథగతవచనము లచటచట ఉపయోగించుటకు కారణమే మనిన, మూలసూత్రములకు వ్యాఖ్యగానున్న యీయుపన్యాస

దార్ఢ్యముకొఱకును వర్తమాన వర్తిష్యమాణసాధకపుంగవులకు జీవ
స్మృక్తులగు నాచార్యసిద్ధాంతములు మాననీయములును గాన, నచ్చ
టచ్చట పూర్వాచార్యకృతవచనములు గ్రహింపఁబడినవి.

**౨౨-వ సూత్రము, బిందుమండలనిరూపణము.**

**మూ. మధ్యం చక్రస్య స్యాత్పరామయం బిందుతత్త్వమేవేదం,**
**ఉచ్ఛూనం తచ్చ యదా త్రికోణరూపేణ పరిణతం స్పష్టం.**

అర్థము. చక్రస్య = నవయోన్యాత్మక శ్రీచక్రముయొక్క, మధ్యం = మధ్యమందున్న, ఇదం=స్వసాత్కృతమయిన, బిందుతత్త్వం = బిందువుయొక్కయథార్థము, పరామయమేవ = పరాశక్తిస్వరూపముగనే యున్నది. తచ్చ=ఆబైందవమున్ను, యదా = ఏకాలమందు, ఉచ్ఛూనం భవతి = వికసనమును బొందుచున్నదో, తదా = ఆకాలమందు, స్పష్టం యథాతథా=స్పష్టమగునటులగా, పరిణతం=పరిణామించినది, భవతి = అగు చున్నది.

తా. నవయోన్యాత్మకము నవచక్రాత్మకమగు శ్రీచక్రమును నిరూపింపఁదలఁచి, అవరోహణక్రమము, (సృష్టిక్రమముగా) నీసూత్ర మందు నవయోని మధ్యగత బిందుమండలమును వర్ణించుచున్నారు.

ఈ శ్రీచక్రమధ్యమందున్న బిందువుయొక్క యథార్థము పరా స్వరూపము. ఈబిందువు శ్రీచక్రమందున్న నవచక్రములకును, పశ్యంతీ మధ్యమావైఖరీరూపములుగల మాతృకకును కారణస్వరూపముగా నున్నది. "త్రిమాతృకాత్మా చ చక్రతాం యాంతా" అని వెనుక చెప్పి నందున పశ్యంత్యాది మాతృకాత్రితయమే యీనవచక్రాకారముగా పరిణమించినదని చెప్పినందున, మాతృకోత్పత్తిని, తద్వారా చక్రోత్పత్తిని వివరించుట ఆవశ్యకము. కాన నీబిందువు మాతృకకు ప్రథమవస్తువు. అట్లే చక్రోత్పత్తికిని ప్రథమకారణముగా నున్నది.

సకలప్రపంచమును నామరూపాత్మకముగా నున్నందున నీనామ రూపములచే స్వరూపజ్ఞానము విస్మృతమైనది. తిరిగి యాస్వరూపమును

దెలిసికొనుటకు, నీనామరూపముల యథార్థము కనుఁగొనుట ఆవశ్య కముగాన, నామము శబ్దబ్రహ్మస్వరూపము, ఆశబ్దము మాతృకాస్వరూ పము, ఆమాతృక పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీలు అని నాలుగు స్వరూపములుగలది. అందు నీబిందువు పరాస్వరూపము. ఇది పశ్యంతీ మధ్యమా వైఖరీల కాస్పదముగా నున్నది.

ఇక చక్రము నవచక్రాత్మకము. ఇది రూపమును తెలియఁజేయు చున్నది. నవచక్రములకు నీబిందువు కారణముగా నున్నది. ఈనామ రూపములు రెండును శబ్దార్థములవలెనే యొకవస్తువుయొక్క సంకేత ములుగా నున్నవిగాన నీబిందువు పరాస్వరూపము. ఈపరాశబ్దముచే ఉత్కృష్టమందును నామరూపాత్మకమయిన జగత్తుకన్న పరమనియుఁ దెలియుచున్నది. ఈబిందువే పరమాత్మస్వరూపము. సచ్చిదానందలక్షణ ములుగల బ్రహ్మతేజోబిందువని తెలియుచున్నది.

శ్రు. ఋతమాత్మా పరం బ్రహ్మ సత్యమిత్యాదికా బుధైః,
కల్పితా వ్యవహారార్థం యస్య సంజ్ఞా మహాత్మనః ఇతి.

ఈబిందువును ఋతమని, ఆత్మయని, పరబ్రహ్మమని, సచ్చిదా నందస్వరూపమని బ్రహ్మవేత్తలు వాడుచున్నారు. ఈబిందువునకు నామరూపములు లేవు. వ్యవహారము కొఱకు నిర్గుణవస్తువును బోధిం చుటకు నీసంజ్ఞలు కలిగినవని యీశ్రుతితాత్పర్యము. ఇది తేజోమయ ముగా నున్నది.

శబ్దబ్రహ్మస్వరూపమైన మాతృకోత్పత్తిక్రమములో ప్రథమ వస్తు వీబిందువు. ఈబిందువికసనమువలన విసర్గలు (నాదము) కలుగు చున్నవి. ఆనాదమువలన కలలు అనఁగా స్వరవ్యంజనములు కలుగు చున్నవి.

చక్రమునకును ఈబిందువే కారణము. ప్రథమము బిందువు. ఈబిందువికసనమువలన చంద్రసూర్యపరివేషములభంగి తేజోమయ

మయిన త్రికోణమండల ముత్పన్న మగుచున్నది. పిదప క్రమక్రమ ముగా నవచక్రము లుత్పన్నమగుచున్నవిగాన నీమాతృకాచక్రము లకు నీపరాస్వరూపబిందువు కారణముగా నున్నదని చెప్పిరి.
తచ్చ యదా ఉచ్ఛూనం భవతి అనినందున:—

శ్లో. అనుత్తరానందశక్తి రిచ్ఛాశక్త్యా నియోజితా,

త్రికోణమితి తత్ప్రాహురిత్యాదివచనములచే జనిష్యమాణ ప్రాణ్యదృష్టకాలముగాని, బ్రహ్మాండోత్పత్తికాలముగాని సంభవించి నపుడు, నిస్తరంగసముద్రమువలెను, పూర్ణానందస్వరూపముగానున్న పరమాత్మయందు మాయావృత్తిచే ఘూర్ణాయమానమైన స్మరణశక్తి కలిగినందున, స్వాంతర్గతవిమర్శశక్తి త్రికోణరూపముగా పరిణమించి నది. ఈవివరము ప్రారంభమందు తురీయకూటమందు వివరింపఁబడినది. కామకలారూపమందున్న, పరిలేఖనము నిచటను గ్రహించేది. ఇక నీబిందువు సుధాసింధువనియు, చంద్రమండలమనియు, మహాహ్రద మనియు వాడఁబడుచున్నది.

శ్లో. పరాభట్టారికా సంవిదిచ్ఛాశక్తిపురస్సరం,
స్థూలప్రమేయపర్యంతం వమంతీ విశ్వమాతరం.
ప్రమాత్రన్తర్బహీరూపహృషీకవిషయాత్మనాం,
ప్రవర్తకత్వస్వచ్ఛత్వగంభీరత్వాదిధర్మతః,
మహాహ్రదో జగద్వ్యాపీ దేశకాలాద్యగోచర ఇతి.

ఈమొదలగు లక్షణములుగల పరాబిందుతేజస్సు వికసనరూప ముగా త్రికోణచక్రము ఉత్పన్న మగుచున్నదని తాత్పర్యము.

౨౩-వ సూత్రము, యోనిచక్రనిరూపణము.

మూ. ఏతత్పశ్యంత్యాదిత్రితయసిద్ధానం త్రిబీజరూపం చ,
వామా జ్యేష్ఠా రౌద్రీ చాంబికయానుత్తరాంశభూతాః స్యుః.

అర్థము. ఏతత్ = ఈత్రికోణచక్రము, పశ్యంత్యాది త్రితయ నిదానం = పశ్యంత్యాదిశక్తుల కావిర్భావకారణము, త్రిబీజరూపంచ = వాగ్భవ, కామరాజ, శక్తిబీజ స్వరూపమున్ను, వామా జ్యేష్ఠా రౌద్రీ చ=వామా, జ్యేష్ఠా, రౌద్రీ, చకారమువలన పరావిలసనరూప పశ్యంతిని, అంబికయా = అంబికతోసహా, అనుత్తరాంశభూతాః స్యుః= శ్రీచక్రాంతర్గతాధోముఖ పంచయోన్యధిదేవతలు అగుచున్నారు.

తా. ఈ ప్రకరణమందు బ్రహ్మాండ పిండాండ మాతృకా శ్రీ చక్రములకు ఐక్యము సంభవించుచున్నందున, వెనుక ౨౦ వ సూత్రోప న్యాసమందు పశ్యంత్యాది రూపములుగల మాతృకవలన విశుద్ధాదికమల ముల ఉత్పత్తి వివరింపఁబడినది. ఆ చతుర్విధమాతృకయే యచట శ్రీ చక్రమందుఁగల నవచక్రాకారమును పొందుచున్నది.

పరామయబిందు వికసనరూప తేజోమయ త్రికోణచక్రమందు మధ్యను పరాబిందువు, కోణత్రయమందు మూఁడుబిందువులును, అన్యో న్యసంబంధముగల మూఁడురేఖలును గలిగియున్నవి. ఈ కోణచక్రము పశ్యంతీమధ్యమావైఖరిలనే శక్తిత్రయమునకు ఆవిర్భావకారణముగా నున్నది. కోణబిందువులు వాగ్భవ, కామరాజ, శక్తిబీజస్వరూపములు. ఏబిందుతత్త్వరూప పరాశక్తి తేజస్సువలన నీ యోనిచక్ర ముత్పన్న మయినదో ఆ తేజస్సువలననే శ్రీచక్ర ముత్పన్నమయినది. ఆ శ్రీచక్ర మందు అధోముఖములుగా నయిదుయోనులును, ఊర్ధ్వముఖములుగా నాలుగుయోనులును, మధ్యను బిందువు గలవు. అందు అధోముఖము లగు పంచయోనుల కధిదేవతలగు వామా, జ్యేష్ఠా, రౌద్రీ, అంబికా, పశ్యంతీలనే దేవతలకును నీయోనిచక్రమే ఆస్పదమని తాత్పర్యము.

**౨౮-వ సూత్రము, పశ్యంతీస్వరూపము.**

**మూ.** ఇచ్ఛాజ్ఞానక్రియాశాంతాశ్చైతాశ్చోత్తరావయవాః,
వ్యస్తావ్యస్తతదర్ణద్వయమిదమేకాదశాత్మ పశ్యంతీ.

అర్థము. ఇచ్ఛాజ్ఞానక్రియాశాంతాః=ఇచ్ఛా, జ్ఞాన, క్రియా, శాంతా అనే, ఏతాః=ఈనాలుగు శక్తులు, ఉత్తరావయవాః=శ్రీచక్రమందున్న ఊర్ధ్వముఖయోనిచతుష్కరూపమును పొందియున్నవి. వ్యస్తావ్యస్తతదర్ణద్వయం=వ్యష్టి సమష్టిరూపమయిన సకలాగమ సిద్ధమయిన, కామకలాక్షరద్వయము ప్రకాశ విమర్శాంశలగు అహామనే ఆత్మమంత్రరూప వర్ణద్వయమును, ఇదం=పూర్వోక్త నవశక్తులు పరాశక్తితో సహా ౧౧. ఏకాదశాత్మ = సమష్టిరూపమగు పరమాత్మస్వరూప కామకలతో ౧౧. ఈపదునొకొండు రూపములును కలసి బిందువు నాచ్ఛాదించుకున్న త్రికోణాధిదేవతయగు పశ్యంతీస్వరూపము కారణముగా నున్నది.

తా. ఇచట నవశక్తుల వివరము కొంచెము చూపింపఁబడును. పరా, పశ్యంతీ, వైఖరీల స్వరూపము వెనుక చెప్పఁబడినది గాన సూక్ష్మముగా సూచింపఁబడును. యాసాంతరోహారూపాసాపరా అంతర్గతేచ్ఛారూపము. అవాఙ్మనసగోచరమయినందున అపరిచ్ఛేద్యము; వ్యాపికా నియామికయు, సర్వోత్కృష్టయు నయినందున పరాశక్తియనియు, నీ పరాశక్తియే పశ్యంతీ మధ్యమా వైఖరీ స్వరూపములను పొందినదని చెప్పిరి.

ఈపరాపశ్యంతులు బిందు త్రికోణములుగా నున్నవి. "త్రికోణరూపిణీశక్తిః బిందురూపః పరశ్శివః" అను వచనమువలన నీరెండును ప్రకాశవిమర్శాంశలుగా నున్నవి. ఈ శివశక్తిసామరస్యము సకలజగదుత్పత్తికి కారణముగానున్నదిగాన నీపరాపశ్యంతుల మధ్యవస్తు సామరస్యరూపము మధ్యమ యనఁబడును. ఈమధ్యమ, ఉభయకారణవస్తుమధ్యము గాన, మధ్యమయనియు, కారణ ద్వయమనఁగా, ప్రకాశాంశ ఉపాదానకారణము. విమర్శాంశ నిమిత్తకారణము. ఉభయమధ్యము మిశ్రబిందు భూతము. ప్రకృతమాతృకా పక్షమందు బిందుమయః పరమాత్మ తేజోగర్భితమయి త్రికోణ చక్రరూప పశ్యంతి మూడురేఖలయందును అవ్యక్తరూపతేజోమయమాతృకావర్ణయుక్తమయి యున్నది. ఆ వర్ణములు స్పష్టమయినపుడు వైఖరీ శక్తియగును.

మఱియు నీ పరాపశ్యంత్యాదులు బీజాంకురవృక్షఫలరూపములుగా నున్నవి. పరాబిందువగు పరమాత్మయందు, బీజమందు వృక్షశాఖాపత్రఫలము లిమిడియున్నట్లు, సకలజగత్తు నిమిడియున్నది. పశ్యంతి అంకురము వంటిది. అంకురమునకును ఫలానా వృక్షమని తెలిపెశక్తి లేదు. అటులనే పశ్యంతియందున్న అవ్యక్తమాతృకకు వర్ణవిభజన తెలియదు. ఈపశ్యంతికి అవ్యక్తమనికూడ సంకేతము. అత్యంతం+వ్యక్తం = అవ్యక్తం; అవ్యక్తం బింద్వపేక్షయా త్రికోణరూపము స్పష్టమయినది. బీజాపేక్షయా అంకురమును స్పష్టమయినది గాన అవ్యక్తము ఇక రెండవది. న+వ్యక్తం = అవ్యక్తం; వర్ణవిభజనలేనిది గాన అవ్యక్తము. అంకురమును ఫలానాజాతి వృక్షమని తెలిసికొనుటకు శక్యముకానిది గాన అవ్యక్తము.

ఇక గోప్రసవసమయమున వత్సశీర్షోదయానంతర ఉభయతోముఖి సమయము అవ్యక్తస్వరూపము. గోవు కన్నవత్స యున్నట్లు స్పష్టమయినదిగాని ఆవత్స గోరూపమా? వృషభమా? యని తెలియఁజాలదు. శ్వేత రక్త నీలాదివర్ణములును తెలుసుకొనఁజాలము గాన నాయవస్థ అవ్యక్తము. ఇదియే పశ్యంతీరూపము. అంతస్థవస్తు ప్రసవాభిముఖావస్థ పశ్యంతి యనఁబడును.

**ఇక నవశక్తులస్వరూపము:—**

వామా, జ్యేష్ఠా, రౌద్రీ, అంబికా, పశ్యంతీ, ఇచ్ఛా, జ్ఞాన, క్రియా, శాంతా వీరు నవశక్తులు.

వామా నామ స్వాంతస్థితప్రపంచవమనా ద్విశ్వజనయిత్రీ శక్తిః.

జ్యేష్ఠా నామ సర్వమంగళకారిణీ శక్తిః,

రౌద్రీ నామ సర్వరోగవిద్రావిణీ సమస్తేష్టఫలదాయినీ శక్తిః,

అంబికా నామ సర్వాతిశాయి పరిపూర్ణరూపస్వాత్మస్ఫురణావలోకన చతురా శక్తిః.

ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తయస్తు ప్రాగుక్త పశ్యంతీ మధ్యమా వైఖరీరూపా ఏవ.

శాంతా నామ నిరంశచిద్రూపేతి మంతవ్యం.

వ్యష్టిరూపముచే నవశక్తులు. పరాశక్తితో దశకం. సర్వసమష్టి కామకల ఒకటి కలసి ౧౧ పదునోకండు శక్తుల రూపము. పశ్యంతి బిందుతత్త్వము పరాశక్తిస్వరూపమయినందున, పశ్యంతీశక్తి కారణముగానున్నందున కార్యకారణముల కభేదమని సూచింపఁబడుచున్నది.

**౨౫-వ సూత్రము, కూటత్రయవిభాగము.**

**మూ. ఏవం కామకలాత్మా త్రిబిందుతత్త్వస్వరూపవర్ణమయీ,**
**సేయం త్రికోణరూపం యాతా త్రిగుణస్వరూపిణీ మాతా.**

అర్థం. ఏవం = పూర్వోక్తమయిన కామకరాత్మా=ప్రకాశవిమర్శ వర్ణద్వయమేళన స్వరూపమయిన, త్రిబిందుతత్త్వస్వరూపవర్ణమయీ= రక్త-శుక్ల మిశ్రరూపములైన బిందుత్రయముయొక్క తత్త్వ స్వరూపమయిన మూలకూటత్రయవర్ణరూపమయిన, త్రిగుణస్వరూపిణీ = ఇచ్ఛా-జ్ఞాన-క్రియామయ సత్వరజస్తమోగుణాత్మకమయిన, సేయం మాతా = ఆ ఈసకలజగన్నిర్మాత యగు త్రిపురాశక్తి, త్రికోణరూపం = యోనిచక్రాకారమును, యాతా = పొందినది.




౧౬ అవ్యక్తమాతృకా బీజములు.
౬ మూలమంత్ర కామ రాజకూటము.
౫ నిత్యాబీజము.
హాం

**అవ్యక్తమాతృకాచక్రపరిలేఖనము.**

తా. ఈ సూత్రమందు ప్రకృతము వర్ణించుచున్న త్రికోణ చక్రమును స్పష్టపఱుచుచున్నారు. ఈమధ్యబిందు, యోనిచక్రములు

రెండును శ్రీచక్రాంతర్గత మధ్యమందున్న ప్రధానవస్తువులు. అందు మధ్యబిందువు ప్రథమము సర్వకారణము. పరమాత్మయగు పంచ వింశతి తత్త్వస్వరూపముగా నున్నది. ఈ పరిలేఖనము నీగ్రంథాదిని తురీయకూటవర్ణనలో కామకలాస్వరూపనిరూపణగా చూపింపఁబడి నది. అదియే ఈ చక్రమధ్యకోణచక్రము. ఇందుఁగల బిందుచతుష్ట యము ప్రకాశవిమర్శమిశ్రబిందువులు, మధ్యది సంవిద్బిందువు. అవిద్యాపాదమందు పరదేవతాశరీరవృక్షమందు 'పంచవింశ ఆత్మా' యనే శ్రుత్యనుసారముగా చూపించి ౨౫ వ స్థానమయిన ప్రథమ బిందువే ఈ శ్రీచక్రాంతర్గతమధ్యబిందువుగా నున్నది. ఈయోని చక్రాకారముగానున్న రేఖాత్రితయము అవ్యక్తస్వరూపములు గల తేజోమయములయిన పంచాశద్వర్ణాత్మకమాతృకయు, పంచదశవర్ణ మయ మూలమంత్రమందుఁగల వాగ్భవ, కామరాజ, శక్తికూటము లును, షోడశనిత్యాస్వరూపములగు అకారాదిషోడశస్వరములును, తేజోమయరేఖాకారమును పొందియున్నవి. ఈకోణబిందువులు, చం ద్రాగ్నిసౌరములగు మండలత్రయము, సత్త్వరజస్తమస్సులనే గుణత్ర యము, వాగ్భవకామరాజశక్తి సంజ్ఞలుగల బీజత్రయము, ఇచ్ఛా జ్ఞాన క్రియలనే శక్తిత్రయము, బ్రహ్మ విష్ణు రుద్రులనే మూర్తిత్ర యము, జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయములనే త్రిపుటియు, నీబిందుత్రయరూప ములుగా తేజోమయములుగా నున్నవి. ఈ బిందురేఖలసమష్టి కామ కలాస్వరూపము.

"కామః కమనీయతయా కలా చ దహనేందువిగ్రహౌ బిందూ" యని వెనుక చెప్పఁబడినది; మహాఋషులచే కోరఁబడుచున్నది; మనోహర మయినదియగు నీవస్తువును మనస్సున ధ్యానించి, అందు ప్రవేశించి, అందే నామనస్సు తనధర్మమయిన, వృత్తిశూన్యమయిన లయమును పొందును గాన మనోహరము, అకారము, ప్రకాశాంశ, బ్రహ్మబీజము, అనుత్తరలిపి అని ఈబీజమునకు వాడుక. అనుత్తరవస్తువు అద్వైత స్వరూపప్రకార మాత్మ గాన తద్రూపము చంద్రమండలము. హకా రము విమర్శాంశము అగ్నిమండలము. ఈ వర్ణద్వయసంయోగము అహమనే ఆత్మమంత్రము. ఈవర్ణద్వయసామరస్యము కామకలా

స్వరూపము మధ్యనున్న హంసద్వంద్వము శివశక్తిమేళనరూప పరమాత్మ వస్తువుగా నున్నది. ఈయోనిచక్రమధ్యబిందువు ప్రకాశరూప అకారస్థానము. యోనిచక్రము విమర్శాంశ, సాకారము రెండు బీజముల మేళనము. శివశక్తి మేళనవస్తువు సర్వకారణమనియు, నిదియే యీ శ్రీచక్రాంతర్గతబిందువని సకలాగమసిద్ధము. కాన నీబిందువు పరాస్వరూపమని కామకలా, పరమాత్మ, పరబ్రహ్మము, సచ్చిదానందస్వరూపమని శ్రుతులచే ప్రతిపాదింపఁబడుచున్నది.

ఈగ్రంథము స్వరూపజ్ఞానసాధనముగా నున్నది. ఆస్వరూపజ్ఞానము విచారణాధీనము. ఆవిచారణ ఆత్మానాత్మలను గుఱించి సత్యాసత్యములను గుఱించి; ఇందులకు చతుర్దశభువనాత్మక బ్రహ్మాండస్వరూపవిచారణ మావశ్యకము, మందాధికారులగు ప్రాకృతులకు దుర్లభముగాన, చరాచరములగు పిండాండ బ్రహ్మాండములు సమానధర్మములు గలవిగాన శారీరకవిచారణవలన నిజము తత్త్వము తెలుసును. ఈశారీరవిచారణయు అంతరంగవస్తుభేదము లనేకములున్నందున నివి ప్రత్యక్షములుగానందున నా అంతరంగ విచారణము దుర్లభమని పరమేశ్వరుఁడు శ్రీచక్రమును స్వస్వరూపజ్ఞానసాధనముగా నిర్మించినాఁడు. బ్రహ్మాండ, పిండాండ, శ్రీచక్రములు, సమానధర్మములు గలవి. కాన నీప్రత్యక్షముగా గ్రహింపఁదగిన చక్రతత్త్వమును తెలుసుకొనినవారు స్వరూపజ్ఞానముకలిగి జీవన్ముక్తులు కాఁగలరు.

శ్రు. సదేవ సౌమ్యేద మగ్ర అసీత్; ఏకమేవాద్వితీయం బ్రహ్మ;
సచ్చిదానందం బ్రహ్మ; అయమాత్మా బ్రహ్మ.

ఇత్యాదిశ్రుతులచే నీమధ్యబిందువు అద్వితీయమయిన ఏకాకారముకలిగి సృష్ట్యాదిని సచ్చిదానంద లక్షణములుగలిగిన బ్రహ్మవస్తువుగా నున్నది. ఈబిందుతత్త్వమును గ్రహించుటకు మనోవాక్కుల కగోచరమయినను శ్రుతులు కొన్ని లోకానుభవదృష్టాంతనులచే బోధించుచున్నవి.

శ్రు. సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ ఇతి తైత్తిరీయశ్రుతిః

ఇందువలన బ్రహ్మవస్తువు, సత్యం = త్రికాలాబాధ్యమనియు, జ్ఞానం = ప్రకాశధర్మము కలదనియు, అనంతం = దేశభేదకాలభేద వస్తుభేదములు లేనిదనియు తెలియుచున్నది.

శ్రు. ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్.

ఆనందమే బ్రహ్మస్వరూపమని ఇందువలన తెలియుచున్నది. ఆనందమనఁగా: నిత్యనిరవధికసుఖము.

ఛాందోగ్యము శ్రు. భూమైవ తత్సుఖం, భూమాత్వేన విజిజ్ఞాసితవ్యం. యత్ర నాన్య త్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజ్ఞాయతే తద్భూమా అన్య దార్తం తన్మర్త్యం, యద్భూమా తదమృతమితి.

ఈ శ్రుతులవలన ఆనందమే బ్రహ్మకు స్వరూపమని, ఆయానందము నిత్యసుఖరూపమని, యాసుఖమనునది భూమాస్వరూపమని, ఆభూమాయనునది యెచట నేస్థలమునఁగాని యేఅవస్థయందుఁగాని,చక్షుర్గోచరమైనయేవస్తువుగాక, శ్రవణగోచరమైనయేశబ్దమునుగాక, మనోగోచరమైనయేపదార్థమును గాక అఖండాకారసంవిన్మయమయిన వస్తువు నిత్యనిరవధికసుఖస్వరూపమని, యది యాత్మయని, పరబ్రహ్మయని తెలియుచున్నది. అదియే యీబిందువుగా నున్నది.

శ్రు. తస్మి న్మరు శుక్తికాస్థాణుస్ఫటికాదౌ జలరౌప్యపురుష రేఖాదివ ల్లోహిత శుక్ల కృష్ణగుణమయ గుణసామ్యానిర్వాచ్యా మూలప్రకృతి రాసీత్. తత్ప్రతిబింబితం యత్సాక్షిచైతన్య మాసీదితి. పైంగలోపనిషది.

తా. పూర్వోక్త సత్యజ్ఞానానందాది లక్షణములుగల పరమాత్మయందు మరుభూమియందు జలభ్రమయు, శుక్తికయందు రజతభ్రమయు, స్థాణువందు చోరపురుషభ్రమయు, స్ఫటికయందు రేఖాభ్రాంతియు, రజ్జువందు సర్పభ్రాంతియు కలిగినట్లు, రజస్సత్వతమోగుణమయమయిన మూలప్రకృతి ఆవిర్భవించినదనియు, నందు ప్రతిబింబించినది సాక్షి చైతన్యమనియు నీశ్రుతివలన తెలియుచున్నది.

ఈ శ్రుతులవలన శ్రీచక్రమధ్యబిందువు శివశక్తిసామరస్య రూప పరమాత్మగాను, సర్వశక్తి పరబ్రహ్మ యనే శ్రుతివలన కామేశ్వరీకామేశ్వరద్వంద్వ సామరస్యరూపమయిన నీ మధ్యబిందు ప్రభా

పుంజము ఈబిందువును పరివేష్టించి, చంద్ర సూర్య పరివేషములభంగి త్రికోణాకారముగా ఇంద్రధనుస్సువంటి శ్వేతరక్త నీలవర్ణములు గలిగి సత్వరజస్తమోగుణాత్మక యగుచు, వామాదినవశక్తుల కాస్పదమయిన మూలప్రకృతి యనే పశ్యంతీశక్తి ఆవిర్భవించినదనియు, నీకోణ చక్రము కార్యముగను బిందుప్రభవలన ఉత్పన్నమయినందున బిందువు కారణమనియు, నీ కారణకార్యముల కభేదమనియు తెలియుచున్నది.

"పరామయ బిందుతత్త్వమేవేదం" అనినందున నీ బిందురూప పరాశక్తియే పశ్యంత్యాదులకు కారణము. ఈ కారణము ఘటనిర్మాణ మునకు మృదాదివత్ ఉపాదానకారణమనియు, కులాలవత్ నిమిత్త కారణమనియు ద్వివిధముగా నున్నది. ఇందు ఘటముయొక్క వర్త మానకాలమందును, అంతమందును కులాలసంబంధము లేనందున నిమిత్తకారణము సామాన్యముగాను, ఘటముయొక్క ఆదిమధ్యాంత ములయందు అనపాయిగా నున్నందున ఘటమునకు మృత్తిక ఉపాదాన కారణము. నిమిత్తకారణముకన్న శ్రేష్ఠముగా నున్నది గాన నీ పర మాత్మస్వరూప పరాబిందువు భావిబ్రహ్మాండమునకును, నవచక్రముల కును ఉపాదానకారణముగా నున్నది. ప్రకాశవిమర్శలు శివశక్తులుగా నున్నందున నిందు ఒకటి ఉపాదానమును, రెండవది నిమిత్తముగను ఉండునా యని భ్రమ కలుగును గాని అట్లుండదు. ఈ బిందువు ప్రకాశవిమర్శాంశల మేళనతత్త్వము ఒకటిగా నున్నందున,

శ్రు. ఆత్మానం ద్వేధా విభజ్య స్త్రీపుంభావ మాపన్నః.

అని బృహదారణ్యకశ్రుతి చెప్పుచున్నందున, శివశక్తిసామరస్యమే బిందుతత్త్వమయినందున ప్రకాశవిమర్శాంశలు రెండును ఉపాదాన కారణములుగానే యున్నవని నిశ్చయము.

**ఉపాదానకారణస్వరూపము.**

శ్రు. ఉపాదానం త్రిధా భిన్నం వివర్తిపరిణామి చ,
ఆరంభకం చ తత్రాద్యౌ న నిరంశే ప్రకాశినా. ౧
ఆరంభవాదినో ఒన్యస్మా దన్యస్యోత్పత్తి మూచిరే,
తంతోః పటస్య నిష్పత్తే ర్భిన్నౌ తంతుపటౌ ఖలు. ౨
అవస్థాంతరితాపత్తి రేకస్య పరిణామితా,
స్యాత్క్షీరం దధిమృత్కుంభస్సువర్ణం కుండలం యథా. 3

తా. ఈ ఆనందస్వరూప ఆత్మ నామరూపాత్మక జగత్తునకు ఘట మునకు మృత్తికవలెనే, ఉపాదానకారణముగా నున్నదిగాని కులాలవత్ నిమిత్తకారణము కాదని తెలియుచున్నది. ఆ ఉపాదానకారణమును వివర్తమని, పరిణామమని, ఆరంభకమని మూఁడు విధములుగా నున్నది. అందు పరిణామ, ఆరంభకములు సాంశములుగాన నిరంశమయిన ఆత్మ యందు వర్తించవు. ఆరంభకమనఁగా తంతువు పటమునకు కారణము. ఆ తంతుపటములు భిన్నరూపములు గలవిగాన ఆకారణరూపతంతువు కార్యమందు పూర్వరూపమును విడిచి పటరూపమును బొందినది; గాన నిది ఆరంభవాదులమతము.

ఇక పరిణామలక్షణము. ఒక వస్తువే అవస్థాంతరమును పొందుట పరిణామము. ఉదాహరణము. క్షీరము, దధి, మృత్కుంభములు, సువర్ణకుండలములు. క్షీరము అవస్థాంతరమును పొందినపుడు క్షీరమనే వ్యవహారముపోయి దధి అనేవ్యవహారము సిద్ధించుచున్నది; సువర్ణము నకు అవస్థాంతరమందు కుండలమనే వ్యవహారమును, మృత్తుకు కుంభ మనియు వ్యవహారము సిద్ధించినది. కాన నీ ఆరంభపరిణామములు సాంశములయినందున నిరంశమయిన బ్రహ్మవస్తువందు వర్తించవు.

ఇక వివర్తలక్షణము. రజ్జు సర్పములవలెనే ఒకవస్తువు మఱియొక వస్తువుగా ప్రకాశించుట వివర్త మనఁబడును. రజ్జురూపమయిన వస్తువు అటులనే యుండఁగా, దానియందు సర్పాకారముగా నగుపడుట, తోఁచుట. ఇట్లే శుక్తి రజతములు, మరుమరీచికలు, స్థాణుపురుషులు. ఇట్లే ఆత్మయందు నామరూపాత్మకజగత్తు వివర్తోపాదనకారణ కార్య ములుగానున్నదని చెప్పిరి. రజ్జు, సర్ప, శుక్తి, రజతాది దృష్టాంత మందును సాంశములుగా నున్నందున నిరంశమయిన బ్రహ్మమందు వర్తించవనిన గగనతలమాలిన్యవత్, ఆకాశమందు నీలత్వకల్పనము వలె నిరంశమయిన ఆత్మయందు జగత్కల్పన యని యీ దృష్టాంతము నిర్దోషమని చెప్పిరి.

శ్లో. అవస్థాంతరభానం తు వివర్తః రజ్జుసర్పవత్,
నిరంశేఽప్యస్త్యసౌ వ్యోమ్ని తలమాలిన్యకల్పనాత్. ౪

యతో నిరంకుశ ఆనందే వివర్తో జగ దిష్యతాం,
మాయాశక్తిః కల్పితా స్యాదైంద్రజాలికశక్తివదితి. ౫

ఈ గగనతలమాలిన్యమువలెనే దృష్టాంతమువలన గగనమువలె ఆత్మవస్తువు శూన్యమా? అనిన అటుల శూన్యము కాదు.

శ్రు. యదస్తి సన్మాత్రం యద్విభాతి చిన్మాత్రం యత్ప్రియమానందం.

తా. ప్రత్యక్షముగా సర్వజనానుభవములో నున్నది. ఎట్లనిన, అహమహమని సకలజనుల వాడుకలోనున్నది. సద్వస్తువనే ప్రకాశతచే అహోరాత్రజ్ఞానము, వస్తుజ్ఞానము కలుగుచున్నదో అది చిద్వస్తువు. ఏది ప్రేమరూపముగా నున్నదో అది ఆనందాంశము. ఇట్లు సదంశ, చిదంశ, ఆనందాంశములు సర్వజనానుభవములో నున్నవి. ఈమూఁడు లక్షణములు బ్రహ్మభాగములు; ఇవి నాశరహితములు. నామరూపములు, ఆద్యంతములు కలవి. మాయాంశములు.

శ్రు. సచ్చ త్యచ్చాభవత్.

పరమాత్మ సద్వస్తువుగాను, అసత్యముగాను కూడ నున్నదని యాసత్యాసత్య మేళనము జగద్రూపము సత్యము. అస్తిభాతిప్రియములు అసత్యము నామరూపములు కలసి జగత్తు సత్యాసత్యస్వరూపమని తెలియుచున్నది.

ప్రకృతమనుసరామః. శ్రీచక్రాంతర్గతబిందువు ఆత్మరూప ఆనందస్వరూపమని తెలియుచున్నది. ఈనామరూపములు ప్రకాశవిమర్శాంశములు గాన వీనిని బోధించుటకు విమర్శాంశమయిన రూపమును బోధించుటకు అవిద్యాపాదమందు పరదేవత శారీరవృక్షరూపముగా నున్నది. అందుఁగల ఊర్ధ్వబిందువయు, శ్రీచక్ర మధ్యబిందువయు నొకటిగానున్నవి. అట్లే విమర్శాంశముగా నామాత్మక శబ్దబ్రహ్మమును బోధించుటకు మాతృకా శ్రీచక్రములు కల్పింపఁబడినవి. ప్రకాశాంశము గాన శారీరవృక్షమందు బిందుమండలములుగా పంచభూతాదులు చూపింపఁబడినవి. చక్రము విమర్శాంశము గాన యోని చక్రములుగా నిందు సంకేతములు చూపింపఁబడినవి. అందున్న ఊర్ధ్వ బిందుచతుష్టయము పరమాత్మ, అవ్యక్తము, మహత్తత్వము అహంకారములుగాను, ఈయోనిచక్రమందున్న బిందుచతుష్టయము పరా,

పశ్యంతీ, మధ్యమా, వైఖరులుగాను నున్నవి. కాన శారీరవృక్ష శ్రీచక్రములు, రూపనామములు, ప్రకాశ విమర్శాంశములుగాను నున్నవి. ఈ రెంటియందును ప్రకాశవిమర్శాంశములు గలిగియున్నవి.

కాన శ్రీచక్రాంతర్గతబిందుతత్త్వము సచ్చిదానందస్వరూపమనియు, ఆబిందుమండలప్రభాపుంజమువలన కలిగిన యోనిచక్రము పశ్యంతీస్వరూపమనియు, నీబిందుయోనులు భావిచక్రములకును, బ్రహ్మాండ పిండాండములకును ఆస్పదములుగానున్నవని పర్యవసానము.

**౨౬-వ సూత్రము, పశ్యంత్యాదిభేదములు.**

**మూ. ఏకా పరా తదన్యా వామాదివ్యష్టిమాతృసృష్ట్యాత్మా,**
**తేన నవాత్మాజాతా మాతా సా మధ్యమాఽభిధానాభ్యాం.**

అర్థము. పరా=సర్వకారణ బిందుభూత పరాశక్తి, ఏకా = ఏకాకారముగా నుంటున్నది. తదన్యా = పరావిలాసన రూపముగా, మాతా= పశ్యంతి అనే రెండవకారణ భూతజనని, యేన = ఏకారణముచేత, వామాది వ్యష్టి మాతృసృష్ట్యాత్మా = వామాది శాంతాంత వ్యష్టిరూప నవశక్తిసముదాయ స్వరూపమయినదో, తేన = ఆకారణముచేత, సా = ఆపశ్యంతీశక్తి, నవాత్మాజాతా=నవయోన్యాత్మక మయినది. మధ్యమా= మధ్యమాఅనే పేరుగల శక్తిన్ని, అభిధానాభ్యాం = నామములచేత, ద్వివిధా= రెండువిధములుగా నున్నది.

తా. వెనుక ౧౮-వ సూత్రమందు కామకలాశక్తికి తత్త్వాత్మకత్వము, తత్త్వాతీతత్వమును చెప్పఁబడినది. తత్త్వవివరము - శారీర వృక్షము రూపాత్మకమని వెనుకటి సూత్రార్థోపన్యాసమందు వివరింపఁబడినది. ఇచట శ్రీచక్రము నామాత్మక విమర్శాంశవిచారణలోను ఏకరూప బహురూపత్వమును, శివశక్తులకు సమానకారణత్వమును వివరించుచున్నారు.

ఈ శ్రీచక్రమధ్యగతమయిన బిందుయోనిచక్రములు రెండును శివశక్తులుగా నున్నవి. బింద్వధిష్ఠాత్రి పరానామము గలది. ఈ పరా స్వరూపము శివశక్తిసామరస్యమండలము. ఇచట స్త్రీ, పుం భేదము లేదు. "పరశ్చ - పరా చ-పరా" యని యున్నందున, ఏకాకి తేజోమయ

మయినందున సర్వవ్యాపిగాను, ఇందు సకలము కల్పిత మయినందున సర్వకారణముగా నున్నది. గ్రంథాదిద్వితీయ సూత్రమందు, "శివరూపవిమర్శనిర్మలాదర్శః, సా జయతి" అని చెప్పినందున పరమాత్మయొక్క ఇచ్ఛాశక్తి ఆవిర్భవించి ఆదర్శమువలె నున్నందున, నందు ప్రతిబింబమునుచూచి పరిపూర్ణో౽హమనే అహమాత్మికస్ఫురణశక్తి ఆత్మయందు కలిగినదని చెప్పిరి. ఇచట మధ్యబిందుకిరణసముదాయమువలన త్రికోణముత్పన్న మయినదని, అది పశ్యంతి శక్తియని చెప్పిరి ఈ ఉభయార్థసామరస్యమున బిందువు శివరూపము. త్రికోణము శక్తిరూపము. జగన్నిర్మాణమునకు మాతాపితరు లుభయులును సమానకారణములుగాన నీ బిందుయోనులు రెండును సమానకారణములుగా నున్నవనుట-నీబిందుయోనులు బింబప్రతిబింబములుగా నున్నవి. బిందువు శుద్ధబ్రహ్మము. ఈపశ్యంతీచక్రము శబలబ్రహ్మస్వరూపముగాను నున్నది.

శ్రీచక్రలేఖనమందు బింద్వాదిచతుర్దశారపర్యంతము లిఖించినపుడు, అధోముఖములుగా నయిదుయోనులును, ఊర్ధ్వముఖములుగా నాలుగుయోనులును నేర్పడును. అందు మధ్యబిందువునకు నేసంబంధమును గలుగదు గాన ఏకాకియనియు, నవయోనులకును నీబిందుప్రభవలన కలిగిన పశ్యంతీయనే ప్రథమయోని సంబంధముచే తక్కిన యోనులు ఉత్పన్నమగుచున్నందున నా నవయోనులకును, తదధిష్ఠాతలగు వామాదినవశక్తులకును ఈపశ్యంతి కారణముగా నున్నందున నిది రెండవకారణముగా నున్నదని చెప్పుట.

వైఖరీరూపశబ్దబ్రహ్మోత్పత్తికి బిందురూపపరావస్థ ప్రథమావస్థ. ఆ బిందువికసనమువలన త్రికోణచక్రాకృతియు, నందు నాదమును ఉత్పన్నమగును. ఆ నాదము ఈపశ్యంతీచక్రము ద్వితీయావస్థ. ఈ పశ్యంతియం దుత్పన్నమయిన నాదమువలన నవనాదములు ఉత్పన్నమగుచున్నందున నానవనాదములకును, వామాదినవశక్తులకును, నవయోనులకును, నీ పశ్యంతీచక్రము కారణముగాను, జనయిత్రిగాను ఉన్నదని చెప్పిరి. భావిజగద్వృక్షమునకు మాతృకకు ఈబిందునాదములు బీజాంకురముల వంటివి.

ఇట్లు పరమాత్మరూప పరాబిందుస్వరూపము పశ్యంతీరూప కోణచక్రస్వరూపమును స్పష్టపరచి యిక మధ్యమాస్వరూపమును వివరించుచున్నారు. ఆ మధ్యమయును ద్వివిధముగా రెండు నామములు కలిగియున్నది.

౭౭-వ సూత్రము, మధ్యమాస్వరూపము.

మూ. ద్వివిధాహి మధ్యమా సా సూక్ష్మాస్థూలాకృతి స్తథాసూక్ష్మా.
నవనాదమయీ స్థూలా నవవర్గాత్మా చ భూతలిప్యాఖ్యా.

అర్థము. సామధ్యమా=ఆమధ్యమావస్థయు, ద్వివిధాహి=రెండు రూపములుకలది, సూక్ష్మా=సూక్ష్మాకారముగలదియు, తథా=అట్లే, స్థూలాకృతిః=స్థూలాకారముగలదియు అని, ద్వివిధాహి=రెండురూపములుగలదిగదా (వానిలో), సూక్ష్మా=సూక్ష్మమధ్యమ, నవనాదమయీ = నవనాదములు గలిగినది, స్థూలా=స్థూలమధ్యమ, నవవర్గా చ=నవవర్గములుగలది, భూతలిప్యాఖ్యా=కల్పితమైన లిపి అనే పేరుగలది.

తా. మధ్యమావస్థ సూక్ష్మమధ్యమయనియు, స్థూలమధ్యమయనియు రెండు విధములుగా నున్నది. ఈ సూక్ష్మస్థూలరూపములు రెండును విభజింపఁబడును. సూక్ష్మమధ్యమయనఁగా పరాపశ్యంతుల మధ్యమావస్థ సూక్ష్మమధ్యమ పశ్యంతీవైఖరీల మధ్యమావస్థను బహు సూక్ష్మమయిన జ్ఞానదృష్టిచే గ్రహింపవలెను. ఇది పరాపశ్యంతుల మధ్యావస్థయనఁగా పరాశబ్దముచే,

శ్రు. ఆత్మైవేద మగ్ర ఆసీత్; సదేవ సౌమ్యేద మగ్ర ఆసీత్; ఏక మేవాద్వితీయం బ్రహ్మ.

ఈ శ్రుతులచే సిద్ధమయిన పరమాత్మస్వరూపము ప్రథమావస్థ.

అనంతరమందు స్వాంతర్గతమయిన చిచ్ఛక్తి ఆవిర్భవించినదిగాననిది పశ్యంతీ అవస్థ. ఈరెంటి మధ్యావస్థ.

శ్రు. సోఽకామయత సఈక్షతేత్యాది శ్రుతిసిద్ధమయిన శివశక్తిసామరస్యరూపము, శక్త్యావిర్భావాత్పూర్వము ఈశ్వరకామనాస్వరూపము, ఇవియే బ్రహ్మానందస్వరూపము. ఇది ఒకవిధమయిన సూక్ష్మ

మధ్యమ. ఇక మరియొకవిధము - సాధకజనసహస్రారాంతర్గత చంద్రమండలము, పరాస్వరూప సాక్షియనే పరమాత్మస్వరూపము, పశ్యంతీరూపగోణచక్రము, ప్రకృతి స్వరూప జీవభావము, గురూపదిష్టమహావాక్యార్థానుసంధానముచే ఆరోహణక్రమముగా జీవత్వారోపసంక్షయమును భావించి 'అహం బ్రహ్మాస్మీతి' వాక్యమందుఁగల బ్రహ్మాత్మైక్యానుసంధానమును తెలియఁజేసె. 'అస్మి' అనే పదార్థభావనయు శివశక్తిమేళనవస్తువు నగు సాక్షిస్వరూపము తన నిజరూపమనే జ్ఞానము కలుగుట సూక్ష్మమధ్యమ. శివశక్తులనే సూక్ష్మవస్తుమధ్యము; అహమనే పదార్థభావన సూక్ష్మమధ్యమ. ఇది రెండవరీతి. ఇక మూఁడవది. అష్టసహస్రారగత చంద్రమండలమందు మనోబుద్ధ్యాదులను లయింపఁజేసి, స్వాంతర్గత అనాహతకమలమం దుత్పన్నమయి, సుషుమ్నా నాడీమార్గముగా సహస్రారమును పొందుచున్న నాదానుసంధానమును నాదబిందూపనిషత్తునందు చెప్పిన ప్రకారము నాదమును వినినపుడు ఆరంభమందు నవవిధనాదములు వినఁబడును. క్రమక్రమముగా నన్నియు నణఁగి, యానాదము పరాకాశమందు లయమగును. ఆ నాదభేదములు వినఁబడినంతవఱకు మనస్సుకలదనియు, ఆ నాదలయమే మనోలయమనియు, నామనస్సు వృత్తిశూన్యమయి యచట లయించుటయే బ్రహ్మానందానుభవము, జీవన్ముక్తావస్థయని సర్వాగమసిద్ధము. ఆ నాదానుసంధానము నొక పక్షమునకు ౧౫ దినము లభ్యసించిన నాదము దొరకుననియు, పదునయిదుదినము లభ్యసించిన ఒక మాసమునకు సాధనలేకను సర్వదా నాదము కలుగుననియు ఉపనిషత్సిద్ధము.

**నవనాదముల వివరము:—**

చిణినాదము, చిణిచిణినాదము, ఘంటానాదము, శంఖనాద, తంత్రీనాద, వేణునాద, భేరీనాద, మృదంగనాద, మేఘనాదములు. ఇవి శ్రుతిసిద్ధములు. అభ్యాసదశలో స్వాంతర్గతప్రాణఘోష వినఁబడును. క్రమముగా నీ భేదములు పరానాదమందు లయించును. ఈమార్గము శ్రద్ధానుసారముగా మనోలయమునకు సులభోపాయముగా నున్నది.

ఇది యొక సూక్ష్మమధ్యమ. ఇది ఈ గ్రంథకర్తమతము. ఇక స్థూలమధ్యను పశ్యంతీవైఖరీల మధ్యమావస్థగా నున్నది. పశ్యంతి

అవ్యక్తమాతృకగా నున్నది. వైఖరి పంచాశద్వర్ణ విభాగమయినది. ఈ ఉభయావస్థలమధ్యము నవవర్గమాత్ర విభాగము పశ్యంతికన్న స్పష్టము, వైఖరీకన్న అస్పష్టము గాన మధ్యమ. ఇది స్థూలమధ్యమ. అ, క, చ, ట, త, ప, య, శ వర్గలు ఎనిమిది. అకారాదిస్వరములు ౧౬ లో హ్రస్వములు ౮ ప్రకాశాంశలు ఒక వర్గముగాను, దీర్ఘస్వరములు ౮ రెండవ వర్గుగాను ఇట్లు నవవర్గు లగును. స్వరములు రెండు వర్గలుగానున్నవి.

ఈ స్థూలమధ్యమ కల్పింపఁబడిన లిపియనే సంజ్ఞకలది. వాస్తవము, మాతృకతేజోమయము, ఉచ్చారణా మంత్రరూపమని తాత్పర్యము. కనుకనే జలమయము ప్రాణమనియు, అన్నమయము మనస్సనియు, తేజోమయము వాక్కనియు, ఛాందోగ్యమందు ఉద్దాలక ఋషి చెప్పినారు.

## కార్యకారణభేదాభావము.

౪౭-వ సూత్రము.

**సూ. ఆద్యా కారణమన్యా కార్యం త్వనయోర్యత స్తతో హేతోః,**
**సైవేయం నహి భేద స్తాదాత్మ్యం హేతుహేతుమతోరిష్టం.**

అర్థము. యతః = ఏహేతువుచేత, అనయోః=ఈస్థూల సూక్ష్మములమధ్యను, ఆద్యా = సూక్ష్మనవనాదాత్మక సూక్ష్మమే, కారణం= కారణముగాను, అన్యా = నవవర్గాత్మక స్థూలమధ్యమ, కార్యం=కార్యముగా నగుచున్నదో, తతోహేతోః = ఆహేతువుచేత, సైవేయం= నవనాదాత్మకసూక్ష్మమే నవవర్గాత్మక స్థూలరూప మగుచున్నది. భేదోన= ఈసూక్ష్మస్థూలములకు భేదములేదు. హేతుహేతుమతోః= కారణకార్యములకు, తాదాత్మ్యం=అన్యోన్యతాదాత్మ్యము, ఇష్టం=కూడుకున్నది.

తా. వెనుకసూత్రమందు సూక్ష్మమధ్యమ, స్థూలమధ్యమయని మధ్యమాస్వరూపమును చెప్పినందున, సూక్ష్మము స్థూలాకృతిని పొందుచున్నందున, నీసూక్ష్మస్థూలములు కారణకార్యములుగా నున్నందున, కారణరూప సూక్ష్మమధ్యమా రూపనాదమే స్థూలాకృతిని పొంది నవవర్గాత్మక మగుచున్నది గాన కారణకార్యములకు భేదములేదు. అట్లే పశ్యంతీ, మధ్యమా, వైఖరీలకు పరాస్వరూపము కారణము

గాన నీ పశ్యంత్యాదులు పరాస్వరూపములే గాని భేదములేదు. అపరా వాక్కు ఆత్మస్వరూపబిందువుగానున్నందున నా ఆత్మకును, వైఖరీ బీజములకును భేదములేదని తాత్పర్యము.

**౪౯-వ సూత్రము, అష్టకోణచక్రము.**

**మూ. శషసపవర్ణమయం తద్వసుకోణం మధ్యకోణవిస్తారః,**
**నవకోణం మధ్యం చే త్యస్మి న్ చిద్దీపదీపితే దశకే.**

అర్థము. శ,ష,స,ప వర్ణమయం = శ,ష,స, నీమూడు వర్ణములు ప,ఫ,బ,భ,మ, యీ ఎనిమిదివర్ణములు స్వరూపముగాగల, వసుకోణం= అష్టకోణచక్రము, మధ్యకోణవిస్తారః = నవయోనుల మధ్యమందున్న యోనిచక్రకిరణ సముదాయముచే నుత్పన్నమయినది. తత్ = ఆమధ్య కోణసహితముగా నవకోణమధ్యనున్న బైందవస్థానము, అస్మిన్ దశకే = ఈబిందు త్రికోణ వసుకోణాత్మకమయిన యీదశకమందు, చిద్దీపదీపితే సతి=పరంజ్యోతి ప్రకాశించుచుండఁగా నీవసుకోణము విలసిల్లుచున్నది.

తా. ఇటుపైన మధ్య శృంగాట తేజఃప్రస్రవణరూపమయిన అష్టకోణచక్ర నిరూపణద్వారా వైఖరీశక్తిని నిరూపించుచున్నారు. శ్రీచక్ర మధ్యగత ఆత్మరూప బిందుమండల తేజస్సువలన నవయోనుల కాస్పదమయిన యోనిచక్రము ఉత్పన్నమయినది. పిదప నా బిందు యోనుల కిరణసముదాయముచే అష్టకోణచక్రము కలిగినది. బిందు రూపమయిన పరంజ్యోతితేజస్సు అవ్యక్తమాతృకారూపమయిన మూఁడు రేఖలుగాను, కోణములందు మూఁడుబిందువులుగాను, మధ్యబిందువు నాక్రమించి త్రికోణచక్రము పరిణమించినది. ఆ బిందు యోనుల తేజస్సు అనఁగా అవ్యక్తమాతృకారూపతేజస్సులో నెనిమిది కలలు. (శ-ష-స-ప-ఫ-బ-భ-మ) ఇవి ఎనిమిదిన్నీ స్ఫుటములయి ఎనిమిది కోణములుగా వికసించినవనియు, నీ ఎనిమిది కోణములు, బిందుయోని చక్రములు రెండును కలసి యీపది వస్తువులును, మధ్యనున్న పరమాత్మ రూపచిత్కలయనే దీపముచే ప్రకాశించుచున్నవని తాత్పర్యము. ఒక దీపమువలన దీపాంతరమువలెనే, మధ్యబిందుతేజస్సువలన వస్తుజాలముత్పన్న మగుచున్నది. ఇట్లు దీపము లధికమయిన కొలది తేజస్సును అధిక మగుచున్నది.

30-వ సూత్రము, దశారయుగ్మము.

మూ. తచ్ఛాయాద్వితయమిదం దశారచక్రద్వయాత్మనా వితతం,
తటచకవర్గచతుష్టయవిలసనవిస్పష్టకోణవిస్తారః.

అర్థము. తచ్ఛాయాద్వితయం = పూర్వోక్త తేజోరాశిమయ చక్రత్రయ ప్రకాశ విమర్శాత్మక తేజోద్వితయము, దశారద్వయాత్మనా వితతమాసీత్ = దశారద్వయాత్మకముగా విలసిల్లుచున్నది. ఇదం = ఈచక్రద్వయము, త-ట-చ-క వర్గ చతుష్టయ విలసన విస్పష్టకోణ విస్తారః=తటవర్గులు అంతర్దశారముగను, చ-క-వర్గులు బహిర్దశారముగను, స్పష్టమయిన కోణాకారములుగా నగుచున్నవి.

తా. వైఖరీమాతృకను అవరోహణక్రమముగా నిరూపించుచున్నారు. ఇంతవరకు బిందుత్రికోణవసుకోణములు ఉత్పన్నమయినవి. అందు బిందువు ప్రకాశాంశము. త్రికోణ వసుకోణములు విమర్శాంశములు. ఈమూడువస్తువులందున్న ప్రకాశ విమర్శ ద్వితయమయ తేజస్సువల్ల దశారద్వయము ఉత్పన్నమయినది. ప్రకాశాంశ తేజస్సు అంతర్దశారముగను, విమర్శాంశ తేజస్సు బహిర్దశారముగను ఈదశార ద్వితయము కలిగినదనియు, నందు అవ్యక్తమాతృకయం దంకురములు గానున్న త-థ-ద-ధ-న-ట-ఠ-డ-ఢ-ణ. యీపదిబీజములు అంతర్దశార కోణములుగాను, చ-ఛ-జ-ఝ-ఞ-క-ఖ-గ-ఘ-ఙ యీపదిబీజములు బహిర్దశార కోణములుగాను పరిణమించినవని తాత్పర్యము.

31-వ సూత్రము, చతుర్దశారము.

మూ. ఏతచ్చక్రచతుష్కప్రభాసమేతం దశారపరిణామః,
ఆదిస్వరగణగతచతుర్దశవర్ణమయం చతుర్దశారమిదం.

అర్థము. చక్రచతుష్కప్రభాసమేతం = వెనుక చెప్పిన నాలుగు చక్రముల కాంతితో కూడుకొన్న దశారచక్ర పరిణామము, ఆది స్వరగణగత చతుర్దశవర్ణమయం = అకారాది స్వరములలో ౧౪ అక్షరముల స్వరూపమయిన, ఇదం చతుర్దశారం స్యాత్ = ఈచతుర్దశార చక్రము అగుచున్నది.

తా. వెనుక చెప్పిన దశారయుగ్మము, వసుకోణము, త్రికోణము, బిందువు ఈనాలుగు చక్రముల కాంతిపుంజము దశారచక్ర పరిణామరూపమయిన చతుర్దశారచక్రాకారము ఉత్పన్నమయినది. త్రికోణచక్రమందున్న అంకురరూపముగల అకారాది ౧౪ స్వరములు స్ఫుటరూపములయి యీచక్రమందు ౧౪ కోణములుగా వికసించినవి. ఇటుల ప్రతి చక్రకాంతియు, చంద్రసూర్య పరివేషాకృతిగా నాచక్రము నాక్రమించి రెండవ చక్రాకృతిని పొందుచున్నదని తాత్పర్యము.

**౩౭-వ సూత్రము, స్పష్టవైఖరీస్వరూపము.**

**మూ. పరయా పశ్యంత్యాఽపి చ మధ్యమయా స్థూలవర్ణరూపిణ్యా,**
**ఏతాభి రేకపంచాశ దక్షరాత్మికా వైఖరీ జాతా.**

అ. పరయా=పరాస్వరూపముచేతను, పశ్యంతా అపిచ = పశ్యంతిచేతను, మధ్యమయా స్థూలవర్ణరూపిణ్యా = నవవర్గాత్మకస్థూలమధ్యమచేతను, ఏతాభిః=ఈ మూడు శక్తులచేతను, ఏకపంచాశదక్షరాత్మికా= ఏకపంచాశదక్షరములు స్వరూపముగాగల, వైఖరీ జాతా = వైఖరీశక్తి కలిగినది.

తా. బింద్వాదిచతుర్దశారపర్యంతము ఉత్పన్నమయిన అయిదు చక్రములు ప్రథమచక్రము కారణము, రెండవది కార్యముగా క్రమముగా నుత్పన్నమయినవి. పరా, పశ్యంతీ, స్థూల, మధ్యమలనే శక్తిత్రయమువలన వైఖరీశక్తి ప్రాదుర్భవించినదని, తద్ద్వారా అకారాది క్షకారాంతమయిన ఏకపంచాశదక్షరరాశిమయ సకలవ్యవహారయోగ్యమయిన వైఖరీయనే స్ఫుటాక్షరపఙ్క్తి ఉత్పన్నమయి యీపంచచక్రాకారముగా వైఖరీశక్తి ప్రకాశించుచున్నదని తాత్పర్యము.

పైనచెప్పిన ఏకపంచాశద్వర్ణమయ వైఖరీ ఉత్పత్తిలో షోడశస్వరగత బిందు విసర్గలును, య - ర-ల - వ - శ-క్ష. యీ ఎనిమిది వర్ణములకు పరిణామము వికసనము అవశిష్టముగా తోచుచున్నది. ఇందుకు సమాధానము. బిందునాదకలలు క్రమోదయములు. మాతృకోత్పత్తికి ప్రథమకారణము బిందువు. ఆ బిందువికసనము ౦ః—విసర్గలు. పిదప అకారాది స్వరము. తరువాత కకారాది వర్ణములు. ఇది వైఖరీ ఉత్పత్తి

క్రమము. అకారాదిస్వరోదయమునకు పూర్వమందున్న బిందు విసర్గలు ఉచ్చరించుటకు వాక్కున కగమ్యములుగాన ౧౪ స్వరముల ఆఖరున అం అః. అని అకారము పురస్కరించుకుని ఈ బిందువిసర్గలు స్వరముల అంతమందు ఉచ్చరింపఁబడుచున్నవి. కాని అవి షోడశస్వరముల కాదిద్వంద్వముగా నున్నవి. ఈ స్వరములు ౧౬ నూ, ప్రకాశవిమర్శాంశలుగా నున్నవి. ఇందు హ్రస్వములు ఎనిమిదియు ప్రకాశాంశములు; దీర్ఘస్వరములు ఎనిమిదియు విమర్శాంశములుగా నున్నవి. కాన షోడశస్వరములలో ప్రథమమయిన బిందువు శ్రీచక్రమధ్యగల బిందురూపము; విసర్గలు మధ్యయోని చక్రాంతర్గము. ఇట్లు షోడశస్వరములయినవి.

ఇక య-ర-ల-వ; ఇందు యకారము వైఖరీమాతృకయందు వాయురూపముగను, రకారము తేజోమయముగను, ఈ తేజోవాయువులు వైఖరీరూపమందు పరిణమించినవి. లకారము శ్రీచక్రమందు ధరణీసదనత్రయముగా పరిణమించినది. వకారము అమృతమయము, షోడశదళకమలముగా పరిణమించినది. ళకారము. ల, ళ, కభేదము. క్షకారము క-ష, అను వర్ణద్వయసంయోగము. ఈ వర్ణద్వయమునకు పరిణామము చెప్పఁబడినది గాన నిట్లు ఏకపంచాశద్వర్ణాత్మక వైఖరీ మాతృకాశక్తిని, గ్రంథకర్త చూపించినాడని సమాధానము.

33-వ సూత్రము, అష్టదళపద్మము-షోడశదళపద్మములు.

మూ. కాదిభిరష్టభిరుపచిత మష్టదళాబ్జం చ వైఖరీవర్గైః,

స్వరగణసముదిత మేతద్ద్వ్యష్టదళాంభోరుహంచసంచింత్యమ్.

అ. కాదిభిః=కకారము మొదలయిన, అష్టభిః=ఎనిమిదైన వైఖరీవర్గైః=వైఖరీవర్గులచేతను, అష్టదళాబ్జం=అష్టదళపద్మము, ఉపచితం=కూడుకున్నది. ద్వ్యష్టదళాంభోరుహాం చ = షోడశదళపద్మమున్ను, స్వరగణసముదితం=షోడశస్వరములచేత పుట్టినదిగా, సంచింత్యం=భావింపఁదగినది.

తా. ఇట్లు శ్రీచక్రమందుఁగల బింద్వాది చతుర్దశారపర్యంతమయిన ఆరు చక్రములను పశ్యంతీ మధ్యమా వైఖరీ శక్తి స్వరూపముగా చెప్పినారు. ఇందువల్ల శ్రీచక్రము ప్రకాశవిమర్శాత్మక

మయినందున అందుఁగల కోణచక్రములు విమర్శాత్మకములు, పద్మదళములు ప్రకాశాత్మకములుగాన నీ కమలచక్రములు బీజశక్తి స్వరూపములు. విమర్శాత్మకమయిన కోణములు పశ్యంత్యాదిస్వరూపములుగా చెప్పిరి గాన అవశిష్టమయిన ప్రకాశాత్మక అష్టదళ, షోడశదళ, కమల ద్వయము పశ్యంతీ మధ్యమా, వైఖరీశక్తి మయమని యిచట చెప్పుచున్నారు. అష్టదళపద్మము - అ-క-చ-ట-త-ప-య-శ - ఈఎనిమిది వర్గులు కాంతిమయమనియు, అకారాదిషోడశస్వరములును షోడశదళ కమలాకారమును పొందియున్నవనియు చెప్పిరి.

**౩౮-వ సూత్రము, వృత్తభూపురములు.**

**మూ. బిందుత్రయమయతేజస్త్రితయవికారస్థితాని వృత్తాని,**
**భూబింబత్రయమేతత్పశ్యంత్యాదిత్రిమాతృవిశ్రాంతిః.**

అ. వృత్తాని = చక్రమందున్న మూడువృత్తములు, బిందుత్రయమయతేజస్త్రితయ వికారస్థితాని = రక్త-శుక్ల-మిశ్రబిందుమయ మయిన చంద్ర సూర్యాగ్ని మండలముల తేజస్సుయొక్క పరిణామము ఈ వృత్తత్రయముగా నున్నది. ఏతత్ = ఈపరిదృశ్యమానమయిన, భూబింబ త్రయం=భూపురత్రయము, పశ్యంత్యాది త్రిమాతృవిశ్రాంతిః=పశ్యంతీ-మధ్యమా-వైఖరీ శక్తులకు విశ్రమస్థానముగా నున్నది.

తా. శ్రీచక్రోద్ధారకశ్రుతియందు "వృత్తత్రయం చ ధరణీసదన త్రయం చ" అని యున్నది. శ్రీచక్రలేఖనలో షోడశదళకమలోపరివృత్త త్రయమును, తదుపరి భూపురత్రయమును లిఖించుట శిష్టపరంపరగా నున్నది.

కొందఱీవృత్తత్రయమును మన్వస్రోపరి, అష్టదళోపరి షోడశ దళోపరినున్న వృత్తత్రయమని, వృత్తములేనిది కమల ముత్పన్నము కానేరదని తలంచుచున్నారుగాని యిది సమంజసము కాదు. ఈగ్రంథ కర్తమతమును అదికాదు. కాన షోడశదళోపరి వృత్తత్రయలేఖనమునే ఇచట 'వృత్తాని' అని వ్యక్తపఱచినారు. ఈవృత్తత్రయము పశ్యంతీ రూప యోనిచక్రస్థ కోణబిందువగు రక్త శుక్ల మిశ్ర బిందువుల తేజస్సు, చంద్రాగ్ని సూర్యమండలములు ఈవృత్తత్రయముగా నున్నవి. భూపుర

త్రయమందు పశ్యంతీ, మధ్యమా, వైఖరీశక్తులు, త్రికోణాది షోడశ దళాంతచక్రములందు విజృంభించి ఈ భూపురత్రయమందు విశ్రమించి నవి గాన, నా శక్తిత్రయమునకు ఈ భూపురత్రయము విశ్రాంతిస్థానమని తాత్పర్యము.

వెనుక పంచదశీవిద్య కూటత్రయాత్మకమని యా కూటత్రయము చంద్రాగ్ని-సౌరమండలత్రయాత్మకమని నిరూపింపఁబడినది. తరువాత పరాశక్తి శరీరమందుఁగల మూలాధారాది ఆజ్ఞాంత కమలషట్కము రెండేసి కమలము లొక్కొక మండలము చొప్పున సోమసూర్యాగ్ని మండలములుగా నున్నవని చెప్పఁబడినది. అందువలన మంత్ర దేవతలు రెండును ఈమండలత్రయాత్మకములుగా నున్నవి. ఈశ్రీచక్రము సైతము మండలత్రయాత్మకమని తెలియుచున్నది.

ఈశ్రీచక్రము నవచక్రాత్మకము. కోణములుగలది చక్రమని, దళములు కలది కమలమని సంకేతము. అందు కోణములు విమర్శాంశములు, దళములు ప్రకాశాంశములుగా ఉన్నవి. త్రికోణ - అష్టకోణ-అంతర్దశార-బహిర్దశార-మన్వస్రములు అయిదున్నూ విమర్శాంశములు. సమిష్టిని-౪౩-కోణములుగలవి. బిందు-అష్టదళ-షోడశదళ-భూపురములు నాలుగును కమలములు. ప్రకాశాంశములు ౨౪ దళములు కలవి.

శ్లో. ద్విరేఖాసంగమస్థానం సంధిరిత్యభిధీయతే,
త్రిరేఖాసంగమస్థానం మర్మ ఇత్యుచ్యతే బుధైః.

ఈవచనమువలన ఇందు ౨౪ సంధిస్థానములు, ౨౮ మర్మస్థానములు కలిగి, పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ, నామకశక్తిచతుష్టయ యుక్తమయి ప్రకాశ విమర్శాంశలగు కామేశ్వరీ కామేశ్వరులకు ఈ శ్రీచక్రము స్థానముగానున్నది.

### శ్రీచక్రమందు బీజన్యాసక్రమము.

**శ్రీవిద్యామహోదధౌ:—**

శ్లో. కమలం పరిలుంప్య మధ్యమాన
స్స్వరమీశాదియుతం సబిందునాదమ్,
నిగమాది నమోఽంతరే విరాజ
ద్భువి దేవీహృదయప్రతిష్ఠితం తత్.

అర్థము. కమలం పరిలుంప్య=ఈశ్రీవిద్యకు ఆదిని బాలామంత్ర బీజత్రయ ముత్పన్నమయినందున, అందున్న ద్వితీయబీజమందు కామ కల యున్నందున, ఈబీజము లక్ష్మీనారాయణాత్మకమయినందున, కమల మనఁగా క్లీంకారమని తెలియుచున్నది. పరిలుంప్య=అందు కకార-లకార-మకారములు తీసివేయగా ఈ అనే తురీయస్వరము మిగిలినది. అది సబిందుకం=బిందుయుక్త, ఈశాదియుతం='ఈశాన స్సర్వవిద్యానా' మనే మంత్రాదివర్ణమయిన ప్రణవయుక్తముగాను, నమోఽంతం=నమః అనేది అంతమందుఁగలది, తత్=ఆమంత్రము, దేవీహృదయప్రతిష్ఠితం=శ్రీచక్ర మధ్యబిందువునందు వ్రాయవలెనని (ఓం ఈం ఈం నమః ఈ అయిదు బీజములు బిందువునందు వ్రాయవలెనని) తెలియుచున్నది.

అత్ర సమయమతానుసారేణ అగస్త్యకారికా:—

శ్లో. వృత్తే దృగ్బీజతారాన్నతిమనలపురే మూలమంత్రం ద్విపారే,
బీజాన్యంతర్దశారాదిషు వసుదళమధ్యే చ యాదీశ్చ కాదీన్,
టాదీన్ కాద్యష్టవర్గానథ నృపసదనేషు స్వరాన్ బిందుయుక్తా
న్మద్రావర్గాష్టవర్ణాన్తదుచితనిచయం విన్యసే ద్భూపురేషు.

దృగ్బీజం = ఓం, అనలపురేమూలమంత్రం = త్రికోణమునందు పంచదశిమంత్రకూటత్రయము, మిగతది స్పష్టముగా నున్నది.

ఈ శ్రీచక్రమందు బీజన్యాసమును గుఱించి ఈగ్రంథకర్తలును శ్రీచక్రోద్ధారమందు అకారాది క్షకారాంతవర్ణమయమయిన మాతృకయే ఆయా చక్రాకారమును పొందియున్నదని వెనుక వివరించినారు. ఇందువల్లను, ఇతరగ్రంథములవల్లను పరిశీలింపఁగా, పరస్పరభేదము అగుపడుచున్నది. బిందువునందు-(ఓం-ఈం-ఈం-నమః) ఈబీజపంచకము నిర్వివాదాంశము. కోణత్రయమందు బాలాబీజత్రయమని కొందఱు, పంచదశీకూటత్రయమని కొందఱు, అష్టకోణమందు యాది అష్టబీజము లని కొందఱు, అకారాద్యష్టవర్గ ప్రథమాక్షరములని కొందఱు, స్వర ములు పదియారును ద్వంద్వములుగా నుంచవలెనని కొందఱును ఇటుల అంతటను పరస్పరభేదములుగా చెప్పిరి. వీరి అందఱిమతమును సమ్మేళ నముచేసి నిర్ణయించినది యీ దిగువ వ్రాయఁబడుచున్నది.

## శ్రీచక్రమునకు కమలములకు నైక్యభావనము.



పు ౧. శ్రీచక్రము




పు ౫. అనాహతకమలము



పు ౨. సహస్రదళకమలము




పు ౬. మణిపూరకమలము




పు ౩. ఆజ్ఞాకమలము




పు ౭. స్వాధిష్ఠానకమలము




పు ౪. విశుద్ధకమలము




పు ౮. మూలాధారకమలము

బిందువునందు:—ఓం ఈం ఈం నమః,

కోణత్రయమునందు:—వామావర్తముగా ఐం-క్లీం సౌః,

అష్టకోణములందు:—సర్వత్రస్వాగ్రకోణ మారభ్య లేఖన క్రమము ప్రదక్షిణముగా అం-కం-చం-టం-తం-పం-యం-శం, ఈ అష్ట వర్గాదివర్ణములను వ్రాయవలయును.

అంతర్దశారమందు:—వామావర్తముగా కం-ఖం-గం-ఘుం-ఙం-చం-ఛం-జం-ఝం-ఞం ఇవి వ్రాయవలయును.

బహిర్దశారమందు:—స్వాగ్రకోణమునుంచి ప్రదక్షిణ క్రమముగా టం-ఠం-డం-ఢం-ణం-తం-థం-దం-ధం-నం ఈ పదియు వ్రాయవలయును.

చతుర్దశారమందు:—స్వాగ్రకోణమునుంచి వామావర్తముగా పం ఫం బం భం మం యం రం లం వం శం షం సం హం క్షం ఈ పదునాలుగు బీజములను వ్రాయవలయును.

అష్టదళమందు:—ప్రదక్షిణక్రమముగా అం - ఇం - ఉం-ఋం-ఌం-ఏం-ఓం-అం ఈ ఎనిమిది హ్రస్వస్వరములను వ్రాయవలయును.

షోడశదళములందు:—ప్రదక్షిణక్రమముగా అం-ఆం-ఇం-ఈం-ఉం-ఊం-ఋం-ౠం-ఌం-ౡం-ఏం-ఐం-ఓం-ఔం-అం-అః, ఈ పదియారు స్వరములను వ్రాయవలయును.

వృత్తత్రయమునకు పైని బాలాబీజత్రయము ఐం-క్లీం-సౌః. అను నీమూడు బీజములచే ప్రదక్షిణక్రమముగా చుట్టును వ్రాయవలయును.

అవరోహణక్రమములో:—ప్రథమభూపురమందు—స్వాగ్రము నుంచి దిక్కులందు విదిక్కులందును ముద్రాబీజత్రయము ద్రాం - ద్రీం - క్లీం బ్లూం-సః- హ్స్ఖ్ఫ్రేం-హ్స్రౌః-ఐం-ఈ బీజములను వ్రాయునది.

ద్వితీయ భూపురమందు:—బ్రాహ్మ్యాదులు, బ్రాహ్మీ మాతృకాయై నమః, ఏవం సర్వత్ర. తృతీయభూపురమందు—ప్రదక్షిణముగా అణిమాసిద్ధ్యై నమః, మహిమాసిద్ధ్యై నమః, ఏవం సర్వత్ర. ఈ క్రమమున శ్రీచక్రమునందుఁగల నవావరణలయందును బీజన్యాసముచేసిన

చక్రమును పూజించవలెను. ఈ లేఖనక్రమము నిర్వివాదము, అనేక సంప్రదాయములు కలదియు గాన నిస్సంశయము.

శ్లో. బీజాక్షరయుతం చక్రం యతీనాముత్తమోత్తమమ్,
బీజాక్షరవిహీనం తు గృహస్థానాం ప్రశస్యతే.

ఈ వచనమువలన గృహస్థులు శ్రీచక్రమం దాయా ఆవరణచక్రములం దాయాబీజములను భావించవలెనని అభిప్రాయము. కావున ఈ బీజ న్యాసక్రమము మాత్రము నాలుగాశ్రమములవారికిని తెలియవలసి యున్నది.

### అథ ఐక్యనిరూపణము.

ముందు శ్రీచక్రమందుఁగలకమలచక్రములకైక్యము—బైందవ యామలే పార్వతీంప్రతి శివేనోక్తమ్.—

శ్లో. చతుర్భిశ్శివచక్రైశ్చ శక్తిచక్రైశ్చ పంచభిః,
నవచక్రైస్తు సంసిద్ధం శ్రీచక్రం శివయోర్వపుః.
త్రికోణమష్టకోణం చ దశకోణద్వయం తథా,
చతుర్దశారం చైతాని శక్తిచక్రాణి పంచ వై.
బిందురష్టదళం పద్మం పద్మం షోడశపత్రకమ్,
చతురస్రం చ చత్వారి శివచక్రాణ్యనుక్రమాత్.

మేళనక్రమః:—

త్రికోణే బైందవం శ్లిష్టం అష్టారేఽష్టదళాంబుజమ్,
దశారయోష్షోడశారం భూపురం భువనాశ్రకే.
శైవానామపి శాక్తానాం చక్రాణాం చ పరస్పరమ్,
అవినాభావసంబంధం యో జానాతి స చక్రవిత్.
త్రికోణరూపిణీ శక్తిః బిందురూపశ్శివస్స్మృతః,
అవినాభావసంబంధస్తస్మాద్బిందుత్రికోణయోః.
ఏవంవిభాగమజ్ఞాత్వా శ్రీచక్రం యస్సమర్చయేత్,
న తత్ఫలమవాప్నోతి లలితాంబా న తుష్యతి.

ఈ ఐక్యమనునది ప్రధానైక్యము. ఏకవిధముగానున్నను సమయాచారమునందు—చతుర్విధైక్య పంచవిధైక్య షడ్విధైక్యానుసంధా

నమే అంతర్యాగక్రమమనియు, బాహ్యపూజాకలాపము ద్వైతప్రతి పాదకమనియు, అద్వైతసిద్ధాంతవిరోధముగాన అనుసంధానార్థమయి ఈచతుర్థైక్యాదులను సమయమతవేత్తలు వివరించిరి.

ఈవ్యాఖ్యానారంభమందుఁగల తురీయపాదమందు ప్రకాశ, విమర్శ, మిశ్ర, సంవిద్బిందువులనే నాలుగు చిద్బిందువులు పరిలేఖనమందు చూపింపఁబడినవి. ౯-౧౦ సూత్రముల ఉపన్యాసమునందు అవిద్యాపాద మందు పరదేవతా శరీరవృక్షము బిందుమయముగా పరిలేఖనము నిరూ పింపఁబడినది. విద్యాపాదమందు పరదేవత శరీరమందుగల మూలా ధారాది సహస్రారాంత కమలములు పరిలేఖనలతో చూపింపఁబడినవి. ఈ ఆనందపాదమందు సర్వానందమయబిందు ప్రధానమగు శ్రీచక్ర నిరూపణమయినది. ఇటుల బహుముఖములుగా చెప్పిన అంశములను ఏకముఖము చేయుటకొఱకు ఐక్యవివరము తెలియుట ఆవశ్యకమైనది.

ఇక విరాడ్రూపమగు పరదేవతాశరీరవృక్షమందుగల మూలా ధారాదికమలములకును, శ్రీచక్రమందుగల కోణచక్రములకును ఐక్యము చూపింపఁబడుచున్నది. ఇదియును ప్రకాశాంశ విమర్శాంశల మేళనము గానే యున్నది. తత్త్వవృక్షమందు నామరూపములనే రెండుశాఖ లేర్పడియున్నవి. అందు రూపము తత్త్వాత్మకము ప్రకాశాంశము; నామము పంచాశద్వర్ణాత్మక మాతృకామయము, శబ్దబ్రహ్మము, విమ ర్శాంశము గాన నీనామరూపములగు ప్రకాశవిమర్శాంశలకును నామ రూపములకును అవినాభావసంబంధము నిత్యయుతము.

మఱియు నీవృక్షమందున్న మూలాధారాదికమలములు పృథి వ్యాది తత్త్వాత్మకములుగాన, ఆతత్త్వములు ప్రకాశాంశలుగాన, నీ మూలాధారాదికమలములకును శ్రీచక్రగత త్రికోణాదిచక్రములు పశ్యంత్యాది మాతృకాశక్తిస్వరూపములుగాన, నీచక్రములు విమ ర్శాంశములుగా నున్నందున, మూలాధారాదికమలములకును శ్రీచక్ర గత త్రికోణాదిచక్రములకునుగల ఐక్యము ప్రకాశ విమర్శాంశల నైక్యముగానే యున్నది.

శ్లో. త్రికోణమష్టకోణం చ దశకోణద్వయం తథా,
మనుకోణం చతుష్కోణం కోణచక్రాణి షట్క్రమాత్.
మూలాధారం తథా స్వాధిష్ఠానం చ మణిపూరకం,
అనాహతం విశుద్ధాఖ్య మాజ్ఞాపద్మం విదుర్బుధాః.
తవాధారస్వరూపాణి కోణచక్రాణి పార్వతి!,
త్రికోణరూపిణీ శక్తిః బిందురూపశ్శివః స్మృతః.
అవినాభావసంబంధః తస్మాద్బిందుత్రికోణయోః.

తా. ఇదివఱకు శ్రీచక్రమందున్న ప్రకాశాంశలగు బింద్వాది కమలములకు విమర్శాంశలగు త్రికోణాదిచక్రములతో సామరస్యము చెప్పఁబడినది. ఇచట ప్రకాశాంశలగు మూలాధారాదికమలములకు శ్రీచక్రగతత్రికోణాదిచక్రములతో సామరస్యమును వివరించుచున్నారు.

శ్రీచక్రమధ్యగతబిందువు పరదేవతాసహస్రారాంతర్గత చంద్రమండలమం దంతర్భావము కలది. ఆజ్ఞాకమలమందు త్రికోణచక్రము కర్ణికగా నున్నది. విశుద్ధకమలమందు అష్టకోణము కర్ణికగా నున్నది. అనాహతకమలమందు అంతర్దశారము కర్ణికగా నున్నది. మణిపూరకమలమందు బహిర్దశారము కర్ణికగా నున్నది. స్వాధిష్ఠాన కమలమందు చతుర్దశారము కర్ణికగా నున్నది. మూలాధారకమలమందు భూపురము కర్ణికగా నున్నది.

ఇటులనే గ్రంథాదినున్న ప్రకాశ-విమర్శ-మిశ్రబిందువులు శారీర వృక్షమందు ఆత్మా-అవ్యక్త-మహత్తత్త్వములుగా నున్నవి. ఆశారీర వృక్షము మూలాధారాదిసహస్రారాంతకమలములం దంతర్భావము. శ్రీచక్రగత బింద్వాదికమలములు త్రికోణాదిచక్రములందంతర్భావము. శ్రీచక్రగతత్రికోణాదికోణచక్రములు మూలాధారాదికమలములం దంతర్భావము. సకలకోణచక్రములును త్రికోణచక్రమం దంతర్భావము. సకల కమలములును బిందువునం దంతర్భావము. ఆబిందువు త్రికోణ చక్రమం దంతర్భావమని భావింపవలయును.

౧. పరదేవతాశ్రీచక్రయో రైక్యం. ౨. శ్రీచక్రబ్రహ్మాండయో రైక్యం. 3. బ్రహ్మాండపిండాండయో రైక్యం. ౪. మాతృకాదేవతయో రైక్యం. ఇది చతుర్విధైక్యము.

౧ శ్రీచక్రము ౨ మాతృక ౩ పంచదశీవిద్య ౪ లలితాదేవత ౫ బ్రహ్మాండము ౬ పిండాండము. ఈ ఆఱును కార్యకారణధర్మమును, పరస్పర సంబంధమును, సమానధర్మములును కలిగియున్నవి గాన సాధకులు ఇందు దేనిని ఆద్యంతములుగా విచారించినను తక్కినవి అవే ధర్మములు గలవని తెలియుచున్నది గాన, నీ ఆరువస్తువులకు సామరస్యమును, ఏకత్వమును సంపాదించుటయే సమయమతమందు పరదేవతారాధన యనియు, నిదియే అంతర్యాగమనియు, షడ్విధైక్యమని స్వరూపవేత్తలు నిశ్చయించిరి.

ఈషడ్విధైక్యమును గౌడపాదాచార్యులవారు మఱియొక విధముగా నిర్దేశించిరి. సుభగోదయే:—

శ్లో. కలాయాం బిందైవైక్యం తదను చ తయోర్నాదవిభవే
తయోర్నాదేవైక్యం తదను చ కళాయామపి తయోః,
తయోర్బిందావైక్యం త్రితయవిభవైక్యం పరశివే
తదైవం షోఢైక్యం భవతి హి సపర్యా సమయినామ్.

ఈచతుర్విధైక్యషడ్విధైక్యముల పర్యవసాన మేమనిన; జగత్తును సాధకునిశరీరమును నామరూపములనే రెండు ధర్మములు కలవి. ఈ రెంటిచే నిండియున్నవి. ఈనామరూపములు బహువిధములుగానున్నందున ఇందు కార్యకారణభేదమును, జ్యేష్ఠ కనిష్ఠభావమును తెలుసుకొనుటకు శక్యముగాక, తన నిజరూపమును కూడ తెలుసుకొనుటకు శక్యము గాకపోవుటయే గాక తనయందును, జగత్తునందును ఈనామరూపములకన్న వేరొక వస్తువే లేనట్లు కూడ జనులకు భ్రాంతిని, నాస్తిక బుద్ధిని కలుగఁజేయుచున్నవి గాన నీనామరూపముల యథార్థమును విచారించవలసియున్నది.

### నామరూపములవిచారణ.

ఈ నామరూపములు రెండును వెనుకటి తత్త్వవృక్షమందు అవ్యక్తమనే మాయాశక్తియందు జనించిన రెండు శాఖలుగానుండి, పిండాండ బ్రహ్మాండముల వ్యాపించి నిండియున్నవి.

అందు రూపమును ముందు విచారింతము. ఈరూపము నేత్రేంద్రియముచే గ్రహింపఁబడుచున్నది. ఇది ఆదిని సూక్ష్మాకారము క్రమముగా స్థూలమయినది; కలాతత్త్వభువనాత్మకముగా నున్నది. కలయన పరమాణువు. తత్త్వమన ౩౬ తత్త్వములు. భువన ౧౪ భువనములు— రూపము నిండియున్నది. దీని ఉత్పత్తి ఎట్టిదనిన:—తత్త్వవృక్షకందస్థ సర్వోర్ధ్వబిందువు శివశక్తి మేళనమయిన నిర్గుణబ్రహ్మవస్తువు సృష్ట్యాదిగా నున్నది. బ్రహ్మాండావిర్భావకాలమందు నిస్తరంగసముద్రమం దలలు వలెను, ఆకాశమందు మేఘమువలెను, ఆ బ్రహ్మవస్తువునందు ఇచ్ఛాశక్త్యుదయంబయినపుడు ఆ పరమాత్మయొక్క పురోభాగమందు త్రిగుణాత్మకమయిన మాయాశక్తి అవ్యక్తనామము కలిగి త్రికోణాకారమగు రెండవబిందువుగా నావిర్భవించినది. అందు వ్యక్తమనే నామము గల మహత్తత్త్వము కలిగినది అం దహంకారము, అందు ఆకాశాది భూతములు క్రమక్రమముగా కలిగినవి. అందు వాయువువఱకు సూక్ష్మము; అగ్నినుంచి రూపము స్థూలమయినది. వానియం దనేక శాఖలు. వీని సమష్టి పరమాణువు; వానివలన ౩౬ తత్త్వములు భువనములు కలిగినవి.

తిరిగి లయకాలమందు క్రమముగా కార్యము కారణమందు లయమగుచున్నది. దిగువనున్న పరికరము అవ్యక్తమందును, అది బ్రహ్మమందును అడఁగును. ఇది రూపముయొక్క ఆద్యంతములు.

ఇక నామోత్పత్తి. వెనుకటి వృక్షమందుఁగల మాయాస్వరూపావ్యక్తము నాదస్వరూపము. ఈనాదము తత్త్వవృక్షమందున్న సర్వోర్ధ్వబిందు వికసనమువలన కలిగినది. శ్రోత్రేంద్రియముచే గ్రహణమగుచున్నది. ఈ నాదోత్పత్తికాలమందు మంద్రమధ్యమాది భేదమును, అకారాదిభేదమును లేనందున అవ్యక్త మనఁబడుచున్నది. అంతపర్యంతము సూక్ష్మము. అందువలన క్రమక్రమముగా అకారాది ఎనిమిది హ్రస్వస్వరములు కలిగినవి. ఆదిబిందువు శివశక్త్యాత్మకముగాన, అకారాది ప్రతిస్వరమును స్త్రీ పుం భావమును పొందినవి. అందువలన ప్రతిస్వరమును హ్రస్వము, దీర్ఘము అని రెండు రూపములను పొందినవి. హ్రస్వములు పుంభాగము. దీర్ఘములు స్త్రీ భాగములు. ఇట్లు

౧౪ స్వరములు కలిగినవి. ఆదిబిందువు నాదము విసర్గలుగాన నీ బిందు విసర్గలు కలసి ౧౬ స్వరము లయినవి. వానివలన కకారాది వ్యంజన ములు కలిగి ౫౦ వర్ణమయ మాతృక ఉత్పన్నమయినది. ఈ నామము వర్ణ, పద మంత్రములుగా వికసించి బ్రహ్మాండము పిండాండము నిండియున్నది.

శ్రు. సచ్చిత్సుఖాత్మకం బ్రహ్మ నామరూపాత్మకం జగత్.

ఈశ్రుతివలన పిండాండబ్రహ్మాండములందు సత్యాసత్యములనే బ్రహ్మవస్తువు మాయాభాగమును కలసియున్నట్లు స్పష్టమగుచున్నది. ఎట్లనిన: "సత్తామాత్రమగోచరః." ఈశ్రుతివలన బ్రహ్మవస్తువు సత్తామాత్రముగా నామరూపములను ఉపాధియందిమిడి ఉన్నదని తెలియుచున్నది గాన, నామరూపాత్మకమయిన జగత్తునందు చల నాదులు వృద్ధిక్షయములకు కారణవస్తువు బ్రహ్మభాగముగాను, అది సచ్చిదానందస్వరూపమనియు, అందులకుపాధి నామరూపములనియు, ఆ బ్రహ్మవస్తువు ఈయుపాధియందు లేనపుడు నామరూపములు మాయా స్వరూపములుగాన వ్యర్థములనియు, ఇట్లు సత్యాసత్యమేళన జగత్తని వ్యవహరింపఁబడుచున్నది. ఇందువలన ప్రత్యక్షముగా నున్న నామరూప ములు అసత్యభాగముగాను, సత్తారూపము అప్రత్యక్షము సత్యము గాను నున్నది.

ఈనామరూపములు మాయాస్వరూపమయిన అవ్యక్తమువలన కలిగినవి గాన, మాయాస్వరూపములుగానే యున్నవి. మాయాబీజము వలన కలిగిన వృక్షము మాయామయముగనే యుండును. అందు కలి గిన బీజములును మాయాబీజములుగనే యుండును గాని నిజములు కానేరవు.

సకలోపనిషత్తులందును పరాశక్తిని సచ్చిదానందస్వరూపిణినిగా వర్ణించుచుండఁగా, ఇచట అవ్యక్తరూపమూలప్రకృతిని మాయా స్వరూపమని చెప్పుట యుక్తమా యనిన;

శ్రు. ద్వే విద్యే వేదితవ్యే ఇతి హస్మ యద్బ్రహ్మవిదో వదంతి, పరా చైవాపరా చ.

తత్త్వవృక్షమందుఁ గల ప్రథమబిందువునందు సదాశివతత్త్వముతో మేళనముగా బ్రహ్మశక్తిస్వరూపిణి యగు పరాశక్తి సచ్చిదానందస్వరూపిణియై సర్వతత్త్వాతీక్రాంతగా నున్నది. ఇది శక్తియొక్క ఆదిరూపము.

ఇక రెండవది. జగత్ప్రవృత్తికొఱకు ఆవిర్భవించిన త్రికోణాకారమయిన మాయాస్వరూప అవ్యక్తమనే మూలప్రకృతిగా నున్నది గాన పరా అనియు, అపరా అనియు, బ్రహ్మశక్తి అనియు, మాయాశక్తులనియు, రెండు నామములు కలిగియున్నారు.

శ్రు. ఏకధా బహుధా చైవ దృశ్యతే జలచంద్రవదితి,
మాయైషా తస్య దేవస్య యయా సమ్మోహితః స్వయం.
శ్లో. యథా మాయామయాద్బీజాజ్జాయతే తన్మయోఽంకురః,
నాసౌ నిత్యో న చోచ్ఛేదీ తద్వద్ధర్మేషు యోజనా.

తా. జగత్తునందున్న నామరూపము లిట్టివని తెలుసుకుని, నామరూపాత్మకమయిన జగత్తును మిథ్యగాఁ దలఁచుచు, అందుఁగల సచ్చిదానంద వస్తువును బ్రహ్మస్వరూపముగా భావించవలెను. ఇదియే సకల నిగమాగమములచేతను, బ్రహ్మవేత్తలచేతను, ప్రతిపాదితమయిన రహస్యముగా నున్నది. ఇదియే నీవిచారణ పర్యవసానము.

**శ్రీచక్ర బ్రహ్మాండ పిండాండముల కైక్యము.**

**శారీరకమీమాంసే:—**

శ్లో. త్వగసృఙ్మాంసమేదోఽస్థిధాతవశ్శక్తిమూలకాః,
మజ్జాశుక్లప్రాణ జీవధాతవశ్శివమూలకాః.
నవధాతుమయో దేహో నవయోనిసముద్భవః,
దశమీధాతురేకైవ పరాశక్తిస్తదీశ్వరీ.
ఏవం పిండాండముత్పన్నం తద్వద్బ్రహ్మాండముద్భవౌ,
పంచభూతాని శాక్తాని మాయాదీని శివస్య తు.
మాయా చ శుద్ధవిద్యా చ మహేశ్వరసదాశివౌ,
పంచవింశతితత్త్వాని తత్రైవాంతర్భవంతి వా,
శివశక్త్యాత్మకం విద్ధి జగదేతచ్చరాచర మితి.

### ప్రకారాంతరైక్యము.

శ్లో. పిండబ్రహ్మాండయోరైక్యం లింగసూత్రాత్మనోరపి,
స్వాపావ్యాకృతయోరైక్యం క్షేత్రజ్ఞపరమాత్మనోః.

అయమర్థః—పిండబ్రహ్మాండయోరైక్యం జ్ఞాతవ్యం. తతః లింగాత్మసూత్రాత్మనోరైక్యం, లింగం నామ శరీరం:—మన ఆది ఏకాదశేంద్రియగణః, సూక్ష్మభూతపంచకం తన్మాత్రాణి, ఏవం షోడశకం లింగశరీరమితి. సూత్రాత్మా నామ పిండాండావచ్ఛిన్నో వాయుః లింగశరీరస్య అర్చిరాదిమార్గప్రాపకః తయో రైక్య మవగంతవ్యం. స్వాపావ్యాకృతయోః, స్వాపః సుషుప్త్యవస్థాపన్న స్సాక్షీ ప్రాజ్ఞ ఇత్యుచ్యతే, అవ్యాకృతః, అవిద్యాశబలితం బ్రహ్మ తయో రైక్యం భావ్యం. క్షేత్రజ్ఞపరమాత్మనోః, క్షేత్రజ్ఞో జీవః, పరమాత్మా బ్రహ్మస్వరూపం, తయో రైక్యం భావ్యం. ఏతచ్చ మహావాక్యార్థే విస్తరితమ్.

### స్థూల సూక్ష్మ సూక్ష్మతరచక్రమేళనము.

తత్రాదౌ స్థూలచక్రనిరూపణం. యోగినీహృదయే:—

అకులే విషుసంజ్ఞే చ శక్తౌ వహ్నౌ తథా పునః,
నాభావనాహతే శుద్ధౌ లంబికాగ్రే భ్రువోఽంతరేతి.

తా. మూలాధారాదిసహస్రారాంతకమలములందు శ్రీచక్రమందుఁగల అష్టచక్రమేళనము స్థూలచక్రమేళన మనఁబడును. విశుద్ధకర్ణికలంబికయును దశారద్వయము ఏకచక్రముగను భావించినపుడు "అష్టచక్రా నవద్వారా" అనేశ్రుతి శరీరచక్రములకు సమానముగా వర్తించుచున్నది. ఇది స్థూలచక్రభావన యనఁబడును.

### సూక్ష్మచక్రభావన.

శ్లో. ఇందౌ తదర్ధే రోధిన్యాం నాదనాదాంత ఏవ చ,
శక్తౌ పునర్వ్యాపికాయాం సమనోన్మనగోచరే,
మహాబిందౌ పునశ్చైవ త్రిధా చక్రం విభావయేత్.

తా. సాధకుని భ్రూమధ్యమునుంచి సహస్రారమధ్యపఱకును ఈ సంజ్ఞలుగల చక్రము లున్నవి. ఆరోహణ క్రమమున ౧ చంద్రమండలము, ౨ అర్ధచంద్రాకారము, ౩ రోధిని, ౪ నాదము, ౫ నాదాం

తము, ౬ శక్తి, ౭ వ్యాపిక, ౮ సమనా, ౯ ఉన్మనా ఈ తొమ్మిదియు శరీరమందు సూక్ష్మకమలములుగా నున్నవి. వీనియందు శ్రీచక్రగత భూపురాదిగా బింద్వంతముగల నవచక్రముల కైక్యము భావించవలెను. ఇది సూక్ష్మచక్రభావన. సహస్రారాంతర్గతచంద్రమండలమునందు, నవచక్రసహిత శ్రీచక్రభావన సూక్ష్మతరచక్రభావన యనఁబడును. ఇటుల శ్రీచక్రమును శరీరమందు ఈమూడువిధములుగా భావించవలెను.

**సూక్ష్మచక్రస్వరూపము.**

శ్లో. ఆజ్ఞాంతం సకలా ప్రోక్తం తతస్సకలనిష్కళం,
ఉన్మన్యంతం పరేస్థానే నిష్కలం చ తథా స్థితం.
దీపాకారార్ధమాత్రశ్చ లలాటవృత్త ఇష్యతే,
అర్ధమాత్రస్తదాకారః పాదమాత్రస్తదూర్ధ్వతః.
జ్యోత్స్నాకారో తదర్ధాంశో రోధినీ త్ర్యస్రవిగ్రహా,
బిందుద్వయాంతరాళస్థో సేవరూపో మణిప్రభః.
కలాంశో ద్విగుణాంశశ్చ నాదాంతో విద్యుదుజ్జ్వలః,
హలాకారస్తు సవ్యస్తబిందుయుక్తో విరాజతే.
శక్తిర్వామస్తబిందూద్యత్సిరాకారా తథాపునః,
వ్యాపికాబిందువిలసత్త్రికోణాకారతాం గతా.
బిందుద్వయాంతరాళస్థ రుజురేఖామయీ పునః,
సమనా బిందువిలసదృజురేఖా తథోన్మనీ.
శక్త్యాదీనాం వపుస్ఫూర్జద్ద్వాదశాదిత్యసన్నిభం,
చతుష్షష్టిస్తదూర్ధ్వం తద్ద్విగుణం ద్విగుణం తతః.
శక్త్యాదీనాం తు మాత్రాంశో మనోన్మన్యాస్తథోన్మనీ.
దేశకాలానవచ్ఛిన్నం తదూర్ధ్వం పరమం మహత్,
నిసర్గసుందరం తత్తు పరానందవిఘూర్ణితమ్.

ఇటుల శ్రీచక్రమును సాధకశరీరమందు త్రిధాగా భావించినపుడు జీవన్ముక్తుఁడగును.

**శ్రీచక్రప్రతిపాదకశ్రుతయః.**

శ్రు. అష్టాచక్రా నవద్వారా దేవానాం పూరయోధ్యా,
తస్యాగ్ం హిరణ్మయః కోశః స్వర్గో లోకో జ్యోతిషా వృతఇతి.

త్మము. అష్టాచక్రా=బింద్వాది భూపురాంతము దశారయుగ్మము ఏకచక్రముగాన ఎనిమిది చక్రములును, నవద్వారా = నవకోణములును కలిగి, దేవానాంపూః = కామేశ్వర్యాది సకలావరణదేవతలకు నివాస స్థానము బ్రహ్మ-విష్ణు-రుద్ర, ఈశ్వరసదాశివులకును స్థానము చంద్రాగ్ని సూర్యులు మండలములుగా నున్నందున వారికిని స్థానమని, అయోధ్యా = భాగ్యహీనులకు లభ్యముకానిది అగమ్యమును, తస్యాగ్ం హిరణ్మయః కోశః = ఈచక్రమధ్యనున్న బిందువు జ్యోతిర్మయకోశ ముగా నున్నదని, స్వర్గోలోకో జ్యోతిషావృతః = ఈ బిందుతత్త్వము స్వర్గలోకము తేజోమయమని తాత్పర్యము.

ఈ శ్రుతి సాధకజనశరీరపరమునందును వర్తించుచున్నది. మూలా ధారాది సహస్రారాంత కమలములు ౭ ను, లంబికాగ్రమందొక కమల మును కలసి ఎనిమిది చక్రములు గలది. నవద్వారములు శ్రోత్రనాసా దులు కలది. ఇంద్రియపాలకులగు మిత్రవరుణాది దేవతలకు స్థానము. అవిద్యాగ్రస్తులకు అంతర్ముఖత్వమునకు అసాధ్యము. సహస్రార కమ లాంతర్గత చంద్రమండలము తేజోమయము. ఆజ్ఞాచక్రోపరిసహస్రా రాంతము జ్యోత్స్నాలోకము గాన స్వర్గలోకము. ఇట్లు ఈ శ్రుతి శ్రీచక్రపరముగను, శరీరపరముగను కూడ వర్తించుచున్నది గాన సాధకజనశరీరములకును, శ్రీచక్రమునకును, ఈషద్భేదమును లేదని తెలియుచున్నది.

శ్రు. పుత్రో నిర్‌ఋత్యా వై దేహః, అచేతా యశ్చ చేతనః, స తం మణి మవిందత్, సోఽగ్రీవః ప్రత్యముంచత్. సోఽజిహ్వో అసజ్జత ఇతి. అ. ఋచోయమర్థః, పుత్రోనిర్‌ఋత్యా వై దేహః = లక్ష్మీపుత్రుం డయిన మన్మథుండు, అచేతాయశ్చచేతనః = ఏ హేతువుచేత శరీరము లేనివాండో అందువలననే మనస్సును లేనివాండు. ఈవాక్యము ఈశ్వర పరముగను వర్తించును. సతం మణి మవిందత్, అంధోమణి మవిందత్ = శరీరము లేనివాండు గాన అంధుండయిన ఆ మన్మథుండు సకలనిగమాగమ ప్రసిద్ధమయిన శ్రీవిద్యారూప పంచదశాక్షరీ విద్యారత్నమును వేదము నుంచి కనిపెట్టినాండు. నేత్రములున్నవాండు వస్తువులు చూచుట ప్రసిద్ధము. ఇచట అప్రసిద్ధమయినను దేవతానుగ్రహరూప భాగ్యసూచ

నగా నున్నది. సో౽గ్రీవః ప్రత్యముంచత్ =మణి సంభవించినప్పుడు కంఠ మందు ధరించుట ఫలము లోకధర్మము. అట్లే అతఁడును కంఠము లేనివాఁడై నను ఆవిద్యారత్నమును కంఠమందు ధరించెను. సో౽జిహ్వోఅసజ్జత = అజిహ్వుఁడయిన అతఁడు ఉపాసించి చంద్రకలాస్వాదన చేసెదనని అందువలన నీవిద్యాభేదములలో ఒక మంత్రమునకు మన్మథఋషిగా ప్రసిద్ధి గలదు.

శ్రు. నైతమృషిం విదిత్వా నగరం ప్రవిశేత్, యది వా ప్రవిశేత్, మిథో చరిత్వా ప్రవిశేత్, తత్సంభవస్య వ్రతం.

అర్థము. సాధకులు శ్రీచక్రమును తమ శరీరమందుఁగల కమల ములతో ఐక్యముగ భావించి సహస్రారాంతర్గతబిందుస్థానమందు మనో లయానుసంధానము చేయుట ఫలితముగా నున్నందున, బ్రహ్మ అట్టి అనుసంధానకాలమందు ఋషిన్యాసాదికమును జపసంఖ్యాదులును లేవని ఈశ్రుతి చెప్పుచున్నది. ఆకాలమందు ఋష్యాదిజ్ఞానము వినాగానే శ్రీచక్రమందు ప్రవేశించవలెను. యదివా ప్రవిశేత్ = ఆ అను సంధానకాలమందు, మిథో చరిత్వా ప్రవిశేత్ = శివశక్త్యాత్మకమైన హంసద్వంద్వసామరస్యమును కనిపెట్టి అందు ప్రవేశించవలెను. ఏత త్సంభవస్య వ్రతం = ఇది మన్మథవ్రతము. మన్మథుఁడును స్త్రీ పురుష ద్వంద్వసామరస్యమును కనిపెట్టి అందు ప్రవేశించుచున్నాఁడు గాన ఆసామ్యముచే మన్మథవ్రతమని చెప్పిరి.

అనంగఃపూర్వం విద్యారత్నం పంచాశద్వర్ణాత్మకం షోడశనిత్యాత్మకం షోడశకలాత్మకం నానావేదేషు నానాస్మృతిషు నానాపురాణేషు నానావిధాగమేషు విప్రకీర్ణం దృష్టవాన్. పంచాశద్వర్ణాన్ త్రేధా విభజ్య ఖండత్రయం కృత్వా త్రిపురసుందర్యాః షోడశనిత్యాం తత్రాంతర్భావ్య ప్రతిపదాది పంచదశతిథీః పంచదశస్వరరూపకలాసు పంచదశ నిత్యానంతర్భావ్య షోడశీరూపమహానిత్యా ధ్రువకలాం బిందావంతర్భావ్య పంచాశద్వర్ణాత్మకం మాతృకాచక్రం ఖండత్రయం కృత్వా సోమ సూర్యానలాత్మకతయా, బ్రహ్మవిష్ణుమహేశ్వరాత్మకతయా, సత్వరజస్తమస్తత్త్వ వ్యవస్థితతయా, జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థాపన్నతయా, సృష్టి స్థితిప్రలయభూతతయా నిశ్చిత్య, శ్రీవిద్యాత్మకే తురీయేపంచదశకలానా

మంతర్భావం విభావ్య, భువనేశ్వరీప్రభృతీనాం నవానాం యోగినీ విద్యానాం త్రికస్యైకైకహ్రీంకారేణాంతర్భావ మంగీకృత్య సర్వ భూతాత్మకం, సర్వమంత్రాత్మకం, సర్వతత్త్వాత్మకం, సర్వవేదాత్మకం, సర్వశబ్దాత్మకం, సర్వశక్త్యాత్మకం, త్రిగుణాత్మకం, త్రిఖండం, త్రిగుణా తీతం, సాదాఖ్యాయాః పరస్యా అయం పంచవింశం శివశక్తిసంపుటా త్మకం హంసద్వంద్వం నిశ్చిత్య, వర్ణపంచదశకేన మూలవిద్యా మసే వ్యత్. తదనంతరసూత్రితం మంత్రరాజం గ్రీవాయాం ధృతవాన్. తదనంతరం చంద్రకలాస్వాదనం కృతవానితి. సమన్మథోఽస్య మంత్రస్య ఋషిరిత్యర్థః.

అనంగశబ్దశ్శివపరత్వాచ్చాస్యాః కాదివిద్యాయాశ్శివరూపదక్షి ణామూర్తిఋషిత్వం లోకే ప్రసిద్ధం, వైదేహీ జనయామాసేతి శ్రుతౌ స్పష్టం.

**రుద్రయామళే విశేషః—**

శ్లో. పృశ్నయో నామ మునయస్సర్వే చక్రసమాశ్రయాః,
సేవ్యమానాశ్చక్రవిద్యాం దేవగంధర్వపూజితాం.
అగ్నిషోమాత్మకం చక్ర మగ్నిషోమమయం జగత్,
అగ్నావంతర్బభౌ భాను రగ్నిషోమమయం స్మృతమ్.
త్రిఖండం మాతృకాచక్రం సోమసూర్యానలాత్మకం,
త్రికోణం బైందవం సౌమ్య మష్టకోణం చ మిశ్రకమ్.
చతుర్దశారం వహ్నేస్తు చతురస్రం చ భానుమత్,
ఏతత్ప్రసాదాదింద్రాద్యా వసవోఽష్టౌ మరుద్గణాః.
యేయే సమృద్ధా లోకేఽస్మిన్ త్రిపురాచక్రసేవకాః,
పురత్రయం చ చక్రస్య సోమసూర్యానలాత్మకం.
మహాలక్ష్మ్యాః పురం చక్రం తత్రైవాస్తే తయా శివ. ఇతి.
ఇమమేవార్థం శ్రుతిరప్యాహ:—

అరుణోపనిషన్నామారుణాయా భగవత్యాః ప్రతిపాదికా ఉప నిషత్, అరుణామేవ ప్రతిపాదయతి. ఇదమర్థం దృష్ట్వా నరుణకేతు ర్నామ ఋషిః.

శ్రు. ఇమానుకం భువనా సీషధేమ, ఇంద్రశ్చ విశ్వే చ దేవాః,
యజ్ఞం న స్తన్వం చ ప్రజాం చ, ఆదిత్యైరింద్రస్సహసీషధాతు.

అర్థస్తు. ఇమానుకం భువనా సీషధేమ=పృశ్నిర్యోనామమునయః పరస్పరం సంగిరంతే, ఇమాం=చక్రవిద్యాం, నుకం=వితర్కే, భువనా=భువనాని, సీషధేమ=అవగచ్ఛామ. ఇమాం చక్రవిద్యా ముపాశ్రిత్యైవ భువనాన్యవతిష్ఠంత ఇతి వితర్కయామ ఇత్యర్థః. ఇంద్రశ్చ విశ్వేచ దేవాః= ఇంద్రవిశ్వేదేవాదయశ్చచక్రవిద్యాముపాశ్రిత్యైవ వసత ఇతి. యజ్ఞంచ న స్తన్వంచ ప్రజాంచ, ఆదిత్యై రింద్ర స్సహసీషధాతు, యజ్ఞం=అగ్నిషోమాదికం, నః=అస్మాకం, తన్వం=తనూం శరీరార్థం పత్నీమితి యావత్, ప్రజాం=సంతానం, చకారాత్ సర్వాస్సంపదః, ఆదిత్యైః=మరుద్గణైస్సహ, ఇంద్రః = చక్రవిద్యోపాసనా త్ప్రాప్తపరమైశ్వర్యః, ఇంద్రః = చక్రవిద్యా మస్మాక ముపదిశ్య, సిషధాతు = సంపాదితవాన్.

ఆదిత్యై రింద్ర స్సగణో మరుద్భిః, అస్మాకం భూత్వవితా తనూనాం,
మంత్రద్వయస్యాయమర్థః పుత్త్రమిత్రకళత్త్రాదీనాం రక్షకః భవత్వితి.
ఇంద్రఏవాస్మాకం యోగక్షేమసంపాదక ఇతి.

శ్రుత్యంతరం. అగ్ని మిచ్ఛధ్వం భారతాః రాజ్ఞ సోమస్య తృప్తాసః, సూర్యేణ సయుజోషసః. అర్థః. పృశ్నయశ్చక్రవిద్యానుష్ఠానే త్వరమాణాః పరస్పరం సంగిరంతే, హేభారతాః - భాయాం = భారూపిణ్యాం జ్యోతిరూపాయాం చక్రవిద్యాయామితి యావత్, రతాః = ఉపాసనరతాః, ఉత్తిష్ఠ=ఉపాసనోపక్రమంకురుత, మాస్వప్త=అప్రమత్తా భవత, అగ్నిమిచ్ఛధ్వం = స్వాధిష్ఠానగతాగ్నింప్రజ్వలయత, రాజ్ఞ స్సోమస్య=ఉమయా సహితస్సోమః. చంద్రమండలాంతర్గత బైందవస్థాన గతత్వాత్ = దేవ్యాః చంద్రస్య సోమశబ్దవాచ్యత్వసిద్ధిః. తస్య = చంద్రస్య, నిష్యందైః, తృప్తాసః = తృప్తాః, సూర్యేణ=అనాహత విశుద్ధ మధ్యగతసూర్యేణ సయుజా; చంద్రాగ్న్యోర్మధ్యవర్తినేత్యర్థః. ఉషసః= ఉషః కాలే; తస్మి న్కాల ఏవ భగవతీ నిదిధ్యాసనాదే ర్విహితత్వాదిత్యర్థః.

శ్రు. ఆప్లవస్వ ప్లప్లవస్వ ఆండీభవజమా ముహుః, సుఖాదీం దుఃఖనిధనాం ప్రతిముంచస్వ స్వాం పురం.

అర్థః. పృశ్నయశ్చక్రవిద్యాం స్తువంతి, అప్లవస్వ = ఆపాద మస్తకం ప్లవనం, అమృతనిష్యందసేచనం కురు, ప్రప్లవస్వ = ప్రకర్షేణ ప్లవనం ద్విసప్తతిసహస్రనాడీమార్గేవా సేచనం కురు, ఆండీభవజమా ముహుః—ఆండీ=పిండాండం బ్రహ్మాండంచ, భవ = పిండాండరూపేణా స్మదీయేన బ్రహ్మాండరూపేణ బాహ్యేన భవదీయేన, ప్రాప్నుహి = భవత్సాయుజ్యం దేహీత్యర్థః. సుఖాదీం దుఃఖనిధనాం—సుఖాదీం=సుఖ ప్రథమాం-సుఖాత్మికాం, దుఃఖనిధనాం = దుఃఖస్య నిధనో నాశో యత్ర దుఃఖనిధనాం, అవిజ్ఞాతదుఃఖగంధా మిత్యర్థః. ప్రతిముంచస్వ స్వాం పురం - స్వాం = భగవతీం, పురం=బిందుమండలం; శ్రీచక్రరూపాం వా, ప్రతిముంచస్వ=అధితిష్ఠస్వ ప్రాపయేత్యర్థః.

ఏతాదృశానేకశ్రుతిస్మృతిప్రసిద్ధబ్రహ్మవిద్యాస్వరూప శ్రీవిద్యాం కేచన బ్రాహ్మణా అపి కౌలమార్గరతాః. అవిజ్ఞాతశ్రుత్యర్థాః. తాంత్రిక మితి వదంతః ముహ్యంతి.

శ్లో. శ్రుతితాత్పర్యమఖిలమబుద్ధ్వా భ్రామ్యతే జడః,
వివేకీ త్వఖిలం బుద్ధ్వా తిష్ఠత్యానందవారిధౌ.
అఖిలం బుధ్వా ఇత్యనేన కాండద్వయమితి నిష్కర్షః.

**శ్రీదేవ్యాః పాదారవిందమహిమా.**

శ్రు. మరీచయస్స్వాయంభువాయేశరీరాణ్యకల్పయన్, మాచతే ఖ్యాస్మతీరిషత్. అర్థః. యే మయూఖాః=షష్ట్యుత్తరత్రిశతసంఖ్యాకాః, శరీరాణి కాలాత్మకాని షష్ట్యుత్తరత్రిశతసంఖ్యాకాని ౩౬౦ దినాని తాన్యేవ సంవత్సరః, సంవత్సరో వై ప్రజాపతిరితి శ్రుతేః, తే దేహం కల్పయంతు తే మరీచయః తే భగవత్యా దేహం కల్పయంతు = దేహ మాశ్రయంతు, దేహశబ్దేన దేహావయవశ్చరణ ఉచ్యతే, శ్రీదేవ్యా శ్చరణోత్పన్నా ఇత్యర్థః. మాచతేఖ్యాస్మతీరిషత్. తేతవ ఖ్యాతిః జ్ఞానం మాచతీరిషత్, అస్మా న్నజహాతు, భవద్విషయకం జ్ఞాన మస్మాకం సిధ్య త్విత్యర్థః.

### ౩౬౦-షష్ట్యుత్తర త్రిశతకళలు.

శ్రు. లోకస్య ద్వార మర్చిమ త్పవిత్రం జ్యోతిష్మ ద్భ్రాజమానం మహస్వత్, అమృతస్య ధారా బహుధా దోహమానం చరణం నో లోకే సుధితాం దధాతు.

అర్థః. లోకస్య = స్వనివాసస్థానస్య సాయుజ్యస్య వా బ్రహ్మ లోకాదేర్వా, ద్వారం ద్వారభూతం తత్ప్రాపక మిత్యర్థః. అర్చి మత్=అర్చీంషి మయూఖాః అస్య సంతీతి అర్చిమత్, పవిత్రం. కిరణాః స్వయ మతిశుద్ధం. జ్యోతిష్మత్ = చంద్రకలాస్వరూపం, మహస్వత్. సూర్యకలాయుక్తం, భ్రాజమానం=ప్రకాశమానం, అమృతస్య ధారా= సుధాప్రవాహాన్, బహుధా=బహుప్రకారేణ, ద్విసప్తతిసహస్రనాడీ మార్గేషు, దోహమానం = కిరత్ చంద్రమండల గళత్సుధాధారా ప్రవాహాన్ స్వనిర్ణేజనపవిత్రితాన్ వర్షతీత్యర్థః. చరణం = చరణశబ్దో నపుంసకః. ని. "పదంఘ్రిశ్చరణోఽస్త్రియా" మిత్యమరః. పరాశక్తేః పాదారవిందం, అస్మాక=సాధకాన్, సుధితాన్ = తృప్తాన్; సంజాతబుద్ధి ప్రకాశకాన్వా, సుధియః కృత్వా దధాతు పుష్ణాతు.

అత్రార్చిష్మజ్జ్యోతిష్మన్మహస్వచ్ఛబ్దా అగ్ని చంద్ర సౌరకలా రూపాః. యథా.

అర్చిష్మదిత్యనేనాగ్నేయాన్యర్చీంషి అష్టోత్తరశతం కథ్యంతే.౧౦౮

జ్యోతిష్మదిత్యనేన చాంద్రీకలాః షట్త్రింశదుత్తరశతం. ౧౩౬ జ్యోతీంషి నిర్దిశ్యంతే.

మహస్వదిత్యనేన సౌరకలా షోడశోత్తరశతం. ౧౧౬. మహాంసి కిరణాస్సంగృహ్యంతే.

సమష్ట్యా షష్ట్యుత్తరత్రిశతసంఖ్యాకైర్మయూఖైః. ౩౬౦. చం ద్రాగ్నిసౌరమండలాకారేణ వ్యాప్య బ్రహ్మాండపిండాండౌ భాతీత్యర్థః. తే కిరణాః తావత్సంఖ్యాదినై ర్దినరూపైః సంవత్సరనామక ప్రజాపతి రాసీత్. తదుక్తం. మరీచయస్స్వాయంభువా ఇతి, పూర్వశ్రుత్యా వివృతం.

తదుక్తం వసిష్ఠసంహితాయాం:—

శ్లో. పావకస్యార్చిషా భానోర్జ్యోతిషా మహసా విధోః,
దోహమానా స్సుధాధారా ద్విసప్తతి సహస్రధా।
గుప్తాచారా కుండలినీ తృప్తా నస్మాన్తనోతు సేతి.

కించ. బైందవయామలే చంద్రజ్ఞానవిద్యాయాం గౌరీం ప్రతి శివేనోక్తం:—

శ్లో. సాధుసాధు మహాభాగే పృష్టం త్రైలోక్యసుందరి,
గుహ్యాద్గుహ్యతమం జ్ఞానం న కుత్రాపి ప్రకాశితం.
కళావిద్యా పరాశక్తేః శ్రీచక్రాకారరూపిణీ,
తన్మధ్యే బైందవం స్థానం తత్రాస్తే పరమేశ్వరీ.
సదాశివేన సంపృక్తా సర్వతత్త్వాతిగా సతీ,
చక్రం త్రిపురసుందర్యాః బ్రహ్మాండాకారమీశ్వరీ,
పంచభూతాత్మకం చైవ పంచతన్మాత్రమేవ చ,
ఇంద్రియాత్మకమేవం చ మనస్తత్త్వాత్మకం తథా.
మాయాదితత్త్వరూపం చ తత్త్వాతీతం చ బైందవం,
బైందవే జగదుత్పత్తిస్థితిసంహారకారిణి.
సదాశివేన సంపృక్తా తత్త్వాతీతా మహేశ్వరీ,
జ్యోతిరూపాపరాకారా యస్యా దేహోద్భవాశ్శివే.
కిరణాశ్చ సహస్రం చ ద్విసహస్రం చ లక్షకం,
కోటి రర్బుద మేతేషాం తథా సంఖ్యా న విద్యతే.
తామేవానుప్రవిశ్యైవ భాతి లోకం చరాచరం,
యస్యా దేవ్యా మహేశాన్యా భాసా సర్వం విభాసతే.
తద్భాసా రహితం కించి న్నచ యచ్చ ప్రకాశతే,
తస్యాశ్చ శివశక్తేశ్చ చిద్రూపాయాశ్చితిం వినా.
అంధ మాపద్యతే సర్వం జగదేతచ్చరాచరం,
తేషా మనంతకోటీనాం మయూఖానాం మహేశ్వరీ.
మధ్యే షష్ట్యుత్తరం చైవ త్రిశతం కిరణాశ్శివే,
బ్రహ్మాండం వ్యశ్నువానాస్తే సోమసూర్యానలాత్మనా.
అగ్నేరష్టోత్తరశతం షోడశోత్తరశతం రవేః,
షట్త్రింశదుత్తరశతం చంద్రస్య కిరణాశ్శివే.

బ్రహ్మాండం భాసయంతస్తే పిండాండమపి శాంకరి,
దివా సూర్యస్తథా రాత్రౌ సోమో వహ్నిశ్చ సంధ్యయోః.
ప్రకాశయంతః కాలాంస్తే తస్మాత్కాలాత్మకాస్త్రయః,
షష్ట్యుత్తరం తు త్రిశతం దినాన్యేకం తు హాయనం.
హాయనాత్మా మహాదేవః ప్రజాపతి రుదీరితః,
ప్రజాపతి ర్లోకకర్తా మరీచిప్రముఖాన్ మునీన్.
ససర్జ లోకపాలాన్వై తే సర్వే లోకరక్షకాః,
సంహారశ్చ హరాయత్త ముత్పత్తి ర్భవనిర్మితా.
రక్షా తు మృడసంలగ్నా సృష్టిస్థితిలయే శివః,
నియుక్తః పరమేశాన్యా జగదేతత్ప్రివర్తతేతి.

**గ్రంథిత్రయవిభాగము స్పష్టము.**

గ్రంథిర్నామ సత్యాసత్య వస్తుద్వయస్య అభేద్యం యథా, అన్యోన్యతాదాత్మ్యాపన్నత్వం గ్రంథిః. ధియం స్వప్రకాశవిమర్శశక్తిం గ్రథతి మాయారూపేణాచ్ఛాద్య గృహ్ణాతీతి గ్రంథిః.

**బ్రహ్మగ్రంథిర్నామ:—**

స్వాధిష్ఠానమణిపూరయో ర్మధ్యే వాగ్భవమాయాబీజస్థానే సర్వాధిష్ఠానరూప చిదాత్మానం అవిద్యారూపేణావృత్య జీవభావ మాపాద్య అన్నమయకోశ స్థూలదేహాభిమానీ జాగ్రదవస్థాపన్నవిశ్వ నామకో జీవః. సత్యరూపరజ్జౌ రజ్జుజ్ఞానం నిరస్య, సర్పజ్ఞానవత్ జగత స్సత్యత్వ మాపాదయన్, బింబప్రతిబింబోభయాభావకలుష సత్వతమః ప్రధాన ప్రకృతిరూపజీవ బ్రహ్మణో రన్యోన్యాధ్యాసః, బ్రహ్మగ్రంధి పదేనోచ్యతే.

**విష్ణుగ్రంథిర్నామ:—**

అనాహత విశుద్ధకమలయోర్మధ్యే, కామరాజమాయాబీజస్థానే, ప్రాణమయ మనోమయ కోశద్వయరూపతేజోమయ సూక్ష్మశరీరాభి మానీ స్వప్నావస్థాపన్నతైజసనామకో జీవః, మిథ్యాప్రపంచానుభవః, కలుషరజః ప్రధానప్రకృతిః, భావాభావరూపప్రతిబింబసదృశః జీవ బ్రహ్మణో రన్యోన్యతాదాత్మ్యాధ్యాసః, విష్ణుగ్రంథిపదేనోచ్యతే.

**రుద్రగ్రంథిర్నామ:—**

ఆజ్ఞాకమలోపరిశక్తిమాయాబీజస్థానే, విజ్ఞానమయ ఆనందమయ

కోశద్వయరూపసుషుప్త్యవస్థాపన్నప్రాజ్ఞనామకో జీవః, ప్రతిబింబానందభుక్కలుష సత్వప్రధానప్రకృతికః, స్పష్టప్రతిబింబసదృశః జీవబ్రహ్మణో రన్యోన్యాధ్యాసః, రుద్రగ్రంథిపదేనోచ్యతే.

**తదపవాదః.**

**ముండకోపనిషది:—**

శ్రు. భిద్యతే హృదయగ్రంథి శ్ఛిద్యంతే సర్వసంశయాః,
క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే.
జ్ఞాత్వా దేవం పాశహానిః క్షీణైః క్లేశై ర్న జన్మభాక్,
దేవం మత్వా హర్షశోకౌ జహాత్యత్రైవ ధైర్యవాన్.
నైనంకృతాకృతే పుణ్యాపాపే న తాపయతః క్వచిత్,
ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చనేతి.
ఏవం విద్వా న్కర్మణీ ద్వే హిత్వాత్మానం స్మరే త్సదా,
కృతే చ కర్మణీ స్వాత్మరూపేణైవ పశ్యతి.
యో వై తాం బ్రహ్మణో వేద అమృతే నావృతాం పురీం,
తస్మై బ్రహ్మ చ బ్రహ్మా చ ఆయుః కీర్తిం ప్రజాం దదుః.

**కఠవల్లీ:—**

శ్రు. నైవ వాచా న మనసా ప్రాప్తుం శక్యో న చక్షుషా,
అస్తీతి బ్రువతోఽన్యత్ర కథం తదుపలభ్యతే.
అస్తీత్యేవోపలబ్ధవ్య స్తత్వభావేన చోభయోః,
అస్తీత్యేవోపలబ్ధస్య తత్వభావః ప్రసీదతి.
యదా సర్వే ప్రముచ్యంతే కామా యేఽస్య హృదిస్థితాః,
అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతేతి.
యదా సర్వే ప్రముచ్యంతే హృదయస్యేహ గ్రంథయః,
అథ మర్త్యోఽమృతో భవత్యేతావదనుశాసనమితి.

అత్ర ఉభయోః తత్వభావేనోపలబ్ధవ్య ఇత్యుక్తమనేన, జీవబ్రహ్మణో రైక్యభావభావనయా అపరోక్షజ్ఞానదార్ఢ్యా న్మర్త్యః అమృతో భవతి బ్రహ్మైవ భవతీతి.

అత్ర అస్మిన్నేవ జన్మని జీవన్ముక్తదశాప్రాప్తి ర్భవతీతి.

## పరానాడీస్వరూపము.

**కఠోపనిషత్:—**

శ్రు. శతం చైకా చ హృదయస్య నాడ్య స్తాసాం మూర్ధాన మభినిసృతైకా, తయోర్ధ్వమాయ న్నమృతత్వమేతి విష్వఙ్ఞాన్యా ఉత్క్రమణే భవంతీతి.

అంగుష్ఠమాత్రః పురుషోఽంతరాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః, తం స్వాచ్ఛరీరాత్ప్రవృహేన్ముంజాదిషీకాం ధైర్యేణ తం విద్యా చ్ఛుక్ర మమృతం తం విద్యాచ్ఛుక్ర మమృతమితి.

**యోగశిఖోపనిషది - బ్రహ్మాణం ప్రతి పరమేశ్వరః.—**

శ్రు. సుషుమ్నాయై కుండలిన్యై సుధాయై చంద్రమండలాత్,
మనోన్మన్యై నమస్తుభ్యం మహాశక్త్యై చిదాత్మనే.
ఏకోత్తరం నాడీశతం తాసాం మధ్యే పరా స్మృతా,
సుషుమ్నా తు పరే లీనా విరజా బ్రహ్మరూపిణీ.
ఇడా తిష్ఠతి వామేన పింగళా దక్షిణేన తు,
తయోర్మధ్యే పరాస్థానం యస్తం వేద స వేదవిత్.

## సర్వరహస్యార్థః.

**యోగినీహృదయే:—**

తథా సర్వరహస్యార్థో కథయామి తవానఘే,
మూలాధారే తటిద్రూపే వాగ్భవాకారతాం గతే.
అష్టావింశత్కలాయుక్తా పంచాశద్వర్ణవిగ్రహా,
విద్యాకుండలినీరూపా మండలత్రయభేదినీ.
తటిత్కోటినిభప్రఖ్యా బిసతంతునిభాకృతిః,
పోర్ణేందుమండలాసక్తా సుధాస్రోతస్స్వరూపిణీ.
ఏషా స్వాత్మేతి బుద్ధిస్తు రహస్యార్థో మహేశ్వరీతి.
అత్ర బిసతంతుః, కమలనాళాంతరతంతుః, అతికృశాకృతిరితి.

శ్రు. నీవారశూకవత్తన్వీ పీతా భాస్వత్యణూపమేతి.

అష్టావింశత్కలాయుక్తా అష్టావింశత్కలాస్తు:— శ్రీవిద్యా షోడశాక్షరీ మంత్రాంతర్గత పంచదశాక్షరీరూపకూటత్రయవర్ణ విభజనేన అష్టావింశద్వర్ణాత్మికా శ్రీవిద్యాషోడశాక్షరీ భవతి, తద్రూపేత్యర్థః.

పంచాశద్వర్ణవిగ్రహా = అకారాది క్షకారాంత మాతృకావర్ణశరీరేతి ప్రసిద్ధా. తేవర్ణాః విశుద్ధాది ఆజ్ఞాంతకమలదళేషు తత్తద్యోగినీరూపా విలసంతీతి ప్రసిద్ధం.

**శ్రీదేవ్యాః పంచబ్రహ్మాసనవివరం.**

తదుక్తం త్రిపురారహస్యే:—

నిర్విశేష మపి బ్రహ్మ స్వస్మిన్మాయావిలాసతః,
బ్రహ్మా విష్ణుశ్చ రుద్రశ్చ ఈశ్వరశ్చ సదాశివః.

యజ్ఞవైభవఖండే:—

ఏక ఏవ శివస్సాక్షాత్సత్యజ్ఞానాదిలక్షణః,
వికారరహితశ్శుద్ధస్స్వశక్త్యా పంచధా స్థిత ఇతి.

ఏతే బ్రహ్మ విష్ణు రుద్ర ఈశ్వరసదాశివాః, సద్యోజాతాది పంచ బ్రహ్మమూర్తయః తత్తన్మంత్రేషు ప్రతిపాదితాః. తదుక్తం జ్ఞానార్ణవే:—

శ్లో. పంచప్రేతా న్మహేశాన బ్రూహి తేషాం తు కారణం,
నిర్జీవా అవినాశాస్తే నిత్యరూపాః కథం వదేతి.

దేవ్యా పృష్టః ఈశ్వర ఉవాచ:—

సాధు పృష్టం త్వయా భద్రే పంచప్రేతాసనం కథం,
బ్రహ్మా విష్ణుశ్చ రుద్రశ్చ ఈశ్వరశ్చ సదాశివః.
పంచప్రేతా వరారోహే నిశ్చలా ఏవ తే సదా,
బ్రహ్మణః పరమేశాని కర్తృత్వం సృష్టిరూపకం.
వామాశక్తిస్తు సా జ్ఞేయా బ్రహ్మప్రేతా న సంశయః,
శివస్య కరణం నాస్తి శక్తేస్తు కరణం యతః. ఇత్యారభ్య,
సదాశివో మహాప్రేతః కేవలో నిశ్చలః ప్రియే,
శక్త్యా వినాకృతో దేవి కథంచిదపి న క్షమ ఇతి. పంచబ్రహ్మాసన లక్షణం.

**సుధాసింధుస్వరూపము.**

నవయోన్యాత్మక శ్రీచక్రమధ్యబిందు స్సుధాసింధుః. తచ్చక్రం శ్రీదేవ్యాః విరాట్ఛరీరేఽంతర్భావాత్, సహస్రారమధ్యగతకర్ణికా రూపచంద్రమండలం బిందురూపం, తస్మాత్తదేవ సుధాసింధుః. తదుక్తం.

వామకేశ్వరతంత్రే:—

శ్లో. బిందుస్థానం సుధాసింధుః పంచయోన్యస్సురద్రుమాః,
తత్రైవ నీపశ్రేణీ చ తన్మధ్యే మణిమంటపః.
తత్ర చింతామణికృతం దేవ్యా మందిరముత్తమం,
శివాత్మకే మహామంచే మహేశానోపబర్హణే.
అతిరమ్యతరే తత్ర కశిపుశ్చ సదాశివః,
భృతకాశ్చ చతుష్పాదా మహేంద్రశ్చ పతద్గ్రహః.
తత్రాస్తే పరమేశానీ మహాత్రిపురసుందరీ,
శివార్కమండలం భిత్వా ద్రావయంతీందుమండలం.
తదుద్భూతామృతస్యంది పరమానందనందితా,
కులయోషిత్కులం త్యక్త్వా పరం వర్షణమేతి సా.

అత్ర శివాకారే మంచ ఇత్యనేన బిందుపరివేష్టితయోనిచక్ర కోణేషు బిందుత్రయం బ్రహ్మవిష్ణుశివాత్మకం త్రికోణచక్రం ఈశ్వర స్థానత్వేన తేషాం మంచత్వారోపణం భృతకాః (భృత్యాః) శివార్క మండలం భిత్వేత్యస్యార్థః.

శివా పరానాడీరూపా కుండలినీ శక్తిః, సర్పసదృశగతివశా త్కుండలినీ సంజ్ఞాప్రాప్తిః. అర్కమండలం భిత్వేత్యత్ర మూలాధారాది కమలషట్క మస్యామేవాధారత్వేన పుష్పమాలాంతర్గతసూత్రవత్ పరాసుషుమ్నానాడీస్థితివశాత్, బ్రహ్మరంధ్రాదిమూలాధారపర్యంతం, మూలాధారాదిబ్రహ్మరంధ్రపర్యంతం, హంసయోః యాతాయాత గతివశాత్ ఏతన్నాడీమార్గేణ స్వాధిష్ఠానాగ్నేః సహస్రారాంతర్గత బిందుమండలస్య వేధసంభవాత్. బ్రహ్మవిష్ణుప్రగ్రంథీనాం భేదనం అర్కమండలరూప అనాహత కమలభేదనం చోక్తం. స్వాధిష్ఠానాగ్ని వేధయా, ఘనీభూతసుధామండలా స్రవదమృతధారాప్రవాహై ర్ద్విసప్తతిసహస్రనాడీసంచయం స్నపతి. తదమృతసేచనేన సర్వే నాడ్య స్తృప్తాః. తదా దేహినాం స్వస్థావస్థా. అగ్నేరుష్ణాధిక్యం స్రవదమృత ధారాభి శ్శామ్యతి. అమృతధారాశైత్యాధికం తు స్వాధిష్ఠానాగ్ని జ్వాలాభిశ్శామ్యతి తయో ర్యదా న్యూనాధికం భవతి, తదా ప్రాణినాం వ్యాధిరూపేణాస్వస్థతాసిద్ధిః. ఔషధసేవాద్యుపచారై స్తత్త

భాగస్య సహాయతా చ, అధికభాగస్య శాంతి ర్భవతి. తేన పున స్స్వస్థావస్థా ప్రాప్తిః ప్రలయే అగ్ని శ్శమయతి. అతివృష్టి ర్భవతి. తదా ప్రలయః. ఏవమాదిశక్తే స్సహజనియామకమితి సమయమతసిద్ధాంతః. ఏవం చేత్ పామరవివేకినోః కోవా ఫలానుభవభేద ఇతి. పామరః అవిద్యావశ స్సర్వదా కామై స్సంతప్యమాన స్సుఖేతరమేవానుభవతి. వివేకీసర్వం బుద్ధ్వా సకలవ్యవహారం మాయాధీనం జ్ఞాత్వా స్వయంధీర స్స్వరూపం సమ్యగ్జ్ఞాత్వా నైజసుఖానందే మగ్న స్సుఖం విహరతి. ఏవం పరస్పరభేదః. ఇత్యలం.

**3౧-వ సూత్రము, పాదద్వంద్వస్వరూపము.**

**మూ. క్రమణం పదవిక్షేపః క్రమోదయ స్తేన కథ్యతే ద్వేధా,**
**ఆవరణం గురుపంక్తిః ద్వయమిదమంబాపదాంబుజప్రసరం.**

అర్థః. క్రమణం=క్రమము, పదవిక్షేపః = పాదవిక్షేపమనియు, క్రమోదయః=క్రమోదయమనియు, తేన = ఆహేతువుచేత, ద్వేధా= రెండువిధములుగా, కథ్యతే=చెప్పఁబడుచున్నది. ఆవరణం=చక్రమందున్న శక్తిసముదాయమును, గురుపంక్తిః = దివ్యౌఘసిద్ధౌఘమానవౌఘము లనెడి గురుమండలమును, ఇదంద్వయం = ఈద్వయమును, అంబా పదాంబుజప్రసరం = త్రిపురసుందరి పాదాంబుజయుగళవిజృంభణగా నున్నది.

తా. ఇటుల శ్రీచక్రమును నిరూపించి యాచక్రమందున్న ఆవ రణశక్తి బృందమును, గురుమండలమున్ను పరదేవతా శరీరావయవ ములపరిణామరూపమేయని నిరూపించుచున్నారు. పదవిక్షేప మనఁగా, అగణితగుణాత్మికానంతశక్తిజననసామర్థ్యము. దివ్యౌఘ సిద్ధౌఘమాన వౌఘ రూపానంత ప్రకాశాత్మక శ్రీగురుమండలస్వరూపముగా ప్రస రించుటయు, నీ ఆవరణదేవతాగురుమండలములు రెండును త్రిపుర సుందరీపాదారవిందములయందు జనించిన తేజోమయ రశ్మిసముదాయమే యని భావము.

**3౨-వ సూత్రము, ఆవరణదేవతాస్వరూపము.**

**మూ. సేయం పరా మహేశీ చక్రాకారేణ పరిణమేత యదా,**
**తద్దేహావయవానాం పరిణతిరావరణదేవతాస్సర్వాః.**

అర్థః. సేయం = ఇదివరకు వర్ణింపఁబడిన, మహేశీ = సర్వేశ్వరి యయిన, పరా = పరాశక్తియనే ఆదిశక్తి, యదా = ఏకాలమందు, చక్రాకారేణ = శ్రీచక్రాకారముగా, పరిణమేత = పరిణమించినదో, తదా = ఆకాలమందే, తద్దేహావయవానాం = ఆ పరాశక్తి దేహావయవముల యొక్క, పరిణతిః = పరిణామము, సర్వాః = సమస్తమయిన ఆవరణదేవతలు, స్యుః = అగుచున్నారు.

తా. నిత్యనిరవధిక తేజోమయానంతకోటి యోగినీబృంద సేవిత నిరవధికానంద సామ్రాజ్యసంపదభిమానశాలియగు నా పరాభట్టారిక ఏకాలమందు శ్రీచక్రాకారముగా పరిణమించినదో, పరిపూర్ణానంద మయాత్మస్ఫురణావలోకనసమయమందు "స్ఫురత్తా మాత్మనః పశ్యేత్తదా చక్రస్య సంభవ" ఇతి వచనాత్, అవస్థాంతరములు పశ్యంతీ - మధ్యమా - వైఖరీరూపములను, అవ్యక్తమహదహంకారాదితత్త్వరూపములను, త్రికోణాది నవచక్రాకారములు పొందినదో అవ్యవహిత తత్కాలమందే ఆతేజః పుంజము త్రిపురసుందరీ అవయవములు కిరణ సముదాయరూపములై, చక్రమందున్న నవావరణదేవతాస్వరూపములుగా పరిణమించినవి. చిదానందసముద్రప్రాయమయిన ఆత్మవలననే తరంగసదృశులైన అనంతకోటిశక్తులును ప్రాదుర్భూతమయినవని తాత్పర్యము.

**3౭, 3౮-వ సూత్రములు, కామేశ్వరీద్వంద్వస్వరూపము.**

బిందుచక్రము. ప్రథమావరణము. సృష్టిక్రమము.

**మూ.** **ఆసీనా బిందుమయే చక్రే సా త్రిపురసుందరీ దేవీ,**
**కామేశ్వరాంకనిలయా కలయా చంద్రస్య కల్పితోత్తంసా.**

**మూ.** **పాశాంకుశేక్షుచాపప్రసూనశరపంచకాంచితస్వకరా,**
**బాలారుణారుణాంగీ శశిభానుకృశానులోచనత్రితయా.**

అర్థము. బిందుమయే చక్రే = సర్వానందమయాత్మ విహరణ స్థాన బిందుపీఠమందు, ఆసీనా = కూర్చున్న, సా=అపరిచ్ఛిన్న సకలతత్త్వ స్వరూపిణియగు, త్రిపురసుందరీ = సకలతత్త్వాతీతగా ఉపాసింపఁబడే పరదేవత, కామేశ్వరాంకనిలయా = ఊర్ధ్వానందనామకాది శ్రీనాథుని

యొక్క వామోరూపరి భాగమందు నివాసస్థానము గాగలదియు, చంద్రస్యకలయా = చంద్రకలచేతను, కల్పితోత్తంసా = రచియింపఁబడిన శిరోభూషణము కలదియు, పాశాంకుశేక్షుచాప ప్రసూనశరపంచకాంచితస్వకరా = ఇచ్ఛాశక్తి రూపపాశమును, జ్ఞానశక్తిరూపాంకుశమును, మనోరూపపుండ్రేక్షుచాపమును, శబ్దాదితన్మాత్రారూప పుష్పబాణపంచకమును ధరించిన హస్తచతుష్టయముగలదియు, బాలారుణారుణాంగీ = బాలసూర్యునివంటి ఎఱ్ఱనికాంతిగల శరీరముగలిగి, శశిభానుకృశానులోచన త్రితయా = చంద్రాగ్నిసూర్యులు నేత్రత్రయముగా గలిగినదియునగు శ్రీరాజరాజేశ్వరీపరాభట్టారికా మూలదేవి, జయతి = సర్వోత్కర్షగా వర్తించుచున్నది.

తా. ఈ చక్రమందున్న బింద్వాది భూపురాంతమువరకు నున్న తొమ్మిదిచక్రములు నవావరణలుగా నేర్పరచఁబడినవి. అందు బిందువు సృష్టిక్రమానుసారముగా ప్రథమావరణగా నున్నది. నవావరణలయందుఁగల యాయాదేవతలస్వరూపాదులు వివరింపఁదలంచి, సర్వానందమయాత్మ విహారస్థానమందున్న రాజరాజేశ్వరీ త్రిపురసుందరీ పరాభట్టారికయగు మూలదేవిని వర్ణించుచున్నారు.

ఈ మహామహేశ్వరి చంద్రకలచే నలంకరింపఁబడిన కిరీటమును, చంద్రాగ్నిసూర్యరూప నేత్రత్రయమును, మందస్మితముఖమును, ఇచ్ఛాశక్తియనే పాశమును, జ్ఞానశక్తియనే అంకుశమును, మనస్తత్త్వమనే ఇక్షుకోదండమును, పంచతన్మాత్రలనే పుష్పబాణములను ధరించిన హస్తచతుష్టయము కలిగి, బాలసూర్యునివంటి శరీరకాంతియు గలిగి, దివ్యగంధవస్త్ర మాల్యాభరణాదులచే నలంకృతయయి, స్వసమానవేష భూషాదులుగల నవావరణదేవతలచేత పరిసేవితయయి కామేశ్వరీదేవి కామేశ్వరవామోరుభాగమందు ప్రకాశించుచున్నదని తాత్పర్యము.

ఈ నవావరణలో సాధకులు గ్రహించవలసిన సంకేతములు· ౧ ఆవరణసంఖ్య. ౨ చక్రాకృతి. ౩ చక్రనామము. ౪ ప్రకృతి. ౫ తత్త్వము. ౬ పూజాక్రమము. ౭ దేవతానామములు. ౮ యోగినీ నామములు. ౯ చక్రేశ్వరి. ౧౦ ముద్ర. ౧౧ ముద్రాబీజము. ౧౨

స్థాయీభావము. ౧౩ ప్రధానరసము. ఈ ౧౩ సంకేతములును గురుముఖతా తెలిసికొనవలెను.

ఈ బిందుమండలము- ప్రథమావరణము, ఆకృతి, బిందుస్వరూపము, చంద్రమండలాకృతియు, సర్వానందమయచక్రము, ప్రధానవస్తువయినందున సర్వమునకు నిదియే ప్రకృతి. బింబభూత శుద్ధబ్రహ్మస్వరూపము. తక్కినవి శబల బ్రహ్మస్వరూపములు. తత్త్వము పంచబ్రహ్మాత్మకము. పూజక్రమము. దేవత శ్రీరాజరాజేశ్వరీ పరాభట్టారికాదేవి, పరాపర రహస్యయోగిని, చక్రేశ్వరి మహాత్రిపురసుందరి, సర్వయోనిముద్ర, త్రిఖండాముద్రయు, ఐం హ్స్రైం హ్స్క్ల్రీం హ్స్రౌంః స్థాయీభావము, శమము, శాంతరసప్రధానము, సర్వభావ నవరసభరితము. ఈ యంశములు ప్రతిచక్రమందు భేదించునుగాన గ్రహించఁదగినవి.

ఇక విశేషాంశము. ఈ ప్రకరణమందు సమయాచారము సనకాది ఋషిబృందముచే ననుగ్రహింపఁబడినది. దీని పర్యవసానము జ్ఞానయోగముగా నున్నది. ఇందు మంత్ర దేవతలకును, దేవతా శ్రీచక్రములకును, చక్రమాతృకకును, చక్ర బ్రహ్మాండపిండాండములకును, తాదాత్మ్యభావన సంపాదించుటయే సమయమతమందు దేవతారాధనగా సనకాదిసంహితలలో నగుపడుచున్నది. సమయైకదేశపక్షమందు ఈ శుభాగమపంచకోక్తప్రకారము కల్పసూత్రము ననుసరించి బాహ్యచక్రార్చనాదుల నాచరించుట వేదమార్గ సమ్మతముగానున్నది. గ్రంథాదిని తురీయకూటము కామకలాస్వరూపము నిరూపించినారు. మూలాధారాది ఆజ్ఞాకమలాంతము కూటత్రయముగను, తత్ప్రభృతి బ్రహ్మరంధ్రాధోభాగమందున్న సహస్రకమల కర్ణికారూప చంద్రమండల పర్యంతము తురీయకూటమని తెలియుచున్నది. "బిందుస్థానం సుధాసింధుః" అనే వామకేశ్వరతంత్రాది వచనములచేత నీ తురీయకూటమందు సుధాసింధువు, నవరత్నద్వీపము, మణిపురము, కల్పకోద్యానము, నీపశ్రేణి, చింతామణిగృహము, పంచబ్రహ్మాకార సింహాసనము, సదాశివరూప పర్యంకము, నీ పరికరమంతయు నున్నట్టు తెలియఁజుచున్నది. ఇది విరుద్ధముగా నగుపడునుగాని, ఆయా గ్రంథకర్తలు సంకేతరూపముగా వర్ణించినందున నంతయు సత్యముగ నేయున్నది. ఎట్లనిన:—

ఈ గ్రంథము నీ ప్రకరణము స్వరూపజ్ఞానసాధనముగా నున్నది. సకలోపనిషత్తులును ఆత్మసాక్షాత్కారముకొఱకే (అపరోక్షజ్ఞానసిద్ధికొరకు) ప్రతిపాదింపఁబడినవి. అవిద్యాగ్రస్తులగు ప్రాణులకు ప్రథమమునందు పరోక్షజ్ఞానము కలుగఁజేసిన పిదప అపరోక్షజ్ఞానము బోధించఁదగినదిగాన, నా ఉపనిషదర్థమునే యీ శ్రీవిద్యా శ్రీచక్రములందు సంకేతముగా పరోక్షజ్ఞానసిద్ధికొఱకు పరమేశ్వరుఁడు ప్రకటించినాఁడు.

శ్రీచక్ర, బ్రహ్మాండ, పిండాండములు సమానధర్మములు కలవయినందున కేవల శారీరమాత్రము కాక నీమూడు వస్తువులందుఁగల పదార్థముల నిచట నీ సంకేతములలో గ్రహింపవలెను. సమష్టిపైన అభిలాషార్థము సిద్ధమగును. ఇటులనే శ్రుతులును పరస్పరభేదముగా నగుపడును గాని సమష్టిపైని ఏకీభవించును. బ్రహ్మకాండ అద్వైత వస్తువును ప్రతిపాదించుచున్నది. కర్మకాండ ఉపాసనాకాండలు ద్వైతమును చూపించుచున్నవి. ఇది పరస్పర విరోధము. ఇక సామరస్యము - వేదము ఉత్తమ మధ్యమ సామాన్యాధికారుల కొఱకు సమష్టిగా నుత్పన్నమయినది. అధికారిభేదము ననుసరించి, ఆయా భాగములు ఉపయోగింపఁబడుచున్నవి. కర్మకాండోపాసనాకాండలు చిత్తశుద్ధి పాపక్షయార్థమై గ్రహింపఁబడుచున్నవి. ఈ ప్రకరణమందు పుణ్యపాపములు జ్ఞానాజ్ఞానపరములు. తద్ద్వారా ఆత్మవిచారణకు యోగ్యుఁడగును. పిదప అపరోక్షసిద్ధి కలుగును గాన పరస్పరసహాయములుగా నున్నవి గాని విరోధములుగా లేవు.

శ్రు. శ్రుతితాత్పర్య మఖిల మబుద్ధ్వా భ్రామ్యతే జడః,
వివేకీ త్వఖిలం బుధ్వా తిష్ఠత్యానందవారిధౌ.

సంకేతార్థము తెలిసికొనుట ఆవశ్యకముగా నున్నది. ఈ శ్రీచక్ర శారీరవ్యక్షాదులు శ్రుతిబోధితమయియున్నవి. "శ్రు. తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" ఈశ్రుతివలన ఆత్మపంచభూతాదులను ఇంద్రియాదులను సృజించి శరీరపూర్తి అయిన పైన తానందు ప్రవేశించినట్లు తెలియుచున్నది. ఆ ఆత్మప్రవేశమార్గము బ్రహ్మరంధ్రమని, నాందనమని

శ్రుతులయందు వాడఁబడుచున్నది. అట్లు ప్రవేశించి, సహస్రకమలాంతర్గత బిందుమండలమందు నివాసస్థానముగానుండి సాక్షియని ఆత్మవ్యవహరింపఁబడుచున్నది. ఆ సాక్షియనే పరమాత్మకలయే ధ్రువకలయని, షోడశీకలయని తెలియుచున్నది. ఈ తురీయకూటమందున్న నాలుగుకలలలో తురీయ తురీయము షోడశకల. అదియే మహా నిత్యాకలయని. ఈ కలవలన పంచదశకలలు క్రమముగా ఉత్పన్నములయి, తిరిగి యిందు లయమగుచున్నవి. ఈ కూటమువలన దిగువనున్న మూడుకూటములు క్రమముగా ఉత్పన్నమగుచున్నవి. కాన నీబిందు మండలము ఆత్మకు స్థానముగా నున్నది.

ఇందువల్ల అమృతవృష్టి సర్వదా అగుచున్నందున ఇదియే సుధా సింధువు. దేహో నవరత్నద్వీపః = దేహమే నవరత్నద్వీపము, ఇంద్రియములే నవరత్నములు. శ్రీచక్రమందున్న ప్రకాశాంశ కోణపంచకము వామాది శక్తులయిదును కల్పకవృక్ష ఉద్యానవనము. కల్పవృక్షముల వలెను సకల కోరికలనిచ్చు ధర్మము వీటియందును గలదు. విమర్శాంశ చతుష్కోణములు, ఉపవనము ప్రాణులకు సుఖము నిచ్చునవి. తురీయ కూటము చింతామణి గృహము. బిందువు నాక్రమించియున్న యోని చక్రమున్ను, కోణముల యందున్న బిందుత్రయము నీనాలుగును బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వరాకారములు. మధ్యబిందువు సదాశివతత్త్వము. ఈసమష్టి పంచబ్రహ్మాసనము.

శ్రు. శ్రద్ధానురూపా ధీర్దేవతా ఇతి భావనోపనిషత్,
ప్రజ్ఞానం బ్రహ్మ ఇతి ఐతరేయం,
సచ్చిదానందం బ్రహ్మ ఇతి బహ్వృచోపనిషత్,
సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ ఇతి తైత్తిరీయం,
అయమాత్మా బ్రహ్మ ఇతి బృహదారణ్యకం,

మొదలగు శ్రుతులచే ప్రతిపాదితమయిన సంవిద్రూపిణియగు పరానాడి యందు ప్రకాశించుచున్నది. విమర్శశక్తియే రాజరాజేశ్వరీ పరా భట్టారిక. ఇందు కాధారమయిన బిందువే ప్రకాశాంశయయిన సదాశివ పర్యాయముగల కామేశ్వరుఁడు. ఈప్రకాశవిమర్శరూప హంసద్వంద్వము సర్వదా సామరస్యమును పొంది యీసహస్రారకమల మధ్య మందు నిజానందసుఖము ననుభవించుచున్నారు.

ఈస్థానము మనోన్మనీస్థానము. ఇందు అహోరాత్రి విభాగము, కాలభేదము, వస్తుభేదము, దేశభేదమును లేదు. సహస్రాదిత్యసంకాశము, కోటిచంద్రశీతలము, విద్యుత్కోటిప్రకాశముగా నున్నది. తైత్తిరీయశ్రుతియందు చెప్పిన మానుషానందాది బ్రహ్మానందపర్యంతమయిన సర్వానందములు నిందు కలిగినందున నీబిందుచక్రము సర్వానందమయమని చెప్పఁబడుచున్నది. ఇందుకు కల్పసూత్రకారిక:—

మేరుమంత్రాత్మకం చక్రం శ్రీత్రివిష స్తత్ర దేవతాః,
కామేశ్వరః ప్రకాశాత్మా శ్రీర్విమర్శా తదంకగా.
ఇత్యేతద్వాసనారూపమభేదం చ పరస్పరం,
జ్ఞాత్వా శ్రీగురువక్త్రాబ్జాత్కృతా పూజా మహాఫలా.

బింద్వభిన్నపంచబ్రహ్మాత్మకే బిందుచక్రే పంచబ్రహ్మాకారమంచస్థ కామేశ్వరాంకస్థాం ప్రముదితాం అరుణాంబరాదిమహాభరణస్రగాఢ్యాం అంకుశపాశధనుర్బాణై రలంకృతభుజాం మందస్మితాం పరదేవతాం ధ్యాత్వా పూజయేత్. తయోః కామేశ్వరీ సదానందఘనా స్వాత్మైక్య రూపా దేవతా.

**౩౯-వ సూత్రము, ద్వితీయావరణము.**

**మూ. తన్మిథునం గుణభేదా దాస్తే ఓంచుత్రయాత్మకే త్ర్యశ్రే,**
**కామేశీ మిత్రేశప్రముఖద్వంద్వత్రయాత్మనా వితతమ్**

అ. తన్మిథునం=పూర్వోక్తాది ద్వంద్వము, గుణభేదాత్ = సత్వ-రజ-స్తమోగుణ భేదమువలన, బిందుత్రయాత్మకే = బిందుత్రయ యుక్తమయిన, త్ర్యశ్రే=త్రికోణచక్రమందు, కామేశీ మిత్రేశప్రముఖ ద్వంద్వత్రయాత్మనా = కామేశీ మొదలగు ద్వంద్వత్రయముచేత, వితతం = వ్యాప్తమయినది.

తా. ద్వితీయావరణ త్రికోణచక్రమందు, కోణత్రయమందు మూడుబిందువులను, మధ్యను ఒకబిందువును ఇట్లు నాలుగు బిందువులున్నవి. ఆమధ్యబిందువే యిదివఱకు ప్రథమావరణాగా వర్ణింపఁబడినది. అందు ఆనందమయ ఓడ్యాణపీఠమందు కామేశ్వరీ కామేశ్వర

రూపదివ్య మిథునము విహరించుచున్నదని వెనుక చెప్పిరి. ఆద్వంద్వమే బ్రహ్మాండసృష్ట్యాదిని విలాసార్థము సత్త్వాదిగుణభేదము ననుసరించి మూడుద్వంద్వములుగా ప్రకాశించుచున్నారనినందున యోనిచక్ర ఉత్తరకోణస్థబిందువు జాలంధరపీఠము. అందు కామేశీ శ్రీమదూర్ధ్వ దేవనాథాత్మకద్వంద్వమును, వీరు సోమబీజాధిష్ఠాతలుగాను, దక్షిణ కోణబిందువు పూర్ణగిరి పీఠము, కామరాజ బీజాధిష్ఠాతలగు వజ్రేశ్వరీ షష్ఠీశ దేవనాథాత్మక ద్వంద్వముగాను, స్వాగ్రకోణ బిందువగు కామగిరి పీఠమందు వాగ్భవ బీజాధిపతులగు భగమాలినీ మిత్రేశ దేవనాథాత్మక ద్వంద్వముగా గుణభేదము ననుసరించి, ఉమామహేశ్వర, లక్ష్మీనారాయణ, వాణీహిరణ్యగర్భులయి ద్వంద్వత్రయముగా నావేదాది దంపతులే రూపాంతరములను పొందినారని తాత్పర్యము.

ఈ ద్వితీయావరణము త్రికోణాకృతి, సర్వసిద్ధప్రదాచక్రము, నాదప్రకృతి, తత్త్వము గుణత్రయము, పూజ ప్రదక్షిణక్రమము, కామేశ్వరీ వజ్రేశ్వరీ భగమాలినీ కోణత్రయ దేవతలు, అతిరహస్య యోగినీలు, త్రిపురాంబ చక్రేశ్వరి, సర్వబీజముద్ర, ముద్రాబీజము, హాస్యం స్థాయీభావము, విస్మయము, అద్భుతరసము ఈసంకేతములు గలది. పరాశక్తియొక్క శారీరవృత్తమందున్న అవ్యక్త మహత్తత్త్వాహంకారములు నీద్వంద్వత్రయముగా నున్నారని రహస్యము.

౪౦-వ సూత్రము, తృ. వసుకోణము.

**మూ.** వసుకోణనివాసిన్యో యాస్తాస్సంధ్యారుణావశిన్యాద్యాః,
పుర్యష్టకమేవేదం చక్రతనోస్సంవిదాత్మనో దేవ్యాః.

అ. వశిన్యాద్యాః = వశిన్యాది దేవతలు, సంధ్యారుణా ఆస్తే = సంధ్యాకాలవర్ణము గలవారై ఉన్నారు. సంవిదాత్మనః = సంవిద్రూపమయిన, చక్రతనోః = చక్రమే శరీరముగాగల, దేవ్యాః = పరదేవతయొక్క, ఇదంపుర్యష్టకమేవ=ఈ అష్టకోణచక్రము అష్టపురములుగానే యున్నది.

తా. ఈ తృతీయావరణము అష్టకోణములు గలది. సర్వరోగహర చక్రము, కకార ప్రకృతికము, అష్టవిధ ప్రకృత్యాత్మకము, పూజ ప్రదక్షిణ క్రమము, దేవతలు వశినీ వాగ్దేవత, కామేశ్వరీ వాగ్దేవత,

మోదినీ వాగ్దేవత, విమలావాగ్దేవత, అరుణావాగ్దేవత, జయినీ వాగ్దేవత, కౌళినీ వాగ్దేవత, సర్వేశ్వరీ వాగ్దేవత, సంధ్యారాగసమానమైన అరుణకాంతిగలవారు, రహస్యయోగినీలు, చక్రేశ్వరి త్రిపురాసిద్ధాంబ, సర్వఖేచరీముద్ర, ముద్రాబీజము. హ్స్ఖ్ఫ్రేం, స్థాయీభావము. హాసము, హాస్యరసము. శ్రీచక్రమే శరీరముగానున్న సంవిద్రూపపరమాత్మకు నీయెనిమిది కోణములు ఎనిమిది పట్టణములుగ నున్నవని. అవి ఏవియనిన:

శ్లో. చితిశ్చిత్తం చ చైతన్యం చేతనాద్వయమేవ చ,
జీవః కలా శరీరం చ సూక్ష్మపుర్యష్టకం భవేత్.

గ్రంథాంతరే:—

గుణభేదాదాత్మమూర్తిరష్టధా పరికీర్తితా,
జీవాత్మా చాంతరాత్మా చ పరమాత్మా చ నిర్మలః.
శుద్ధాత్మా జ్ఞానరూపాత్మా మహాత్మా సప్తమః స్మృతః,
అష్టమస్తేషు భూతాత్మా హ్యష్టాత్మానః ప్రకీర్తితాః. యద్వా.
భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ,
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా.

ఇందువలన పరదేవతయొక్క మనోబుధ్యహంకారములు పంచభూతములు నీఅష్టకోణరూపమును పొందియున్నవని తాత్పర్యము.

౪౧-వ సూత్రము, చతుర్థం, అంతర్దశారము.

**మూ. తద్విషయవృత్తయస్తాస్సర్వజ్ఞాదిస్వరూపమాపన్నాః,**
**అంతర్దశారనిలయా లసంతి శరదిందు సుందరాకారాః.**

అర్థము. తద్విషయవృత్తయః = ఆపరదేవతయొక్క శబ్దస్పర్శాది విషయవృతులు, సర్వజ్ఞాది స్వరూపమాపన్నాః = సర్వజ్ఞాదిశక్తి దశకరూపమును పొంది, శరదిందుసుందరాకారాః = శరత్కాల చంద్రునివంటి దేహకాంతులు గలవారై, అంతర్దశారనిలయాః=అంతర్దశారము స్థానముగా గలవారై, లసంతి = ప్రకాశించుచున్నారు.

తా. ఈచతుర్థావరణము చక్రాకృతి, అంతర్దశారము, సర్వరక్షాకరచక్రము, రేఖ ప్రకృతికము, వైశ్వానరతత్త్వము, పూజ వామా

వర్తము, దేవతలు సర్వజ్ఞా సర్వశక్తి, సర్వైశ్వర్యప్రదాయిని, సర్వజ్ఞానమయీ, సర్వవ్యాధివినాశినీ, సర్వాధారస్వరూపా, సర్వపాపహారీ, సర్వానందమయీ, సర్వరక్షాస్వరూపిణి, సర్వేప్సితఫలప్రదా, వీరు గర్భయోగినీలు. త్రిపురమాలినీ చక్రేశ్వరి, సర్వమహాంకుశముద్ర, ముద్రాబీజము, 'క్రోం' స్థాయీభావము, క్రోధము రౌద్రరసము, పరదేవతయొక్క విషయవృత్తులు పదిన్ని యీ అంతర్దశారచక్రమందు సర్వజ్ఞాదిశక్తిరూపములు ధరించియున్నవి.

### ౪౨-వ సూత్రము, బహిర్దశారము, పంచమావరణము.

మూ. తద్బాహ్యపఙ్క్తికోణే యోగిన్యస్సర్వసిద్ధిదా పూర్వాః,
దేవీధీకర్మేంద్రియవిషయమయా విశదవేషభూషాఢ్యాః.

అర్థము. సర్వసిద్ధిదాపూర్వాః=సర్వసిద్ధిప్రదా మొదలగు, యోగిన్యః=యోగినీదశకము, దేవధీకర్మేంద్రియ విషయమయాః=శ్రీదేవతయొక్క, జ్ఞానేంద్రియ కర్మేంద్రియ విషయస్వరూపము గలవియై, విశదవేష భూషాఢ్యాః=నిర్మలమయిన నేపథ్యాద్యలంకారములు గలవారై, తద్బాహ్యపఙ్క్తికోణే=చక్రబహిర్దశారమందు, భాసంతే=ప్రకాశించుచున్నారు.

తా. ఈ పంచమావరణము దశకోణాకృతి, సర్వార్థసాధక చక్రము, ఏకారప్రకృతి, దశావతారాత్మకము, పూజ ప్రదక్షిణక్రమము, దేవతలు సర్వసిద్ధిప్రదా, సర్వసంపత్ప్రదా, సర్వప్రియంకరి, సర్వమంగళకరి, సర్వకామప్రదా, సర్వదుఃఖవిమోచనీ, సర్వమృత్యుప్రశమనీ, సర్వవిఘ్ననివారిణి, సర్వాంగసుందరి, సర్వసౌభాగ్యదాయినీ, వీరలు కులోత్తీర్ణ యోగినీలు. చక్రేశ్వరి త్రిపురా, సర్వోన్మాదినీముద్ర, ముద్రాబీజము, సః స్థాయీభావము, జుగుప్సభీభత్సరసము, ఈ సంకేతములు గలది. ఇందు పరదేవతయొక్క జ్ఞానేంద్రియపంచకము, కర్మేంద్రియ పంచకము. ఈపదియు సర్వసిద్ధిదామొదలగు దేవతారూపములను ధరించి నిర్మలమయిన నేపథ్యాద్యలంకారములు కలిగియున్నారని తాత్పర్యము.

### ౪౩-వ సూత్రము, చతుర్దశారము-షష్ఠమావరణము.

మూ. భువనారచక్రభవనా దేవీమనుకరణవివరణస్ఫురణాః,
సంధ్యాసవర్ణవసనాస్సంచింత్యాస్సంప్రదాయయోగిన్యః.

అ. భువనారచక్రభవనాః = చతుర్దశారచక్రమే స్థానముగాగల, దేవీమనుకరణ వివరణస్ఫురణాః = పరదేవతయొక్క ఇంద్రియదశకము, అంతఃకరణ చతుష్టయము నీ పదినాలుగును యోగినీరూపములుగలవై, సంధ్యాసవర్ణవసనాః = సంధ్యాకాలవర్ణముతో సమానమైన వస్త్రము ధరించినట్టియు, సంప్రదాయయోగిన్యః = సంప్రదాయయోగినీలు, సంచింత్యాః=ధ్యానింపఁదగినవారు.

తా. ఈ షష్ఠావరణము చతుర్దశారచక్రాకృతి, సర్వసౌభాగ్య చక్రము, ఈంకారప్రకృతికము, చతుర్దశభువనాత్మకము పూజ వామావర్తము, దేవతలు సర్వసంక్షోభిణీ, సర్వవిద్రావిణీ, సర్వాకర్షిణీ, సర్వాహ్లాదినీ, సర్వసంమోహినీ, సర్వస్తంభినీ, సర్వజృంభిణీ, సర్వవశంకరీ, సర్వరంజనీ, సర్వోన్మాదినీ, సర్వార్థసాధినీ, సర్వసంపత్తిపూరణీ, సర్వమంత్రమయీ, సర్వద్వంద్వక్షయకరీ, ఈ పదునలుగురు యోగినీలు, దాడిమీకుసుమ సమానదేహచ్ఛాయగలవారై అంకుశ పాశ దర్పణామృత భరితపాత్రలు హస్తములందు గలవారై యున్నారు. వీరు సంప్రదాయ యోగినిలు. చక్రేశ్వరి త్రిపురవాసిని. సర్వశంకరీ ముద్ర, ముద్రాబీజము, బ్లూంస్థాయీభావము, భయము, భయానకరసము. పరదేవతయొక్క ఇంద్రియదశకము, అంతఃకరణచతుష్టయము కలసి యీ యోగినీరూపములు ధరించియున్నారని తాత్పర్యము.

**౮౮-వ సూత్రము. అష్టదళము, సప్తమావరణము.**

**మూ.** అవ్యక్తమహదహంకృతి తన్మాత్రా స్త్రీకృతాంగనాకారాః,
ద్విరదచ్ఛదనసరోజే జయంతి గుప్తతరయోగిన్యః.

అ. అవ్యక్తమహదహంకృతి తన్మాత్రాః=అవ్యక్త మహత్తత్త్వాహంకారములు, శబ్దస్పర్శాది తన్మాత్రాపంచకము, స్త్రీకృతాంగనాకారాః స్త్రీరూపమును పొందినవై, ద్విరదచ్ఛదనసరోజే = అష్టదళపద్మమందు, గుప్తతరయోగిన్యః = గుప్తతరయోగినులుగా, లసంతి = ప్రకాశించుచున్నారు.

తా. ఈసప్తమావరణము అష్టదళపద్మాకృతి, సర్వసంక్షోభిణీ చక్రము, హకారప్రకృతికము, అష్టమూర్త్యాత్మకము, పూజ సవ్యము.

దేవతలు అనంగకుసుమా, అనంగమేఖలా, అనంగమదనా, అనంగ మదనాతురా, అనంగరేఖా, అనంగవేగినీ, అనంగాంకుశా, అనంగ మాలినీ, అను నీరయెనమం(డ్రు)గురును జపాకుసుమ సదృశ దేహ కాంతులు గలవారై ఈ అష్టదళపద్మమందు అంకుశ పాశ నవరత్న కలశ నీలోత్పలములను హస్తములందు ధరించి రక్తవస్త్రమాల్యా భరణభూషితలయి ప్రకాశించుచున్నారు. వీరు గుప్తతరయోగినులు. చక్రేశ్వరి త్రిపురసుందరి. సర్వాకర్షిణీముద్ర, ముద్రాబీజము క్లీం స్థాయీభావము, శోకము, కరుణారసము. పరాశక్తియొక్క అవ్యక్త మహత్తత్త్వాహంకారములు, భూతతన్మాత్రా పంచకమును నీ ఎనిమిదియు, ఈ అష్టదళపద్మమందు దేవతారూపమును ధరించియున్నవని తాత్పర్యము.

౭౫. వ సూత్రము, షోడశదళపద్మము, అష్టమావరణము.

**మూ. భూతానీంద్రియదశకం మనశ్చ దేవ్యా వికారషోడశకం, కామాకర్షిణ్యాదిస్వరూపతష్షోడశార మధ్యాస్తే.**

అ. భూతాని ఇంద్రియదశకం మనశ్చ = పంచభూతములు, దశేంద్రియములు, మనస్సు, దేవ్యాః = మిశ్రాఖ్య పరదేవతయొక్క, వికారషోడశకం = అకారాదిస్వరములు పదియారును, కామాకర్షిణ్యాది స్వరూపతః = కామాకర్షిణ్యాది రూపములుగా, షోడశారం = షోడశ దళపద్మమును, అధ్యాస్తే=అధిష్ఠించియున్నవి.

తా. ఈ అష్టమావరణము షోడశదళపద్మాకృతి, సర్వాశాపరి పూరకచక్రము, సకారప్రకృతికము, చంద్రకలాస్వరూపము. పూజప్రద క్షిణక్రమము. దేవతలు కామాకర్షిణీ నిత్యాకల, బుధ్యాకర్షిణీ నిత్యా కల, అహంకారాకర్షిణీ నిత్యాకల, శబ్దాకర్షిణీ నిత్యాకల, స్పర్శాకర్షిణీ నిత్యాకల, రూపాకర్షిణీ నిత్యాకల, రసాకర్షిణీ నిత్యాకల, గంధాకర్షిణీ నిత్యాకల, చిత్తాకర్షిణీ నిత్యాకల, ధైర్యాకర్షిణీ నిత్యాకల, స్మృత్యా కర్షిణీ నిత్యాకల, నామాకర్షిణీ నిత్యాకల, బీజాకర్షిణీ నిత్యాకల, ఆత్మా కర్షిణీ నిత్యాకల, అమృతాకర్షిణీ నిత్యాకల, శరీరాకర్షిణీ నిత్యాకల, ఈపదియారుగురు యోగినులును అకారాది పదియారు స్వరములుగా నున్న నీషోడశకమలదళములందు గలరు. వీరు గుప్తయోగినులు. చక్రే

శ్వరి త్రిపురసుందరి. సర్వవిద్రావిణీముద్ర ముద్రాబీజము. ద్రీం స్థాయీ భావము. ఉత్సాహము, వీరరసము. ఈ సంకేతములు గలది.

ప్రకాశవిమర్శ మిశ్రభూత పరదేవతాశరీరమందుఁగల పృథివ్యాది పంచభూతములును, చంద్రమండలాకార పరదేవతయందుఁ గల షోడశకలారూప అకారాది ౧౬ షోడశస్వరములు, పంచదశనిత్యలు, మహానిత్యయు నీమూఁడు విధముల తత్త్వములును కలసి యీషోడశ దళపద్మమందు యోగినీలుగా నున్నారు. వీరు అంకుశపాశ అమృత పూరితకలశస్ఫటికములను ధరించినవారని తాత్పర్యము.

౪౬, ౪౭-వ సూత్రములు, ప్రథమావరణము, ప్రథమభూపురము.

మూ. ముద్రాస్త్రిఖండయా సహ సంవిన్మయ్యస్సముచ్ఛ్రితాకారాః,
ఆదిమహీగృహవాసా భాసా బాలార్కకాంతిభిస్సదృశాః.
ఆధారనవక మస్యా నవచక్రత్వేన పరిణతం యేన,
నవనాథశక్తయోఽస్మిన్ముద్రాకారేణ పరిణతం తేన.

అ. త్రిఖండయా సహ = త్రిఖండాముద్రతో సహ, ముద్రాస్సర్వాః = పది ముద్రలున్ను, సముచ్ఛ్రితాకారాః = ఆకారపరిణామమును పొందినవై, భాసా = కాంతిచేత, బాలార్కకాంతిభిస్సదృశాః = బాలసూర్యకాంతితో సమానమైనవై, ఆదిమహీగృహవాసాః = ప్రథమభూపురమందున్నవి, అస్యాః = ఈపరదేవతయొక్క, ఆధారనవకం = మూలాధారాది సహస్రకమలాంతమయిన నవ కమలములును, యేన = ఏకారణముచేతను, నవచక్రత్వేన పరిణతం = నవచక్రాకారమును పొందినవో, తేన = ఆకారణముచేత, నవనాథశక్తయోఽపి = వామాది నవశక్తులున్ను, ముద్రాకారేణ పరిణతాః = ముద్రాకారముగా పరిణమించినారు.

తా. పరదేవతా విరాడ్రూపమందుఁగల మూలాధారాది నవ కమలములు, శ్రీచక్రమందున్న నవచక్రములుగా పరిణమించియున్నందున వామాదిశక్తులు తొమ్మిదియు, సర్వసంక్షోభిణ్యాది నవముద్రాకారమును పొందియున్నారనియు, త్రిఖండాముద్ర శ్రీచక్రసమష్టి రూపమనియు, నీ త్రిఖండాముద్రకు మూలశక్తియగు పరభట్టారిక దేవతగా నున్నదని తాత్పర్యము.

౪౮-వ సూత్రము, ద్వితీయభూపురము.

**మూ. అస్యాస్త్వగాదిసప్తకమాకారస్త్వేవ మష్టకం చైతత్,**
**బ్రాహ్మ్యాదిమాతృరూపం మధ్యమభూబింబ మధ్యాస్తే.**

అ. అస్యాః = ఈపరమేశ్వరియొక్క, త్వగాదిసప్తకం = త్వగాది సప్తధాతువులును, ఆకారః = సమష్టిస్వరూపమున్ను, బ్రాహ్మ్యాది మాతృరూపం = బ్రాహ్మ్యాది అష్టమాతృకా స్వరూపమయిన, అష్టకం-అష్టకము, ఏతత్ = పూర్వోక్తమయిన, మధ్యభూబింబం = మధ్య భూపురమును, అధి = అధిష్ఠించియున్నది.

తా. రక్తవర్ణముగల మధ్యభూపురమందు బ్రాహ్మీ - మాహే శ్వరీ-కౌమారీ-వైష్ణవీ - వారాహీ - మాహేంద్రీ - చాముండా - మహా లక్ష్మి అను నీ యెనమండ్రు మాతృకలు మధ్యభూపురమందున్నారు. పరదేవతయొక్క సప్తధాతువులును సమష్టిశరీరము నీ మాతృకారూప ములను ధరించియున్నారని తాత్పర్యము.

౪౯-వ సూత్రము, ప్రథమభూపురము.

**మూ. అణిమాదిసిద్ధయోఽస్యాః స్వీకృత కమనీయ కామినీ రూపాః,**
**విద్యాంతరఫలభూతా గుణభావేనాంత్యభూనికేతనగాః.**

అర్థము. అస్యాః = ఈపరమేశ్వరియొక్క, అణిమాదిసిద్ధులు, విద్యాంతరఫలభూతాః = ఈశ్రీవిద్యకన్న వేరైన సప్తకోటి మంత్ర ములకును, హఠయోగాదులకును ఫలభూతములు, స్వీకృతకమనీయ కామినీరూపాః=మనోహరమయిన అంగనారూపములను ధరించి, గుణ భావేన = ప్రభాసభావముచేతను, అంత్యభూనికేతనగాః = సర్వాంత్య భూపురమును పొందియున్నవి.

తా. ఈభూపురత్రయసమష్టిరూపమయిన ప్రథమావరణము, చతురస్రాకృతి, త్రైలోక్యమోహనచక్రము, ఒకార ప్రకృతికము, పృథివీతత్త్వము, పూజాక్రమము, దేవతలు, అణిమాసిద్ధి, లఘిమాసిద్ధి, మహిమాసిద్ధి, ఈశిత్వసిద్ధి, వశిత్వసిద్ధి, ప్రాకామ్యసిద్ధి, గరిమాసిద్ధి, ప్రాప్తిసిద్ధి అను నీ అష్టసిద్ధులును శుక్లవర్ణములు గలిగి ప్రథమభూపుర మందు సుందరమయిన స్త్రీరూపములను ధరించి, అంకుశము-పాశము-పద్మద్వయము హస్తములందు ధరించియున్నారు. వీరు ప్రకటయోగినీలు.

## శ్రీచక్రమందు నవావరణలలోనున్న సంకేతములు.

| ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ |
|---|---|---|---|---|---|---|
| ఆవరణ సంఖ్య. | చక్రాకృతి. | చక్రనామములు. | ప్రకృతి. | తత్వం. | పూజాక్రమం. | దేవతానామము. |
| ౯-న. | బిందువు. | సర్వానందమయము. | బిందురూపము. | పంచబ్రహ్మాత్మకం. | క్రమము. | శ్రీరాజరాజేశ్వరి. |
| ౮-అ. | త్రికోణం. | సర్వసిద్ధిప్రదా. | నాదప్రకృతి. | గుణత్రయము. | ప్రాదక్షిణ్య. | కామేశ్వరాదయః. |
| ౭-స. | అష్టకోణం | సర్వరోగహారం. | కకారప్రకృతి. | ప్రకృత్యష్టకం. | సవ్యమార్గము. | వశిన్యాదులు. |
| ౬-వ మ. | అంతర్దశారము. | సర్వరక్షాకరము. | రేఖప్రకృతి. | వైశ్వానరాత్మకం. | వామావర్తం. | సర్వజ్ఞాదులు. |
| ౫-పం. | బహిర్దశారం. | సర్వార్థసాధకం. | ఏకారప్రకృతి. | దశావతారాత్మకం. | ప్రదక్షిణ. | సర్వసిద్ధిప్రదాదులు |
| ౪-చ. | చతుర్దశారం. | సర్వసౌభాగ్యచక్రం. | ఈకారం. | చతుర్దశభువనాత్మకం. | వామావర్తం. | సర్వసంక్షోభిణ్యాదులు. |
| ౩-త్రై. | అష్టదళం. | సర్వసంక్షోభిణీ. | హకారప్రకృతికం | అష్టమూర్త్యాత్మకం. | క్రమం. | అనంగకుసుమాదులు |
| ౨-ద్వి. | షోడశదళం. | సర్వాశాపరిపూరకం. | సకారం. | చంద్రాత్మకం. | ప్రదక్షిణం | కామాకర్షిణ్యాదులు. |
| ౧-ప్ర. | చతురస్రం | త్రైలోక్యమోహనం. | లకారము ప్ర. | పృథివీరూపం. | క్రమం. | అణిమాదులు. |
| ౧౦-సమష్టి | శ్రీచక్రస్వరూపం. | మహావజ్రాఖ్యచక్రం. | సర్వప్రకృత్యాత్మకం | సకలతత్వాతీతం. | సర్వతోముఖం. | సకలదేవతాత్మకం. |

ఇది సిద్ధవజ్రమనే యంత్రము.

| ౮ | ౯ | ౧౦ | ౧౧ | ౧౨ | ౧౩ |
|---|---|---|---|---|---|
| యోగినీ నామము. | చక్రేశ్వరి. | ముద్ర. | బీజం. | స్థాయీ భావము. | రసము. |
| పరాపర రహస్య యోగిని. | త్రిపుర సుందరి. | సర్వయోని ముద్ర | ఐం. | శమభావము. | శాంతరసము. |
| అతి రహస్య యోగిని. | త్రిపురాంబ. | సర్వబీజము. | హ్సౌః. | విస్మయము. | అద్భుత రసము. |
| రహస్య యోగిని. | త్రిపురాంబ | సర్వఖేచరీ. | హ్స్ఖ్ఫ్రేం. | హాసము. | హాస్యరసము. |
| గర్భ యోగినులు. | త్రిపుర మాలిని. | సర్వమహాంకుశము. | క్రోం. | క్రోధం. | రౌద్రరసం. |
| కులోత్తీర్ణ యోగిని. | త్రిపురా. | సర్వోన్మాదినీ. | సః. | జుగుప్స. | బీభత్సరసము |
| సంప్రదాయ యోగినులు. | త్రిపురవాసిని | సర్వవశంకరీ. | బ్లూం. | భయము. | భయానక రసాదులు. |
| గుప్తతర యోగినులు. | త్రిపుర సుందరీ. | సర్వాకర్షణం. | క్లీం. | శోకం. | కరుణరసం. |
| గుప్తయోగినులు. | త్రిపురేశ్వరి. | సర్వవిద్రావిణి. | ద్రీం. | ఉత్సాహం. | వీరరసం. |
| ప్రకటయోగినులు. | త్రిపురా. | సర్వసంక్షోభిణి. | ద్రాం. | రతి. | శృంగార రసం. |
| సకల యోగినీ రూపం. | కామకలా స్వరూపం. | త్రిఖండా ముద్రా. | హ్స్రైం హ్స్క్ల్రీం | నవభావ యుతము. | నవరస భరితము. |

చక్రేశ్వరి-త్రిపురా; సర్వసంక్షోభిణీముద్ర, ముద్రాబీజముద్రాం; స్థాయీభావము రతి, శృంగారరసము ఈసంకేతములు కలిగియున్నది.

ఈ అణిమాదిసిద్ధులు ఇతరదేవతోపాసకులకు ఫలభూతములుగా నున్నవి. శ్రీవిద్యోపాసకు లాత్మోపాసకులయినందున, పరదేవతా సాయుజ్యమే వారికి ఫలము. అపరోక్షజ్ఞానసిద్ధి వారికి మాయాకల్పితములయిన మహిమాదులు తుచ్ఛములుగానుండును. వారికి జీవన్ముక్తత్వమే ఫలము. ఇది సకలాగమసిద్ధము. దేహధారణపర్యంతము ఐహికసుఖములు స్వయముగనే లభించునని తాత్పర్యము.

ఈగ్రంథకర్త యిందు ఆవరణక్రమమును, సృష్ట్యాది ననుసరించి అవరోహణక్రమముగా వర్ణించెను గాని, ఉపాసకులు శ్రీచక్రార్చనమందు ఆరోహణక్రమమును గ్రహించవలెను. అపు డీభూపురము ప్రథమావరణగాను, బిందుమండలము నవమావరణగాను అగుచున్నవి.

మధ్యమాధికారులు ఆరంభమందు మంత్రసంకేత, చక్రసంకేత, పూజాసంకేత జ్ఞానముకొఱకు శుభాగమపంచకోక్త కల్ప సూత్ర ప్రకారము వేదవిహితాచారముగా శ్రీచక్రనవావరణార్చనాదుల నాచరించవలెను.

ఉత్తమాధికారులకు చతుర్విధైక్య షడ్విధైక్యానుసంధానమే పరదేవతాపూజాకలాపమనియు, ఇదియే అంతర్యాగక్రమమనియు, వీరికి బాహ్యపూజాకలాపము లేదనియు సకలాగమసిద్ధము. అనుసంధానక్రమము వెనుక వివరింపఁబడినది. ఈచక్రసంకేతములు సమష్టిగా తెలిపే చక్రము నిందు చూపింపఁబడెను.

**అంతర్యాగక్రమము.**

ఈ గ్రంథకర్త వివరించిన ఆవరణ దేవతాస్వరూపాదులు ఇంచుమించుగా భావనోపనిషత్తు ననుసరించి యున్నందున, మానసిక పూజాదికమందుఁగల ఆవాహనాదివాక్యములు ఆభావనోపనిషత్తునుంచి గ్రహించి ఇచట నిరూపింపఁబడినవి.

శ్రు. మేరుమంత్రాత్మకం చక్రం శ్రీర్వ్యాప్తస్తత్ర దేవతాః,
కామేశ్వరః ప్రకాశాత్మా శ్రీర్విమర్శం స్తదంకగా,

ఇత్యేతద్వాసనారూపమభేదం చ పరస్పరం,
జ్ఞాత్వా శ్రీగురువక్త్రాబ్జాత్కృతా పూజా మహాఫలా.

తా. శ్రీచక్రము మేరుమంత్రస్వరూపము. అందుఁగల భూపురాది బిందువంతమయిన నవచక్రములును మేరుమంత్రమందున్న లకారాది వర్ణములు ప్రకృతిగా గలవి. ఆబీజమువలన ఆ యావరణచక్రముత్పన్నమయినది గాన సమష్టి శ్రీచక్రము మేరుమంత్రస్వరూపము. అందున్న ఆవరణదేవతలు పరదేవతయొక్క శరీరకాంతికిరణసముదాయముగానున్నారు. బిందుమండలమందున్న కామేశ్వరుఁడు ప్రకాశాంశగాను, అతని వామాంకమందున్న కామేశ్వరీదేవి విమర్శాంశగాను, వీరిరువురకును కించిత్తైనను భేదములేదని, నిత్యయుతములని గురుముఖముగా నీ శ్రుత్యర్థమును తెలిసికొని చేసిన శ్రీచక్రార్చన మహాఫలము నిచ్చునని తాత్పర్యము.

### మేరుమంత్రస్వరూపము.

ఉద్ధారము:—

భూమిశ్చంద్రశ్శివో మాయా శక్తిః కృష్ణాధ్వమాదనాః,
అర్ధబిందుశ్చ బిందుశ్చ నవావరణముచ్యతే.

భూమిః లకారః, చంద్ర స్సకారః, శివో హకారః, మాయా ఈకారః, శక్తిః ఏకారః, కృష్ణో రకారః, అధ్వమాదనాః కకారః, అర్ధబిందు [illegible]ర్గః, అః బిందుః-పూర్ణానుస్వారం మంత్రోచ్చారణే తు. లం-సం-హం-ఈం-ఏం-రం-కం-అః-అం. సర్వసమష్టిః. హ్రీంస్క్రీం. ఇతి ఏకాక్షరీ మేరుమంత్రం.

### శ్రీదేవీమానసికపూజావిధిః.

ఇచ్ఛాశక్తి ర్మహా త్రిపురసుందరీ శ్రద్ధానురూపా ధీర్దేవతా, తయోః కామేశ్వరీ సదానందఘనా పూర్ణా స్వాత్మైక్యరూపా ధీర్దేవతా. సలిలమితి సౌహిత్యకరణగ్ సత్వం, కర్తవ్య మకర్తవ్యమితి వివేక భావనాయుక్త ఉపచారః, అస్తినాస్తీతి కర్తవ్యతా అనుపచారః, బాహ్యాభ్యంతఃకరణానా మేకరూపగ్రహణ యోగ్యతాస్త్వితాహ్యావాహనం, తస్య బాహ్యాభ్యంతఃకరణానా మేకరూప విషయగ్రహణ మాసనం. రక్తశుక్లపదైకీకరణం పాద్యం, ఉజ్జ్వలదామోదానుసంధాస

మర్ఘ్యం, స్వచ్ఛం స్వతస్సిద్ధ మిత్యాచమనీయం, చిచ్చంద్రమయీ సర్వాంగస్రవణగ్ం స్నానం, చిదగ్నిస్వరూప పరమానందశక్తిస్ఫురణం వస్త్రం, ప్రత్యేకగ్ం సప్తవింశతిధా భిన్నత్వే నేచ్ఛాజ్ఞానక్రియాత్మక బ్రహ్మగ్రంధివ ద్రసతంతు బ్రహ్మనాడీ బ్రహ్మసూత్రం, స్వవ్యతిరిక్త వస్తుసంగరహితస్మరణం విభూషణం, సత్సంగపరిపూర్ణతానుస్మరణం గంధః, సమస్తవిషయాణాం మనసః స్థైర్యేణానుసంధానం కుసుమం, తేషామేవ సర్వదా స్వీకరణం ధూపః, పవనావిచ్ఛిన్నోర్ధ్వజ్వలన సచ్చిదుల్కాకాశదేహో దీపః, సమస్త యాతాయాతవర్జం నైవేద్యం, అవస్థాత్రయైకీకరణం తాంబూలం, మూలాధారా దాబ్రహ్మరంధ్ర పర్యంతం, బ్రహ్మరంధ్రాదామూలాధారపర్యంతం గతాగతరూపేణ ప్రాదక్షిణ్యం, తురీయావస్థా నమస్కారః, దేహశూన్యప్రమాతృతా నిమజ్జనం బలిహరణం, సత్వమస్తి కర్తవ్యమకర్తవ్య మౌదాసీన్య నిత్యాత్మవిలాపనగ్ం హోమః, స్వయం తత్పాదుకా నిమజ్జనం పరిపూర్ణ ధ్యానం. ఏవం ముహూర్తత్రయభావనయా యుక్తో భవతి తస్య దేవతాత్మైక్యసిద్ధిః. చింతితకార్యాణ్యయత్నేన సిధ్యంతి స ఏవ శివయోగీతి కథ్యత ఇత్యుపనిషత్. భద్రం కర్ణేభిరితి శాంతిః.

**పరాపూజాస్వరూపం.**

**తదుక్తం నిత్యాతంత్రే శివేన:—**

శ్లో. తవ నిత్యోదితా పూజా త్రిభిర్భేదైర్వ్యవస్థితా,
పరా చాప్యపరా గౌరి తృతీయా చ పరాపరా.
ప్రథమా ద్వైతభావస్థా సర్వప్రచయగోచరా,
ద్వితీయా చక్రపూజా చ సదా నిష్పాద్యతే మయా,
ఏవం జ్ఞానమయే దేవి తృతీయా స్వప్రథామయీతి.

**సూతసంహితాయాం:—**

శ్లో. పూజాశక్తేః పరాయాస్తు ద్వివిధా సంప్రకీర్తితా,
పూజా యాఽభ్యంతరా సాఽపి ద్వివిధా పరికీర్తితా.
సాధారా చ నిరాధారా నిరాధారా మహత్తరా,
సాధారా యా తు సాఽఽధారే నిరాధారా తు సంవిది.
ఆధారే వర్ణసంక్లృప్తవిగ్రహే పరమేశ్వరీం,

ఆరాధయేదతిప్రీత్యా గురుణోక్తేన వర్త్మనా.
ఆధారం నామ శ్రీచక్రం.
యా పూజా సంవిది ప్రోక్తా సా తు తస్యాం మనోలయః.
సంవిదేవ పరాశక్తి ర్నేతరా పరమార్థతః,
అతస్సంసారనాశాయ సాక్షిణీ మాత్మరూపిణీం,
ఆరాధయే త్పరాశక్తిం ప్రపంచోల్లాసవర్జితాం.
స్వానుభూత్యా స్వయం సాక్షాత్స్వాత్మభూతాం మహేశ్వరీం,
పూజయేదాదరేణైవ పూజా సా పురుషార్థదా ఇతి.

శ్రు. దేహో దేవాలయః ప్రోక్తో జీవో దేవస్సనాతనః,
త్యజేదజ్ఞాననిర్మాల్యం సోఽహంభావేన పూజయేదితి.

**పరాహోమము.**

**స్వతంత్రతంత్రే:—**

శ్లో. వాచ్యావ్యర్థానా మశేషేణ వేద్యవేతృవిదాత్మనాం,
స్థితిః పరో భవేద్ధోమ స్సర్వభేదవిలాపనాత్.
స్వాత్మరూపమహావహ్ని ర్జ్వాలారూపేషు సర్వదా,
నిరింధనం చేద్ధరూపే పరమాత్మని సుస్థిరే,
నిర్వ్యర్థానవిలాపస్తు పరాహోమ స్సమీరితః.

**శ్రుత్యంతరం:—**

శ్రు. అంతర్నిరంతర నిరంధన మేధమానే
మోహాంధకారపరిపంథిని సంవిదగ్నౌ,
కస్మింశ్చిదద్భుతమరీచి వికాసభూమౌ
విశ్వం జుహోతి వసుధాదిశివావసానం.

శ్రు. సదాసాంగ్రహణ్యేష్ట్యాశ్వమేధాంత మంతర్యాగం యజతే,
స మహామఖో మహాయాగః, కృత్స్న మేతచ్చిత్రం కర్మ ఇతి.

శ్లో. అగ్నౌ వహ్ని ర్ఘృతం సర్వ మగ్ని రేవ భవేద్యథా,
విదితం విదితం వేద్యం సంవిదేవ భవేత్తథా,
సంవిదితం సంవిదితం సంవిన్మయమేవ భవతి సంవేద్యం,
అగ్నా వాహిత మాహిత మగ్నిమయం కిం న జాయతే కాష్ఠం.
ఉపదేశా దయం వాదః జ్ఞాతే ద్వైతం న విద్యతేతి.

పరానిష్ఠాస్వరూపము.

సూతసంహితాయాం:—

శ్లో. శాస్త్రాచార్యోపదేశేన తర్కైశ్శాస్త్రానుసారిభిః,
సర్వసాక్షితయాఽఽత్మానం సమ్యఙ్నిశ్చిత్యసుస్థిరః,
స్వాత్మనోఽన్యతయా భాంతం సమస్తమవిశేషతః,
స్వాత్మమాత్రతయా బుద్ధ్వా పునస్స్వాత్మానమద్వయం,
శుద్ధబ్రహ్మేతి నిశ్చిత్య స్వయం స్వానుభవేన చ.
నిశ్చయం చ స్వచిన్మాత్రే విలాప్యావిక్రియేద్వయే,
విలాపనం చ చిద్రూపం బుద్ధ్వా కేవలరూపతః,
స్వయం తిష్ఠేదయం సాక్షాద్బ్రహ్మవిత్ప్రవరో మునిః,
ఈదృశీయం పరా నిష్ఠా శ్రౌతీ స్వానుభవాత్మికేతి.

౨౧౦-వ సూత్రము, శ్రీవిద్యాగురుపరంపర.

మూ. పరమానందానుభవః పరమగురుర్నిర్విశేషబింద్వాత్మా,
సపునః క్రమేణ భిన్నః కామేశత్వం యయావిమర్శాంశాత్.

అర్థము. పరమానందానుభవః = ఉత్కృష్టమయిన పూర్ణాహంభావ రూపజ్ఞానముగల, నిర్విశేషబింద్వాత్మా = ప్రకాశవిమర్శమిశ్రబిందు సమష్టిరూపమయిన, పరమగురుః = సకలగురు మండలస్వరూప పరమాత్మ, అభూత్ = ఆయెను. సపునః=పూర్వోక్త పరమాత్మయే, క్రమేణ భిన్నః = దివ్యసిద్ధమానవౌఘములను వేరువేరుగా పొంది, విమర్శాంశాత్ = పూర్వోక్తలక్షణ స్వాత్మశక్తి స్వరూప కామకల యొక్క అర్థభాగమువలన, కామేశత్వం = కామేశ్వరభావమును యయౌ = పొందెను.

తా. ఇంతవరకు అవిద్యాపాదమందు సృష్టిక్రమమును, విద్యాపాదమందు శ్రీవిద్యామంత్రసంకేత మంత్రార్థాదులును, ఆనందపాదమందు శ్రీచక్రరహస్యములును, తురీయపాదమందు చిద్బిందువివరము పరమాత్మస్వరూపమును వివరించి, ఈ బ్రహ్మవిద్యావతార క్రమము తెలియనిచో విశ్వాసబుద్ధి కలుగనేరదని లోకముం దనుగ్రహబుద్ధితో నీగ్రంథకర్తలు పరమశివాది ఓఘత్రయమును నిరూపించుచున్నారు.

పూర్ణబిందుస్వరూప పరమాత్మ తనయందిమిడియున్న బిందు త్రయమును క్రమముగా విభజించి, ప్రకాశాంశ విమర్శాంశలచే కామేశ్వర - కామేశ్వరీ రూపములను ధరించి, తరువాత ఓఘత్రయ రూపమును పొందినారని చెప్పిరి.

౫౧-వ సూత్రము.

**మూ. ఆసీనశ్శ్రీపీఠే కృతయుగకాలే గురుశ్శివో విద్యామ్,**
**తస్యై దదౌ స్వశక్త్యై కామేశ్వర్యై విమర్శరూపిణ్యై.**

అర్థము. శ్రీపీఠే=పరమానంద విశ్రాంతబిందురూపోడ్యాణ పీఠమందు, ఆసీనః = నిత్యసన్నిహితమయినందున కూర్చున్నట్టి, గురుః = ప్రకాశాంశాత్మక ఊర్ధ్వానంద నామకగురురూప పరమాత్మ అయిన కామేశ్వరుఁడు, తస్యై విమర్శరూపిణ్యై = పూర్వోక్త విమర్శరూపమయిన, స్వశక్త్యై = అనుత్తరాంశభూతమయిన, కామేశ్వర్యై=సర్వాభీష్టప్రదాయినియగు కామేశ్వరికొఱకు, కృతయుగకాలే = జగదుత్పత్త్యనంతరావ్యవహితకాలమందు, విద్యాం=స్వాత్మైక్యదాయిని యగు శ్రీవిద్యను, దదౌ = ఉపదేశించెను.

తా. సృష్ట్యావిర్భావకాలము కృతయుగాదిగాన నాకాలమందు సర్వానందమయోడ్యాణమనే బిందుపీఠమందు నిత్యసన్నిహితమయిన పరమాత్మ స్వరూపకామేశ్వరుఁడు ఊర్ధ్వానందనామమును ధరించి, అనుత్తరానంద విశ్రాంతి స్థానభూతశక్తి స్ఫారరూపిణియగు స్వాత్మరూప కామేశ్వరికొఱకు నీ శ్రీవిద్యారూపాత్మవిద్యను ఉపదేశించినారని స్వతంత్రతంత్రమనే ఈశ్రీవిద్యాతంత్రమందు కామేశ్వరీ కామేశ్వరులకు సమప్రధాన వర్తిత్వము కలిగినను, సర్వోపనిషత్కారణ భూతమయిన నీరహస్యతంత్రమును లోకమందనుగ్రహబుద్ధితో ప్రవర్తింప చేయగోరి పరమాత్మయే గురుశిష్యభావమును పొంది స్వశక్తికొఱకు ఉపదేశించెనని భావము.

౫౨, ౫౩ సూత్రములు.

**మూ. సేయామిత్రసంజ్ఞాం స్థానేశాన్ జ్యేష్ఠమధ్యబాలాఖ్యాన్,**
**చిత్ప్రాణవిషయభూతాన్ త్రేతాయుగాదికారణత్రిగురూన్.**

**మూ. బీజత్రితయాధిపతీన్పరీక్ష్య విద్యాం ప్రకాశయామాస,**
**ఏతైరోఘత్రితయం సమనుగృహీతం గురుక్రమో విదితః.**

అర్థము. సా = ఆకామేశ్వరీస్వరూప పరాశక్తి, మిత్రసంజ్ఞాం ఇయాయ=మిత్రేశదేవనాథ సంజ్ఞనుపొంది, చిత్ప్రాణవిషయభూతాన్ = తనయొక్క చిత్ప్రాణవిషయస్వరూపులైన, స్థానేశాన్ = మధ్యత్రశ్రస్యాగ్రకోణ దక్షిణోత్తరకోణాధిపతులయిన, జ్యేష్ఠమధ్య బాలాఖ్యాన్=ఊర్ధ్వదేవనాథ, షష్ఠీశదేవనాథ, మిత్రేశదేవనాథులను, త్రేతాయుగాదికారణ త్రిగురూన్ = త్రేతాయుగాది కారణగురువులుగా, బీజత్రితయాధిపతీన్ = వాగ్భవ-కామరాజ-శక్తి బీజత్రయాధిపతులను, దేశికాన్=గురుస్వరూపులనుగా, పరీక్ష్య = శోధించి, సా=ఆమిత్రేశదేవనాథ సంజ్ఞకల కామేశ్వరి, విద్యాం = పరశివ చరణారవింద నిస్సృతమయిన శ్రీవిద్యను, ప్రకాశయామాస=ఉపదేశించెను. ఏతైః=ఈయుగత్రయగురువులచేతను, ఓఘత్రితయం = దివ్య-సిద్ధ-మానవౌఘత్రయము, సమనుగృహీతం=అనుగ్రహింపఁబడినది, గురుక్రమః=ఈ బ్రహ్మవిద్యాగురుపరంపర, విదితః= తెలియఁబడినది.

తా. పరమాత్మస్వరూప పరశివుఁ డీ శ్రీవిద్యను లోకము ననుగ్రహము కలిగి ప్రవర్తింపఁ జేయఁగోరి తాను ఊర్ధ్వదేవనాథనామమును ధరించి కామేశ్వరిదేవి కుపదేశించి ఆమెకు మిత్రేశదేవనాథనామ మొసంగెను. ఆకామేశ్వరీ ఊర్ధ్వదేవనాథ ద్వంద్వము సర్వానందమయోడ్యాణ పీఠమందు పురాణదంపతులుగా నున్నారు.

ఇదియే విద్యాప్రథమోత్పత్తి. పరమేశ్వరసంకల్పానుసారముగా కామకలాస్వరూపిణి యగు నాపరాభట్టారిక ఈచిద్విద్యాసంప్రదాయరహస్యములను విస్తరింపఁగోరి తాను షష్ఠీశదేవనాథనామమును ధరించి తనయొక్క చిత్ప్రాణవిషయభూతు లయిన అవ్యక్తమహత్తత్త్వాహంకారస్వరూపులును, సత్వరజస్తమోగుణప్రధానులును, వాగ్భవకామరాజ శక్తిబీజాధిపతులు నగు జ్యేష్ఠ, మధ్య, బాలులను సంజ్ఞలుగల త్రేతాయుగాదికారణ గురువులయిన ఉమామహేశ్వర, లక్ష్మీనారాయణ, వాణీహిరణ్యగర్భులనే ద్వంద్వత్రయమును, ఈరహస్యవిద్యోపదేశయోగ్యులుగా నెంచి వారి కుపదేశించెను. వారివలన

ఉపదేశపరంపరగా ప్రవర్తించి దివ్యౌఘ, సిద్ధౌఘ, మానవౌఘరూప గురుమండలక్రమముగా సీవిద్య అవతరించి జగత్తునందు వ్యాపించినది.

బిందుమండలవర్తినియగు నాకామేశ్వరీయోనిచక్రోత్తరకోణమందున్న బిందురూప జాలంధరపీఠస్థితశక్తి బీజాత్మక జ్యేష్ఠసంజ్ఞకల ఉమామహేశ్వరద్వంద్వమున కుపదేశించి వారికి ఊర్ధ్వదేవనాథ కామేశ్వర్యంబా నామములను నిర్దేశించెను.

ఆ ఊర్ధ్వదేవనాథ ద్వంద్వము దక్షిణకోణస్థ బిందురూప పూర్ణగిరిపీఠస్థిత కామరాజ బీజాధిపతులయిన లక్ష్మీనారాయణ ద్వంద్వమున కుపదేశించి వారికి షష్ఠీశదేవనాథానంద వజ్రేశ్వర్యంబా నామముల నొసంగెను.

ఆషష్ఠీశదేవనాథానంద ద్వంద్వము స్వాగ్రకోణమందున్న కామగిరిపీఠస్థ వాగ్భవ బీజాధిపతులయిన వాణీహిరణ్యగర్భుల కుపదేశించి వారికి మిత్రేశదేవనాథానంద భగమాలిన్యంబా నామములను నిరూపించెను.

ఆ మిత్రేశదేవనాథానంద ద్వంద్వమువలన ఇంద్రాది దివ్యౌఘమునకును, వారివలన సనకాది సిద్ధౌఘమునకును, వారివలన మానవౌఘమునకును, ఉపదేశపారంపర్యాయముగా స్వస్వగురుపర్యంత మీకాది విద్యాపరంపర ప్రపంచమందు వికసించి ప్రకాశించుచున్నది.

౫౪-వ సూత్రము, గ్రంథోత్పత్తి కథనము.

**మూ.** ఉదితః పుణ్యానందాదితి కామకలాంగనావిలాసోఽయం,

పరశివభుజంగభావాకర్షణహర్షాయ కల్పతాం నిత్యమ్.

అర్థము. పుణ్యానందాత్ =పుణ్యానందమునీంద్రులవలన, ఉదితః= రచియింపఁబడిన, అయం కామకలాంగనావిలాసః=ఈపరిదృశ్యమానమయిన కామకలావిలాసము, పరశివభుజంగ భావాకర్షణహర్షాయ = రసికాగ్రేసరుఁడయిన పరశివునియొక్క శృంగారరసజనకమయిన ఉత్సాహముకొరకు, నిత్యం = సర్వదా, కల్పతాం = పఠింపఁబడుఁగాక.

తా. ఈగ్రంథము పుణ్యానందమునీంద్ర విరచితమయి కామకలావిలాసమని నామము కలిగియున్నది. వేదాంతప్రకరణమందు పుణ్యపాప

శబ్దములు జ్ఞానాజ్ఞానపరములుగాన ప్రపంచభాగ్యస్వరూపమయిన బ్రహ్మానందస్వరూప పరశివావతార శ్రీదక్షిణామూర్తిగురుముఖావిర్భావమును, పరభట్టారికాముఖ పంకజాయత్న నిస్సారితంబునగు నీగ్రంథమును, శృంగారవీరకరుణాది నవరసములును, రత్యుత్సాహాది నవభావములును సర్వానంద బిందుమండలవాసులగు కామేశ్వరీద్వంద్వమనే యీ ఆదిదంపతులవలననే కలిగి, లోకమందు విస్తరించినవి గాన పరశివ చిత్తరంజనముకొఱకు నిత్యము నీగ్రంథము పఠింపఁదగినదని చెప్పిరి.

ఈగ్రంథపఠనమునకును, ఈశ్వరానందమునకు నేమి సంబంధమనిన: ఈగ్రంథము కామకలావిలాసముగానున్నది. ఆకామకల ప్రకాశ విమర్శాత్మకశివశక్తిసంపుటము. దాని విలాసమనఁగా కార్యవర్గము, శ్రీవిద్య, శ్రీచక్రము, పిండాండము, బ్రహ్మాండము, మాతృక, తత్త్వ సమూహము అనునివి ఆ ఆదిదంపతులవలన కలిగినందున, నీసకలగ్రంథము వారి ప్రభావముగాన, రసికులకు శృంగారరసజనకాంగనా విలాసములానందకరములుగాన నీగ్రంథపఠనమువలన ఈశ్వరానుగ్రహమును పొందఁగలరు. స్వస్వరూపజ్ఞానము కలిగి పూర్ణానందానుభవమును పొందుదురని తాత్పర్యము.

ఇచట స్వరూపజ్ఞానదార్ఢ్యముకొఱకు కొన్ని ఉపనిషద్రహస్య వాక్యములు నిరూపింపఁబడుచున్నవి:—

**ఉపనిషద్వాక్యములు. తత్రాదౌ మహామాయాస్వరూపము.**

శ్రు. మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరం,
అస్యావయవభూతైస్తు వ్యాప్తం సర్వమిదం జగత్.
ఇతి శ్వేతాశ్వతరోపనిషత్.

ద్వే విద్యే వేదితవ్యే ఇతి హస్మ యద్బ్రహ్మవిదో వదంతి.

పరా చైవాపరా చ, తత్ర పరా బ్రహ్మవిద్యారూపా, అపరా ప్రపంచాకారా సా మాయా. ఏవ మేవైషా మాయా, స్వవ్యతిరిక్తాని పూర్ణాని క్షేత్రాణి దర్శయిత్వా జీవేశావాభాసేన కరోతి. మాయా చావిద్యా చ స్వయమేవ భవతి. సైషా చిత్రా సుదృఢా బహ్వంకురా అంకురేష్వపి గుణభిన్నా ఇతి నృసింహతాపిన్యాం.

జ్ఞానినామపి చేతాంసి దేవీ భగవతీ హి సా,
బలాదాకృష్య మోహాయ మహామాయా ప్రయచ్ఛతీతి. ౧
అచింత్యరచనారూపం మాయైవ సకలం జగత్,
ఇతి నిశ్చిత్య వస్తుత్వ మద్వైతే పరిశేష్యతామ్. ౨
తుచ్ఛాఽనిర్వచనీయా చ వాస్తవీ చేత్యయం త్రిధా,
జ్ఞేయా మాయా త్రిభిర్బోధైశ్శ్రౌతయౌక్తికలౌకికైః. ౩
అస్వతంత్రా హి మాయా స్యాదప్రతీతేర్వినాచితిం,
స్వతంత్రాపి తథైవ స్యాదసంగస్యాన్యథాకృతేః. ౪
కూటస్థాసంగమాత్మానం జగత్త్వేన కరోతి సా,
చిదాభాసస్వరూపేణ జీవేశావపి నిర్మమే. ౫
కూటస్థ మనుపద్రుత్య కరోతి జగదాదికం,
దుర్ఘటైకవిధాయిన్యాం మాయాయాం కా చమత్కృతిః. ౬
న వేత్తి లోకో యావత్తం సాక్షాత్తావచ్చమత్కృతిం,
ధత్తే మనసి పశ్చాత్తు మాయైవేత్యుపశామ్యతి. ౭
ద్రవత్వముదకే వహ్నావౌష్ణ్యం కాఠిన్యమశ్మని,
మాయాయాం దుర్ఘటత్వం చ స్వతస్సిధ్యతి నాన్యతః. ౮
ప్రసరంతి హి చోద్యాని జగద్వస్తుత్వవాదిషు,
న చోదనీయం మాయాయాం తస్యాశ్చోద్యైకరూపతః. ౯
విస్మయైకశరీరాయా మాయాయాశ్చోద్యరూపతః,
అన్వేష్య పరిహారస్యాస్యబుద్ధిమద్భిః ప్రయత్నతః. ౧౦
మాయాం త్వమేవ నిశ్చేయమితి చేత్తర్హి నిశ్చిను,
లోకప్రసిద్ధమాయాయాః లక్షణం యత్తదీక్ష్యతామ్. ౧౧
న నిరూపయితుం శక్యా విస్పష్టం భాసతే చ యా,
సా మాయేతీంద్రజాలాదౌ లోకాస్సంప్రతిపేదిరే. ౧౨
నిరూపయితు మారబ్ధే రఖిలైరపి పండితైః,
అజ్ఞానం పురతస్తేషాం భాతి కక్ష్యాసు కాసు చిత్. ౧౩
దేహేంద్రియాదయో భావా వీర్యేణోత్పాదితాః కథం,
కథం వా తత్ర చైతన్య మిత్యుక్తే తే కిముత్తరమ్. ౧౪
ఏతస్మాత్కిమివేంద్రజాల మపరం యద్గర్భవాసే స్థితం,

శేతశ్చేతతి హ_స్తమ_స్తకపదప్రోద్భూతనానాంకురం,
పర్యాయేణ శిశుత్వయౌవనజరావేషైరనేకైర్వృతం
పశ్యత్యత్తి శృణోతి జిఘ్రతి తథా గచ్ఛత్యథాగచ్ఛతి. ౧౫
అచింత్యరచనాశక్తిబీజం మాయేతి నిశ్చిను,
మాయాబీజం తదేవైకం సుషుప్తావనుభూయతే. ౧౬

**మాయాపరిహారః, మహోపనిషత్.**

సతి దీప ఇవాలోకస్సత్యర్క ఇవ వాసరః,
సతి పుష్ప ఇవామోదశ్చితి సత్యాం జగత్తథా. ౧
ప్రతిభాసత ఏవేదం నజగత్పరమార్థతః,
జ్ఞానదృష్టౌ ప్రసన్నాయాం ప్రబోధవితతోదయే,
యథావజ్జ్ఞాస్యసి స్వస్థో మద్వాగ్వృష్టిబలాబలమ్. ౨
అవిద్యయైవోత్తమయా స్వార్థనాశోద్యమార్థయా,
విద్యా సంపాద్యతే బ్రహ్మన్ సర్వదోషాపహారిణీ. ౩
శామ్యతి హ్యస్త్రమస్త్రేణ మలేన క్షాళ్యతే మలం,
శమం విషం విషేణైవ రిపుణా హన్యతే రిపుః. ౪
ఈదృశీ భూతమాయేయం యాస్వనాశేన హర్షదా,
న లక్ష్యతే స్వభావోఽస్యా వీక్ష్యమాణైవ నశ్యతి. ౫
నాస్త్యేషా పరమార్థేనేత్యేవం భావనయేద్ధియా,
సర్వం బ్రహ్మేతి యస్యాంతర్భావనా సాహి ముక్తిదా. ౬
భేదదృష్టి రవిద్యేయం సర్వథా తాం విసర్జయేత్,
మునే నాపాద్యతే తద్ధి పదమక్షయ్య ముచ్యతే. ౭
కుతో జాతేయమితి తే ద్విజ మాస్తు విచారణా,
ఇమాం కథమహం హన్మీత్యేషా తేఽస్తు విచారణా. ౮
ఇతి మాయాపరిహారః.

**అజ్ఞానాది సప్తావస్థలవివరము.**

విద్యారణ్యకృతపంచదశ్యాం.

శ్లో. అజ్ఞానావృతివిక్షేప ద్వివిధజ్ఞానతృప్తయః,
శోకాపగమ ఇత్యేతే యోజనీయాశ్చిదాత్మని. ౧

తా. అజ్ఞానము, ఆవరణము, విక్షేపము, పరోక్షజ్ఞానము, అపరోక్షజ్ఞానము, నిరంకుశమయిన తృప్తి, దుఃఖనివృత్తి అనే ఈసప్తావస్థలును చిదాభాసుఁడగు జీవునియందు కల్పించ తగినవని, యిందువలన ఆత్మకు నే అవస్థాభేదము లేదని తెలియఁచున్నది.

శ్లో. సంసారాసక్తచిత్తస్సన్ చిదాభాసః కదాచన,
స్వయంప్రకాశ కూటస్థం స్వతత్వం నైవ వేత్త్యయమ్. ౨

తా. ఈచిదాభాసుఁడగు జీవుఁడు సర్వదా సంసారమందాసక్తి గలవాఁడై యుండి, ఒకానొకప్పుడయినను స్వతస్సిద్ధమయిన ప్రకాశత గల సాక్షిస్వరూపమయిన కూటస్థుని తన నిజరూపమని తెలిసుకోలేఁడు. తలంపఁడని తా.

శ్లో. న భాతి నాస్తి కూటస్థ ఇతి వక్తి ప్రసంగతః,
కర్తా భోక్తా ఒహ మస్మీతి విక్షేపం ప్రతిపద్యతే. 3

తా. కూటస్థుఁడే తననిజరూపమని తెలుసుకోలేక పోవడమేగాక నాప్రసంగము కలిగినపుడు కూటస్థుఁడనే వాఁడు లేనేలేఁడు. ఎక్కడను అగుపడఁడు. నేనే కర్తను. పుణ్యపాపములను చేసెడివాఁడను. నేనే భోక్తను. ఆయాఫలముల ననుభవించువాఁడనని విక్షేపమును, విపరీత బుద్ధినిశ్చయమును కూడ నాజీవుఁడు పొందుచున్నాఁడు.

శ్లో. అస్తి కూటస్థ ఏవాస్మీత్యేవం వేత్తి విచారతః,
కర్తా భోక్తేత్యేవమాది శోకజాలం ప్రముంచతి. ౪

తా. అదృష్టవశముచే తన నిజరూపమును తెలుసుకుందామనే విచారణ (ఆత్మానాత్మవిచారణ) కలిగినపుడు కూటస్థుఁడు కలఁడు, అతనే తన నిజరూపమని తెలుసుకొనుచున్నాఁడు తాను కూటస్థరూపుఁడనని తెలిసినపుడు నేనే కర్తను భోక్తను అనే దుఃఖసమూహముగల జీవ భావము, నానిజరూపము కాదని తెలిసినందున సకలదుఃఖములవలన పూర్తిగా విడువఁబడుచున్నాఁడు. అవిద్యాముక్తుఁడగుచున్నాఁడని తాత్పర్యము.

శ్లో. కృతం కృత్యం ప్రాపణీయం ప్రాప్తమిత్యేవ తుష్యతి. ౫

తా. దుఃఖనివృత్తి మాత్రమేగాక స్వరూపజ్ఞానసాధనమైన ఈమనుష్యజన్మకలిగినందుకు చేయఁదగినపని చేయఁబడినది; పొందఁదగిన

తన నిజరూపమును పొందినానని సంశయవిపర్యయరహితమయిన నిశ్చయము కలవాఁడై సంతోషించుచున్నాఁడు.

ఆసప్తావస్థలవివరము.

శ్లో. అజ్ఞాన మావృతి స్తద్వద్విక్షేపశ్చ పరోక్షధీః,
అపరోక్షమతిశ్శోకమోక్ష స్తృప్తిర్నిరంకుశా. ౬

తా. వెనుకచెప్పిన అజ్ఞానాది సప్తావస్థలస్వరూపమును ప్రత్యేకముగా వివరించుచున్నారు. అజ్ఞానము, ఆవరణము, విక్షేపము, పరోక్షజ్ఞానము, అపరోక్షజ్ఞానము, శోకమోక్షము, నిరంకుశమయిన తృప్తి ఇవి సప్తావస్థలు.

శ్లో. సప్తావస్థా ఇమాస్సంతి చిదాభాసస్య తాస్విమౌ,
బంధమోక్షౌ స్థితౌ తత్ర తిస్రో బంధకృతః స్మృతాః. ౭

తా. ఈసప్తావస్థలు చిదాభాసుఁడయిన జీవునికేగాని పరమాత్మకునే అవస్థాభేదమును లేదనియు, నీసప్తావస్థలయందు బంధమోక్షములను నని రెండును ఇమిడియున్నవని చెప్పిరి. ఎట్లనిన: ఆదినున్న అజ్ఞానము ఆవృతి, విక్షేపము నీమూడును జీవునికి బంధకారణములుగా నున్నవి. పరోక్షజ్ఞానము, అపరోక్షజ్ఞానము, శోకనివృత్తి, తృప్తి ఈనాలుగును జీవునికి మోక్షసాధనములుగా నున్నందున నీసప్తావస్థలందు బంధమోక్షములున్నవని చెప్పిరి. "అసంగోఽయం పురుషః" ఈశ్రుతివలన "పూర్షు స్థూలసూక్ష్మకారణశరీరేషు శయతి తిష్ఠతీతి పురుషః" అయం పురుషః=సాక్షిస్వరూప పరమాత్మ, అసంగః=ఏసంబంధమును లేనివాఁడు, అని తెలియుచున్నందున అన్ని అవస్థలు జీవునికేగాని ఆత్మకు ఏ అవస్థాభేదమును లేదని తెలియుచున్నది.

౧ అజ్ఞానలక్షణం:—

శ్లో. న జానామీత్యుదాసీనవ్యవహారస్య కారణం,
విచారప్రాగభావేన యుక్తమజ్ఞానమీరితమ్.

తా. అజ్ఞానమనఁగా వస్తువుయొక్క నిజరూపము తెలియక పోవుట. ఇదియే తమస్సని, మాయాశక్తి యని యనఁబడును. స్వరూపవిచారణకు పూర్వము బ్రహ్మవస్తువనేది నాకు తెలియదని ఉదాసీనుఁడుగా నుండుటయే అజ్ఞానమనఁబడును.

**౨. ఆవరణలక్షణము:—**

శ్లో. అమార్గేణ విచార్యాథ నాస్తి నో భాతి చేత్యసౌ,
విపరీతవ్యవహృతి రావృతేః కార్య మిష్యతే. ౯

తా. ఆవృతి, ఆవరణశక్తి శాస్త్రసజ్జనోపదేశములను విడచి అమార్గముగా తనకుఁ దోఁచినట్లు విచారించి, బ్రహ్మవస్తువనునది లేనే లేదు, అది అగుపడలేదనే విపరీతవ్యవహారము కలుగుట ఆవరణ మనఁ బడును. ఇదియును మాయాకార్యముగనే యున్నది.

**3. విక్షేపవివరము:—**

శ్లో. దేహద్వయచిదాభాసరూపో విక్షేప ఈరితః,
కర్తృత్వాద్యఖిలశ్శోకప్రసంసారాఖ్యోఽస్య బంధకః. ౧౦

తా. విక్షేప మనఁగా విక్షేపశక్తి. అహమహమని వ్యవహరించుచున్న తాను స్థూలసూక్ష్మములనే దేహద్వయముకలవాఁడను, చిదాభాసుఁడగు జీవస్వరూపుఁడ ననే జ్ఞానము విక్షేపమనఁబడును. ౧. అజ్ఞానము తమస్సనే మాయాశక్తి. ౨. ఆవరణశక్తి. 3. విక్షేపశక్తులు నా మాయాశక్తియొక్క కార్యవర్గములుగా నున్నవి. ఈ అజ్ఞాన, ఆవృతి, విక్షేపములనే మూఁడవస్థలును జీవునికి బంధకారణములుగా నున్నవి. ఆవరణశక్తి విక్షేపశక్తులు రెండును మాయాకార్యములు.

ఈశక్తిత్రయమువలన జీవునికి కర్తృత్వభోక్తృత్వరూపాభిమానమారోపిత మయినందున సంసారమనే శోకజాలము కలిగినది. ఈ అవస్థాత్రయమునకు దృష్టాంతము. ఇవి రజ్జువందు సర్పభ్రమవంటివి. అంధకారమందు రజ్జువందు రజ్జుజ్ఞానాభావము, అజ్ఞానము, అందు సర్పభ్రమ అవరణశక్తి సర్పత్వనిశ్చయము కలిగి, భయకంపాదులును, పలాయనాదులును కలుగుట విక్షేపశక్తిగా నున్నవి.

దార్ష్టాంతికమందు స్వయంప్రకాశుఁడును, సర్వాంతర్యామియు నగు సాక్షి ఆత్మస్వరూపుఁడని తెలియకపోవుట అజ్ఞానము. అంతఃకరణ యనే అవిద్యోపాధియందుఁగల నాసాక్షి ప్రతిబింబము చిదాభాసుఁడు. జీవుఁడనే వస్తువుగానున్నది. అది తన నిజరూపమనుకొనుట ఆవరణశక్తి ధర్మము. ఆనిశ్చయముతో కులగోత్రవయో రూపములుగల స్థూలశరీ

రము తాననియు, కర్తృత్వభోక్తృత్వములు గలవాఁడననే ఐహిక సంసారాభిమానమును, జీవత్వముతనదని, పూర్వాపరజన్మలును, జనన మరణాదులును, పుణ్యపాప కర్మఫలానుసారము స్వర్గ నరకాదిలోకాంతరగమనాదులును, తనకుఁ గలవనే నిశ్చయము విక్షేపశక్తిధర్మముగా నున్నది.

౪. పరోక్షజ్ఞానలక్షణము:—

శ్లో. ఆత్మా వా ఇదమిత్యాదౌ పరోక్షం బ్రహ్మ దర్శితం,
అధ్యారోపాపవాదాభ్యాం ప్రజ్ఞానం బ్రహ్మ దర్శితం. ౧౧
అవాంతరేణ వాక్యేన పరోక్షబ్రహ్మధీ ర్భవేత్,

తా. "ఆత్మావా ఇదగ్ సర్వః అస్తి బ్రహ్మేతి వ్యజానాత్." ఈ మొదలగు శ్రుతులయందు సకలప్రపంచము ఆత్మస్వరూపమనియు, బ్రహ్మ వస్తువు కలదనియు, నాబ్రహ్మవస్తువునందు అధ్యారోపముగానున్న ప్రజ్ఞానము బ్రహ్మయని, ఎచటనో బ్రహ్మవస్తువనునది కలదని తెలియుట పరోక్షజ్ఞాన మనఁబడును.

౫. అపరోక్షజ్ఞానలక్షణము:—

శ్లో. సర్వత్రైవ మహావాక్యవిచారా దపరోక్షధీః. ౧౨
బ్రహ్మాపరోక్షసిద్ధ్యర్థం మహావాక్య మితీరితం,
వాక్యవృత్త్యా వతో బ్రహ్మాపరోక్ష్యే విమతిర్నహి. ౧౩

తా. అపరోక్షజ్ఞానమనఁగా, తత్త్వమస్యాది ఆప్తోపదేశములగు మహావాక్యార్థమువలన చిత్స్వరూపుఁడగు సాక్షియే, తన నిజరూపమనియు, చిదాభాసుఁడగు జీవత్వము నాసాక్షిప్రతిబింబముగాన మిథ్యయని, తానే బ్రహ్మవస్తువుగా నున్నట్లు చెప్పుచున్న యితర మహావాక్యములవలనను కలిగినజ్ఞానము అపరోక్షజ్ఞాన మనఁబడును. మహావాక్యము లందంతటను ఆత్మబ్రహ్మల నైక్యముగ బ్రహ్మపరోక్షజ్ఞానమే తెలియఁబడుచున్నది.

బ్రహ్మవస్తువనునది కలదనే పరోక్షజ్ఞానమువలన లేదనే ఆవరణశక్తి నశించుచున్నది. శబ్ద స్పర్శ రూపాదులను గ్రహించే ప్రజ్ఞానమే బ్రహ్మవస్తువనే అపరోక్షజ్ఞానమువలన బ్రహ్మవస్తువు అగుపడదనే విక్షేపశక్తియు నశించినది. ఇటుల పరోక్షాపరోక్షములనే జ్ఞానద్వయము

చేతను అజ్ఞానము తనకార్యవర్గమయిన ఆవరణ విక్షేపములతో సహా నశించినందున, అవిద్యాకల్పితమయిన జీవత్వభ్రమ నివర్తించి కర్తృత్వాదిశోకజాలము నశించునని చెప్పిరి.

**౬. శోకనివృత్తిః—**

శ్లో. జ్ఞానద్వయేన నష్టేఽస్మిన్నజ్ఞానే తత్కృతావృతిః,
న భాతి నాస్తి చేత్యేషా ద్వివిధాఽపి వినశ్యతి. ౧౪
పరోక్షజ్ఞానతో నశ్యే దసత్త్వావృతిహేతుతా,
అపరోక్షజ్ఞాననాశ్యే హ్యభానావృతిహేతుతా. ౧౫
అభానావరణే నష్టే జీవత్వారోపసంక్షయాత్,
కర్తృత్వాద్యఖిలశ్శోకః సంసారాఖ్యో నివర్తతేతి. ౧౬

తా. ఈపరోక్షాపరోక్షజ్ఞానద్వయమువలన ఆవరణవిక్షేప శక్తులతోఁ గూడ అజ్ఞానము నశించనందున (జీవత్వారోపణ క్షయించినందున) కర్తృత్వ భోక్తృత్వాది శోకజాలము నశించును.

**౭. తృప్తిలక్షణము:—**

శ్లో. నివృత్తే సర్వసంసారే నిత్యముక్తత్వభాసనాత్,
నిరంకుశా భవేత్తృప్తిః పునశ్శోకాసముద్భవాత్. ౧౭

తా. స్థూలశరీర జీవాదులు తాననియు, జననమరణ పుణ్యపాప కర్మానుగుణ లోకాంతరగమనాది, కర్తృత్వభోక్తృత్వాది సకలసంసార రూపజ్ఞానము నశించినందున, తాను నిత్యముక్తుఁడననే జ్ఞాన ముదయించినందున నిరంకుశమయిన తృప్తి కలుగుచున్నది. లోకమందుఁ గల తృప్తులు అంతముగలవైనందున నీతృప్తి నిరంకుశముగానున్నది.

శ్లో. పరోక్షా చాపరోక్షేతి విద్యా ద్వేధా విచారజా,
తత్రాపరోక్షవిద్యాప్తౌ విచారోఽయం సమాప్యతే. ౧౮
అస్తి బ్రహ్మేతి చేద్వేద పరోక్షజ్ఞానమేవ తత్,
అహం బ్రహ్మేతి చేద్వేద సాక్షాత్కారస్స ఉచ్యతే. ౧౯
యస్మిన్కాలే స్వమాత్మానం యోగీ జానాతి కేవలం,
అస్మాత్కాలాత్సమారభ్య జీవన్ముక్తో భవత్యసౌ. ౨౦
ఐహికాముష్మికవ్రాతసిద్ధ్యై ముక్తేశ్చ సిద్ధయే,
బహు కృత్యం పురాఽస్యభూత్తత్సర్వమధునా కృతం. ౨౧

అద్యాస్తమేతు న పురా శశితార మాస్తాం
కస్తావతాపి మమ చిద్వపుషో విశేషః,
కుంభే వినశ్యతి చిరం సమవస్థితే వా
కుంభాంబరస్య స హి కోఽపి విశేషలేశః. ౨౨

ఇది సప్తావస్థానిరూపణము.

ఈసప్తావస్థలను గురించి మందాధికారుల బోధకొఱకు మఱియొక లోకదృష్టాంత మిం దుదహరింపఁబడుచున్నది. ఇది దశమదృష్టాంతమని వాడుక గలదు. ఒక గ్రామమునుంచి పదిమంది జనులు కలసి గ్రామాంతరమును గురించి వెళ్లుచుండఁగా, నామార్గమధ్యమందు చాలా లోఁతును, వేగమును కలిగి ప్రవహించుచున్న ఒకనది మార్గమున కడ్డముగా నుండెను. అప్పు డాప్రయాణికు లందఱును నదిలోదిగి, చేతులలో తమతమ శక్తికొలది ఈదుకొనుచు క్రమక్రమముగా నావలితీరమునకు చేరినతరువాత, అందఱును చేరిరా లేదాయని సంశయముతో వలయాకారముగా నందఱును ఉండి, నందొకఁడు లెక్కింపసాగెను. తనవామభాగమందున్న వానిని ప్రారంభించి లెక్కింపఁగా కుడిభాగమందున్నవాఁడు తొమ్మిదవవాఁడై నాఁడు. పదిమందిమి వచ్చితిమి. తొమ్మండ్రుమాత్రము అగుపడుచున్నారని సంశయము కలిగి తిరిగి కుడినుంచి ఎడమకు లెక్కించినను ఆటులనే తొమ్మండ్రుమాత్ర మగుపడిరి. అపుడు తమతో వచ్చిన దశముఁడు నదిలో మునిఁగిపోయెనని ఆలెక్కించినవాఁడు తక్కినవారికిఁ జెప్పఁగా అందఱును దశముఁడు లేఁడని నిశ్చయించుకొని వానినిగురించి దుఃఖించుచుండిరి.

అప్పు డామార్గమున నొకబాటసారి వచ్చి విచారగ్రస్తులగు వీరినిచూచి దయాళుఁడయి దగ్గరచేరి, విచారకారణమును వారివలన విని వీరికి అజ్ఞానమువలన నీశోకజాలము సంప్రాప్తమయినది. వీరిని నీఅజ్ఞానమునుంచి తొలఁగించి ఆనందింపచేసెదనని తలంచి, ఆదిని లెక్కించిన ప్రకారము వలయాకారముగా నుంచి మీపదవవాఁడు ఉన్నాఁడు; భయపడకుఁడి యనెను. ఆవార్త అమృతోపమానముగా నున్నందున నందఱును అతనిని, అయ్యా మాపదవవాని నెక్కడ చూచితిరి ? బ్రతికి యుండెనా ? మాకును చూపఁగలరాయని అత్యాదరముగా ప్రార్థించిరి. అపు డతను వెనుకటి వరుసను లెక్కించి క్రమముగా లెక్కించినపుడు

అతను ఆబాటసారి లెక్కించినవానిని నీవే దశముఁడవని బోధించినం దున తమ అవివేకమునకును, దశముని గురించిన వెనుకటి విలాపము లను తలఁచుకుని, అందరును సిగ్గుపడుచు నతనికి నమస్కరించి చనిరి.

ఈ ఇతిహాసమందు అజ్ఞానాది సప్తావస్థలు నున్నవి. ఎట్లనిన; దశముఁడు నదిలో మునిఁగిపోయినాఁడని వానినిగురించి విచారించుట అజ్ఞానము. అమార్గముగా లెక్కించి దశముఁడు లేఁడనుట ఆవరణము. వానినిగురించి విలపించుట విక్షేపము. బాటసారి మీఁదదశముఁ డున్నాఁ డనినందున కొంత సంతసించుట పరోక్షజ్ఞానము. క్రమముగా లెక్కింప చేసి నీవే దశముఁడవని బోధించినపైని తానే దశముఁడనని సంశయ విపర్యయ రహితమయిన నిశ్చయజ్ఞానము కలుగుట అపరోక్షజ్ఞానము. ఈపరోక్షా పరోక్షజ్ఞానద్వయమువలన వెనుకటి విలాపాదులను తలఁచి సిగ్గుపడుట శోకనివృత్తి. అందరము ఉన్నామని సంతసించుట తృప్తి. ఇటులనే బ్రహ్మవేత్తలగు గురువులచే మహావాక్యార్థ బోధవలన తామే బ్రహ్మస్వరూపులనే జ్ఞానము పరోక్షాపరోక్షజ్ఞానద్వయము కలిగి, అజ్ఞానావృత విక్షేపాదులను వదలి శోకనివృత్తియు, అఖండతృప్తియు కలిగి జీవన్ముక్తు లగుచున్నారని తెలియుచున్నది.

అథ మోహభూమికా సప్తకమ్.

**మహోపనిషత్. ౫. అధ్యాయము. ౧, ౯ మంత్రములు:—**

**అజ్ఞానభూమికాసప్తకముచ్యతే:—**

శ్రు. బీజజాగ్రత్తథా జాగ్రన్మహాజాగ్రత్తథైవ చ,
జాగ్రత్స్వప్నస్తథా స్వప్నః స్వప్నజాగ్రత్సుషుప్తికం.
ఇతి సప్తవిధో మోహః పునరేష పరస్పరం,
శ్లిష్టో భవత్యనేకాగ్ర్యం శృణు లక్షణ మస్య తు.

తా. జ్ఞానభూమికా సప్తకమును చెప్పు నుద్దేశముతో ముందు మోహలక్షణమును తెలుసుకొనక జ్ఞానము తెలియదు గాన సప్తవిధ మోహమును వివరించుచున్నారు.

౧. బీజజాగ్రత ౨. జాగ్రత ౩. మహాజాగ్రత ౪. జాగ్రత్స్వప్నము ౫. స్వప్నము ౬. స్వప్నజాగ్రత ౭. సుషుప్తి. ఇవి సప్తవిధ

మోహములు. ఈసప్తకము అన్యోన్యమేళనగా అనేక శాఖోపశాఖలుగా పెరిగినది గాన, నీసప్తకము మాత్రము వివరింపఁబడుచున్నది.

౧. బీజజాగ్రతలక్షణం:—

శ్రు. ప్రథమం చేతనం యత్స్యాదనాఖ్యం నిర్మలం చితః,
భవిష్యచ్చిత్తజీవాదినామశబ్దార్థభాజనమ్.

మహోపనిషత్. అధ్యా. ౫. మం. ౧౦.

తా. గర్భస్థజంతువునందు గల చిత్కలయనే ప్రథమవస్తువు అతి నిర్మలమయినది. ఇట్టిదని చెప్పుటకు శక్యముకానిది. ముందు కలుగఁబోవు చిత్తము, జీవుఁడు నీమొదలగు నామరూపముల కాస్పదముగానున్నది. అట్టి వస్తువునందు జాగ్రతయనే ప్రపంచవ్యవహారజ్ఞానము బీజమం దంకురశక్తివలె ఇమిడియున్నందున, నీప్రథమావస్థ బీజజాగ్రత యనఁబడుచున్నది.

౨. జాగ్రతలక్షణం:—

శ్రు. ఏషా జ్ఞప్తేర్నవావస్థా త్వం జాగ్రత్సంస్థితిం శృణు,
నవప్రసూతస్య పరా దయం చాహమిదం మమ,
ఇతియః ప్రత్యయస్స్వచ్ఛస్తజ్జాగ్రత్ప్రాగభావనాత్.

తా. శిశువు జననాంతరము క్షుత్తును, స్తన్యపానానంతరమున ఆనందమును కలిగియుండును. క్రమక్రమముగా ఇది నేను, నాది, ఇతరము, ఈమొదలగు జ్ఞానము స్పష్టముగా తెలియుట జాగ్రత యనఁబడును.

౩. మహాజాగ్రతలక్షణం:—

శ్రు. అయం సోఽహ మిదం తన్మే ఇతి జన్మాంతరోదితః,
పీవరః ప్రత్యయః ప్రోక్తో మహాజాగ్రదితి స్ఫుటం.

తా. వెనుక కలిగిన భేదజ్ఞానము వృద్ధినిపొంది, స్థూలశరీరము తాననే అభిమానమును పొంది, నాశరీరమునకు సుఖములను గోరుచు సంపాదించుచు తనది, ఇతరము అనే భేదజ్ఞానము దృఢమయినపుడు మహాజాగ్రత యనఁబడును.

౪. జాగ్రత్స్వప్నలక్షణం:—

శ్రు. ఆరూఢ మథవారూఢం సర్వదా తన్మయాత్మకం,
యజ్జాగ్రతో మనోరాజ్యం తజ్జాగ్రత్స్వప్న ఉచ్యతే.

తా. తనప్రవృత్తిలోనున్న అంశమునుగాని, లేని అంశమును గాని యుద్దేశించి జాగ్రదవస్థలో సర్వదా తన్మయముగా నుండుట జాగ్రత్స్వప్న మనఁబడును.

౫. స్వప్నలక్షణం:—

శ్రు. ద్విచంద్రశుక్తికారూప్య మృగతృష్ణాదిభేదతః,
అభ్యాసం ప్రాప్య వై జాగ్రత్స్వప్నో నానావిధో భవేత్.

తా. చంద్రద్వయము రజ్జువునందు సర్పత్వము, శుక్తియందు రజితభ్రమయు, మృగతృష్ణలవలెనే జగత్తును, తానును, సత్యములని తాదాత్మ్యభ్రాంతినొంది నిరంతరాభ్యాసము నానావిధముగా నున్నందున స్వప్న మనఁబడును. స్వప్నమనఁగా: స్వప్నాంతమందు జాగ్రత కలిగినపుడు కొద్దికాలము నాచే చూడఁబడుచున్నది గాన స్వప్నమందు చూచినచర్య అసత్యమని నిశ్చయించుట.

౬. స్వప్నజాగ్రతలక్షణం:—

శ్రు. చిరం సందర్శనాభావాద ప్రఫుల్లం బ్రహ్మ తద్వచః,
చిరకాలానువృత్తిస్తు స్వప్నో జాగ్రదివోదితః,
స్వప్నజాగ్రదితి ప్రోక్తం జాగ్రత్యపి పరిస్ఫురత్.

తా. బ్రహ్మవస్తువుగాని, ఆశబ్దముగాని వీనికి చూడడము, వినడము అనేక జన్మలక్రిందట కలిగినందున విస్మృతి కలిగి, జాగ్రతలో స్వప్నమును ఎట్లు మిథ్యగా నిశ్చయించునో అటులనే బ్రహ్మవస్తువు మిథ్యగాఁ దోఁచుట స్వప్నజాగ్రత యనఁబడును.

౭. సుషుప్త్యవస్థాలక్షణం:—

శ్రు. షడవస్థాపరిత్యాగే జడా జీవస్య యా స్థితిః,
భవిష్యద్దుఃఖబోధాఢ్యా సౌషుప్తిస్సోచ్యతే గతిః.

తా. వెనుకచెప్పిన ఆరు అవస్థలును లేక జీవి జడత్వమును పొంది రాబోవు జ్వరదారిద్ర్యాదులను గురించిగాని, ఉత్తరజన్మాదులను గురించిగాని కలిగెడుదుఃఖబోధతో కూడినది సుషుప్తి యనఁబడును. ఇది సప్తమావస్థ.

శ్లో. జగత్తస్యామవస్థాయా మంతస్థమపి లీయతే,
సప్తావస్థా ఇమాః ప్రోక్తా మయా జ్ఞానస్య వై ద్విజ,
ఏకైకా శతసంఖ్యాఽత్ర నానావిభవరూపిణీతి.

**అజ్ఞానభూమికా సప్తకం.**

తా. పైనిచెప్పిన సుషుప్తి అను సప్తమావస్థయనే అంధకార మధ్యను జగత్తు లీనమైయున్నది. లోకము నీ అజ్ఞానరూప తమస్సునందు మునిఁగియున్నదనుట. ఇది మోహసప్తకం.

**జ్ఞానభూమికాసప్తకం.**

**మహోపనిషత్. అధ్యాయము 5. మంత్ర. 21-24 వఱకు.**

శ్లో. ఇమాం సప్తపదాం జ్ఞానభూమి మాకర్ణయానఘ,
నానయా జ్ఞాతయా భూయో మోహపంకే నిమజ్జతి.
వదంతి బహుభేదేన వాదినో యోగభూమికాః,
మమత్వభిమతా నూన మిమా ఏవ శుభప్రదాః.
అవబోధంవిదుర్జ్ఞానం తదిదం సాప్తభూమికం,
ముక్తిస్తు జ్ఞేయమిత్యుక్తం భూమికాసప్తకాత్పరమ్.

తా. ఈ ఉపనిషత్కర్తలు, పుణ్యశాలులగు శిష్యులయిన ఋషికుమారులగు నిదాఘునితో చెప్పుచున్నారు. ఓ ఋషికుమారా! హే నిదాఘా! ఈజ్ఞానభూమికా సప్తకమును వినుము. ఇది తెలుసుకొనిన వారు తిరిగి మోహపంకమందు మునుఁగరు. తిరిగి వారిని అజ్ఞాన మావరింపలేదనుట. బ్రహ్మవాదులు ఈఅజ్ఞానభూమికాసప్తకమును అనేక విధములుగా చెప్పిరి గాని, నాకు ఈసప్తవిధములే ఇష్టములుగా నున్నవి. ఈ జ్ఞానభూమికాసప్తకము తెలుసుకొనుటకు దుర్లభముగా నున్నది. ఈసప్తభూమికలును ముక్తికి సాధనమయి జ్ఞానాభ్యాసముగా నున్నవి. ముక్తియనేది యీసప్తభూమికలపై నజ్ఞేయరూపముగానున్నది.

శ్లో. జ్ఞానభూమిశ్శుభేచ్ఛాఖ్యా ప్రథమా సముదాహృతా,
విచారణా ద్వితీయా తు తృతీయా తనుమానసీ,
సత్వాపత్తిశ్చతుర్థీ స్యాత్తతో సంసక్తినామికా,
పదార్థభావనా షష్ఠీ సప్తమీ తుర్యగా స్మృతా.

ఆసామంతస్థితా ముక్తిర్యస్యాం భూయో న శోచతి,
ఏతాసాం భూమికానాం త్వమిదం నిర్వచనం శృణు.

తా. ౧. సుఖేచ్ఛ ప్రథమము. ౨. విచారణ ద్వితీయము. 3. తనుమానసి తృతీయము. ౪. సత్వాసత్తి చతుర్థము. ౫. సంసక్తినామిక పంచమము. ౬. పదార్థభావన షష్ఠము. ౭. తుర్యావస్థాప్రాప్తి సప్తమము. ముక్తియనేది ఈసప్తావస్థలలో నిమిడియున్నది.

**౧. సుఖేచ్ఛాలక్షణము:—**

శ్రు. స్థితః కిం మూఢ ఏవాస్మి ప్రేక్ష్యేఽహం శాస్త్రసజ్జనైః,
వైరాగ్యపూర్వ మిచ్ఛేతి సుఖేచ్ఛేత్యుచ్యతే బుధైః.

తా. మూఢునిగా నున్నాను. శాస్త్రముచేతను, సజ్జనులవలనను బ్రహ్మవస్తువును తెలిసికొని యావస్తువును చూడవలెనని ప్రపంచమందు వైరాగ్యము కలిగి జనించిన బుద్ధి సుఖేచ్ఛ యనఁబడును.

**౨. విచారణాలక్షణము:—**

శ్రు. శాస్త్రసజ్జనసంపర్కవైరాగ్యాభ్యాసపూర్వకం,
సదాచారప్రవృత్తిర్యా ప్రోచ్యతే సా విచారణా.

తా. వైరాగ్యాభ్యాసము కలిగి గురువులవలనను, శాస్త్రముచేతను ఆత్మానాత్మవిచారణ చేయుట రెండవ యవస్థగానున్నది.

**3. తనుమానసీ:—**

శ్రు. విచారణాసుఖేచ్ఛాభ్యా మింద్రియార్థేషు రక్తతా,
యత్ర సా తనుతా మేతి ప్రోచ్యతే తనుమానసీ.

తా. వైరాగ్యము, విచారణవలన ఇంద్రియవిషయములందు విరక్తిగలిగి మనోవృత్తి తగ్గుటయే తనుమానసీ యనఁబడును.

**౪. సత్వాపత్తి:—**

శ్రు. భూమికాత్రితయాభ్యాసాచ్చిత్తే తు విరతేర్వశాత్,
సత్వాత్మని స్థితే శుద్ధే సత్వాపత్తి రుదాహృతా.

తా. వెనుకటిభూమికాత్రయాభ్యాసములన చిత్తము విశ్రాంతిని పొందియుండఁగా, సద్వస్తువు ఆత్మరూపముగా రూఢిజ్ఞానము కలిగియుండుట సత్వాపత్తి యనఁబడును.

౫. సంసక్తినామిక:—

శ్రు. దశాచతుష్టయాభ్యాసా దసంసర్గఫలా తు యా,
రూఢసత్త్వచమత్కారా ప్రోక్తా సంసక్తినామికా.

తా. ఈజ్ఞానమువలన ఇంకొక ఫలమున్నదని కోరక, వెనుకటి నాలుగవస్థలబలమున తానే ఆత్మస్వరూపుఁడననే రూఢిజ్ఞానముకలుగుట సంసక్తి యనిపించుకొనును. సకల సంశయములును వదలి "అహంబ్రహ్మాస్మి" నేను బ్రహ్మస్వరూపుఁడనని తెలియుటయే ఈజ్ఞానమునకు ఫలముగాన యింతకన్న వేరేఫలము లేదు. ఈజ్ఞానము కలుగుటయే అమృతత్వసిద్ధి. ఆ బ్రహ్మవస్తువునకు జనన మరణాదులు లేవు. ఇవి మాయాభాగములు. ఆ బ్రహ్మకు మాయాసంబంధము ఎన్నఁడును లేదు. అసంగుఁడని శ్రుతి సిద్ధము. ఈ అవస్థ కలిగినయెడల తిరిగి మాయాసంబంధము కలుగదని తాత్పర్యము.

౬. పదార్థభావన:—

శ్రు. భూమికాపంచకాభ్యాసాత్స్వాత్మారామతయా దృఢం,
అభ్యంతరాణాం బాహ్యానాం పదార్థానా మభావనాత్.
పరప్రయుక్తేన చిరం ప్రయత్నేనావబోధనం,
పదార్థభావనా నామ షష్ఠీ భవతి భూమికా.

తా. వెనుకటి దశాపంచకజ్ఞానమువలన బ్రహ్మస్వరూపమయిన ఆత్మయందు విశ్రాంతిని రూఢిగా పొంది, బాహ్యాభ్యంతరపదార్థములను స్మరించక పరులచే బోధింపఁబడినపుడు మాత్రము వ్యవహారజ్ఞానము కలుగుట పదార్థభావన యనఁబడును. పదార్థము బ్రహ్మవస్తువు. దానిని మాత్రము భావించుట, తలఁచుట అంతకన్న వేరుగానున్న బాహ్యములు, పంచభూతమయములు, ఆంతర్యములు, ఇంద్రియాదులు, ఇవన్నియు బ్రహ్మవస్తువునందు లీనమయినవి. మనస్సును వృత్తిశూన్యమయినది గాన తాత్కాలిక దేహధారణమాత్రముకొఱకు పరులచే బోధింపఁబడి నపుడు లోకజ్ఞానము వీరికిఁ గలుగుచున్నదని తాత్పర్యము.

౭. తుర్యగా:—

శ్రు. భూమిషట్కచిరాభ్యాసా ద్భేదస్యానుపలంభనాత్,
యత్స్వభావైకనిష్ఠత్వం సా జ్ఞేయా తుర్యగా గతిః.

ఏషా హి జీవన్ముక్తేషు తుర్యావస్థేషు విద్యతే,
విదేహముక్తివిషయం తుర్యాతీత మతఃపరం.

తా. తురీయావస్థాప్రాప్తి బ్రహ్మాకారమయిన ఆత్మానుభవము కలిగి జాగ్రతలో ప్రపంచజ్ఞాన విస్మృతియు, బ్రహ్మవస్తువునందు తాదాత్మ్యమును కలిగి బ్రహ్మానందరసమగ్నుఁడయి యుండుట తురీయపద ప్రాప్తియనఁబడును. తురీయదార్ఢ్యమే తుర్యాతీత మనఁబడును. ఈ అవస్థ ముందు విరళమగును. ఈయవస్థ జీవన్ముక్తులయందు, తుర్యావస్థను పొందినవారియం దగుపడును. దేహము తాననే జ్ఞానము వదలుటయే విదేహముక్తి. ఇదే తుర్యాతీత మనఁబడును.

శ్రు. యే నిదాఘ మహాభాగస్సప్తమీం భూమిమాగతాః,
ఆత్మారామా మహాత్మానస్తే మహాపద మాగతాః.
జీవన్ముక్తా న జీవంతి సుఖదుఃఖరసస్థితే,
ప్రకృతేనాథ కార్యేణ కించిత్కుర్వంతి వా న వా.
పార్శ్వస్థబోధితాస్సంతః పూర్వాచారక్రమాగతం,
ఆచారమాచరంత్యేవ సుప్తబుద్ధవదుత్థితాః.

తా. ఓ నిదాఘఋషీ! ఏ మహానుభావులు ఈ సప్తమభూమికను పొందినారో వారు ఆత్మారాములు, మహాత్ములు, ఉత్తమస్థానమును పొందినవారు. వారే జీవన్ముక్తులు. వారి జీవితకాలమంతయు బ్రహ్మాకారముగనే యుండును గాని సుఖదుఃఖరూపసంసారమం దెంతమాత్రము లేదు. దేహధారణమాత్రము కొఱకు పార్శ్వమందున్న వారిచే బోధితులయి నిద్రావస్థలో నున్నవారు మేల్కొనురీతిని, తురీయము నుంచి జాగ్రతలోకి వచ్చి లోకానుసరణముగా కార్యములను చేసిన చేయవచ్చును గాని, అంతమాత్రమున వారికి మాయాతాదాత్మ్యము కలుగనేరదు.

శ్రు. భూమికాసప్తకం చైతద్ధీమతామేవ గోచరం,
ప్రాప్య జ్ఞానదశామేతాం పశుమ్లేచ్ఛాదయోఽపియే.
సదేహా వాప్యదేహా వా తే ముక్తా నాత్ర సంశయః,
జ్ఞప్తిర్హి గ్రంథివిచ్ఛేద స్తస్మిన్సతి విముక్తతా.
మృగతృష్ణాంబుబుద్ధ్యాదిశాంతిమాత్రాత్మకస్త్వసౌ.

తా. ఈ భూమికాసప్తకము బుద్ధిమంతులకే తెలియును. పశుతుల్యులయినను, మ్లేచ్ఛాదులయినను ఈసప్తభూమికాక్రమమును తెలిసికొని జ్ఞానావస్థనుపొందినపుడు వారు దేహధారణకాలమందును, దేహాంతమందును గూడ ముక్తులనే చెప్పఁబడుదురు. ఎంతమాత్రమును సంశయములేదు. గ్రంథివిచ్ఛేదమే జ్ఞానము. దేహజీవాదులును, ప్రపంచమును సత్యములని నమ్ముటయే గ్రంథి. అవి మాయామయములనియు, అస్వతంత్రములనియు, అం దిమిడియున్నవానికి సత్తాను కలుగఁజేయు సచ్చిదానందస్వరూప బ్రహ్మవస్తువు నిజమైనదనియు, అదియే తానని తెలుసుకొనుటయే గ్రంథివిచ్ఛేద మనఁబడును. ఈజ్ఞానము అతికష్టమని తోఁచును. కాని అతిసులభము. ఎండమావు లుదకములవలె నగుపడును. అది భ్రమగాన నాభ్రమనివృత్తియే నిజస్థితిగానున్నది గాన మనోవృత్తిశాంతియే జ్ఞానదశగా నున్నదని తాత్పర్యము.

ఇది జ్ఞానభూమికాసప్తకము సంపూర్ణము.

---

## భూమాస్వరూపః.

ఛాందోగ్యే:—

శ్రు. యో వై భూమా తత్సుఖం నాల్పే సుఖ మస్తి భూమైవ సుఖం, భూమాత్వేన విజిజ్ఞాసితవ్య ఇతి. భూమానాం భగవోవిజిజ్ఞాస ఇతి. యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి సభూమా న్యత్పశ్యత్యన్యచ్ఛృణోత్యన్యద్విజానాతి తదల్పం, యో వై భూమా తదమృత మథ యదల్పం తన్మర్త్యగ్ం స భగవః కస్మి న్ప్రతిష్ఠితమితి స్వే మహిమ్ని యది వా న మహిమ్నీతి.

శ్లో. భూతోత్పత్తేః పురా భూమా త్రిపుటీద్వైతవర్జనాత్,
జ్ఞాతృజ్ఞానజ్ఞేయరూపా త్రిపుటీ ప్రలయేఽపి నో.

తా. అరుణపుత్త్రుఁడయిన ఉద్దాలకుఁడనే మహాఋషి తన శిష్యుఁడయిన శ్వేతకేతువనే ఋషికుమారునకు అనేక లోకదృష్టాంతములతో బ్రహ్మోపదేశమును చేసిన ప్రకరణము ఛాందోగ్యమనే ఉపనిషత్ ప్రసిద్ధముగ నున్నది.

అందు బ్రహ్మావస్తువును భూమాస్వరూపముగా నిర్దేశించి ఉప దేశించినారు. ఏది భూమ యనునదో అదియే సుఖస్వరూపము. భూమ కానిది అల్పము. అట్టి అల్పమందు సుఖములేదు గాన నా బ్రహ్మావస్తువు భూమాస్వరూపముగా భావింపఁదగినది అనిచెప్పఁగా నీభూమాస్వరూప మెట్టిదని ప్రశ్నించెను. సమాధానము:—తాను జాగ్రతలోనుండఁగా ఏ అవస్థయం దున్నపుడు ఏరూపము అగుపడదో, ఏశబ్దము వినఁబడదో, ఏదియు మనస్సునకు గోచరముకాదో, అది, ఆయవస్థయే భూమావస్థ యనఁబడును. ఇదియే తురీయ తురీయాతీత మనఁబడును. ఏరూప మగు పడినను, ఏశబ్దము వినఁబడినను, ఏవస్తువు స్ఫురించినను, ఆ అవస్థ అల్పము. భూమావస్థ అమృతము జననమరణరహిత బ్రహ్మాకారము రెండవది, జననమరణములు గల మాయాస్వరూపముగా నున్నది. జాగ్రతలో తానుండి మనస్సును లయింపఁజేసినపుడు వృత్తి శూన్యమగును.

పర్యవసానమునకు మనోలయము కానిది తురీయ మనఁబడదు గాన, మనోలయము బ్రహ్మావస్థ. అపుడు ఏరూపము, ఏశబ్దము, ఏవస్తువు లేవు. ఇవి కలిగినపుడు మనోలయము లేదని స్పష్టమగుచున్నది గాన భూమావస్థయు తురీయముగానే యున్నది. అపుడు బుద్ధిమాత్రము నిలుచును.

ఈ సృష్ట్యాదిని, సృష్ట్యంతమందును జ్ఞాతా, జ్ఞానము, జ్ఞేయము లనే త్రిపుటి లేనందున నాకాలము భూమాకారముగా నున్నదని, యదే నిజమగు బ్రహ్మావస్తువని చెప్పిరి.

### స్వస్వరూపం.

**మహోపనిషత్:—**

శ్రు. ఋతమాత్మా పరం బ్రహ్మ సత్యమిత్యాదికా బుధైః,
కల్పితా వ్యవహారార్థం యస్య సంజ్ఞా మహాత్మనః. ౧
తద్బ్రహ్మానంద మద్వంద్వం నిర్గుణం నిత్యచిద్ఘనం,
విదిత్వా స్వాత్మనో రూపం న బిభేతి కదాచన. ౨
స్వరూపావస్థితిర్ముక్తిః తద్భ్రంశో హంతృవేదనం,
శుద్ధసన్మాత్రసంవిత్తే స్స్వరూపాన్న చలంతి యే,
రాగద్వేషాదయో భావా తేషాం నాజ్ఞత్వసంభవాః. 3
యత్స్వరూపపరిభ్రంశశ్చేత్యార్థే చితి మజ్జనం,

ఏతస్మాదపరో మోహో న భూతో న భవిష్యతి. ౪
అర్థా దర్థాంతరం చిత్తే యాతి మధ్యే తు యా స్థితిః,
సా ధ్వస్తమననాకారా స్వరూపస్థితి రుచ్యతే. ౫
సంశాంతసర్వసంకల్పా యా శిలావ దవస్థితిః,
జాగ్రన్నిద్రావినిర్ముక్తా సా స్వరూపస్థితిః పరా. ౬
అహంతాం శేషితే శాంతే భేదనిష్పందచిత్తతా,
అజడా యా ప్రచరతి తత్స్వరూప మితీరితమ్. ౭
బింబభూతో య ఆనంద ఆత్మాఽసౌ సర్వదా స్థితేః,
పంచకోశ పరిత్యాగే సాక్షిబోధావశేషతః,
స్వస్వరూపం స ఏవ స్యాచ్ఛూన్యత్వం తస్య దుర్ఘటమ్. ౮

**వరాహోపనిషది:—**

శ్రు. స్వస్వరూపం తు చిన్మాత్రం సర్వదా సర్వదేహినాం,
నైవ దేహాదిసంఘాతో ఘటవద్దృశి గోచరః. ౯
స్వాత్మనోఽన్యతయా భాంతం చరాచరమిదం జగత్,
స్వాత్మమాత్రతయా బుధ్వా తదస్మీతి విభావయ. ౧౦
స్వస్వరూపం స్వయం భుఙ్క్తే నాస్తి భోజ్యం పృథక్స్వతః,
అస్తిచే దస్తితా రూపం బ్రహ్మైవాస్తిత్వలక్షణమ్. ౧౧
బ్రహ్మవిజ్ఞానసంపన్నః ప్రతీతమఖిలం జగత్,
పశ్యన్నపి సదా నైవ పశ్యతి స్వాత్మనః పృథక్. ౧౨
స్వస్వరూపానుసంధానా న్నృత్యంతం సర్వసాక్షిణాం,
ముహూర్తం చింతయే న్మాం యస్సర్వబంధైః ప్రముచ్యతే. ౧3

**ఇతి స్వస్వరూపజ్ఞానకథనం.**

**చిత్స్వరూపం. తత్రైవ.**

శ్రు. నానందం న నిరానందం న చలం నాచలం స్థిరం,
నస న్నాస న్న చైతేషాం మధ్యం జ్ఞానినో విదుః. ౧
యథా సౌక్ష్మ్యా చ్చిదాభాస్య ఆకాశో నోపలభ్యతే,
తథా నిరంశ శ్చిద్భావ స్సర్వగోఽపి న లక్ష్యతే. ౨
సర్వసంకల్పరహితా సర్వసంజ్ఞావివర్జితా,
సైషా చిదవినాశాత్మా స్వాత్మేత్యాదికృతాభిధా. 3

ఆకాశశతభాగాచ్ఛా జ్ఞేషు నిష్కళరూపిణీ,
సకలామలసంసారస్వరూపైకాత్మదర్శనీ. ౪
నాస్తమేతి న చోదేతి నోత్తిష్ఠతి న తిష్ఠతి,
న చ యాతి న చాయాతి న చ నేహ న చేహచిత్.
సైషా చిదమలాకారా నిర్వికల్పా నిరాస్పదా. ౫

**ఇతి చిత్స్వరూపం.**

**సాక్షిస్వరూపం.**

**బ్రహ్మోపనిషత్:—**

శ్రు. కర్తారం చ క్రియాం తద్వద్వ్యావృత్తవిషయానపి,
స్ఫోరయేదేకయత్నేన యోఽసౌ సాక్ష్యత్ర చిద్వపుః. ౧
ఏకో దేవస్సర్వభూతేషు గూఢః సర్వవ్యాపీసర్వభూతాంతరాత్మా,
కర్మాధ్యక్షస్సర్వభూతాధివాస స్సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ. ౨
ఏకో వశీ సర్వభూతాంతరాత్మైకం రూపం బహుధాయః కరోతి,
తమాత్మస్థంయేఽనుపశ్యంతిధీరా స్తేషాంసుఖంశాశ్వతంనేతరేషాం.

**కైవల్యోపనిషత్:—**

శ్రు. త్రిషు ధామసు యద్భోజ్యం భోక్తా భోగశ్చ యద్భవేత్,
తేభ్యో విలక్షణస్సాక్షీ చిన్మాత్రో ఽహం సదాశివః. ౪
సాక్షిభూతే సమే స్వచ్ఛే నిర్వికల్పే చిదాత్మని,
నిరిచ్ఛం ప్రతిబింబంతి జగంతి ముకురే యథా. ౫
ఏకం బ్రహ్మ చిదాకాశం సర్వాత్మకమఖం స్థితం,
ఇతి భావయ యత్నేన చేతశ్చాంచల్యశాంతయే. ౬
సర్వసాక్షిణ మాత్మానం వర్ణాశ్రమవివర్జితం,
బ్రహ్మరూపతయా పశ్యన్ బ్రహ్మైవ భవతి స్వయమ్. ౭
అజ్ఞానాంధతమోరూపం కర్మధర్మాదిలక్షణం,
స్వయం ప్రకాశమాత్మానం నైవ మాం స్ప్రష్టుమర్హతి. ౮
భాసమాన మిదం సర్వం భానరూపం పరంపదం,
పశ్యన్వేదాంతమానేన సద్య ఏవ విముచ్యతే. ౯
త్రిధామసాక్షిణం సత్యజ్ఞానానందాదిలక్షణం,
త్వమహం శబ్దలక్ష్యార్థ మసక్తం సర్వదోషతః. ౧౦

సర్వగం సచ్చిదానందం జ్ఞానచక్షుర్నిరీక్షతే,
అజ్ఞానచక్షుర్నేక్షేత భాస్వంతం భానుమంధవత్. ౧౧
ప్రజ్ఞానమేవ తద్బ్రహ్మ సత్యప్రజ్ఞానలక్షణః,
ఏవం బ్రహ్మపరిజ్ఞానాదేవ మర్త్యోఽమృతో భవేత్. ౧౨
నిస్తత్త్వే నామరూపే ద్వే జన్మనాశయుతే చ తే,
బుద్ధ్వా బ్రహ్మణి వీక్షస్వ సముద్రే బుద్బుదాదివత్. ౧౩
సచ్చిదానందరూపేఽస్మిన్పూర్ణే బ్రహ్మణి వీక్షితే,
స్వయమేవావజానంతి నామరూపే శనైశ్శనైః. ౧౪
ఉపేక్ష్య నామరూపే ద్వే సచ్చిదానందధీర్భవేత్,
అమత్వా సచ్చిదానందం కథం ముక్తో భవిష్యతీతి. ౧౫

**సాక్షిస్థానవివరము.**

**బ్రహ్మోపనిషది:—**

శ్రు. నేత్రస్థం జాగరితం వింద్యాత్కంఠే స్వప్నం సమావిశేత్,
సుషుప్తం హృదయస్థం తు తురీయం మూర్ధ్ని సంస్థితం,
తురీయం నామ తదవస్థాపన్నస్సాక్షీతి యావత్.

పంచపాదబ్రహ్మణో న కించన చతుష్పాదాంతర్వర్తినోఽన్తర్జీవబ్రహ్మణశ్చత్వారి స్థానాని, నాభి హృదయ కంఠ మూర్ధసు, జాగ్రత్స్వప్న సుషుప్తిః తురీయావస్థాః. ఆహవనీయ గార్హపత్య దక్షిణా సభ్యావసథ్యాగ్నిషు, విశ్వతైజస ప్రాజ్ఞ, సాక్షిణః తత్తదధ్యాసవశాదితి.

**తురీయపాదస్వరూపము.**

**మాండూక్యోపనిషది:—**

శ్రు. నాంతఃప్రజ్ఞం న బహిఃప్రజ్ఞం నోభయతఃప్రజ్ఞం న ప్రజ్ఞానఘనం న ప్రజ్ఞం నాప్రజ్ఞం, అదృష్టమవ్యవహార్యమగ్రాహ్యమలక్షణమచింత్యమవ్యపదేశ్యమైకాత్మ్యప్రత్యయసారం ప్రపంచోపశమం శాంతం శివమద్వైతం చతుర్థం మన్యంతే స ఆత్మా స విజ్ఞేయః.

అర్థస్తు. నాంతఃప్రజ్ఞం = స్వప్నావస్థలోనున్న జ్ఞానము తురీయజ్ఞానము కాదు, న బహిఃప్రజ్ఞం=జాగ్రదవస్థలోనున్న జ్ఞానమును కాదు, నోభయతః ప్రజ్ఞం = నిద్రావస్థలో నున్నజ్ఞానమును కాదు, న ప్రజ్ఞాన

ఘనం= ప్రజ్ఞానఘనస్వరూపమును కాదు, న ప్రజ్ఞం = జ్ఞానముకాదు, నాప్రజ్ఞం = జ్ఞానములేనిదీ కాదు, మరి ఎట్టిదనిన, అదృష్టం = అగుపడనిది, అవ్యవహార్యం=వ్యవహరింపఁదగినదికాదు, అగ్రాహ్యం=గ్రహింపఁదగినదికాదు, అలక్షణం = ఏచిహ్నాలును లేనిది, అచింత్యం = మనస్సుచేనూహింపశక్యము కానిది, అవ్యపదేశ్యం=చెప్ప శక్యముకానిది, ఏకాత్మప్రత్యయసారం=ఏకాకారమయిన ఆత్మయను శబ్దముయొక్కసారముగానున్నది. పంచభూతవికారము లన్నియు శాంతించినపై నున్నది. శాంతం = నిస్తరంగసముద్రమువలె స్వయం శాంతస్వరూపము, శివం = ఆనందస్వరూపము, అద్వైతం = ద్వితీయవస్తురహితము, చతుర్థం మన్యంతే డి బ్రహ్మవేత్తలు ఈధర్మములుగల వస్తువును తురీయపాదమని తలంచుచున్నారు. స ఆత్మా = ఆతురీయవస్తువే ఆత్మగానున్నది. స విజ్ఞేయః = అదియే సకల నిగమాగమములచేతను సర్వోపనిషత్తులచేతను తెలుసుకొనఁదగినదిగా నున్నది.

**అథ జాగ్రదాద్యవస్థాచతుష్టయవివరణమ్.**

తత్రాదౌ జాగ్రదవస్థాలక్షణం. తంత్రరాజే:—

శ్లో. సర్వాక్షగోచరత్వేన యా తు బాహ్యతయా స్థితా,
సృష్టిస్సాధారణీ సర్వప్రియాత్మాఽయం స జాగరః.

తా. మనోబుద్ధులు దశేంద్రియములయందును పూర్ణవికాసత కలిగియున్నది జాగ్రదవస్థ యనఁబడును. ఇందు స్థూలదేహాభిమానియగు జీవుఁడు విశ్వుఁ డనిపించుకొనును.

స్వప్నలక్షణం:—

శ్లో. మనోమాత్రపథేఽధ్యక్షవిషయత్వేన విభ్రమాత్,
స్పష్టావభాసభావానాం సృష్టిస్స్వప్నపదం మతమ్. ఇతి.

తా. ఆ మనోబుద్ధులు, ఇంద్రియదశకముయొక్క స్థూలనాసంచారమును విడిచి, సూక్ష్మనాడులయందు మాత్రము సంచరించునపుడు జాగ్రత సుషుప్తులమధ్యగా నున్న స్వప్నావస్థ కలుగును. అందు సూక్ష్మశరీరాభిమానియగు జీవుఁడు తైజసుఁ డనఁబడును.

**సుప్తావస్థాలక్షణం:—**

ఇది సంప్రసాదావస్థయని కూడ చెప్పఁబడుచున్నది. తల్లక్షణం చ శివసూత్రే :—

అవివేకో మాయా సౌషుప్త మితి. సుఖ మహ మస్వాప్సం న కించి దవేదిషమితి స్మరణాత్.

తా. మనోబుద్ధులు రెండును స్థూలసూక్ష్మ నాడీసంచారమును విడిచి అంతఃకరణయనే తమస్సునందు లీనమయియున్నపుడు సుప్తాముగా నున్నది. అపుడు మనస్సు వృత్తిశూన్యముగను, బుద్ధి తమోలీనవస్థగ నున్నందున సుఖదుఃఖాభావముగా నున్నది. సుఖజ్ఞానము లేక పోయినను దుఃఖాభావముచేత జాగ్రత్త కలిగినపుడు సుఖముగా నిద్రించితినని తలంచును. సుఖదుఃఖాభావముచే సంప్రసాదావస్థ యనఁబడుచున్నది. ఇందు కారణదేహాభిమానియగు జీవుఁడు ప్రాజ్ఞుఁ డనఁబడును. కారణమనఁగా : అవిద్యోపాధి.

శ్రు. యదజ్ఞానం తత్ర లీనౌ తౌ విజ్ఞానమనోమయౌ,
తయోర్హి విలయావస్థా నిద్రా జ్ఞానం చ సైవ. ఇతి.

**తుర్యావస్థాలక్షణం:—**

ఏతదవస్థాత్రయస్య తద్భోక్తౄణాం చ వివిచ్య జ్ఞానజన్య శుద్ధవిద్యోదయాఖ్య శ్చమత్కార స్తుర్యావస్థా. తదుక్తం బ్రహ్మోపనిషది.—

శ్రు. త్రిషు ధామసు యద్భోజ్యం భోక్తా యశ్చ ప్రకీర్తితః,
విద్యా త్తదుభయం యస్తు స భుంజానో న లిప్యతే. ఇతి.

**వరదరాజేనాపి:—**

శ్లో. తుర్యం నామ పరం ధామ తథా భోగశ్చమత్క్రియా,
భేదేఽపి జాగ్రదాదీనాం యోగిన స్తస్య సంభవేదితి.

శివసూత్రమపి:—జాగ్రత్స్వప్నసుషుప్తి భేదేఽపి తుర్యాభోగ సంభవ ఇతి. త్రిషు చతుర్థం తైలవ దాసేచ్యమితి. మహాకారణశరీరాభిమానీ జీవః. సాక్షీ స ఏవ తుర్యః.

తా. ఈతురీయ తుర్యాతీతావస్థలు రెండును ముందు తురీయాభ్యాసకథనమందు విస్తరింపఁబడును గాన నిచట సంక్షేపముగా చెప్పఁడ మయినది.

**తుర్యాతీతావస్థాలక్షణం.**

సా చ తుర్యావస్థా దార్ఢ్యాద్భవతి.

తుర్యావష్టంభతో లభ్యం తుర్యాతీతం పరంపద మితి వచనాత్.

వరదరాజః:—

తుర్యాభ్యాసప్రకర్షేణ తుర్యాతీతాత్మకం పదం,
సంప్రాప్తస్సాధకస్సాక్షాత్సర్వలోకాంతరాత్మనా,
తుల్యశ్శివేన తన్మాత్రస్స్వచ్ఛందానందశాలినేతి.

పంచమదశాపన్నస్య స్వరూపకథనాయ సూత్రత్రయముక్తం. శివసూత్రం. శరీరవృత్తివ్రతం. కథాజపః. దానమాత్మజ్ఞానం. ఇతి స్వాత్మానుసంధానరూపశివపూజాసాధనత్వాచ్ఛరీరధారణం వ్రతరూపం, న తుచ్ఛం. అంతరుల్లసితస్వచ్ఛశక్తిపీయూషతోషితం, భవత్పూజోపభోగాయ శరీర మిద మస్తు వ ఇతి. తచ్చిత్తస్య సత్యగ్రాహిత్వాత్. యోగసూత్రం. నిర్వికార వైశద్యేఽధ్యాత్మప్రసాదః. ఋతంభరా తత్ర ప్రజ్ఞేతి. యద్ధి మనసా ధ్యాయతి తద్వాచా వదతీతి శ్రుత్యా తదు[illegible]సర్వస్యాపి యథార్థత్వేన మంత్రరూపత్వాత్.

యోగవాసిష్ఠే:—

సదా సంతోఽభిగంతవ్యా యద్యప్యుపదిశంతి నో,
యా హి స్వైరకథాస్తేషాముపదేశా భవంతి తా ఇతి.

దానమాత్మజ్ఞానమితి సూత్రస్య పరేభ్యః ఆత్మోపదేశం దానమితి.

కృష్ణదాసేనోక్తం:—

ప్రోక్తచైతన్యరూపస్య సాక్షాత్కారణమాత్మనః,
యత్తద్దానం తదేవాస్య దానం యత్నేన దీయతామితి.

శ్లో. ఇతి ప్రోక్తం వ్రతం కుర్వ న్జపంశ్చ ప్రతిపాలయన్,
శివతుల్యస్సదా స్వాత్మా శివారాధనతత్పరః.

అయమేవ మహాయోగీ మహామంత్రధురంధరః,
అంతేవాసిజనస్యాన్తస్తత్వతస్తత్వబోధకః.
**ఇతి తుర్యాతీతలక్షణం.**

బ్రహ్మానందానుగమార్థము ముందు సుషుప్త్యానందము నిరూపింపఁబడుచున్నది:—

**సుషుప్త్యానందస్వరూపము.**

శ్లో. అంధస్సన్నప్యనంధస్స్యాద్విద్ధో విద్ధోత్థరోగ్యపి,
అరోగీతి శ్రుతిః ప్రాహ తచ్చ సర్వేజనా విదుః. ౧
న దుఃఖాభావమాత్రేణ సుఖం లోష్టశిలాదిషు,
ద్వయాభావస్య దృష్టత్వాదితి చేద్విషమం వచః. ౨
ముఖదైన్యవికాసాభ్యాం పరదుఃఖసుఖోహనం,
దైన్యాద్యభావతో లోష్టే దుఃఖాద్యూహో న సంభవేదితి. ౩
దృష్టాంతాశ్శకునిశ్శ్యేనః కుమారశ్చ మహానృపః,
మహాబ్రాహ్మణ ఇత్యేతే సుప్త్యానందే శ్రుతీరితాః. ౪
శకునిస్సూత్రబద్ధస్సన్ దిక్షు వ్యావృత్య విశ్రమం,
అలబ్ధ్వా బంధనం స్థానం హస్తస్తంభాద్యుపాశ్రయేత్. ౫
జీవోపాధిమనస్తద్వద్ధర్మాధర్మఫలాప్తయే,
స్వప్నే జాగ్రతి చ భ్రాంత్వా క్షీణే కర్మణి లీయతే. ౬
శ్యేనో వేగేన నీడైకలంపటశ్శయితుం వ్రజేత్,
జీవస్సుప్త్యై తథా ధావేద్బ్రహ్మానందైకలంపటః. ౭
అతిబాలస్తనం పీత్వా మృదుశయ్యాగతో హసన్,
రాగద్వేషాద్యనుత్పత్తే రానందైకస్వభావభాక్. ౮
మహారాజస్సార్వభౌమస్సంతృప్తస్సర్వభోగతః,
మానుషానందసీమానం ప్రాప్యానందైకమూర్తిభాక్. ౯
మహావిప్రో బ్రహ్మవేదీ కృతకృత్యత్వలక్షణాం,
విద్యానందస్య పరమాం కాష్ఠాం ప్రాప్యావతిష్ఠతే. ౧౦
ముగ్ధబుద్ధాతిబుద్ధానాం లోకే సత్యాసుఖాత్మతా,
ఉదాహృతానా మన్యేతు దుఃఖినో న సుఖాత్మకాః. ౧౧
కుమారాదివదేవాయం బ్రహ్మానందైకతత్పరః,

స్త్రీపరిష్వక్తవద్వేద న బాహ్యం నాపి చాంతరమ్. ౧౨
బాహ్యం రథ్యాదికం వృత్తం గృహకృత్యం తథాంతరం,
తథా జాగరణం బాహ్యం నాడీస్థస్స్వప్న ఆంతరః. ౧౩
పితాఽపి సుప్తావపితేత్యాదౌ జీవత్వవారణాత్,
సుప్తౌ బ్రహ్మైవ నో జీవస్సంసారిత్వాసమీక్షణాత్. ౧౪
పితృత్వాద్యభిమానో య స్సుఖదుఃఖాకరస్సహి,
తస్మిన్నపగతే తీర్ణస్సర్వాన్ఛోకాన్ భవత్యయమ్. ౧౫
సుషుప్తికాలే సకలే విలీనే తమసావృతః,
సుఖరూపముపైతీతి బ్రూతేత్యాథర్వణీ శ్రుతిః. ౧౬
సుఖమస్వాప్స మత్రాహం నైవ కించిదవేదిషం,
ఇతి సుప్తసుఖాజ్ఞానే పరామృశతి చోత్థితః. ౧౭
పరామర్శోఽనుభూతేఽస్తీత్యాసీదనుభవస్తథా,
చిదాత్మత్వాత్స్వతో భాతి సుఖమజ్ఞానధీస్తతః. ౧౮
బ్రహ్మవిజ్ఞానమానందమితి వాజసనేయినః,
పఠంత్యతస్స్వప్రకాశం సుఖం బ్రహ్మైవ నేతరమ్. ౧౯
యదజ్ఞానం తత్ర లీనౌ తౌ విజ్ఞానమనోమయౌ,
తయోర్హి విలయావస్థా నిద్రాజ్ఞానం చ సైవహి. ౨౦

ఇతి సుషుప్త్యానందః.

### అథ బ్రహ్మానందకథనం.

తైత్తిరీయే:—

శ్రు. ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్.
సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ, యో వేద నిహితం గుహాయాం
పరమే వ్యోమన్, సోఽశ్నుతే సర్వాన్కామాన్త్సహ.
రసో వై సః, రసగ్గ్ హ్యేవాయం లబ్ధ్వాఽఽనందీ భవతి.

శ్లో. బ్రహ్మానందో వాసనా చ ప్రతిబింబ ఇతి త్రయం,
అంతరేణ జగత్యస్మిన్నానందో నాస్తి కశ్చన. ౧
తథా చ విషయానందో వాసనానంద ఇత్యమూ,
ఆనందౌ జనయన్నాస్తే బ్రహ్మానందస్స్వయంప్రభః. ౨
శ్రుతియుక్త్యనుభూతిభ్యః స్వప్రకాశచిదాత్మకే,
బ్రహ్మానందే సుప్తికాలే సిద్ధే సత్యన్యథా శృణు. ౩

అన్యథేత్యత్ర జాగ్రదవస్థాయాం బ్రహ్మానందం శృణ్వితి.

**వాసనానందస్వరూపం:—**

శ్లో. ఆస్తామేతదృత్ర యత్ర సుఖం స్యాద్విషయైర్వినా,
తత్ర సర్వత్ర విద్ధ్యేతాం బ్రహ్మానందస్య వాసనామ్. ౪

సుఖీ-దుఃఖీ-ఉదాసీన ఇత్యవస్థాత్రయమేవలోకే సర్వానుభవసిద్ధం. నాన్యత్ సుఖదుఃఖాభావకాలే తూష్ణీం స్థితౌ ద్యోతమానః వాసనానందః,

అహం సుఖీత్యహంకారతాదాత్మ్యాన్న నిజానందః.

**ప్రతిబింబానందలక్షణం:—**

శ్లో. విషయేష్వపి లబ్ధేషు తదిచ్ఛోపరమే సతి,
అంతర్ముఖమనోవృత్తావానందః ప్రతిబింబతి. ౫

ప్రతిబింబం తు మిథ్యాభూతమేవ న నిజానందః.

**ముఖ్యానందలక్షణం:—**

శ్లో. యావద్యావదహంకారో విస్మృతోఽభ్యాసయోగతః,
తావత్తావత్సూక్ష్మదృష్టేర్నిజానందోఽనుమీయతే. ౬
యావద్యావదిత్యత్ర పూర్వక్షణాపేక్షయా ఉత్తరక్షణంగ్రాహ్యం.
సర్వాత్మనా విస్మృతస్సన్ సూక్ష్మతాం పరమాం వ్రజేత్,
అలీనత్వాన్న నిద్రైషా తతో దేహోఽపి నోపతేత్. ౭
న ద్వైతం భాసతే నాపి నిద్రా తత్రాస్తి యత్సుఖం,
స బ్రహ్మానంద ఇత్యుక్తస్సకలాగమవేదిభిః. ౮
యద్యప్యసౌ చిరం కాలం సమాధి ర్దుర్లభో నృణాం,
తథాఽపి క్షణికో బ్రహ్మానందో నిశ్చీయయత్యసౌ. ౯
శ్రద్ధాళుర్వ్యసనీయోఽత్ర నిశ్చినోత్యేవ సర్వథా,
నిశ్చితే తు సకృత్తస్మిన్ విశ్వసత్యన్యథాప్యయం. ౧౦
తాదృక్పుమా నుదాసీనకాలేఽప్యానందవాసనాం,
ఉపేక్ష్య **ముఖ్య** మానందం భావయత్యేవ తత్పరః. ౧౧
ఏవం తత్త్వే పరే శుద్ధే ధీరో విశ్రాంతి మాగతః,
తదేవాస్వాదయత్యంతర్బహిర్వ్యవహరన్నపి. ౧౨
యుంజన్నేవం సదాఽఽత్మానం యోగీ విగతకల్మషః,

సుఖేన బ్రహ్మసంస్పర్శ మత్యంతం సుఖ మశ్నుతే. ౧౩
యథా నిరింధనో వహ్నిస్స్వయమేవోపశామ్యతి,
తథా వృత్తిక్షయాచ్చిత్తం స్వయోనావుపశామ్యతి. ౧౪
సమాసక్తం యథాచిత్తం జంతోర్విషయగోచరే,
యద్యేవం బ్రహ్మణి స్యాత్తత్కో న ముచ్యేత బంధనాత్. ౧౫

ఇతి బ్రహ్మానందకథనం.

**అతివర్ణాశ్రమలక్షణం.**

శ్రు. అగ్రిమత్వాద్వరేణ్యత్వాద్ధూతసంసారబంధనాత్,
తత్త్వమస్యాదివాక్యార్థా దవధూత ఇతీరితః. ౧
యశ్శరీరేంద్రియాదిభ్యో విహీనం సర్వసాక్షిణం,
పారమార్థికవిజ్ఞానం సుఖాత్మానం స్వయంప్రభం,
పరతత్త్వం విజానాతి సోఽతివర్ణాశ్రమీ భవేత్. ౨
సర్వాశ్రమాదయో దేహే మాయయా పరికల్పితాః,
ఆత్మనో బోధరూపస్య మమత్వే సతి సర్వదా,
ఇతి యో వేద వేదాంతైస్సోఽతివర్ణాశ్రమీ భవేత్. ౩
యస్య వర్ణాశ్రమాచారో గళితస్స్వాత్మదర్శనాత్,
స వర్ణా నాశ్రమా న్సర్వా నతీత్య స్వాత్మని స్థితః. ౪
యోఽతీత్య స్వాశ్రమాఀత్సర్వా నాత్మన్యేవ స్థితః పుమాన్,
సోఽతివర్ణాశ్రమీ ప్రోక్త స్సర్వవేదార్థవేదిభిః. ౫
తస్మా దన్యగతా వర్ణా ఆశ్రమా అపి నారద,
ఆత్మన్యారోపితాస్సర్వే భ్రాంత్యా తేనాత్మవేదినా,
న విధిర్న నిషేధశ్చ న వర్జ్యావర్జ్యకల్పనా. ౬
కృశోఽహం దుఃఖబద్ధోఽహం హస్తపాదాదిమానహం,
ఇతిభావానురూపేణ వ్యవహారేణ బధ్యతే. ౭
నాహం దుఃఖీ న మే దేహో బంధః కోఽస్యాత్మని స్థితః,
ఇతి భావానురూపేణ వ్యవహారేణ ముచ్యతే. ౮
నాహం బ్రహ్మేతి సంకల్పాత్సుదృఢాద్బధ్యతే మనః,
సర్వం బ్రహ్మేతి సంకల్పాత్సుదృఢాన్ముచ్యతే మనః. ౯
అజాగ్రత్స్వప్ననిద్రస్య యత్తే రూపం సనాతనం,

అచేతనం చాజడం చ తన్మయో భవ సర్వదా.
న నిరోధో న చోత్పత్తిర్న బంధో న చ సాధనం,
న ముముక్షుర్న వై ముక్త ఇత్యేషా పరమార్థతా. ౧౦
ఇతి శివం.

**మౌనలక్షణం—వరాహోపనిషది.**

శ్రు. సత్యచిద్ఘన మఖండమద్వయం
సర్వదృశ్యరహితం నిరామయం,
యత్పదం విమలమద్వయం శివం
తత్సదాహమితి మౌనమాశ్రయ. ౧
జన్మమృత్యుసుఖదుఃఖవర్జితం
జాతినీతి కులగోత్రదూరగం,
చిద్వివర్తజగతోఽస్య కారణం తత్సదాహమితి మౌనమాశ్రయ.
పూర్ణ మద్వయ మఖండచేతనం విశ్వభేదకలనాదివర్జితం,
అద్వితీయపరసంవిదంశకం తత్సదాహమితి మౌన మాశ్రయ. ౩
కేనాప్యబాధితత్వేన త్రికాలేఽప్యేకరూపతః,
విద్యమానత్వమస్త్యేతత్సద్రూపత్వం సదా మమ. ౪
జితే తస్మిన్వృత్తిశూన్యం మనో తిష్ఠతి మూకవత్,
ఏతత్పదం వసిష్ఠేన రామాయ బహుధేరితమ్. ౫
దృశ్యం నాస్తీతి బోధేన మనసో దృశ్యమార్జనం,
సంపన్నం చేత్తదుత్పన్నా పరా నిర్వాణనిర్వృతిః. ౬
విచారితమలం శాస్త్రం చిరముద్గ్రాహితం మిథః,
సంత్యక్తవాసనాన్మౌనా దృతే నాస్త్యుత్తమం పదం. ౭
అపదం పదమాపన్నం పదం చాప్యపదం భవేత్,
పదాపదవిభాగజ్ఞో పరమం పద మశ్నుతేతి. ౮

**భక్తిలక్షణం—భక్తిమీమాంసాయాం.**

భక్తిర్ద్వివిధా గౌణా ముఖ్యాచేతి. తత్ర ఈశ్వరవిషయకానురాగాఖ్యచిత్తవృత్తివిశేషో ముఖ్యాభక్తిః. తథా చోక్తం. భక్తిమీమాంసాసూత్రం:— సాపరానురక్తిరీశ్వర ఇతి,

పరం ముఖ్యమిత్యర్థః; గౌణీభక్తిస్సేవారూపా కథితా.

దేవీభాగవతే:—

భజ ఇత్యేష వై ధాతుస్సేవాయాం పరికీర్తితః,
తస్మాత్సేవా బుధైః ప్రోక్తా భక్తిస్సాధనభూయసీతి.
తద్భేదాః స్మరణకీర్తనాదయో బహవః.
భక్తిరష్టవిధా హ్యేషా యస్మిన్ మ్లేచ్ఛేఽపి వర్తతే,
స విప్రేంద్రో యతి శ్శ్రీమా న్స ముని స్సచ పండితః.
ఇత్యాదిత్యపురాణవచనం.
భక్తిర్నవవిధేతి భాగవతవచనం.
భక్తిర్దశవిధాజ్ఞేయా పాపారణ్యదవోపమేతి చ.

తా. భక్తి ముఖ్యము, గౌణము అని రెండువిధములుగా నున్నది. అందు ముఖ్యము ఈశ్వరునియం దనురాగయుక్తమయిన చిత్తవృత్తి విశేషము. గౌణమనఁగా సేవాదిరూపము. ఈగౌణము స్మరణ కీర్తనాద్యనేక భేదములు కలిగియున్నది.

ఈభక్తి అష్టవిధమనియు, నవవిధమనియు, దశవిధమనియు అనేక భేదములుగా వచనములున్నవి. ఈగౌణభక్తి ముఖ్యభక్తికి ద్వారభూతముగా నున్నది.

ఇక ముఖ్యపక్షము. భక్తిరనుసంధానవిషయమితి.

శు. కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైక్ష దావృత్తచక్షు రమృతత్వ మిచ్ఛన్నితి.

శ్లో. యోగిన స్తం ప్రపశ్యంతి భగవంతం సనాతనమితి.

ఈశ్వర ప్రణిధానాద్వేతి యోగసూత్రం.

ప్రణిధానపదస్య భక్తిపరతయా.

బ్రహ్మసూత్రమపి:—

అపి సంరాధనే ప్రత్యక్షానుమానాభ్యామితి.

అవ్యక్తమపి బ్రహ్మ - భక్త్యా ప్రత్యక్షం భవతీత్యర్థః.

శ్రు. బ్రహ్మసంస్థోఽమృతత్వమేతీతి.

నిష్ఠాపదవాచ్యం భక్తిమీమాంసాయాం:—

తత్సంస్థస్యామృతత్వోపదేశాదితిసూత్రం. బ్రహ్మమీమాంసా సూత్రం తు:—తన్నిష్ఠస్య మోక్షోపదేశాదితి.

తా. పైని చెప్పిన ప్రమాణములచే ఆత్మయం దనురాగరూప చిత్తవృత్తివిశేషము ముఖ్యభక్తిగానున్నది. ఇదియు అపరోక్షజ్ఞాన సాధనముగానున్నది. గౌణరూపసేవాదులు పరోక్షజ్ఞానజనకములు. అంతకు పూర్వావస్థకన్న శ్రేష్ఠముగాన పరోక్షజ్ఞానము వినాగా అప రోక్షజ్ఞానము సిద్ధించదు. కాన నీద్వివిధభక్తియు అవిద్యావిముక్తికి ద్వారభూతముగానున్నదని తాత్పర్యము.

**వైరాగ్యలక్షణం.**

శ్రు. వైరాగ్యబోధోపరమాస్సహాయాస్తే పరస్పరం,
ప్రాయేణ సహ వర్తంతే వియుజ్యంతే క్వచిత్క్వచిత్.
తత్వబోధః ప్రధానం స్యాత్సాక్షా న్మోక్షప్రదత్వతః,
బోధోపకారిణావేతౌ వైరాగ్యోపరమావుభౌ.

తా. వైరాగ్యము, బోధ, ఉపరమము ఈమూఁడును అన్యోన్య సహాయములుగా నున్నవి. తఱుచుగా నీమూఁడును కలిసియేయుండును. ఒక్కొకచోటను విడిపోవడమును కలదు. రెండు ధర్మములుండి ఏదో ఒకటి లోపించుటయును, రెండు లోపించుటయును కలదు. ఆమూటిలో తత్వబోధ ప్రధానమయినది. తప్పక ఉండఁదగినది. అది మాత్రమున్నపుడు మోక్షము కలుగును. తక్కిన వైరాగ్యోపరమములు రెండును ఈతత్వబోధకు సహాయములు. ఉపకారులుగా నున్నవని.

శ్రు. త్రయోఽప్యత్యంతమక్వాశ్చే న్మహత స్తపసః ఫలం,
దురితేన క్వచిత్కశ్చి త్కదాచి త్ప్రతిబధ్యతే.

తా. ఈమూఁడును సంపూర్ణముగా కలిగిన యెడల గొప్ప తపో ఫలమని చెప్పతగ్గది. జన్మాంతరదురిత ప్రతిబంధముచేత ఒకానొకనికి ఒకానొకటి ఒకానొకప్పుడు లోపించును.

శ్రు. వైరాగ్యోపరతీ పూర్ణే బోధస్తు ప్రతిబధ్యతే,
యస్య తస్య న మోక్షోఽస్తి పుణ్యలోక స్తపోబలాత్.
పూర్ణే బోధే తదన్యౌ ద్వౌ ప్రతిబంధౌ యదాతదా,
మోక్షో వినిశ్చితః కింతు దృష్టదుఃఖం న నశ్యతి.

తా. ఎవరికి వైరాగ్యోపరతులు పూర్ణములుగా నుండి బోధ లోపించియుండునో, వారికి మోక్షములేదు గాని తపోబలమున పుణ్య లోకములు కలుగును. బోధమాత్రముండి వైరాగ్యోపరమములు లేనపుడు మోక్షము నిశ్చయముగాని జీవన్ముక్తి లేదు. శరీరధారణ మున్నవరకు సుఖదుఃఖానుభవ మున్నదని.

శ్రు. బ్రహ్మలోకతృణీకారో వైరాగ్యస్యావధి ర్మతః,
దేహాత్మవ త్పరాత్మత్వదార్ఢ్యే బోధ స్సమాప్యతే.
సుప్తివ ద్విస్మృతి స్సీమా భవేదుపరమస్య హి,
ధియా స్వయా వినిశ్చేయం తారతమ్య మవాంతర మితి.

తా. బ్రహ్మలోకము నిచ్చెద ననిన తృణప్రాయముగా నిరాక రించుట, మోక్షమునే కోరుట వైరాగ్యమున కవధిగా నున్నది. దేహ జీవాదులు తాననే జ్ఞానము ఎటుల నిశ్చయముగానున్నదో, అటులనే నీదేహజీవాదులు అవిద్యాకల్పితములు గాన మిథ్యలని తెలిసికొని, సాక్షి తానని నిశ్చయబుద్ధి కలుగుట బోధకు అవధి. నిద్రయందు ప్రపంచ విస్మృతి యెటుల కలుగునో అటులనే జాగ్రత్తలో నున్నపుడును సాక్షి స్వరూపాత్మయందు మనోబుద్ధులుంచి బాహ్యప్రపంచవిస్మృతి కలుగుట ఉపరతికి సమాప్తి.

శ్రుత్యంతరం:—

దేహాత్మజ్ఞానవ ద్జ్ఞానం దేహాత్మజ్ఞానబాధకం,
ఆత్మ న్యేవ భవేద్యస్య స నేచ్ఛన్నపి ముచ్యతేతి.

ఈవైరాగ్యబోధ ఉపరమముల స్వరూప మెట్టిదనిన: ఇంద్రియ విషయములగు పదార్థములయందును, ఆసుఖములయందును ఆసక్తియు, కోరికయు లేకయుండుట, వానియందు నిరసనబుద్ధి కలుగుట వైరాగ్య మనఁబడును.

బోధ యనఁగా: శాస్త్రసజ్జనోపదేశములవలన ఆత్మానాత్మవిచారణ కలిగి, అందువలన "బ్రహ్మ సత్యం జగన్మిథ్య" యనే సంశయవిపర్యయ రహితమయిన మనోబుద్ధుల దృఢనిశ్చయము బోధ యనఁబడును. ఉప రతి యన లోకమందు పరాగ్దృష్టి, ప్రత్యగ్దృష్టి యని రెండు విధములు.

అందు ఆంతర్యదృష్టి, బాహ్యదృష్టి అనియు; బాహ్యము చక్షురింద్రియ గోచరము, ఆంతర్యము మానసికము నిది బాహ్యదృష్టి కాధారము. ఈ ఉభయేంద్రియములును తనకన్న వేరుగానున్న ప్రపంచమందు వ్యాపించి వాటిని నాయా వస్తురూపములను గ్రహించుట మామూలుగా నున్నది. ఇది సహజముగాన పరాగ్దృష్టి యనఁబడును.

ఇక ప్రత్యగ్దృష్టి యనఁగా ప్రపంచమందును లోకాంతరమందు ప్రసరించే మానసికదృష్టిని స్వాభిముఖముగా త్రిప్పి తనయందుఁగల అంతరంగవస్తువిచారణచేయుటయు, అందు నిజానిజముల నేర్పరచు టయు ప్రత్యగ్దృష్టి యనఁబడును.

శ్రు. కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైక్షు దావృత్తచక్షు రమృతత్వ మాయన్.

తా. వేలకొలఁది సంఖ్యగలవారిలో పరాగ్దృష్టిగల మనుష్యులలో ఒకానొకధైర్యశాలి జననమరణ ధర్మరహితమయిన మోక్షమును గోరి, తన మానసికదృష్టిని ఆంతర్యమునకు మళ్లించి, తనయందుఁగల ప్రత్య గాత్మను (సాక్షిని) చూచి అది తన నిజరూపమని గ్రహించును. ఆ జ్ఞానము కలిగినందున తనదికాని శరీరప్రపంచాదులం దాసక్తిని వదలి తనను తాను మరువకుండ అధికప్రేమతో చూచి సంతసించుచు నుండు టయే ఉపరమ మనఁబడును.

వైరాగ్య మనునది మూఁడువిధములుగా నున్నది. అభావవైరా గ్యము, నిర్బంధవైరాగ్యము, సహజవైరాగ్యము అని. అందు అభావ మనఁగా: సామాన్య సంసారికి గజారోహణము, ఇంద్రాధిపత్యము మొద లగు కోరికలయందుఁగల వైరాగ్యము అభావవైరాగ్యము. నిర్బంధ మనఁగా: వస్తువు సంభవించి, తనకు కోరికయుండి, శాస్త్రనిబంధనలు లోక నింద్యము వీనికి లోఁబడి ఆయాకోరికలయందు విరక్తినొందుట, ఏకా దశినాఁ డుపవాసము, పరస్త్రీగమనాదులు, ఇవి నిర్బంధ వైరాగ్యము లనఁబడును. ఇక సహజవైరాగ్యము: ఉత్కృష్టవస్తువు సిద్ధముగా నున్నం దున నికృష్టములందుఁగల వైరాగ్యము సహజము. అది కలిగినపుడు తిరుగు లేదు. శాశ్వతమయిన ఆత్మవస్తువు లభించినపుడు అశాశ్వత ప్రపంచాదులందు గలది సహజవైరాగ్యము. అది కలుగవలెను.

వెనుక వివరించిన భక్తిజ్ఞానవైరాగ్యబోధోపకరణముల వలనను వానివాని అంతర్భేదములు తెలిసినందున నేమి సార్థక మనిన: లోక మందు దేవునియొక్క నిజమును తెలిసికొందమనియు, నిత్యసుఖమును సంపాదించెదమనియు, ముక్త్యపేక్షయు నీరెండును సర్వజన సామాన్య ధర్మములుగా నున్నవి. జనులు వీనిని తెలుసుకొనుటకు రెండు సాధన ములు కలవు. ఒకటి గురువులు, రెండవది గ్రంథములు. ప్రకృతకాల మందు నీ రెండును అతివృద్ధిని బొందినందున నిశ్చయము తెలియుటకు మారుగా సంశయము లధికమగుచున్నవి. ఇందుకు కారణము.

సృష్ట్యాదిని విద్య అవిద్య, జ్ఞానము అజ్ఞానము, దేవుఁడు ప్రపం చము.ఇటుల రెండే వస్తువులు వాడుకలో నున్నవి. ఇటీవల క్రమక్రమ ముగా అనేక మతములు, అనేక గ్రంథములు, వానిని బోధించే అనేక గురువులు వృద్ధిఅయినందున, ఆదినున్న మతమును నిజమును ఈసము దాయమందు మునింగియున్నందున నిపుడు భ్రమకు హేతువయినది. నిజము పూర్ణముగా తెలియనివారు, స్వానుభవము లేనివారు చేసిన గ్రంథములును, అట్టిగురువులును లోకమున కుపకారమునకు బదులుగా అపకారులుగా నున్నారు. ఎట్లనిన:

శ్రు. అంధేనైవ నీయమానా యథాంధాః.

—లోకమందు ఒక అంధుఁడు మరియొక అంధునిసహాయమును నమ్మినపుడు ఇద్దఱికిని మోసము సంభవించును.

కాన లోకమందు భక్తియే ప్రధానమని కొందఱును, వైరా గ్యమే ప్రధానమని కొందఱును, యోగము, కర్మలు, దానములు, యాత్రలు ప్రధానములని కొందఱును గ్రంథములను చూపుచు జను లను మోసపుచ్చుచున్నారు. ఎట్లనిన: వస్తునిజమును తెలిసికొనుటకు పైన చెప్పిన అయిదుసాధనములలో బోధ ప్రధానముగా నున్నది నిజమగు బోధ కలిగినపుడు గాని అందు భక్తి కుదరదు. ఇక వైరాగ్యమును గుఱించి అనుభవములోనున్న ప్రపంచ సుఖములకన్న అధిక సుఖమును, ఇంతకన్న గుణాధికము బ్రహ్మమందున్నట్టు తెలిసినపుడుగాని ప్రపంచ సుఖములందు వైరాగ్యము కలుగనేరదు.

ఇట్టిస్థితిలో ఆత్మానాత్మవిచారణవలనఁగాని బోధయనే బుద్ధి నిశ్చయము కలుగదు. అది కలిగినపైని దాని సంరక్షణకొఱకు భక్తి వైరాగ్యము ఉపరమమును సంపాదించవలెను. బోధ కలిగినపైన జనించినభక్తికి చలనములేదు. బ్రహ్మవస్తువును తెలిసికొన్నపుడు ప్రపంచమందు వైరాగ్యము సహజముగనే కలుగును. ఆవైరాగ్యమునకు తిరుగులేదు గాన, అన్నియు విచారించగా ముందు బోధను సంపాదించుట ప్రధానముగా నున్నది. ఆబోధ విచారణాధీనము. అట్టిబోధ కలిగినపైన భక్తి వైరాగ్యము ఉపరమము కలుగవలెను. ఇవి సహజముగనే తటస్థించునని తెలియుచున్నది గాన జ్ఞానపూర్వమయిన భక్తియు, సహజ వైరాగ్యమును కలుగవలెను.

తురీయాభ్యాసము.

శ్లో. నిత్యానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
విశ్వాతీతం గగనసదృశం తత్వమస్యాదిలక్ష్యం,
ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి.

**బైందవయామలే:—**

ప్రాణాయామాదికం త్యక్త్వా స్థూలోపాయం వికల్పకం,
అవికల్పకరూపేణ స్వచిత్తేన స్వసంవిదా.
మనస్తుర్యరసేనాత్ర స్వదేహాదిప్రమాతృతాం,
మజ్జనేన ప్రశమయన్ ప్రవిశేత్తత్సమావిశేదితి.

తా. ఈతురీయావస్థారక్షణము వెనుక నిరూపింపఁబడినది. ఆయవస్థను పొందఁగోరువారికి అభ్యాసలక్షణము ఇచట చూపింపఁబడును. ఈతురీయశబ్ద మీస్వరూపవిచారణలో అనేకస్థలములందుఁ గలదు గాన, నీతురీయసంజ్ఞ ఎచటనున్నను బ్రహ్మవస్తువును తెలుపుచున్నది.

బ్రహ్మజ్ఞానమును తెలుసుకొనుటకు కొన్ని సాధనములు గలవు. అందు ౧. బ్రహ్మాండము. ౨. పిండాండము. 3. శ్రీచక్రము. ౪. మాతృక. ౫. అవస్థాచతుష్టయము. ౬. మంత్రము. ఈయారును తురీయ పదములుగలవి. ఇందు దేనిని విచారించినను తక్కినవి స్థిరపడుచున్నవి.

౧. బ్రహ్మాండమందు భూర్భువస్సువర్లోకత్రయము, తదుపరి తురీయస్థానమును గలది. ౨. శరీరము మూలాధారాది అజ్ఞాంతము. భ్రూమధ్యాంతమువరకు కూటత్రయము. తదుపరి ద్వాదశాంతము వరకు తురీయకూటము. 3. శ్రీచక్రము భూపురాదియోనిచక్ర పర్యంతము కూటత్రయము. బిందుమండలము తురీయకూటము. ౪. మాతృక అవ్యక్తమనే నాదబిందువు మొదలు వైఖరీయావత్తు మండల త్రయము. సర్వకారణబిందువు తురీయము. ౫. అవస్థాచతుష్టయము. జాగ్రత్స్వప్నసుషుప్తులు మూఁడును ప్రకృతిమయములు. తురీయము స్వస్వరూపము. ఇదే బ్రహ్మావస్థ యనఁబడును. విశ్వతైజసప్రాజ్ఞులు ప్రాకృతులు సాక్షి తురీయావస్థాభిమాని గాయత్రీ మంత్రము తురీయ పాదముగలది. పంచదశి, కూటత్రయము, శ్రీవిద్య, తురీయము ఇటుల తురీయపదము అంతటను ఆత్మవస్తువునే తెలుపుచున్నది. దేనిని ఆద్యంతములుగా విచారించినను తురీయము స్థిరపడును. ఇదియే జీవన్ముక్తావస్థ యనఁబడును.

లోకమునందు జాగ్రత్స్వప్నసుషుప్తులనే అవస్థాత్రయము సర్వానుభవ సిద్ధముగా నున్నది. ఇక నీతురీయావస్థ స్వరూపనిష్ఠులగు బ్రహ్మవేత్తల అనుభవములో నున్నది. ఈ అవస్థకు కాలమేది? అనుభవమెట్టిది? ఏమి ఫలము? అని సంశయముకలుగవచ్చును. దిగువవచనముల వలన సర్వసంశయములు వదలును.

**అభ్యాసలక్షణము:—**

విజనప్రదేశమందు జాగ్రత్తలో స్వస్థచిత్తతతో ఉదఙ్ముఖ ప్రాఙ్ముఖముగా పద్మాసనాసీనుఁడయి స్వస్వరూపానుసంధానమును చేయవలెను. తురీయావస్థను పొందవలెనని ప్రాణాయామము, ఖేచర్యాది ముద్రలు, ఆసనభేదములు, ఓఢ్యాణాదిబంధములు గల హఠయోగాదులును, స్థూలశరీరవికారాదులను విడచి, వికారరహితమయిన నిశ్చలమయిన స్థూలశరీరస్థితితో పౌర్ణమీదృష్టికలిగి, తన మనో బుద్ధులను అంతర్ముఖమును పొందించి, అందువలన కలిగిన విచిత్రమయిన ఆనందరస పరిజ్ఞానము మాత్రము కలిగియుండవలెను. ఆ తురీయావస్థలో తన మనస్సును, దేహేంద్రియాదులును, ప్రపంచమును లయింపఁజేసి, జల మధ్యమందున్న మత్స్యమువలె బ్రహ్మతేజస్సులో సకలమును మునిగి

